# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------------ కూపన్ ------------------------------

ఏప్రిల్ చతుర నవల 'మలిసంధ్య'

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

# చమత్కార కోతలు

## మేడ్ ఫర్ టీచ్ అదర్!

"లాభంలేదు గురూగారూ... ఇక ఈ ఇంటిపోరు పడడం నావల్లకాదు... రేపే మా ఆవిడకి విడాకులు ఇచ్చేద్దామనుకుంటున్నాను" కుర్చీలో చతికిలబడుతూ విసుగ్గా అన్నాడు సింహాచలం.

"అదేంమాటోయ్? ... శాంతం ... శాంతం! అసలింతకీ ఏంజరిగిందోయ్? నిదానంగా చెప్పు" సమాధానపరచబోయారు హెడ్‌క్లర్క్ కోలాహలంగారు.

ఉన్నతాదర్శాలు, భావాలుగల కోలాహలంగారంటే ఆఫీసులో అందరికీ తగని గౌరవం.

"ఏంచెప్పమంటారు సార్? మా సామ్రాజ్యానికీ, నాకూ సరిపడడంలేదండి! ప్రొద్దున చిన్న విషయానికే ఇంట్లో రామరావణయుద్ధం... మీరెన్నయినా చెప్పండి గురూగారూ! ఇక ఆ మనిషితో కాపరం చేయడం నావల్లకాదు" నిశ్చితాభిప్రాయానికి వచ్చినట్లుగా అన్నాడు సింహాచలం.

"చూడబ్బాయ్... ఒకవేళ అమ్మాయి తొందరపడ్డా మనం తొందరపడకూడదయ్యా... ఎందుకంటే మనం మగవాళ్లం. విశాలహృదయంతో సర్దుకుపోవాలి. అప్పుడే కాపరం పదికాలాలపాటు నిలబడ్తుంది. చిన్నచిన్న విషయాల్ని నువ్వు సీరియస్‌గా తీసుకోకూడదు! ఆడవాళ్లన్నాక ఏదో..."

"అదికాదు గురూగారూ...!"

"నువ్వింకేం చెప్పకు. సాయంత్రం మీ ఇంటికి నేనూ, మా ఆవిడా వస్తాం. మీ ఇద్దరికీ రాజీకుదిర్చే పూచీ మాది... సరేనా? నువ్వింక నిశ్చింతగా ఉండు" మరోమాటకు అవకాశం యివ్వకుండా ఫైలులో తలదూర్చారు కోలాహలంగారు.

★ ★ ★

ఆ సాయంత్రం అన్నమాటప్రకారం కోలాహలం దంపతులు సింహాచలం ఇంటికి చేరుకున్నారు. లేనినవ్వులు ముఖానపులుముకొని వారికి స్వాగతంపలికారు సింహాచలం దంపతులు. కాఫీగట్రా పూర్తయ్యాక-

"అమ్మాయ్... చూడమ్మా! మగవాడు అన్నాక బయట సవాలక్ష పనులతో తలవాచిపోయి చిరాకుతో ఇంటికొస్తాడు. అలాంటినమయంలో మన ఆడాళ్లం వాళ్లమనసెరిగి మసులుకోవాలి. అంతేగాని చిన్నచిన్న విషయాలకి..." కోలాహలంగారి సతీమణి వర్ధనమ్మగారు సామ్రాజ్యానికి ప్రైవేటు మొదలుపెట్టింది. ఆవిడ తనని వెనకేసుకొస్తుంటే సింహాచలానికి పట్టలేని ఆనందంగాఉంది. సామ్రాజ్యంమాత్రం ముభావంగా ఉండిపోయింది.

"అలా అంటే నేను ఛస్తే ఒప్పుకోను. బయట పనులుంటేమాత్రం మగాడు ఆ చిరాకు ఇంట్లో చూపించాలా? ఇంతెడు చాకిరీ చేసి అలసిపోయిన భార్యమీద విరుచుకుపడాలా? ఆమె కష్టసుఖాలు గమనించాల్సిన బాధ్యత మగాడికిమాత్రం లేదూ... అమ్మాయి తొందరపడ్డదేఅనుకో, తను సర్దుకుపోవచ్చుగదా?" కోలాహలంగారు భార్య వాక్ప్రవాహానికి అడ్డుతగిలారు.

ఈసారి సామ్రాజ్యం ముఖం వెలగడం సింహాచలం ముఖం మాడిపోవడం షరామామూలుగానే జరిగిపోయాయి.

"ఇదుగో, మీరెన్నయినా చెప్పండి! సర్దుకుపోవాల్సిన బాధ్యత ఆడవాళ్లదే... ఆడదంటే

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: జగ్‌మోహన్



ఎవరనుకున్నారు 'క్షమయా ధరిత్రి'..."

"నోనో... నాటెటాల్! మగాడుమాత్రం తక్కువా? భర్తంటే ఎవరనుకున్నావ్? భరించేవాడు. గరళాన్ని కంఠంలో భరించిన హరుడిలా కష్టసుఖాలన్నింటినీ చిరునవ్వుతో భరించేవాడు..."

"ఓయబ్బో... ఏంగొప్ప? అందుకేనా మొన్న రాత్రి 'పాలు పిల్లి తాగేసింది కాఫీ లేదు' అంటే తాడెత్తున ఎగిరింది ఎవరో... కష్టసుఖాల్ని భరించే భర్త తీరేనా ఇది?" వెటకారం చేశారు వర్ధనమ్మగారు.

"నువ్వుమాత్రం చేసిందేమిటి? నిన్నరాత్రి ఆఫీసుపనితో అతలాకుతలమై ఇంటికి వచ్చిన మొగుడికి కాఫీనీళ్లన్నా పోయకుండా కడుపునొప్పి వంకతో ముసుగుతన్ని పడుకొంది తమరుకాదూ... సిన్మాకి తీసుకెళ్లలేదనేగదా అంత అలుగుడు... మళ్లీ క్షమయా ధరిత్రట... చెప్పడానికి సిగ్గుకూడా లేదు"

"అదుగో, అదేవద్దన్నాను. బయటవాళ్ల ముందు పెళ్లాన్ని పట్టుకొని 'సిగ్గుఎగ్గు' అంటున్నారే? మీకసలు బుద్ధిఉందా?" రెచ్చిపోయారు వర్ధనమ్మగారు.

"నా బుద్ధిని ప్రశ్నించే యోగ్యత నీకెక్కడ ఏడ్చిందే... నిజంగా నాకు బుద్ధిలేదుగనుకే నీలాంటి గయ్యాళిగంపను కట్టుకొన్నాను. మీ నాన్న..."

"అంటే నన్ననండి, మా నాన్న ఊసెందుకు? పైకి స్త్రీజన పక్షపాతిలా ఫోజు... ఇంట్లో భార్యనేమో పురుగుకన్నా హీనంగా చూడడం, మీగుట్టు ఎవరికి తెలియదు? పాతికేళ్లనుంచీ నన్ను చెండుకుతింటున్నారుగదా!

"నువ్వుమాత్రం స్త్రీ అంటే ఓర్పు... నీ పిండాకూడు అని అందరికీ నుత్తికొట్టడమేతప్ప ఒక్కనాడైనా ఓర్పుగా ఉండిచచ్చావా? చీటికిమాటికి అలగడం, దుప్పటి ముసుగుతన్నడం... ఇదేగదా..." ఆవేశపడ్డారు కోలాహలంగారు.

"చావూబ్రతుకూ అన్నారంటే మర్యాద దక్కదు..." కోపంతో వర్ధనమ్మగారి ముక్కుపుటాలు ఎర్రబడిపోయాయి.

"ఏంచేస్తావే? కొడ్తావా?" మీదికి వెళ్లసాగారు కోలాహలంగారు.

అక్కడికీ సామ్రాజ్యం వర్ధనమ్మగారికి ఏదో చెప్పబోయింది. సింహాచలం కోలాహలంగారిని సమాధానపర్చబోయాడు. అయినా ఫలితం శూన్యం.

ఆ తర్వాత అక్కడ జరిగిన భీభత్సకాండకి సింహాచలం, సామ్రాజ్యం బెదిరిపోయారు. తమమధ్య కీచులాటలు వచ్చినా ఎప్పుడూ ఇంతలా గొడవపడలేదు.

అందుకే ఇద్దరూ కూడబలుక్కుని పక్కగదిలోకి పారిపోయారు.

-ప్రతాపచంద్ర

# తిట్టు

ఏడుపుముఖంతో ఆటలనుంచి తిరిగివచ్చిన మా శ్రీనును చూసి ముఖాలు చూసుకున్నాం నేను, మా ఆవిడాను.

"ఏరా శ్రీనూ, అలా ఉన్నావేం? ఎవరైనా ఏమైనా అన్నారా?" అనడిగింది మా ఆవిడ.

"వానుగాడు నన్ను కొట్టాడు, మమ్మీ!" అన్నాడు శ్రీను వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

చివుక్కుమంది నాకు. సాధారణంగా నేను పిల్లల్ని కొట్టను, మా ఆవిడనూ కొట్టనివ్వను. అటువంటిది వరాయి పిల్లలు మా పిల్లల్ని కొట్టారని తెలిస్తే మనసుకు కాస్త కష్టంగా అనిపిస్తూంటుంది.

"ఎందుకు కొట్టాడురా?" అంది మా ఆవిడ వాడిని దగ్గరకు తీసుకుంటూ.

"క్రికెట్ ఆడుతున్నాం. వాను ఫీల్డింగ్ సరిగాచేయడం లేదని కెప్టెన్ తిట్టాడు. వాడికి కోపం వచ్చి ఆటలోంచి వాకౌట్ చేశాడు. వాడితోపాటు మరో ఇద్దరు కుర్రాళ్లను కూడా తీసుకుపోయాడు. నన్నూ రమ్మంటే వెళ్లలేదని చెంప మీద కొట్టాడు" వివరించాడు శ్రీను.

ముఖాలు చూసుకోవడం మినహా ఏమనాలో తెలీలేదు మా దంపతులకు. వాను ఇల్లు మా వీధిలోనే వుంది. ఆ పిల్లాడు తరచు మా వాణ్ణి తిట్టడమో, కొట్టడమో చేస్తూంటాడు. అయినా పిల్లల తగవుల్లో పెద్దలు తలదూర్చకూడదనే తత్వంమాది.

"వాను చెడ్డపిల్లాడు. చెడ్డపిల్లలకు దూరంగా వుంటే సరి" అంతకంటే వాణ్ణి ఎలా అనునయించాలో తెలీలేదు కాబోలు, "వెళ్ళి కాళ్ళు కడుక్కుని రా, బోర్నవిటా త్రాగుదువుగాని" అంటూ వాణ్ణి బుజ్జగించి తీసుకుపోయింది మా ఆవిడ.

నేను ఆలోచనల్లో పడ్డాను. శ్రీనుకి పన్నెండేళ్లు. ఎయిత్ స్టాండర్డ్ చదువుతున్నాడు. చదువులో ఫస్టు. కాని, అందరిచేత తిట్లూ, తన్నులూ తిని వస్తుంటాడు తరచు. వాడికి కోపం ఒక పట్టాన రాదనుకుంటాను. అందుకే ఎవరి మీదా తిరగబడడు. గొడవలంటే ఇష్టముండదు. బహుశా వాణ్ణి మేము జెంటిల్‌గా

పెంచడం కూడా కారణం కావచ్చును.

కాని అప్పుడప్పుడు నాకు విచారం, బాధ కలుగుతుంటాయి- వాడినంత సున్నితంగా, మృదువుగా ఎందుకు తయారుచేశామా అని. ఎప్పుడైనా వాడు తిరగబడి తనను తిట్టినవారినీ, కొట్టినవారినీ చితగ్గొడితే బావుండునని కూడా అనిపిస్తూ ఉంటుంది అప్పుడప్పుడు. ఇలా వాడు అన్నిటికీ పడిపూరుకుంటూంటే అందరికీ లోకువయి పోతున్నాడాయె! ఎంతటి సాధు జంతువైనా, కొమ్ము విసిరితే తప్ప భయపడరెవరూ.

★ ★ ★

ఓ రోజు సాయంత్రం నేను ఆఫీసునుంచి ఇంటికి చేరుకునేసరికి ఇంటి దగ్గర అంతా గందరగోళంగావుంది. కించిత్తు కంగారు కలిగింది నాకు. ఆరా తీస్తే తెలిసిన విషయమిది- మా శ్రీను వానుని చితగ్గొట్టాడట! వాను తల్లిదండ్రులు మా ఇంటికొచ్చి నానా గొడవా చేస్తున్నారు!

ఆశ్చర్యంతో నోట మాట రాలేదునాకు.

శ్రీను, వానుని చితగ్గొట్టాడా! ఎయిత్ వండర్! ఒక పట్టాన నమ్మలేకపోయాను.

పైగా,ఎన్నిసార్లు వాను మా వాణ్ణి తిట్టి, కొట్టినా వాడి తల్లిదండ్రులు ఒక్కనాడూ 'తప్పు' అని కొడుకును మందలించిన పాపాన పోలేదు. కాని ఏదో ఒకసారి మావాడు కొట్టాడని మా ఇంటి మీదకు పోట్లాటకు వచ్చారు. ఇదీ కొందరి వరుస!

అయితే, వానును చూసేసరికి నాకు మతిపోయినట్లయింది. ఆ పిల్లాడి వొళ్లంతా కవికిపోయి ఎర్రగా అవడమే కాక అక్కడక్కడ చర్మం కొట్టుకుపోయి రక్తం కారుతోంది. శ్రీను వాణ్ణి గట్టిగానే కొట్టాడన్నమాట! ఓ క్షణం వాను మీద జాలేసింది నాకు.

అంత తీవ్రంగా చితగ్గొట్టాడంటే అందుకు బలమైన కారణం ఏదో వుండాలనిపించింది. శాంతమూర్తి అయిన మా వాడు అలా ఎందుకు కొట్టాడో తెలునుకోవాలన్న కుతూహలం కలిగింది నాలో... బహుశా అస్తమానూ వాడి చేత అడ్డమైన తిట్లూ, తన్నులూ తినితిని వినుగెత్తిపోయి, ఈరోజు ఇంత తీవ్రంగా తిరగబడి వుంటాడా? అనుకున్నాను.

అసలు విషయం తెలునుకోవాలని మావాణ్ణి పిలిచాను "శ్రీనూ, ఇలారా" అంటూ. తిడతాననుకున్నాడేమో బిక్కమొగం వేసుకుని నెమ్మదిగా నా దగ్గరికొచ్చాడు.

"వానును అలా ఎందుకు కొట్టావు?" గంభీరంగా అడిగాను. "వాడు నన్ను తిట్టాడు" అన్నాడు భయం భయంగా.

"వాను నిన్ను తిట్టడం, కొట్టడం ఇవాళ కొత్తకాదుగా? రోజూ ఆ పని చేస్తూనే వుంటాడుగా? రోజూ నోర్మూనుకుని పడివచ్చేవాడివి ఇవాళ నిన్ను ఏ దెయ్యం పట్టిందని, అంతలా చావబాదావ్ వాణ్ణి?" నాకు తెలీకుండానే వినుగూ, కోపమూ నా గొంతులో తొంగిచూశాయి.

వాను తల్లిదండ్రులు కొడుకు పెద్ద బుద్ధిమంతుడిలా వాణ్ణి వెనకేనుకుని పోట్లాటకు రావడంతో కలిగిన చిరాకూ, కోపమూ కావచ్చునవి.

నా స్వరంలోని తీవ్రతనూ, నా ముఖంలోని కఠినత్వాన్నీ చూసి కొద్దిగా జంకాడు మావాడు. "మాట్లాడవేం?" అంటూ గద్దించాను.

"రోజూ వాడు నన్ను వచ్చి బూతులు తిట్టినా కొట్టినా పడిపూరుకున్నాను డాడీ! కాని ఇవాళ వాడు చాలా పెద్ద తిట్టు తిట్టాడు. అందుకే సహించలేకపోయాను. కోపంలో నాకు వొళ్లు తెలీలేదు... సారీ డాడీ" అన్నాడు శ్రీను. వాడి స్వరంలో పశ్చాత్తాపం తొంగిచూసింది. వాను ప్రయోగించిన అంత పెద్ద తిట్టు ఏమిటో తెలునుకోవాలన్న కుతూహలం కలిగింది. అందుకే, "ఏమిటా తిట్టు?" అనడిగాను.

వెంటనే జవాబివ్వలేదు వాడు. ఆ పదాన్ని తన నోటివెంట వుచ్చరించడానికే న్యూనత చెందుతూన్న వాడిలా ఓసారి వాను వంక, తరవాత అక్కడున్న వారందరివంకా అదోలా చూశాడు.

తరువాత తలవంచుకుని మెల్లగా అన్నాడు- "వాను నన్ను... 'ఒరే మంత్రీ' అని తిట్టాడు నాన్నా"

-విశ్వమోహిని





# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# నాజీ నాయకుడి అపురూపవస్తువులు

1. హిట్లర్‌గారి బంగారు పిస్తోలు

2. వెండిబంతిలో భద్రపరచిన ప్లాటినం ఉంగరం. దానిపైన 'స్వస్తిక్' మార్క్‌ను గమనించవచ్చు.

3. 'మాటింగ్ కంటెస్ట్'లో విజేత అయినవారికి హిట్లర్ 'ట్రోఫీ'గా ఇవ్వాలని తయారుచేయించిన వెండిప్లేటు *(1939)*

4. హిట్లర్ విజయాలను ప్రతిబింబిస్తూ నాజీలలో జాతీయ భావాన్ని చాటిచెప్పే గరుడచిహ్నం.







# చరిత్ర విచిత్రం

ప్రపంచ దేశాల్ని గడగడలాడించిన నియంత అడాల్ఫ్ హిట్లర్ గురించి విననివారెవ్వరు? ఆయనగారు ప్రాణప్రదంగా చూసుకునే వస్తుసముదాయమే మీకీ ఫొటోల్లో దర్శనమిస్తోంది. రెండవ ప్రపంచయుద్ధకాలంలో ఓ అమెరికన్ సైనికుడికి మ్యూనిచ్‌నగర్ ముట్టడి సమయంలో హిట్లర్‌గారి వస్తువులున్న పెట్టె దొరికింది. అతడు రహస్యంగా వాటిని ఇంటికి తెచ్చుకొని 29 ఏళ్ళపాటు తనదగ్గరే ఉంచుకున్నాడు. ఆ కాలంలోనే హిట్లర్ తాలూకు బంగారు పిస్తోలు, ఇంకా లెక్కలేనన్ని డైమండ్స్ ఎవరికిబడితే వారికి అతడు రహస్యంగా అమ్మిపారేశాడు. ఆ రహస్యాన్ని పసిగట్టిన రేబిల్లీ అనే కోటీశ్వరుడు ఆ సైనికుడికి అడిగినంత డబ్బిచ్చి మిగిలిన వస్తువులన్నింటినీ స్వాధీనం చేసుకున్నాడు. ఆయన వాటిని ఎనిమిదేళ్ళపాటు నేవ్‌దా బ్యాంకు లాకర్లో మూడోకంటికివాడికి తెలియకుండా దాచిపెట్టుకుని అప్పుడప్పుడు చూసుకుని ఆనందించాడు. ఆ తర్వాత జ్ఞానోదయమైన కారణంగా ఈ అపురూప వస్తువుల్ని ప్రజలందరూ చూడ్డానికని స్మిత్‌సోనియన్ ఇన్‌స్టిట్యూట్ మ్యూజియంవారికి బహూకరించాడు.



# ఏరిన ముత్యాలు

★ ఇతరులను అనుమానించవచ్చు. కాని ఎల్లప్పుడూ శంకించడం పాపంగా మారుతుంది. ఇతర్లలో చెడును వెదుకుతూ తిరగకు. పరోక్షంలో నిందించకు. పరోక్షంలో నిందించడం మరణించిన సోదరుని మాంసాన్ని భక్షించడంవంటిది.

— ఖురాన్

★ నీవు మంచువలె పవిత్రంగా ఉన్నా పరనింద నుంచి తప్పించుకోలేవు.

— షేక్స్‌పియర్

★ యోగ్యులు అయోగ్యులపై అధికారం చెలాయించడం ప్రకృతిసాధారణ నియమం. ఇదెప్పుడూ మారదు.

— డాయోనియస్

★ తాను నమ్మినదాన్ని తు.చ. తప్పకుండా అనుసరించగలిగినవాడే సమాజంలో ఏనాటికైనా మన్నన పొందగలడు. సంకల్పస్థిరత్వం లేనివాడు పైకి రాలేడు.

— గార్‌ఫీల్డ్

★ నీచునితో స్నేహం, ప్రేమ ఏవీ వద్దు. నిప్పుకణికను తాకితే కాలుతుంది. చల్లారిన తర్వాత ముట్టుకుంటే మసి అంటుకుంటుంది.

— హితోపదేశం

★ తనకంటె బలహీనుడిపై దెబ్బతీయాలనుకోవడం నీచత్వమే అవుతుంది.

— నెహ్రూ

★ నీతిమంతుడుగా ఉండటమంటే నిజానికి కేవలం సంప్రదాయాన్ని అనుసరించడం కాదు. సరియైన మార్గమేదో స్వతంత్రంగా తెలుసుకొని ధైర్యంగా అనుసరించడం.

— గాంధీజీ

★ సంఘానికి నీతిని గురించిన భావాలే తప్ప నీతి లేదు.

— చలం

★ ఆత్మకు కిటికీ వంటిది నేత్రం. జ్ఞానం, అభీష్టం అందులో కనిపిస్తాయి. మనిషి భావాలను చదవటానికి జంతువులు అతని కళ్లలోకి సూటిగా చూస్తాయి.

— హీరామ్ పవర్స్

★ చెడ్డ ఆలోచనలు కలిగితే వాటిగురించే ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చోరాదు. అలాంటి ఆలోచనలు మనకు అసలు కలుగనేలేదనుకొని ముందుకు సాగిపోతుండాలి.

— గాంధీజీ

★ తెలుసుకోవడంకంటే ఆలోచించడం మరింత ముఖ్యం.

— ఐన్‌స్టీన్

★ ఆరోగ్యం ఆశను చేకూరుస్తుంది. ఆశ ఉన్నవాడికి అన్నీ ఉన్నట్లే.

— అరేబియన్ సామెత

★ అన్ని విషయాలలోనూ నిస్పృహతో ఉండటంకంటే ఆశతోనే గడపటం మంచిది.

— గోథే

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

# చతుర

సంపుటి: 15 సంచిక: 3 ఏప్రిల్ 1992

'వృద్ధాప్యం' మనిషి జీవితంలో రెండోబాల్యం. కానీ..... పసితనపు కేరింతలు, చిలిపిచేష్టలు, ముద్దుమాటలతో పసివాళ్లుపెద్దల నాకర్షించి నట్లు, వృద్ధులు తమ బిడ్డలనాకర్షించలేరు. కారణం... పసివారి విషయంలో అది సహజ ప్రవర్తనయితే, వృద్ధుల విషయంలో సహజత్వం కోల్పోయి, అదొక భారమైన బాధ్యతమాత్రమే అనిపించడం. మరి ఇలాంటి వృద్ధులైన పసివారు కొందరు ఓచోట చేరితే వారిలోని రెండవ బాల్యపు చిలిపిచేష్టలు ఎలావుంటాయి? అదే సమయంలో తమను విస్మరించిన తమ పిల్లలు, ఏనాటికయినా మనసు మార్చుకుని తమ కోసం రాకపోతారా?... అని ఎదురుచూసేవారి ఆశ ఎంతమంది విషయంలో సఫలమవుతుంది?

ఇవన్నీ చర్చిస్తూ పిల్లలు నిరాదరించిన పెద్దల, పెద్దలులేని పిల్లల మనోభావాలను విశ్లేషిస్తూ జి. లత రాసిన 'మలిసంధ్య' ఈ నెల 'చతుర' సమర్పణ.

# మలిసంధ్య

—జి.లత

గణగణ,గంట మోగిస్తూ ఫైరింజన్ 'రాఘవేంద్ర అనాథ వృద్ధశరణాలయం'ముందు ఆగింది. హడావిడిగా దిగిన అగ్నిమాపక సిబ్బంది తెల్లబోతూ చుట్టూ చూశారు. ఎక్కడా మంటలాంటిది కనిపించటంలేదు. తెల్లవారుజామున ఐదు కావస్తూంది సమయం. తూర్పు యింకా ఎరుపెక్కనేలేదు. కమ్ముకున్న చీకట్లు బద్ధకంగా ముడుచుకునున్నాయి. ఆ చీకట్లో నిప్పురవ్వయినా స్పష్టంగా కనిపించాలి. అలాంటిది మంటలు కనపడకుండా దాక్కోవటానికి నీళ్ళుకాదుకదా, నిప్పు... నిప్పు!

విషయం కనుక్కుందామనుకుని లోపలికి దారితీశాడు ఫైర్ ఆఫీసర్. మామూలుగానే ఐదుగంటలకల్లా లేచిపోయే వృద్ధుల్లో, యింకా నిద్రలేవని ఒకటీ, అరా ఎవరైనా వుంటే ఫైరింజన్ మోతకు లేచిపోయారు. కొందరు కుతూహలంగా దాన్ని చూడటానికి బయలుదేరారు కూడాను.





అంతలో మరో చప్పుడు వినిపించింది. అది పోలీస్ సైరన్. క్షణాల్లో ఓ పోలీసు జీపు వచ్చి ఫైరింజన్ పక్కనే ఆగింది. దాన్లోంచి ఓ ఇన్స్పెక్టరూ, సిబ్బందీ దిగారు.

"ఏంటీ, హత్యంటే, శవాన్ని తగలెట్టారా? బిల్డింగ్ ఏమైనా కాలిందా" ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్.

తెలియదన్నట్టు పెదవి విరిచాడు ఫైరాఫీసర్-

"హోమ్‌ఫర్ ఏజ్డ్ తగలబడిపోతోందని ఫోనొస్తే వచ్చాం మేము. ఎక్కడా మంటలు కనిపించడంలేదని క్షణంపాటు నిలుచుండిపోయాం. అంతలో మీరొచ్చారు"

ఆసరికి అక్కడికి చేరుకున్న కొందరు వృద్ధులు ఈ మాటల్ని ఆశ్చర్యంగా విన్నారు. హత్య విషయంగానీ, మంటల విషయంగానీ తమకేమీ తెలియదని చెప్పారు.

ఇన్‌స్పెక్టర్ కోరినమీదట వాచ్‌మన్ కరీమ్ గదులన్నీ చూపించాడు. రాజారాం అనే పెద్ద మనిషి భగవద్గీత చదువుకుంటున్నాడు. హత్య మాట విని చెవులు మూసుకుని భగవంతుడ్ని తలచుకున్నాడు.

కొందరు తోటపని చేస్తున్నారు. కొందరు పళ్ళు తోముకుంటున్నారు. థామస్ అనే ఆయన మరో యిద్దరు వృద్ధులకి యోగాసనాలు నేర్పిస్తున్నాడు. ఆ వయసులో అంత ఓపిగ్గా ఆసనాలు ప్రాక్టీసు చేస్తున్నవాళ్లను చూసి ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యపోయాడు. మెచ్చుకోలుగా చూశాడు వాళ్ళవంక.

ఇంకా సగం గదులు చూడాల్సినవి ఉన్నాయి. అంతట్లోనే కేర్‌టేకర్ శంకర్‌రెడ్డి స్కూటర్‌పైనొచ్చాడు. వచ్చీరావటంతోనే ఆయన పోలీసులపైన విరుచుకుపడ్డాడు-

"రిటైరైపోయిన ముసలాళ్ళు వీళ్ళు. వీళ్ళల్లో నక్సలైట్లేమిటండీ. ఐనా మా పర్మిషన్ తీసుకోకుండా, సెర్చ్‌వారెంట్ లేకుండా మీరు వెదకడమేమిటి? ఐవిల్ కంప్లెయిన్ టు యువర్ కమీషనర్"

తెల్లబోయి చూశాడు ఇన్‌స్పెక్టర్. కాసేపు గందరగోళం తరువాత అర్థమయిందేమిటంటే హెూమ్‌ఫర్ ఏజ్డ్‌పైన పోలీసులు దాడి చేసి, నక్సలైట్లకోసమని వృద్ధుల్ని హింసిస్తున్నారని ఎవరో యింటికి ఫోన్‌చేస్తే శంకర్‌రెడ్డి హడావిడిగా పరిగెత్తుకొచ్చాడు.

"కనీసం హత్య విషయం నిజమవుతుందేమో, మిగతా గదులన్నీ చూడనీయండి. తమకు సంబంధించిన క్లూలు దొరక్కుండా, ఒక్కోసారి యిలాగే కన్‌ఫ్యూజ్ చేస్తుంటారు కొందరు తెలివైన హంతకులు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏమండోయ్ చలపతిగారూ... అప్పుడే లేచి పూజ కూడా మొదలెట్టారా?".

"ఏమిటండీ నీరజమ్మగారూ, మందులు వాడుతున్నారుగదా. ఇంత చలిలో లేవకూడదని తెలీదా?"

"మిమ్మల్ని చూస్తే ప్రొద్దున్నే పార్వతీ పరమేశ్వరుల్ని చూసినట్టుందండీ శాస్త్రిగారూ"

-ఇలా ఒక్కొక్కరినీ పలకరిస్తూ, గదులన్నీ ఇన్‌స్పెక్టర్‌కి చూపించాడు శంకర్‌రెడ్డి.

తోటలోనూ, ప్రహరీ గోడచుట్టూనూ వెతికిన తరువాత అక్కడ ఓ హత్య జరిగిన తాలూకు నిదర్శనాలేవీ లేవని నిర్ధారించుకున్నారు పోలీసులు. అందరికీ కాఫీలు ఏర్పాటు చేశాడు శంకర్‌రెడ్డి.

"పోలీసులంటే ఆటలైపోయిందండీ జనాలకి. మరీ, యింత పొద్దున్నే ఫోన్ చేసి హత్య జరిగిందని చెప్పాడెవడో మహానుభావుడు. నా అదృష్టం బావుండి ఏ పిల్లిదో, ఎలకదో నెత్తురు కనిపించలేదు గనుక సరిపోయిందిగానీ, లేకుంటే ఆ నెత్తురు ఫొటోలూ, పాథాలజీ పరీక్షలూ, రిపోర్టులూ, అబ్బో చచ్చేవాణ్ణి"- కాఫీ తాగుతూ చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"మీకు సమస్య తప్పింది గానీ, నాకు మొదలయిందండీ" నీరసంగా అన్నాడు శంకర్‌రెడ్డి.

"కొంపదీసి చిన్నింటికి వెళ్లొచ్చారనుకుంటుందా మీ ఆవిడ?" జోక్ చేశాడు పైరాఫీసర్.

"అలాంటిదేం లేద్సార్. నా సమస్యంతా ఈ ఆశ్రమంగురించే. ఎవరో యింత పొద్దున్నే పనిగట్టుకుని హెూమ్‌ఫర్ ఏజ్డ్‌లో హత్య జరిగిందని పోలీసులకూ, యిక్కడ నక్సలైట్లున్నారని, పోలీసులు దాడిచేశారని నాకూ, అసలీ భవనమే తగలబడిపోతూందని ఫైర్‌స్టేషన్‌కూ ఫోన్‌చేశారంటే, యిది వట్టి ఆకతాయిపనేనా లేక ఏదైనా జరగబోయే దారుణానికి ప్రస్తావనా అన్నది అర్థంకావటంలేదు"

"మరీ అంతగా వర్రీ అవకండి. మీరో రిపోర్టివ్వండి. కొద్దిరోజులు ఓ యిద్దరు కానిస్టేబుల్స్‌ని నైట్‌పికెటింగ్‌కి పంపిస్తాను" హామీ యిచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"పోలీసులు రాజకీయ నాయకుల్ని తప్పపట్టించుకోరని అందరిలాగే నేనూ అనుకునేవాణ్ణి. థాంక్యూ ఇన్‌స్పెక్టర్" సంతోషంగా అన్నాడు శంకర్‌రెడ్డి.

"పోలీసులు కూడా మనుషులే సార్. మంచీ, చెడూ అంతటా వుంటాయి. ఎంతైనా యిక్కడున్నవాళ్ళు పసిపాపల్లా చూసుకోవాల్సిన వృద్ధులు. వాళ్ళకు వ్యక్తిగతంగా ఏమీ చేయలేకపోయినా, వృత్తిపరంగానైనా చేయగలిగినసాయం చేద్దామని అన్నాను" లేచి నిలబడ్డాడు ఇన్‌స్పెక్టర్.





"వృద్ధుల్ని గురించి అందరూ మీలాగా ఆలోచిస్తే, యిక్కడున్నవాళ్ళలో సగంమందైనా హాయిగా ఎవరిళ్ళల్లో వాళ్ళుండేవాళ్లు. ముసలాళ్ళంటే అరిగిపోయిన రికార్డుల్లాగా, ఐపోయిన పేస్ట్ ట్యూబ్‌లాగా చెత్తకుప్పమీద పడేయాల్సినవాళ్ళనుకుంటారు చాలామంది" నిట్టూర్చాడు శంకర్‌రెడ్డి.

పోలీసులూ, ఫైర్‌మెన్నూ వెళ్ళిపోయిన తర్వాత పది నిమిషాలు అక్కడే గడిపి, ఆ సంఘటన గురించే ఆలోచిస్తూ యింటిదారి పట్టాడు శంకర్‌రెడ్డి.

★ ★ ★

"... యికపోతే యిది నీకు" చిలిపిగా భార్య చేతిలో పెట్టాడు బాదం ఆకు పొట్లాన్ని.

పొట్లంలోని మల్లెపూలని చూసి, కంటతడి పెట్టుకుని విశ్వనాథం భుజంమీద వాలిపోయి బావురుమంది అన్నపూర్ణ.

"అన్నపూర్ణా, ఏమిటిది?" అనునయంగా ఓదార్చాడు.

"రిటైరై విశ్రాంతి తీసుకోవలసిన వయసులో మళ్ళీ జీవితం మొదలెట్టడమంటే మాటలా?" జీరవోయిన గొంతుతో అంది అన్నపూర్ణ.

"పిచ్చిదానా, ఇరవయ్యేళ్ళు నిండని పిల్లలు, అమ్మానాన్నల్ని కాదని ప్రేమపెళ్ళిళ్ళు చేసుకుని, వేరు కాపురాలు పెట్టుకుని హాయిగా బతుకుతున్నారు. అరవయ్యేళ్ళు దాటిన మనమెందుకు భయపడాలి. మనకుమాత్రం గుండెదిటవు లేదా ఏం?" భార్యకు ధైర్యం చెప్పాడు విశ్వనాథం.

"ఓ గ్లాసివ్వు, టీ పట్టుకొస్తాను" కావాలనే విషయం వదిలేశాడు.

"నాకు ఎందుకులెండి"

"భలేదానివే... ఇద్దరం కలిసి తాగుదామని నేను తాగకుండా వచ్చాను. ఉద్యోగానికి ఓ రూలుంది గనుక నేను రిటైరయ్యాను. ఆమాటకొస్తే నువ్వూ రిటైర్ కావలసిన వయసేగదా యిది. ఇకనించీ నువ్వు కూడా విశ్రాంతి తీసుకో"

ఏమీ మాట్లాడకుండా ఓ స్టీలు గ్లానుతెచ్చి భర్త చేతిలో పెట్టింది అన్నపూర్ణ. అతను గడపదాటగానే సామానులన్నీ పొట్లాలు విప్పి సర్దనారంభించింది.

దాదాపుగా కట్టుబట్టలతో వచ్చారిద్దరూ. అదృష్టవశాత్తూ వెంటనే దొరికిందా పాక. ఎంత తక్కువలో చూసుకున్నా అగ్గిపుల్ల దగ్గర్నించి మొదలెట్టి ఎన్నో కొనాలి. పొద్దుట్నించీ మూడు సార్లు తిరిగి సామాన్లన్నీ తీసుకొచ్చాడు విశ్వనాథం.

ఓ పెద్ద పాకెట్‌ను విప్పి ఆశ్చర్యపోయింది అన్నపూర్ణ. చాలా పెద్ద యిడ్లీపాత్ర. భర్త అమాయకత్వానికి క్షణంపాటు నవ్వుకుంది. గిన్నెకు వాసిన కట్టి వేసుకుంటే సరిపోయే యిడ్లీలకు పాత్ర కొనటమే దండగైతే మరీ నాలుగు కుటుంబాలకు ఒక్క వాయిలోనే సరిపోయేంత పెద్ద పాత్ర తీసుకొచ్చినందుకు డబ్బు వృధా అనుకుని బాధపడింది.

విశ్వనాథం టీ పట్టుకురాగానే యిద్దరూ అది తాగుతూ కూర్చున్నారు. అప్పుడు ప్రస్తావించిందామె, ఆ పాత్ర సంగతి.

"ఇన్నేళ్ళు సంసారం చేశాను, మనిద్దరికీ ఏమాత్రపు యిడ్లీ పాత్ర సరిపోతుందో నాకు తెలియదనుకున్నావా!" నవ్వుతూ అన్నాడు విశ్వనాథం.

"అంటే యిన్ని యిడ్లీలు తినేయగలననుకుంటున్నారా మీరు"

ఇక తప్పనిసరిగా భార్యకు వివరించాలని తోచగానే క్షణకాలం బాధతో చివుక్కుమంది అతని మనసు. కానీ, కొన్ని వాస్తవాలు ఎంత క్షోభ కలిగించేవైనా తప్పించుకోలేనివికదా. అందుకే, కొంచెం గంభీరంగా వివరించాడు-

"నువ్వూ, నేనూ తినటానికి కాదు. మనకు తిండిపెట్టే అక్షయపాత్ర అదే, అన్నపూర్ణా"

"అంటే...?" సగం అర్థమై తెల్లబోయిందామె.

"మనం యిడ్లీల వ్యాపారం ప్రారంభిద్దాం"

రెక్కలు తెగిన పక్షిలా విల్లవిల్లాడిందామె మనసు-

"ఏమండీ... అంటే, మీరు యిడ్లీలు అమ్ముదామనుకుంటున్నారా?"

"తప్పేముంది అన్నపూర్ణా. ఇతరుల కడుపు కొట్టకుండా మన పొట్టలు మనం నింపుకోవటానికి చేసే ఏ పనీ అల్పమైంది కాదు.

కాకపోతే, ముందుగా జీర్ణించుకోవటం కష్టమని పిస్తుంది. క్రమంగా అలవాటైపోతుంది''

'ఇడ్లీ... ఇడ్లీ.... వేడివేడి యిడ్లీ' అని అరుస్తూ వీధుల్లో తిరుగుతున్న విశ్వనాథంను ఊహించుకునేసరికి అన్నపూర్ణ మనసంతా అదోలా అయిపోయింది.

''ఏమండీ, కష్టపడటమంటే మరీ యిలా...''

''ట్యూషన్లు చెప్పుకుని బతగ్గలిగిన రోజులు కావు. ట్యూషన్లు చెప్పించుకునే వాళ్ళలో చాలా మంది 'మాస్టారు ఎంత గొప్పవాడు' అని అతని హోదా చూస్తారేగానీ 'ఎంత చక్కగా చదువు చెప్పగలడు' అని చూడరు. ట్యూషన్ మాస్టారంటే చదువు చెప్పడంకన్నా ముఖ్యంగా పాస్ చేయించగలగాలి. అవన్నీ నావల్ల ఎక్కడవుతాయి చెప్పు...

''వచ్చే పెన్షన్ డబ్బులూ, మనకెటూ సరిపోవు. రానురానూ పెరిగే ధరలతో ఆ పెన్షన్ మనకు ఒక్కపూట భోజనానిక్కూడా సరిపోతుందని చెప్పలేం. ఇద్దరమూ జీవితానికి చివరి దశలో వున్నవాళ్ళం. ఏ జబ్బో చేస్తే మందులూ, మాకులూ అంటే ఎంత కష్టం చెప్పు. అందుకే మనకు అదనపు సంపాదన కావాలి. అదీకాక ముప్పొద్దులూ యింట్లో కూచుని ఏమీ తోచక బాధపడేకన్నా ఒంట్లో శక్తి ఉడిగిపోయేలోగా ఏదో పని చేసుకుని నాలుగు డబ్బులు వెనకేసుకోగలిగితే మంచిదేగదా...

''ఇక వ్యాపారాలంటావా, మనకంత స్తోమత లేదు. మనం చేయగల వ్యాపారం యిదొక్కటే. పక్కవీధిలో గ్రైండరుంది. పప్పు రుబ్బించుకున్నామంటే సరి. తెల్లవారుఝామున లేచి, రెండు వాయిలు వేసుకుని బయలుదేరితే ఎనిమిది, తొమ్మిదికల్లా పూర్తవుతాయి. పదికల్లా యింటికొచ్చేసి, శుభ్రంగా రెస్టు తీసుకుంటే సరిపోతుంది. పార్ట్‌టైం జాబ్ అన్నమాట...

అసలీ పట్నంలో మంచి యిడ్లీ చేయటం చాలామందికి రాదు తెలుసా? నువ్వు నీ పద్ధతిలో పాళ్ళు కలిపి దూదిపింజల్లాంటి యిడ్లీలు చేశావంటే రుచి చూస్తే వదలరు. అన్నపూర్ణమ్మగారి యిడ్లీలనగానే జనం పరిగెట్టుకొచ్చేస్తారు కొన్నాళ్ళకు...'' చిన్నగా నవ్వాడు విశ్వనాథం.

''సరే, కానీండి... మీరుండగా నాకెందుకు భయం... ఎప్పట్నించి మొదలెడదాం పని''

అన్నపూర్ణ ధోరణి చూడగానే నిశ్చింతగా నిట్టూర్చాడు విశ్వనాథం. నాలుగు రోజులు గడిస్తే అలవాటయిపోయి, అసలు పనిలేకపోతే తోచదు, నిజమే... అయితే అన్నపూర్ణకు ఏదో చెప్పేశాడు కానీ, నిజంగా ఈ పట్నంలో ప్రజలు యిడ్లీలకు మొహంవాచివున్నారా, తన యిడ్లీలన్నీ ఖర్చవుతాయా... ఆలోచిస్తున్న విశ్వనాథం, భార్య మరోసారి అడిగేసరికి తేరుకుని, బదులిచ్చాడు.

''రేపు దశమి, గురువారం, మంచిరోజు. కనుక యివ్వాళ పప్పు పోసెయ్యి''

★ ★ ★

''సార్, మరిక వస్తాం సార్''

''ఇక అవసరం లేదన్నాడు సార్, సర్కిల్ సారు''

వారం రోజులుగా ప్రతి రాత్రీ కావలా కాసే డ్యూటీ వాళ్ళకు వేశాడు ఇన్‌స్పెక్టర్. ఆ వారం రోజుల్లోనూ హోమ్ ఫర్ ఏజ్డ్‌లో ఎలాంటి అవాంఛనీయ సంఘటనలూ జరగలేదు. ఆరోజు శంకర్‌రెడ్డి వచ్చే సమయందాకా ఆగి, సెలవు తీసుకుంటున్నారు, యిద్దరు కానిస్టేబుల్సు.

''చాలా చాలా థాంక్స్ చెప్పండి మీ ఇన్‌స్పెక్టర్‌గారికి'' అన్నాడు శంకర్‌రెడ్డి.

''మరిక వెళ్ళమంటారా''

''కరీం, యింతసేపైంది, వీళ్ళకు టిఫినో, కాఫీనో ఏమైనా యిచ్చావా?''

''రెండూ యిచ్చాను సార్'' బదులిచ్చాడు కరీం, అక్కణ్ణించి వెళ్ళిపోతూ.

''వారం రోజుల్నించీ మేమిద్దరమే వస్తున్నాం సార్'' అన్నాడు ఒక కానిస్టేబుల్.

''రోజూ, రాత్రంతా నిద్రపోకుండా కావలా కాశాం సార్'' అందుకున్నాడు మరో కానిస్టేబుల్.

వాళ్ళిద్దరి మాటల్లోని భావం అర్థమయింది శంకర్‌రెడ్డికి. పర్సు తీసి, వంద రూపాయల నోటు అందించాడు. ఇద్దరి ముఖాలూ సంతోషంతో పొంగిపోయాయి.

''మళ్ళీ ఎప్పుడైనా ఏదైనా అవసరమైతే



కబురు చేయండి సార్'' ఉత్సాహంగా అన్నాడో కానిస్టేబుల్.

క్షణంపాటు తటపటాయించి, నోటు దాచుకున్న జేబువైపు చూపిస్తూ, మరొకతనన్నాడు-

''సార్, ఈ విషయంమాత్రం మా సర్కిల్ సార్‌కు చెప్పొద్దు సార్''

''భలేవారయ్యా... వెళ్ళిరండి'' నవ్వుతూ అన్నాడు శంకర్‌రెడ్డి.

''థాంక్స్ సార్'' చెప్పేసి, యిద్దరూ బైటికి నడిచారు.

వాళ్ళిద్దరూ గేటు దాటుతూండగా వెనకనించి పిలిచాడొక వృద్ధుడు. అతని పేరు రాజారాం.

''ఐతే, మీరు రేపట్నించీ రావటంలేదా?''

''లేదు సార్... ఎందుకు?''

''అబ్బే, ఏంలేదు. మీరు రెడ్డితో మాట్లాడుతుండగా విన్నాను యిందాక. అందుకని అడిగాను. మళ్లీ రేపట్నించీ ఆకునికిపాట్ల కరీంగాడే నన్నమాట మాకు దిక్కు'' నిట్టూర్చాడు రాజారాం.

''దొంగలుపడి దోచుకుపోవటానికి యిక్కడ ఏమున్నాయి గనక సార్? మీరేం భయపడకండి సార్. మా సర్కిల్‌గారికి చెప్పండి, ఏదైనా వుంటే. పెట్రోల్‌కార్‌ని రోజూ ఓసారి యిటుగా పొమ్మని చెబుతారు'' అభయమిచ్చాడు కానిస్టేబుల్.

''సరే, జరగాల్సిందేమైనా వుంటే పెట్రోల్ కారేంటి, డీజిల్‌కార్ కూడా ఆపలేదు'' వేదాంత ధోరణిలో అన్నాడు రాజారాం.

''పెట్రోల్ అంటే బండ్లోపోసే పెట్రోల్ కాద్సార్. పోలీస్ పెట్రోలింగ్ అన్నమాట. వస్తాం సార్''

''మంచిదయ్యా''

పోలీసుకానిస్టేబుల్సిద్దరూ వెళ్ళేవరకూ అక్కడే నిలుచుండిపోయాడు రాజారాం. వాళ్ళిద్దరి సైకిళ్ళూ కనుమరుగవగానే అతనిదగ్గరకొచ్చి చేరారు థామస్, చలపతిలు.

''హమ్మయ్య, గండం గడిచిందిరా బాబూ'' హాయిగా నిట్టూర్చాడు చలపతి.



''గండమా, నీ బొందా. అనవసరంగా న్యూసెన్స్ చేశారిద్దరూ'' కసురుకున్నాడు రాజారాం.

ముగ్గురూ మాట్లాడుకుంటూ, బైటికి నడిచారు.

''ఏంట్రోయ్, న్యూసెన్సులూ, ఓల్డ్‌సెన్స్‌లూ అంటున్నావ్? అసలు హెూమ్‌ఫర్ ఏజ్‌డ్ తగలబడిపోతూందని ముందుగా ఫోన్ చేసింది నువ్వు కాదూ'' పోట్లాట మొదలెట్టాడు చలపతి.

''అవును, ఏదో చిన్నవాణ్ణి గనుక సరదాగా ఫోన్ చేశాను. నీకు డెబ్భైఏళ్ళు దాటాయ్, వాడికి అవరై ఎనిమిది. అరవై ఏళ్ళవాడితో పోటీలు పెట్టుకుని మీరూ ఆకతాయి పనులే చేస్తారా. అందునా పోలీసుల్తో''

రాజారాం ఆర్గ్యుమెంటుకు నివ్వెరపోయారిద్దరూ, ఇక వాదించి లాభంలేదని, టాపిక్ మార్చారు.

''అసలు వాడొచ్చేసరికి ఓ యిద్దరు మునలినాకొడుకులకి యోగా క్లాసులు తీసుకుంటున్నాను. మహా మెచ్చుకోలుగా చూశాడ్రా ఆ యిన్‌స్పెక్టర్. చెప్పొద్దూ, కుర్ర సన్నాసిని చూస్తే జాలేసింది''

''ఇంకా నయం. జాలేసి అసలు విషయం చెప్పలేదు' అడ్డుకున్న చలపతిని మధ్యలో రాజారాం అడ్డుకున్నాడు-

''వెధవ తెలివితేటలు. పోలీసులతో పెట్టుకుంటే ఏమయిందో చూడు. అసలే పోలీసులంటే అనుమాన పక్షులు. వాడిభయం పాడుగానూ, వారంరోజులు బైట కానిస్టేబుల్సుని కాపలా పెట్టాడు. రోజూ పొద్దున్నే ఏమీ చేయలేక గిలగిల్లాడిపోయాననుకోండి''

''ఒరేయ్, జాగర్తరోయ్. ఆ కృష్ణమూర్తిగాడికి మనమీద అనుమానమొచ్చినట్టుంది'' హెచ్చరించాడు చలపతి.

''నీమొహం... అసలీ ఫైర్ స్టేషన్‌కు ఫోన్‌చేసే ప్లాను వాడూ, నేనూ కలిసి ఆలోచించాం''

రాజారాం మాటలకు తెల్లబోయారిద్దరూ.

''కానీ వాడితో ఒకటే చిక్కు. పొద్దున్నే లేవకుండా, మునలి పీనుగలా ఏడూ, ఎనిమిద్దాకా పడుకుంటాడు. బైటికి రమ్మంటే ఒకపట్టాన రాడు'' మళ్ళీ వివరించాడు రాజారాం.

''మనం ముగ్గురం చాల్లేవోయ్. ఇవాళ కాస్త

తొందరగా రావాలి. ఆదివారం సుధొస్తుంది''

''అవునుగదూ... చాక్లెట్ కొనాలిరా. మతిమరుపు వెధవలు, మరిచిపోకుండా కాస్త గుర్తుచెయ్యండి''

★ ★ ★

''సార్, వెళ్లొస్తాను సార్'' పూడుకుపోయిన గొంతుతో భారంగా అన్నాడు రాజు.

ఏం మాట్లాడాలో తెలీలేదు సుబ్రమణ్యానికి. అది చాలా వింతైన సంఘటన. బహుశా, జైల్నించి వెళ్ళిపోయే ఖైదీలను చూసి జైలర్లు అలా బాధపడతారేమో... ఊహు... ఖైదీలంటే నేరస్తులుగా వచ్చి శిక్ష అనుభవించినవాళ్లు. మళ్ళీ నేరంచేస్తే మళ్ళీ జైలుకొస్తారు. వాళ్ళపైన జైలర్‌కు ప్రేమ వుండటానికి వీల్లేదని కాదు. అది మరోరకం సంఘటన.

బహుశా, అత్తవారింటికి వెళ్ళే కన్నకూతుర్ని అంపకాలు పెట్టే సందర్భంలో కన్నవాళ్ళ మనసుతో పోల్చవచ్చునేమో. ఊహు... అదీ సరికాదు. గారాబంగా పెరిగినా, ఎలా పెరిగినా కూతురుకు పెళ్ళి చేయటం తలిదండ్రుల బాధ్యత. అన్నేళ్ళు తమమధ్య తిరిగిన తమ కూతురు పరాయి యింటికి వెళ్ళిపోవటం బాధ కలిగిస్తుందేమో కానీ అది మరోరకంగా సంతోషం కలిగించే సందర్భమే. కూతురుకు కొత్తజీవితం ప్రారంభమవుతుంది. కొత్త సంసారం, భర్త, కొన్నాళ్ళకు పిల్లలు - జీవితానికి పరిపూర్ణతనిచ్చేది. పెళ్ళి అంపకాలు యిలాంటిది కాదు. అది తియ్యని బాధ.

రిటైరైన ఉద్యోగికి వీడ్కోలివ్వటం, ఫారిన్‌లో సెటిలవటానికి వెళుతున్నవాళ్ళకు వీడ్కోలివ్వటం యివేవీ ఈ సందర్భంతో పోల్చదగినవి కాదు.

అనాథాశ్రమంనుండి ఓ అనాథ వెళ్ళిపోవటం, అన్నాళ్ళుగా అమ్మగా, నాన్నగా పెంచిన నీడకు దూరమై, అందునా ఏ ఆలంబనా లేకుండానే కేవలం పద్దెనిమిది సంవత్సరాలు నిండిపోయినందున రూల్సుప్రకారం వెళ్ళిపోవటం తప్పనిసరైనదే కావచ్చుగానీ మనసున్న వార్డెన్‌కు, అలాటి పిల్లాడు వెళ్ళిపోతుండగా నిస్సహాయంగా వెళ్ళిపోనీయడమనేది నిజంగా ప్రపంచంలో మరే సంఘటనతోనూ పోల్చలేనిదేమో...

వంగి కాళ్ళకు నమస్కరించిన రాజును ఆప్యాయంగా లేవదీశాడు సుబ్రమణ్యం.

''రాజూ, అప్పుడప్పుడూ వస్తూండు'' అన్నాడాయన చివరగా.

మౌనంగా తలూపి, బైటకి నడిచాడు రాజు.

రాజు అన్న పేరు చెబితే పదేళ్ళకింద, ఆ ఆశ్రమంలో సిబ్బంది భయపడేవారు. గడగడ వణికేవాళ్ళు. పద్దెనిమిదేళ్ళకింద రైల్వేట్రాక్ పైన నెత్తుటి గుడ్డుగా వదిలేయబడిన పసివాణ్ణి ఎవరో చూసి, రక్షించడంతో ఒక మనిషి ఈ లోకంలో నిలవగలిగాడు. రెండురోజులు రైల్వే సిబ్బందిలోని ఆడవాళ్ళు కడుపునింపి, నిద్రబుచ్చారు. మూడోరోజున అనాథాశ్రమంలో చేర్పించారు. కొత్తలో ఆ రైల్వేసిబ్బందిలో ఎవరో ఒకరు వారానికీ, పదిరోజులకూ ఓ సారి వచ్చి చూసేవాళ్ళు. క్షేమసమాచారాలు కనుక్కునేవాళ్ళు. మూణ్ణాలుగు నెలల తరువాత మానేశారు. పిల్లవాడు పెరిగి పెద్దవాడై, మనుమల్ని గుర్తించటం మొదలైతే, పెరిగే అనుబంధాల్ని తెంచుకోవటం కష్టమని అనుకునుంటారు. అనుబంధమనేది పెంచుకుంటేనేకదా పెరిగేది. పేగు తెంచుకుని పుట్టిన సంగతే మరిచిపోయిన కన్నతల్లి రైల్వేట్రాక్‌మీద వదిలేసిన లోకంలో బరువు, బాధ్యతలుగా పరిణమించే మమకారాన్ని పెంచుకోవటానికి అందరూ అంగీకరించరు.

ఆ పసిగుడ్డుకు 'రాజు' అని నామకరణం చేశారు అనాథాశ్రమంవాళ్ళు. నామకరణమంటే ఉత్సవం చేశారని కాదు. రిజిస్టర్లో ఆ పిల్లాడు తమదగ్గరికి చేర్చబడిన రోజు రాసుకుని, ఆ పేరు రాసుకున్నారన్నమాట.

నిజంగా కన్నవాళ్ళ దగ్గరగానీ పెరిగుంటే ఎంత అల్లరి చేసివుండేవాడోగానీ, ప్రేమా, ఆదరణా దొరకని అనాథాశ్రమంలోనే అక్షరాలా యిల్లుపీకి పందిరేసేంత అల్లరి చేసేవాడు. ఆయా కనుమరుగైతేచాలు, పిల్లలందరికీ రాజు చేసే పనులు సరదాగానూ, భయం కలిగించేట్టుగానూ వుండేవి. ఎవరో ఒకరొచ్చి అందరినీ తంతారేమోనని కొందరు భయపడి రాజుకు దూరంగా వుంటే, పిల్లల్లో సహజంగా వుండే చిలిపిదనంకొద్దీ కొందరు రాజును ప్రోత్సహించేవాళ్ళు. దాదాపు ఆశ్రమంలోని పిల్లలంతా రాజును చూసి ఏదో ఒకరకంగా మన

సులోనైనా యిష్టపడేవాళ్లు. కన్నతల్లిదండ్రులే ఒక్కోసారి పిల్లల అల్లరి తట్టుకోలేక వీపులు మోతమోగించటం జరుగుతుంటుంది. అలాంటిది, దాతలిచ్చే సొమ్ముతోకాక తమ దయతోనే పిల్లలు బతుకుతున్నారనుకునే సిబ్బందివున్న ఆశ్రమంలో రాజు ఎన్నిసార్లు తన్నులు తిన్నాడో, పస్తులున్నాడో చెప్పటం కష్టమే. ఆరకంగా అతని అల్లరి చాలావరకూ తగ్గిపోయిందిగానీ లేకుంటే మరింత చురుకుగా తయారయేవాడేమో. అల్లరిచేసే పిల్లలు చురుకైనవాళ్ళని చాలామందికి తెలియదు. ఏం చేయాలో తెలియక అల్లరిచేసే పిల్లల్ని సరైనవిధంగా నడిపిస్తే మహా మేధావులవుతారని తెలిసిన యింట్లో పుట్టిన పిల్లల్ని అదృష్టవంతులుగా చెప్పుకోవాలి!



రెండు, మూడు సంవత్సరాల వరకూ తానేం పోగొట్టుకున్నదీ రాజుకు తెలియలేదు. ఆ తరవాత కొందరు పెద్దవాళ్లు, కొత్తవాళ్లు రావటం, పిల్లల్ని చూడటం, అందులో ఎవరో ఒకర్ని పెంపకానికి తీసుకోవటం లాంటి వాటి వల్ల తమకు తెలియని మరో ప్రపంచం వున్నదని అర్థమయింది. మొదట్లో దత్తతకు వెళ్లే పిల్లల్ని దురదృష్టవంతులుగా భావించేవాళ్లు. వయసు పెరుగుతున్నకొద్దీ, విషయాలు తెలుస్తున్న కొద్దీ తననూ ఎవరైనా పెంచుకుంటే బావుణ్ణనే ఆలోచన, పెంచుకోవాలన్న ఆశ ఎక్కువవుతూ వచ్చింది. ఎవరికి పుట్టిన బిడ్డరా వెక్కెక్కి ఏడుస్తున్నాడు- అనే మాట మొదటిసారిగా అర్థమైనప్పుడు తనలో తనే కుళ్లి కుళ్లి ఏడ్చాడు రాజు. తానెవరికీ చెందడు. తనకెవరూ లేరనే ఆలోచన ప్రారంభమైనప్పటినుండే జీవితం నరకమని అనిపించసాగిందా ఆశ్రమంలో. జీవించటానికి హక్కులేదని తెలిసిన వాడికీ, జీవించటానికి అవకాశం లేదని తెలిసిన వాడికీ జీవితం మీద కొత్త మమకారం పుట్టుకొచ్చినట్టే, ప్రేమా, ఆదరణా పొందే అవకాశం లేదని తెలిసిన వాళ్లల్లో అవి తప్పకుండా పొందాలనే తపన ఎక్కువై ఆ భావన అలకగానో, దౌర్జన్యంగానో, మరోరకంగానో బయటపడుతుంది. తల్లి అందించిన పాలు ఒలకబోసే పసిపాప దగ్గర్నించీ, భర్త వద్దన్న రంగు చీర కొనుక్కునే భార్య వరకూ ఆయా పనుల్లో తమకున్న హక్కును నిరూపించుకోవాలనే పంతం వ్యక్తమవుతుంది. రాజు విషయంలోనూ అదే జరిగింది. అతను ఆ ఆశ్రమంలో చేసిన పనులకు పేరు పెడితే, దాన్ని 'హక్కుల పోరాటం'గా చెప్పుకోవాలి.

ఐదారేళ్ళ వయసొచ్చినప్పట్నించీ అలా అల్లరి వాడుగా మారిపోయాడు రాజు. అనాథాశ్రమంలోని పిల్లలతో యింట్లో పనులు చేయించుకోవటం చాలామంది వార్డెన్‌లకు అలవాటు. ఉద్యోగం షిఫ్టుల్లాగా నెలకో యిద్దరు, ముగ్గురికి అలాంటి డ్యూటీ పడేది. వార్డెన్ యింట్లో పనిచేయాల్సి వచ్చినప్పుడల్లా రాజుకు ఒళ్లు కంపరమెత్తేది. తన నిస్సహాయతను అలుసుగా తీసుకుంటున్నారని అనిపించి మొండికెత్తేవాడు. కానీ తప్పించుకోలేకపోయాడు. అదంతా పాత వార్డెన్ కాలంలోని కథ.

పాత వార్డెన్ మోహన్‌రావ్ వున్నప్పుడు ఓసారి భోజనంలో బొద్దింకలొచ్చి, రాజు నాయకత్వంలో... సలహాతో కొందరు పిల్లలు నిరాహార దీక్ష చేశారు. విషయం తెలిసిన వార్డెన్ రాజును బండబూతులు తిట్టాడు. రాజుకూడా అంతకన్నా నీచమైన బూతులు తిట్టాడు. తమను పనికిమాలిన వాళ్ళుగా చూసుకోకూడదనీ, అసలు తామంటూ లేకపోతే వార్డెన్‌కు ఉద్యోగమే వుండేది కాదనీ అరిచాడు. ఎప్పట్లాగే అప్పుడూ నాలుగుతన్నాడు వార్డెన్. ఐతే అతనికి రాజును చూస్తే భయం వేసింది. తనను బూతులు తిట్టాడని కాదు, హక్కుల గురించి మాట్లాడాడని ఆ భయం. అతనిమూలంగా ఆశ్రమంలో కొందరు పిల్లలైనా ఆహక్కుల విషయం తెలుసుకుంటే తనకు చాలా కష్టాలొ

స్తాయని.

అసలందుకే ధర్మకర్తలు చూడటానికొచ్చినప్పుడు వాళ్ళ కంటపడకుండా రాజును ఎక్కడికో అక్కడికి పంపించేవాడు. ఈరోజు రాజు అన్న మాటలకు వార్డెన్‌కు చాలా కోపమొచ్చింది. తనను కొట్టినందుకు క్షమాపణలు చెప్పకోకపోతే ఏం చేస్తానో చూడమని బెదిరించాడు. ఏం చేస్తాడని చాలా సేపు ఆలోచించాడు. చివరకు ఆ విషయం మరిచిపోయాడు. కానీ ఆ విషయం రాజు మాత్రం మరిచిపోలేదు.

ఏదో పని విషయమై వార్డెన్ మోహన్‌రావ్ బొంబాయికి వెళుతున్నాడు. అతను మరునాడు ఉదయం ఫ్లైట్‌కు వెళుతున్న విషయం ఎవరితోనో చెబుతుండగా విన్నాడు రాజు. ఏం చేయాలో ఆలోచించి, నిర్ణయించుకుని, తన స్నేహితుల సహాయం తీసుకున్నాడు. ముఖ్యంగా తానేం చేస్తున్నదీ చెప్పకుండా, వాళ్లు ఏం చేయాల్సిందీ మాత్రమే వాళ్ళకు చెప్పాడు, ప్లాను సిద్ధమయింది.

పదేళ్ళ వయసున్న రాజుకు, అందునా అనాథాశ్రమంలో పెరుగుతూ, మానసిక వికాసానికి ఎలాంటి అవకాశమూలేని చోట పెరుగుతున్న వాడికి అలాంటి తెలివితేటలెలా వచ్చాయనే సందేహం రానవసరం లేదు. అనేక మంది మేధావులు పువ్వులాగా పుట్టగానే పరిమళించినవాళ్లే.

తన గురించీ, తన తోటివాళ్ల గురించీ ఎన్నో కల్పనలు చెప్పేవాడు రాజు. అవి ఆసక్తికరంగా, తమాషాగా, సరదాగావుండేవి. చాలా మందికి తమకు తెలియని, తమ జన్మకు కారకులైన తమ తల్లిదండ్రులపైన కోపద్వేషాలుండేవి. అవకాశం వుంటే, వాళ్ళుగానీ ఎదురైతే, వాళ్ళను ముక్కలు ముక్కలుగా నరికేయాలనుకునే వాళ్ళు కొందరు పిల్లలు. కానీ రాజు మాత్రం తన తల్లిదండ్రుల గురించి ఎప్పుడూ ఉన్నతంగా ఊహించుకునేవాడు. తన తల్లీ, తండ్రీ, యిద్దరూ మంచి వాళ్ళే. ఏదో తప్పనిసరి కారణంవల్లనే వాళ్ళు తనను వదిలేసి వుంటారనే భావనకు ఫిక్స్ అయిపోయాడు.

తన తండ్రి ఒక రచయిత. తన తల్లి ఆయన అభిమాని. ఇద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకున్నారు. తన తండ్రి మూలంగా పైకి రాలేని రచయితలెవరో అసూయతో ఆయన్ని హత్య చేశారు. తన తల్లి తనను కనగానే ఆత్మహత్య చేసుకుని తన తండ్రిని చేరుకుంది. ఇదో ఊహ.

ఒక మిలిటరీ ఆఫీసర్ యుద్ధంలో గాయపడి శత్రువులకు దొరక్కుండా అడవుల్లోంచి తప్పించుకుని పోయి, ఓ మారుమూల పల్లెకు చేరుకుని స్పృహతప్పి పడిపోయాడు. ఆ ఊరి జమీందారు కూతురు గుడికెళ్లి వస్తూ ఆయన్ని చూసి, తమ యింటికి తీసుకుపోయి వైద్యం చేసి, రక్షించింది. క్రమంగా వాళ్ళమధ్య ప్రేమ చిగురించింది. ఇద్దరూ పెళ్లి చేసుకున్నారు. భార్య గర్భవతిగా వుండగా ఆ మిలిటరీ ఆఫీసర్ యుద్ధానికి వెళ్ళి, వెయ్యిమంది శత్రువుల్ని చంపి, వీర మరణం పొందాడు. పుట్టిన బాబు మూలంగా తమ కూతురి బతుకు పాడుకాకూడదని, జమిందారు బాబు పుట్టగానే చనిపోయాడని చెప్పి, వాణ్ని రైల్వేట్రాక్ మీద వదిలేశాడు. తన కూతురికి మళ్ళీ పెళ్లి చేశాడు. ఆ బాబే తాను.

తన తల్లీ తండ్రీ యిద్దరూ పెద్దల అంగీకారంతో పెళ్ళి చేసుకుని హాయిగావుండే వారు. తను కడుపులో పడగానే ఎంతో జాగ్రత్తగా వుంటూ, మంచి మందులు తీసుకుంటూ, పుట్టబోయే బిడ్డకోసం ఎన్నో ప్రణాళికలు సిద్ధం చేసుకుంటూ, ఎంతోఆశతో, ఎన్నో కోరికలతో తన పుట్టుకకోసం ఎదురు చూస్తున్నారు. ఓ పెద్ద ఆసుపత్రిలో తన తల్లి తనను ప్రసవించింది. వీళ్ళిద్దరి అనురాగమూ, అన్యోన్యతా చూసి కన్నుకుట్టిన పక్కింటావిడ, తనను ఆసుపత్రినుండి మాయం చేసి, రైల్వేట్రాక్ పైన పడేసింది. తన తల్లిదండ్రులు తనకోసం యింకా వెతుకుతూనే వున్నారు. తన భుజమ్మీదున్న విచిత్రమైన పుట్టుమచ్చను తన తల్లి గుర్తుపెట్టుకుంది. ఎప్పుడో ఒకసారి తనను చూసినప్పుడు గుర్తుపడుతుంది.

తన తండ్రి ఓ నక్సలైట్. పోలీసుల్ని గడగడలాడించిన తన తండ్రిని ప్రేమించిన తన తల్లి అతనితో కలిసి, తనను కడుపున మోసింది. వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుని, తనను కూడా నక్సలైట్ చేయాలనుకున్నారు. ఈ పరి

స్థితుల్లో తన తండ్రిని ఎన్‌కౌంటర్ పేరుతో పోలీసులు చంపేస్తారు. అప్పుడే తాను పుట్టాడు. నక్సలైట్ కొడుకుగా తననూ పోలీసులు ఏం చేస్తారోనని తనను గుండెలకు హత్తుకుని తప్పించుకు పోతున్న తన తల్లి, ఎక్కడో ఓ చోట పోలీసులకు మస్కా కొట్టడానికి తనను రైలు కట్ట పక్కన వదిలేసి, పక్కన దాగుంది, పోలీసులు వెళ్ళగానే తనను తీసుకోవచ్చని ఆమె ఆశ. అంతలో ఎవరో చూసి తనను అనాథాశ్రమంలో చేర్చారు. వాళ్ళను అనుసరించటానికి తన తల్లికి వీలు చిక్కలేదు.

ఇలావుండేవి రాజు ఆలోచనలూ, కల్పనలూ. వీటిని రెండు, మూడు గంటల కథలుగా చేసి, తోటి వాళ్ళకు వినిపించేవాడు. వాళ్ళకు కూడా వాళ్ళ తల్లిదండ్రులను గురించిన కథల్లి చెప్పేవాడు. కొందరి గురించి తమాషాలు చెప్పేవాడు. ఓసారి 'పొట్టేలు పున్నమ్మ' సినిమా చూసిన కొందరు పిల్లలు అందులో పొట్టేలు చేసిన పనుల గురించి చర్చించుకుంటున్నారు. ఆశ్రమం మెస్‌లో పనిచేసే యాదగిరి కూడా వాళ్ళతో చేరాడు. ఈ యాదగిరి చాలా అమాయకుడు. అతను అవకతవక పనులు చేసి, వంటతనితోనూ, వార్డెన్‌తోనూ తరచుగా చీవాట్లు తినేవాడు. అవన్నీ పిల్లలకు వినోదం.

''అసలా గొర్రె అచ్చం మనిషిలాగే చేసింది రాజూ. అలా ఎలా వీలవుతుందో నీకు తెలిసుండాలి, చెప్పు'' అన్నాడు యాదగిరి, ఎంతో కుతూహలంగా.

పది క్షణాలు ఆలోచించాడు రాజు. తరవాత చెప్పాడు

''ఓసారి బ్రహ్మదేవుడు కొన్ని మనుషుల బొమ్మలు తయారుచేసి, వాళ్ళకు తలరాతలు రాసి, మెదళ్ళు అమర్చుతున్నాడు. చివరగా ఒకే ఒక్క మనిషికి మెదడు అమర్చే పని వుండగా సరస్వతి దగ్గర్నించి పిలుపొచ్చింది. దాంతో ఆ పని అక్కడే వదిలేసి, హడావిడిగా వెళ్ళిపోయాడు. మళ్ళీ వచ్చిన తరవాత గొర్రెల్ని తయారు చేయటం మొదలెట్టాడు. మొదటి గొర్రెకు ఆ మనిషి మెదడు పెట్టేసి, భూలోకంలోకి పంపించిన తరువాత ఆయనకు గుర్తొచ్చింది, తను చేసిన పొరబాటు. కానీ అప్పటికే ఆ గొర్రె భూలోకానికి వెళ్ళి పోవటంతో ఏమీ చేయలేకపోయాడు. అలా మనిషిమెదడుతో వచ్చిన గొర్రె పొట్టేలే ఈ సినిమాలోని గొర్రె''

రాజు చెప్పిన కథ నిజమేనని చాలామంది పిల్లలతోపాటు యాదగిరి కూడా నమ్మేసాడు. కానీ అతనికో అనుమానం వచ్చింది.

''మరి రాజూ, అప్పుడు ఓ మనిషి మిగిలిపోయాడుకదా... మరి అతని సంగతేంటీ?''

''ఏముందీ... ఎటూ ఓ గొర్రె మెదడు మిగిలిపోయిందిగదా. దాన్ని ఆ మనిషికి అమర్చేశాడు. ఆ మనిషే నువ్వు''

అంతే, పిల్లలంతా విరగబడి నవ్వేసారు. యాదగిరిని చూసినప్పుడల్లా 'పొట్టేలు పున్నమ్మ' అని ఎగతాళి చేయటం పిల్లలకు అలవాటైపోయింది. ఓసారి ఈ విషయమై మళ్ళీ రాజుతోనే ప్రస్తావించాడు యాదగిరి.

''నువ్వు చేయాల్సిన పనల్లా ఆ గొర్రె ఎక్కడుందో కనుక్కో మద్రాసులో. దాన్ని కొనుక్కుని, దాని మెదడు తినేస్తే చాలు నీ మెదడు నీకు వచ్చేస్తుంది'' అని సలహాయిచ్చాడు రాజు.

అలాంటి రాజు, తన మనసంతా పెట్టి వార్డెన్ మోహన్‌రావ్ విషయమై ఆలోచించాడు. కావలసిన ఏర్పాట్లు చేసుకున్నాడు.

ఆ రోజు రాత్రి, వార్డెన్ యింట్లో తమ షిఫ్టు పనిచేస్తున్న ముగ్గురు పిల్లల్లో ఒకడు గోడగడియారంతో సహా అన్ని గడియారాలనూ ఓ గంట వెనక్కి తిప్పేశాడు. టెలిఫోన్ కనెక్షన్ వచ్చే ప్లగ్గును విప్పి, లోపలివైర్లు పాడు చేయటానికి ఒప్పుకోలేదు గానీ, ఆ పని రాజు చేయటానికి వీలుగా పెరటి తలుపు తీసిపెట్టాడు. తెల్లవారు జాము నాలుగింటికి ఆశ్రమంలోంచి రహస్యంగా వచ్చిన రాజు టెలిఫోన్ ప్లగ్గును పాడు చేశాడు. వార్డెన్ కారు పెట్రోల్ ట్యాంక్‌లో పావుకిలో పంచదార పోసాడు. గమ్మున తన పనులు చేసుకోమని మిత్రుడికి చెప్పి, తను బైటికి వెళ్ళిపోయాడు. కాస్త దూరంలోవున్న ఓ యిరానీ హొటల్‌కెళ్ళి టీ తాగి, అక్కడో గంటన్నర గడిపి, తెల్లవారు జామున ఆరుకల్లా వార్డెన్ యింటి ముందుకు చేరుకుని రహస్యంగా కూచుని, జరగబోయే దానికోసం ఓపిగ్గా కాచుకున్నాడు.

పాల కుర్రాడొచ్చి పాకెట్స్ వేసి వెళ్ళిపోయా





డు. పేపర్ కుర్రాడొచ్చి పేపర్ వేశాడు. రాజు చేసిన పనులతో ఏమవుతుందో తెలియని అతని మిత్రుడు సగం భయంతోనూ, సగం కుతూహలంతోనూ గమనిస్తున్నాడు. ఇంతలో వార్డెన్ భార్య మాటలు వినిపించి ఉలిక్కిపడ్డాడు.

"ఒరేయ్ ప్రతాప్ పాలు తొందరగా వచ్చేశాయేంట్రా?"

క్షణంపాటు తడబడిన ప్రతాప్, భయం భయంగా బదులిచ్చాడు

"ఏమోనమ్మా... మరి కాఫీ పెట్టమంటారా?"

"మరీ ఆరింటికే ఏం కాఫీరా... ఓ అరగంట పోనీ... ఆయన లేచాడా?"

"లేదమ్మగారూ... లేపమంటారా?"

"ఇవాళ ఆయన బొంబాయి వెళుతున్నారు చెప్పారుగదా. మరి ఫ్లైట్ ఎన్నింటికో, ఏంటో, వెళ్ళి నిద్రలేపి కనుక్కో"

"మంచిదమ్మగారూ" అక్కణ్ణించి రామోహన్‌రావ్ గదికి వెళ్ళాడు ప్రతాప్.

మోహన్‌రావ్ పడగ్గదిని ఏ.సీ. చేయించుకున్నాడు. అతని భార్యకు ఏ.సీ. పడదు. అంచేత యిద్దరూ వేర్వేరుగా పడుకుంటారు. వాళ్ళకు పిల్లలు పుట్టలేదెందుకో. అలాంటి వాళ్ళు సాధారణంగా అనాథాశ్రమంలోని పిల్లల్ని ప్రేమగా చూసుకోవచ్చుగానీ, ఆ దంపతులిద్దరికీ అలాంటి భావన ఎన్నడూ కలగలేదు.

ప్రతాప్ నిద్రలేపగానే కంగారుగా లేచిపోయాడు మోహన్‌రావ్. కంగారుగా బల్లమీది వాచీ తీసి చూసుకున్నాడు. ఆరూ పది చూపిస్తుందది. నిజానికి అప్పుడు ఏడూ పదవుతూంది.

"ఎనిమిదింటికిరా ఫ్లైటు. ఒక్క పావుగంట పడుకుంటాను. ఆరున్నరకు లేపు" అన్నాడు మోహన్‌రావ్, బద్ధకంగా మళ్ళీపడుకుని.

దడదడలాడుతున్న గుండెతో బైటికి నడిచాడు ప్రతాప్.

మరో పది నిమిషాలకు మోహన్‌రావ్ స్నేహితుడు రంగస్వామి వచ్చాడు హడావిడిగా తను బొంబాయి వెళుతున్నందున తనను కార్‌లో ఎయిర్‌పోర్టు దగ్గర డ్రాప్ చేసి, కారు యింట్లో పెట్టేయడానికి రంగస్వామిని తయారుగా వుండమన్నాడు మోహన్‌రావ్. ఏడుకల్లా వస్తానన్న మిత్రుడు రాకవి... మి ఫోన్ చేశాడు గానీ, మో... పనిచేయక పోవడంతో, మరో పది ... చూసి, తనే వచ్చాడు. చాలా ముఖ్య ప్రయాణమది. కేన్సిల్ కావటానికి వీల్లేదు. పైగా ముందుగానే విమానం టికెట్ కూడా కొనిపెట్టుకున్నాడు మోహన్‌రావ్.

బైట నిలుచున్న రాజు, రంగస్వామి అనే కొత్త పాత్ర ప్రవేశాన్ని చూసి, దానివల్ల తన ప్లాను బెడిసికొట్టే అవకాశాలున్నాయా అని ఆలోచించసాగాడు. రంగస్వామిని చాలాసార్లు ఆశ్రమంలో చూడటం వల్ల అతను మోహన్‌రావ్ మిత్రుడని తెలుసుగానీ, యిప్పుడెందుకొచ్చాడో అర్థం కాలేదు రాజుకు.

మిత్రుడొచ్చి ఏడున్నర కావొస్తూందని చెప్పటంతో ముందుగా ప్రతాప్‌నీ, తరవాత భార్యనీ తిట్టాడు మోహన్‌రావ్. ఎయిర్‌పోర్టుకు పదిహేను నిమిషాల్లో వెళ్ళిపోవచ్చు. ఇంకా అరగంట టైముంది. కానీ తన యింట్లోని గడియారాలన్నీ ఎందుకు తక్కువ నడుస్తున్నాయో అర్థం కాలేదు. అది ఎవరో చేసిన పనని అతనికి తోచలేదు. గబగబా ముఖం కడుక్కుని, స్నానం చేయకుండానే బయలు దేరాడు. మిత్రులిద్దరూ కారులో ఎక్కారు. కారు స్టార్ట యింది.

ఇంట్లో వున్న ప్రతాప్, బైటవాకిలి ఊడుస్తున్న అశోక్ అనే మరో ఆశ్రమం పిల్లాడూ, బైటవున్న రాజూ అందరూ గజిగజిగావున్న మనస్సుతో గుండెలుగ్గబట్టుకున్నారు. గేటు దాటి రోడ్డు మీదికెక్కిన కారు వేగం పుంజుకుంది. కారు తనను దాటిన వెంటనే ఇంట్లోకి పరిగెత్తిన రాజు హడావిడిగా మరో కొత్తపని పురమాయించాడు అశోక్‌కి, ప్రతాప్‌కీ. తను వెంటనే తన స్థానంలోకెళ్ళి నిలుచున్నాడు. వందగజాల ధూరంలో ఆగిపోయిన కారుతో కుస్తీలు పడుతున్నారు మోహన్‌రావ్, రంగస్వామిలు.

వంటింట్లోంచి తెచ్చిన గుప్పెడు వంచదారను అశోక్ చేతిలో పోసి, గబగబా లోపలికెళ్లాడు ప్రతాప్. అదురుతున్న గుండెలతో స్కూటర్ పెట్రోల్ ట్యాంకర్ మూత తీసి, తన చేతిలోని



వంచదారను దాన్లో కుమ్మరించి, అక్కణ్ణించి తప్పుకున్నాడు అశోక్.

ఆగిపోయి మొరాయించిన కారుతో లాభంలేదని తన స్కూటర్ తీసుకుపోదామని పరుగులాంటి నడకతో వచ్చాడు రంగస్వామి. ఒక్క కిక్‌తో స్టార్టయిన స్కూటర్ వేగంగా కారు వైపు దారి తీసింది. కారు పక్కన ఆగగానే మోహన్‌రావ్ వినుగ్గా చిరాగ్గా ఎక్కేసాడు వెనక సీటుమీద. మరో యాభై గజాలువెళ్లి స్కూటరూ మొరాయించింది. ఆటోగానీ, టాక్సీగానీ ఏది దొరికితేదాన్లో వెళ్ళటానికి చిరాగ్గా నిలుచున్నాడు మోహన్‌రావ్. ఆ ప్రాంతాల్లో అంత పొద్దున్నే ఏదైనా దొరకటం అదృష్టమే. కానీ మోహన్‌రావ్‌ని అదృష్టం వరించలేదు. మరో పది నిమిషాలకు దొరికింది ఓ ఆటో. ఆటో కదలగానే టైము సరిచేసుకున్న గడియారం చూసుకున్నాడు. ఎనిమిదికి రెండు నిమిషాలు తక్కువుందది. టీ కాఫీ టైముకి ఎడెనిమిది నిముషాలు మాత్రమే. అదృష్టవశాత్తూ ఏదో అవాంతరం జరిగి, విమానం లేటైతే తప్ప, తనా విమానాన్ని అందుకోలేడు. ఫ్లైట్ టికెట్ డబ్బులకన్నా ముఖ్యంగా, చాలా లాభదాయకమైన ఓ ముఖ్యమైన వ్యవహారం చెడిపోతుంది. వినుగ్గా నిట్టూర్చి, ఆటోలోంచి పరిసరాలను గమనించసాగాడు, ఎంత దూరంలో వున్నదీ చూసుకోవటానికి... ఆటోవేగంగా వెళుతూంది.

రంగస్వామి స్కూటర్ బయలుదేరగానే తనున్న స్థలంలోంచి కదిలి మరో వైపు దారితీశాడు రాజు. నాలుగు వీధులవతల వున్న గుళ్ళో ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ వుంది. రూపాయి కాయిన్ తీసి చేతిలో పట్టుకుని, ఎయిర్‌పోర్ట్ నంబర్ కలిపాడు. కాయిన్ వేస్తూ పరిసరాలు పరిశీలించాడు. ఫోన్ దగ్గర్లో ఎవ్వరూ లేరు. వీలైనంత వరకూ గొంతు కరుగ్గా మార్చి నోట్లో వున్న రెండు గోలీకాయలు కిందపడకుండా చూసుకుంటూ, చెప్పాడు

"బాంబే వెళుతున్న విమానంలో బాంబుంది"

"ఏంటీ" కంగారుగా వినిపించింది అవతలి కంఠం.

"మీరు విన్నది కరెక్టే"

"ఇప్పుడు బాంబే వెళుతున్న ఫ్లైట్‌లోనా?"

"అవును"

"విమానంలో ఎక్కడుంది. లగేజ్‌ల్లోనా, బాడీలోనా"

ఎవరో ఫోన్ దగ్గర చెప్పులు విడుస్తున్నారు. ఇక ఎక్కువ సేపుండటం మంచిది కాదని నిర్ణయించుకున్నాడు రాజు.

"నాకు తెలీదు" అందామనుకుని అనకుండానే ఫోన్ కట్ చేశాడు.

"ఒరేయ్, ఫోన్‌తో ఆటలేంటీ" కసురుకున్నాడు, చెప్పులు విడిచినాయన.

భయపడినట్టు నటించి, బిక్కమొహం వేసుకుని అక్కణ్ణించి కదిలాడు రాజు. ఆశ్రమం వైపు బయలుదేరాడు.

ఆ పూట తన ప్రయాణం మీద ఆశ వదులుకున్న మోహన్‌రావ్, ప్లేన్ బయలుదేరలేదని తెలిసి హాయిగా నిట్టూర్చాడు. ప్లేన్‌లో బాంబుందని తెలిసి కంగారుపడ్డాడు. కాస్సేపట్లో మృత్యువునుండి తప్పించుకోగలిగినందుకు సంతోషించాడు. విమానం దొరికేట్టు చేసినందుకు బాంబు పెట్టిన టెర్రరిస్టుల్నీ ఆ బాంబుకు బలికాకుండా మిగతావాళ్ళతోపాటు తనను కాపాడినందుకు ఫోన్ చేసిన మనసున్న టెర్రరిస్టునీ మనసులోనే అభినందించి తన టికెట్ అందించి బోర్డింగ్ పాస్ కోసం అడిగాడు.

ఆ పూట బాంబే ఫ్లయిట్‌కు టికెట్లు తీసుకున్న వాళ్ళందరూ వచ్చారు, ఒక్క మోహన్‌రావ్ తప్ప. అతను వచ్చేలోగా విమానంలో బాంబుందని ఫోన్ వచ్చింది. అతను ఆలస్యంగా వచ్చాడు. కాస్సేపటికి విమానంలో బాంబు లేదని తెలియగానే, ఎయిర్‌పోర్టు అధికారులు మోహన్‌రావ్‌ను అరెస్ట్ చేశారు, ఆ ఫోన్‌చేసింది అతనేనని. బాంబు బెదిరింపుల్లో ఫ్లైట్‌కు ఆలస్యమైన వాళ్లు చేస్తున్నవీ వున్నాయని కనుక్కున్న విమానాశ్రయ అధికారులు అలాంటి ఫోన్ లొచ్చినప్పుడు ఆలస్యంగా రిపోర్ట్ చేసిన వాళ్ళను అరెస్టు చేయటం ప్రారంభించి చాలా కాలమయింది.

'సిరిదావచ్చిన వచ్చును నారికేళ సలిలము భంగిన్' అన్నట్లుగా రాజుకు తెలివితేటలు అబ్బినాయని చెప్పుకోవాలి. ఆ సంఘటన తరవాత ధర్మకర్తల్లో కొందరు మోహన్‌రావ్





వ్యక్తిత్వం గురించీ, ఆశ్రమం నిర్వహణ గురించీ శ్రద్ధ వహించి, చాలా మార్పులు చేశారు. అప్పుడే సుబ్రహ్మణ్యం వార్డెన్‌గా వచ్చాడు. ఓ రకంగా సుబ్రహ్మణ్యం వచ్చినప్పట్నించీ ఆశ్రమంలోని పిల్లలకు మంచి రోజులొచ్చాయని చెప్పుకోవచ్చు. ప్రతి పిల్లాణ్నీ అతను ఒళ్ళో చేర్చుకుని లాలించకపోవచ్చుగానీ, ఆ పిల్లల్లోని నైరాశ్యాన్నీ, న్యూనతా భావననూ తొలగించి, వాళ్ళల్లో తామూ మనుషులమేనన్న భావనను కలిగించకలిగాడు. 'సిరిదాపోయిన పోవును కరిమింగిన వెలగపండు చందము'న్నట్టు క్రమంగా రాజులోని దుడుకుతనం తగ్గిపోయి, పదిహేనో ఏటికల్లా ఓ విధమైన నిండుతనం వచ్చేసింది.

తననెవరైనా పెంచుకుంటారేమోనన్న ఆశా, పెంచుకుంటే బావుణ్నన్న కోరికా రాజులో క్రమంగా తగ్గిపోయాయి. అందుకు ముఖ్యమైన కారణం, పెంచుకోగోరేవారు సాధారణంగా నాలుగైదేళ్ళు దాటని పిల్లల్ని మాత్రమే పెంచుకోవటానికి యిష్టపడతారనే నిజం అర్థం కావటమే. ఆ ఆశ స్థానంలో తనకు పద్దెనిమిదేళ్ళు నిండగానే ఆశ్రమాన్ని వదిలి వెళ్ళాలన్న దిగులు మొదలయింది.

ఖాళీ సమయాల్లో చిన్న చిన్న పనులు చేసి డబ్బు సంపాదించుకోవటం అలవాటు చేసుకున్నాడు. ఆ రకంగా ఆ మూడేళ్ళలోనూ ఐదు వేల రూపాయలపైన కూడబెట్టగలిగాడు. పేపర్లు వేయటం, పాలపాకెట్లు వేయటం లాంటి పనులతో పాటు ఆటో నడిపించటం కూడా నేర్చుకున్నాడు. కొన్ని రోజులు ఓ కమర్షియల్ ఆర్టిస్టు దగ్గర చేరి బోర్డులకు రంగులు వేయటం, గీసిచ్చిన అక్షరాలు పెయింట్ చేయటం వంటి పనులు చేశాడు. ఆశ్రమంలో కుట్టుపని నేర్చుకున్నాడు. తను సంపాదించిన డబ్బుల్లోంచి ఫీజు కట్టి టైపింగ్ నేర్చుకున్నాడు. బైటి ప్రపంచంలో బతకటానికి ఆర్థికంగా అవసరమైన హంగులన్నీ సమకూర్చుకున్నాడు కానీ, ఆశ్రమం దాటివెళ్ళిన తరవాత తాను ఒంటరి వాడినన్న మానసిక భావనను అధిగమించలేకపోయాడు. ఉరిశిక్ష పడిన ఖైదీలాగా, తొందరలో తన ప్రాణం పోతుందని తెలిసిన రోగిలాగా మానసికంగా తను వెళ్లి పోవాలన్న భావనను హృదయంలో నింపుకోవటంతో ఆ అసలు రోజు వచ్చేనరికి అతనికి తట్టుకోవటం కష్టమయింది. తను వెళ్లిపోవాల్సిన రోజుకు మూడు నెలలు ముందుగానే ఒక పెట్రోల్ బంకులో ఉద్యోగం సంపాదించుకున్నాడు. మరోవారం రోజులుందనగా ఒక చిన్న గది అద్దెకు తీసుకున్నాడు. వెళ్ళిపోయే ముందు రోజు సాయంత్రం ఆశ్రమంలోని పిల్లలందరినీ పలకరించాడు. వాళ్ళకు జాగ్రత్తలు చెప్పాడు. తనకు వీలైనంతలో ఎవరికైనా ఏదైనా సహాయం అవసరమైతే చేస్తానని హామీ యిచ్చాడు. ముఖ్యంగా ఆశ్రమం వదిలిపోవాల్సిన పిల్లలు తాము నిలదొక్కుకునే వరకూ తనతో పాటు తన గదిలో వుండవచ్చునని ఆహ్వానం అందించాడు. అలా అంతకు ముందు ఎవ్వరూ చెప్పలేదా ఆశ్రమంలో. అది తెలిసిన సుబ్రహ్మణ్యం రాజును అభినందించాడు.

ఆ మాటల్లో రాజు తన సందేహం ఒకటి సుబ్రహ్మణ్యంకు తెలిపి దాని విషయంలో అతనికి తెలిసింది చెప్పమని అడిగాడు. అనాథాశ్రమంలో వుండే పిల్లలంతా దాదాపుగా అక్కడ వున్నన్ని రోజులూ తమను ఎవరైనా పెంచుకుంటే బావుణ్ణనే ఆలోచనల్లోనే మునిగివుంటారు. ఎవరో పిల్లలు లేని దంపతులు దత్తత తీసుకోవటానికి వచ్చినప్పుడల్లా ఆశగా చూడటం, తమను తీసికెళ్ళాలని దేవుళ్ళకు మొక్కుకోవటం, తమగురించి చెప్పమని సిబ్బందిని అడగటం, చివరకు ఆ వచ్చిన వాళ్ళను బతిమాలు కోవటం చాలా సాధారణమైన విషయాలు. వాళ్ళు ఎవరో ఒకరిని ఎన్నిక చేసుకోగానే మిగతా వాళ్ళంతా కొన్ని రోజులపాటు చాలా నిస్పృహతో వుండిపోతారు. కొందరైతే కొన్ని రోజుల పాటు భోజనం కూడా సరిగ్గా చేయరు. దత్తతకు వెళ్ళిన వాళ్ళల్లో వున్న గొప్పదనమేమిటి, తమలో లేనిదేమిటని అదే పనిగా ఆలోచించుకుంటూ అదే విషయాన్ని పదేపదే తలుచుకుంటూ బాధ పడతారు. ఒక్కోసారి, అలా పెంచుకుంటామని వచ్చిన వాళ్ళు ఎవర్నీ పెంపకానికి తీసుకోకుండానే వెళ్ళిపోతుంటారు. చాలామంది దంపతులు పిల్లలు కలగకపోతే డాక్టర్ల చుట్టూ తిరుగుతారు. దేవుళ్ళకు మొక్కుకుంటారు, పూజలూ, వ్రతాలూ చేస్తారేగానీ ఎవరినైనా పెంచేసు



కుంటే సరిపోతుందని ఆలోచించరు. అలాంటి ఆలోచన వచ్చిన వాళ్ళల్లో ఎక్కువ మంది తమ బంధువుల్లోనే ఎవరో ఒకర్ని దత్తత తీసుకుంటారేగానీ అనాథాశ్రమానికి వద్దామనే ఆలోచనే రాదు. అలా వచ్చేవాళ్ళు కొద్ది మంది మాత్రమే వుంటారు. పెళ్ళయిన ఐదారేళ్ళకల్లా పిల్లలు పుట్టని దంపతులంతా యితర ప్రయత్నాలేవీ చేయకుండానే అనాథాశ్రమాలకొచ్చేసి, అక్కడున్న వాళ్ళల్లో ఎవరో ఒకర్ని ఎందుకని పెంచుకోరని, ఆ పిల్లలంతా ఎన్నోసార్లు చర్చించుకుంటూ వుంటారు. ఐతే రాజుకొచ్చిన ఆలోచన అది కాదు. ఆశ్రమంలో వున్నన్ని రోజులూ తమను ఎవరైనా పెంచుకుంటే బావుణ్ణనే ఆశతోనూ, ఎవరూ పెంచుకోలేదనే నిరాశతోనూ సతమతమైన వాళ్ళంతా ఆశ్రమంలోంచి బైటపడి, జీవితంలో నిలదొక్కుకుని పెళ్ళి చేసుకున్న తరువాత, పిల్లల్ని కనేబదులు, ఆశ్రమంలోని పిల్లల్ని పెంచుకోరెందుకని?

రాజు ప్రశ్న సుబ్రహ్మణ్యంకు చాలా ఆశ్చర్యం కలిగించింది. చాలా సేపటివరకూ ఆయన జవాబేదీ చెప్పలేకపోయాడు. ఆశ్రమంలోంచి వెళ్ళిన పిల్లల్లో సగంమంది ఓ సంవత్సరం తరువాత ఆశ్రమం విషయం మరిచిపోతారు. బహూశా జీవన పోరాటంలో ఎదురయ్యే సమస్యలతోనే సతమతమవుతూ వుండిపోవటం అందుకో కారణం కావచ్చు. కొద్దిమంది కొన్ని సంవత్సరాల పాటు ఉత్తరాలు రాయటమో, అప్పుడప్పుడూ వచ్చి, అందరినీ పలకరించిపోవటమో చేస్తుంటారు. చాలా కొద్దిమంది డబ్బులు పంపిస్తుంటారు. కానీ ఆశ్రమంలో పెరిగి, వెళ్ళిపోయి, ఆశ్రమంలోని పిల్లల్ని పెంచుకున్నవాళ్ళు, కనీసం పెంచుకుందామనుకున్నవాళ్ళు ఒక్కరు కూడా ఆయనకు తెలీదు.

ఐదారు నిమిషాలు ఆలోచించిన మీదట సుబ్రహ్మణ్యం చెప్పిన విషయం చాలావరకూ నిజమేననిపించింది రాజుకు. తమకెవరూ లేరన్న భావనతో పెరిగిన పిల్లల్లో 'తమ' అన్నదాని పట్ల మామూలుకన్నా ఎక్కువ మమకారం ఏర్పడుతుంది. తనది మాత్రమేనని అనుకోగలిగినది కావాలన్న తపన ఎక్కువగా వుంటుంది. అదే ఆలోచన 'తన పిల్లలు' అన్న భావనతో ఈ ప్రపంచంలో అచ్చంగా తనకు సంబంధించిన వాళ్ళున్నారనే సంతృప్తి కోసం అనాథాశ్రమాలలోని పిల్లల్ని పెంచుకోవటానికి అక్కణ్ణించే బైటికి వెళ్ళినవాళ్ళు ఉత్సాహం చూపించరు.

ఆ సంభాషణంతా పూర్తయ్యాక ఆ రాత్రి రాజు నిద్రపోలేకపోయాడు. అంతకు ముందు పంజరంలా తోచిన ఆశ్రమం యిప్పుడు తెంచుకోలేని బంధంగా అనిపిస్తుంది. అక్కణ్ణించి వెళ్ళిపోతే తప్ప మోక్షం లేదన్న ఆలోచనలు, అక్కణ్ణించి వెళ్ళిపోతే ఆదుకునే వారులేరన్న ఆందోళనలోకి దారితీశాయి.

తెల్లవారింది... చాలామంది పిల్లలు క్లాసుల్లో వున్నారు. కొందరు వర్కుషాపులో వున్నారు. కొందరు బైటికెళ్ళారు. చివరిసారిగా ఆశ్రమమంతా కలియతిరిగాడు. ఆరోజు సుబ్రహ్మణ్యం కూడా తొందరగానే వచ్చాడు. రాగానే తనుకొనుక్కొచ్చిన కొత్త బట్టలిచ్చాడు రాజుకు. ఆశ్రమం పద్ధతి ప్రకారం అలా వెళ్ళిపోయే పిల్లలకిచ్చే దుప్పటి, పంచెల్లాంటి చిన్నచిన్న వస్తువులూ, ఐదొందల రూపాయలూ అందించాడు. ఎన్నో చెప్పాలనుకున్నవాడు, ఆయనా ఏమీ మాట్లాడలేకపోయాడు. మరెన్నో అడగాలనుకున్నవాడు, రాజూ ఏమీ మాట్లాడలేకపోయాడు.

''సార్... వెళ్ళొస్తాను సార్'' పూడుకుపోయిన గొంతుతో భారంగా అన్నాడు రాజు.

ఏం మాట్లాడాలో తెలీలేదు సుబ్రహ్మణ్యానికి.

వంగి కాళ్ళకు నమస్కరించిన రాజును ఆప్యాయంగా లేవదీశాడు.

మౌనంగా తలూపి బైటకు నడిచాడు రాజు. గబగబా అడుగులేసుకుంటూ గేటు వరకూ వచ్చాడు. గేటు దగ్గరున్న గడపరాయిని కళ్ళకద్దుకున్నాడు. బైటికి అడుగువేశాడు. వెనుతిరిగి ఆశ్రమంవైపోసారి చూసి, పాతబడిపోయిన ఆశ్రమం బోర్డును చూసి గిరుక్కున వెనుతిరిగి పాత స్మృతుల్ని నెమరేసుకుంటూ కొత్త జీవితంవైపు ముందుకు సాగాడు.

★ ★ ★

గేటు దగ్గర ఎదురైన పద్మనాభంని పలకరించి, హోమ్‌ఫర్ ఏజ్‌డ్‌లోకి అడుగుపెట్టింది సుధ, ఒక్కొక్కర్నీ పలకరిస్తూ.




''ఇదిగోమ్మా చాక్‌లెట్'' అందించాడు రాజారాం.

''ఏంటి బాబాయ్... చిన్న పిల్లలకిచ్చినట్టు నేనొచ్చిన ప్రతిసారీ చాక్‌లెట్ కొనిస్తావు'' మురిపెంగా ఆ చాక్‌లెట్ నందుకుంటూ అంది సుధ.

''ఇరవయ్యేళ్ళు కూడా నిండలేదు. నువ్వు చిన్న పిల్లవు కాక మరేంటి?''

''ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకేనన్న సామెత ప్రకారం మీరు చెప్పింది నిజమే కానీ నేనింకా చాక్‌లెట్ తినేంత చిన్న పిల్లనా చెప్పు''

''ఇవ్వాలన్నా నేనిస్తే చాక్‌లెట్ తీసుకునే పిల్లలెవరున్నారమ్మా, నువ్వు తప్ప. అదీగాక యింతకన్నా నేను ఏమివ్వగలను చెప్పు''

''నువ్వసలు నాకేమైనా ఎందుకివ్వాలసలు చెప్పు. అది సరేగానీ మీ మిత్ర బృందంలో ఒక్కడివే కనిపిస్తున్నావేంటీ?''

''ఆ ముసలి వెధవలిద్దరూ వంట గదిలో దూరి నీకోసం ఏదో స్పెషల్ చేయిస్తున్నారు. వాళ్ళిద్దరికన్నా ముందుగా నీతో మాట్లాడుదామని నేను మాత్రం చాలా సేపట్నించీ యిక్కడే కూర్చున్నాను, ఎదురు చూస్తూ''

ఇంట్లో వదిలేసి ఊరికెళ్ళిన తల్లి కోసం ఎదురు చూసే చిన్న పిల్లాడు గుర్తొచ్చాడు సుధకు. అసలా రోజు తను ఊరికెళ్ళాల్సింది, వెళ్ళిపోదామనుకుంది. పరీక్షల మూలంగా అంతకుముందు వారం రాలేకపోయింది. ఇప్పుడు గానీ యిటు రాకుండా వెళ్ళిపోతే వీళ్ళంతా ఎంత బాధపడేవారోకదా అనిపించి, సుధలోని స్త్రీహృదయంలోవున్న 'అమ్మ' మనసు చివుక్కుమంది. తను రావటం చాలా మంచి దైయిందనుకుంటూ, రాజారాం వెంట నడిచింది.

ఒక్కొక్కరినీ పలకరిస్తూ, వాళ్ళదగ్గర ఐదారు నిమిషాలు కూచుని మాట్లాడుతూ, పార్వతి దగ్గరికొచ్చి, ఆమె దగ్గర అరగంట దాకా కూచుంది. ప్రతిసారీ యిద్దరు, ముగ్గురి దగ్గర అరగంట, గంట సేపు కూర్చుని కబుర్లాడుతుంది. ఒక్కోసారి ఒకరి దగ్గర, ఆ కబుర్లలో సుధ మాట్లాడేది చాలా తక్కువ. వాళ్ళే మాట్లాడుతుంటారు. ప్రధానమంత్రి, అపాయింట్‌మెంట్ టైం దాటి ఎవరతోనైనా పదిక్షణాలు ఎక్కువ మాట్లాడితే వెంటనే మధ్యలో వచ్చేసి గుర్తు చేసే పి.యే.లాగా, సుధ ఎవరి దగ్గరైనా కాస్త ఎక్కువ సేపు కూచుంటే చాలు, రాజారాం, చలపతి, థామస్ ఈ ముగ్గురిలో ఎవరో ఒకరు వచ్చి ఆమెను అక్కణ్ణించి కదిలిస్తూవుంటారు. ఒకరి దగ్గర్నించి మరొకరి దగ్గరికి వెళ్ళే మధ్య దారిలో వీలైనంత ఎక్కువ ఆలస్యం జరిగేలా చూస్తూ, ఆమెతో ముత్తంమీద ఎక్కువసేపు గడుపుతుంటారు ఈ ముగ్గురూ. తాము ఆ వారం రోజులూ చేసిన చిలిపి పనులూ, తమలో తాము పెట్టుకున్న తగాదాలూ, తమకొచ్చిన కొత్త ఆలోచనలూ, యిలా ఎన్నెన్నో ఆమెతో మాట్లాడేస్తూవుంటారు.

సుధ వస్తుందని తెలిసి, ఆదివారంరోజున శంకర్‌రెడ్డి ఆలస్యంగా వస్తుంటాడు. పోలీసుల కాపలా అంతకు ముందురోజే అయిపోవటంతో, ఆరోజున ఆయన కూడా కాస్తముందుగానే వచ్చాడు. ఆఫీసులో కూచుని పనులు చూసుకుంటూండగా ఆశ్రమంలో చేరటం విషయం మాట్లాడటానికి ఎవరో ఒకాయన వచ్చాడనీ, అరగంట తరవాత మళ్లీ వస్తానన్నాడనీ చెప్పాడు కరీం. ఈలోగా దశరథరామయ్యనే ఆయన, ఆయనభార్య జానకమ్మను వెంటబెట్టుకునొచ్చాడు. వాళ్లకు టీ యిప్పించి, తను చూస్తున్న ఫైలును ఐదునిమిషాల్లో మూసేశాడు శంకర్‌రెడ్డి. అప్పుడే అంతకు ముందొచ్చినాయనా వచ్చాడు. ఆయన పేరు మహాలింగం. మిలిటరీలో మేజర్‌గా చేసి, యుద్ధంలో గాయపడి రిటైరయ్యాడు. ఆయన కూడా గది కోసమే వచ్చాడు.

ఆశ్రమంలో ఒక్కటే గది ఖాళీగా వుంది. ఇద్దరిలోనూ ఎవరికివ్వాలనే ఆలోచన లేకుండా దంపతులకిద్దామని నిర్ణయించుకున్నాడు శంకర్‌రెడ్డి.

''అదేమిటండీ, నేను ముందుగా వచ్చాను. అరగంట కింద మీరు లేరు. ఉంటే అప్పటికే నాకు యిచ్చేసేవారు కదా. ముందుగా వచ్చిన వాణ్ని వదిలేసి, తరవాతొచ్చిన వాళ్లకు యిస్తానంటారేంటి?'' దెబ్బలాడాడు మహాలింగం.

''వాళ్ళిద్దరూ భార్యా భర్తలు కదాని అన్నాను గానీ వాళ్లుకూడా నాకు తెలిసిన వాళ్లు కాదండీ'' నచ్చజెప్పాడు శంకర్‌రెడ్డి.

''ఊహు... ఐతే ఇప్పుడిక్కడ మీరు గదివ్వ



టంకోసం నేను పెళ్లి చేసుకుని రావాలన్న మాట. బ్రహ్మచారులకు గదివ్వమని వయసులో వున్న వాళ్లనంటే అర్థం వుందిగానీ యిదేమిటండీ, ఈ వయసులో''

ఆయన వాదనా ధోరణికి నవ్వొచ్చింది శంకర్‌రెడ్డికి. కానీ నవ్వును లోపలే దాచుకుని, సౌమ్యంగానే వివరించాడు-

''అది కాదండీ, వాళ్లిద్దరూ భార్యా భర్తలు. ఒకే గదిలో వుండగలరు. ఉన్న ఒక్క గదీ మీ ఒక్కరికీ యివ్వటంకంటే వాళ్లకిస్తే యిద్దరికీ ఆశ్రయం దొరుకుతుంది. ఉన్నదాన్ని వీలైనంత ఎక్కువగా వాడుకున్నట్టువుతుంది గదాని అన్నానంతే''

''అలా చూస్తే వాళ్ళిద్దరూ భార్యాభర్తలు. నాలుగు రోజులు యిక్కడ గది దొరక్కపోయినా ఆవిడ వండిపెడుతుంది. ఆయనకు యిబ్బందిలేదు. మరి నా విషయం అలాకాదే. ఐతే హోటల్ కూడు తినాలి. లేదా ఇప్పుడు ఏ 'ముప్పై రోజుల్లో పాకశాస్త్రమో' కొనుక్కుని, చెయ్యి కాల్చుకోవాలి. అదే నాకు యిక్కడ రూం యిచ్చారనుకోండి. నాకాశ్రమ తప్పుతుంది గదా. పైగా నేను ముందుగా వచ్చాను కూడాను''

ఇలా వాదనలు జరుగుతుండగా ముగ్గురు మూర్తులతోపాటు సుధ కూడా ఆఫీసు గదిలోకొచ్చింది. పలకరింపులయ్యాక, వచ్చిన వాళ్లను పరిచయం చేసి, విషయం వివరించాడు శంకర్‌రెడ్డి. అది వినగానే, గాన ప్రియుడైన చలపతి, తన సహజధోరణిలో రాగయుక్తంగా పాడుతూ చెప్పాడు

''అంటే, ముందుగా వచ్చితీవు, మును ముందుగా అర్జును నేను జూసితిన్- అన్నట్టుగా అయిందన్నమాట''

అది వినగానే మహాలింగంకు మరింత మండింది-

''ఏమిటండీ, పాటలూ, పద్యాలు పాడటంకాదు. న్యాయంగా నాకు గది యివ్వాలి. ఇస్తారా యివ్వరా చెప్పండి''

''అంత కోపమెందుకు మిలిట్రీ మావయ్యా. మనం ఈ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవచ్చుకదా'' నవ్వుతూ అంది సుధ.



"ఔనమ్మా... కానీ శాంతియుతంగా పరిష్కరించుకోలేనప్పుడు పోట్లాడటానికే కదా మిలిటరీ వాళ్లున్నది"

"ఇప్పుడు మనకున్నదొక్క గది. ఒక్క గదిలో ఒక్కరుంటే ఆరొందల రూపాయలు. ఇద్దరుంటే భోజనానికి మూడొందలు మాత్రం అదనంగా తీసుకుంటాం. మరి ఈ గది మీబదులు వీళ్లకిస్తే మాకో మూడొందలు ఎక్కువొస్తుంది గదా? ఏమంటారు?"

"ఓహో! ఇదేదో చారిటబుల్ ట్రస్ట్ వాళ్లు నడుపుతున్నారనుకున్నాను. కానీ లాభాల కోసం నడుపుతున్నారన్నమాట. ఐతే నన్నేంచేయమంటావు?"

"మరో గది ఖాళీ అయ్యి, వీళ్లకిచ్చేవరకూ ఆ మూడొందలూ మరి మాకు నష్టమేగదా, మీరా గదిలో వుంటే"

"ఐతే, అన్ని రోజులూ ఆ మూడొందలూ నేనిస్తాను" పంతంగా అన్నాడు మహాలింగం.

శంకర్‌రెడ్డి కంగారుగా చూశాడు సుధవైపు. ఆ అమ్మాయి ఆయనవైపు చూడటంలేదు. సీరియస్‌గా మహాలింగంతో మాట్లాడటంలో నిమగ్నమైపోయింది. దశరథ రామయ్య దంపతులు తమను ఆదుకోమన్నట్టుగా శంకర్‌రెడ్డి వైపు చూస్తున్నారు. అంతలో మళ్ళీ అంది సుధ

"కానీ అందువల్ల ప్రయోజనమేముంది? ఎటూ వీళ్లు తొమ్మిదొందలూ యిస్తున్నారు. పైగా యిద్దరికి గది యిచ్చిన తృప్తి దక్కుతుంది మాకు"

"ఐతే అన్ని రోజులదాకా, అంటే మరో గది ఖాళీ అయ్యేంతవరకూ నేను వెయ్యి రూపాయలిస్తానమ్మాయ్" మరింత పట్టుదలగా అన్నాడు మహాలింగం.

అప్పుడు దశరథ రామయ్య దంపతుల వైపు తిరిగింది సుధ

"మరి మీసంగతేంటి బాబాయ్? ఆయన ఒక్కడూ మీకన్నా వందరూపాయలు ఎక్కువిస్తానంటున్నాడు. మీరు దానికన్నా కాస్త ఎక్కువిస్తామంటే ఆలోచిద్దాం"

"ఏమిటమ్మాయ్, వేలం పాడేస్తున్నట్టు

న్నావ్'' ఉక్రోషంగా అన్నాడు మహాలింగం. తొందరపడి వెయ్యి రూపాయలిస్తానన్నందుకే ఆయనకు చిర్గాగ్గా వుంది.

''మేం అంత యిచ్చుకోలేమమ్మా. నాకొచ్చే పెన్షను ఏడొందల యాభై రూపాయలు. గ్రాట్యుటీ, ప్రావిడెంటుఫండులన్నీ బ్యాంకులో వేశాను. నెలకో ఐదొందలు వడ్డీ వస్తుంది. ఇక్కడుంటే ఆ పై సొమ్ము ఏదో మాకు రోగాలూ రొష్టులూ వచ్చినప్పుడు ఉపయోగపడుతుంది. పైగా వెయ్యి రూపాయలు మాకు బైటెక్కడున్నా ఖర్చవక తప్పదు. ఇక్కడైతే హాయిగా వుంటుందీ వయసులో అనొచ్చానే గానీ ఎంత బడితే అంతా యిచ్చుకునే శక్తి లేదమ్మా... పోనీలే, మరో గది ఖాళీ అయేవరకూ ఎక్కడో మా కష్టాలు మేం పడతాం'' బాధగా అంటూ లేవటానికి సిద్ధమయ్యాడాయన.

ముగ్గురు వృద్ధమిత్రులకూ ఆయనమీద జాలేసింది. సుధమీద కోపం కూడా వచ్చింది. ఆ పరిష్కరిస్తున్నది సుధగానీ కాకపోయుంటే ఆనరికే దుమ్ము దులిపేసేవాళ్ళు కూడానూ. అందుకే యిక తప్పనిసరిగా అన్నాడు రాజారాం-

''అమ్మాయ్, ఈ పద్ధతేం బాలేదు. ఎక్కువ సొమ్ము తీసుకుని ఎవరికి లాభం చెప్పు?''

చిన్నగా నవ్వింది సుధ-

''నేనింకా ఏమీ చెప్పనేలేదు. అంత బాధపడతావేంటి బాబాయ్! ఒక్క నిమిషం ఒపికపట్టు'' అంటూ, లేవబోతున్న దశరథరామయ్యను వారించింది- ''ఆగండి బాబాయ్... అంత తొందరపడతారేం. కూచోండి రెండు నిమిషాలు''

అయిష్టంగానే కూచున్నాడాయన. మహాలింగం చాటుగా ముసిముసి నవ్వులు నవ్వుకుంటూండిపోయాడు.

''మరిక చెప్పేసేయమ్మాయ్. గది నాకిచ్చేసినట్టేగదా'' - ఎంత వద్దనుకున్నా ఆయన మనసులోవున్న సంతోషం బైటికి కనిపిస్తూనే వుంది.

''అలా అని నేనన్నా మిలటరీ మామయ్యా! జస్ట్, మీరు ఎక్కువ డబ్బు యివ్వగలరా అని ఆరాతీశాను అంతేకదా''

''అంటే, యిస్తానన్నట్టేగదా''

''అలా ఎలా వీలవుతుంది మావయ్యా... వీళ్ళేమో అడిగినంత డబ్బు యిచ్చుకోలేరు. అంటే వీళ్ళు యిక్కడ తప్ప మరోచోట వుండలేరన్నమాట. మరి మీ విషయం అలాకాదే. మీరు అడిగినంత సొమ్ము యియ్యగల స్థితిలో వున్నారు. అవసరమైతే నాలుగురోజులు వంట మనిషిని పెట్టుకుని జీతం యిచ్చే స్తోమత మీకుంది. అంచేత, ఈ గది ప్రస్తుతం మీకన్నా దశరథరామయ్య బాబాయ్‌కే ఎక్కువ అవసరం. కనుక వాళ్ళకివ్వటమే న్యాయం. అంతే కదా మావయ్యా?''

సుధ అలాంటిదేదో చేయగలదని నమ్మినందుకే శంకర్‌రెడ్డి అంతసేపూ మాట్లాడకుండా వుండిపోయాడు. ఆ అమ్మాయి చెప్పింది వినగానే ఆయన హాయిగా నిట్టూర్చాడు. మేజర్ మహాలింగం మొహంలో రంగులు మారిపోయాయి. అది గమనించిన సుధ వెంటనే మళ్ళీ చెప్పింది ఆయన బాధపడకుండా వుండటానికి-

''మామయ్యా, మీరు మిలిటరీ మనిషి. మీకున్నంత ధైర్యం, ఓపికా, సత్తువా అందరికీ వుంటాయా చెప్పండి. అసలు మిమ్మల్ని చూస్తుంటే మీరు వృద్ధుల ఆశ్రమానికి రావాల్సిన అవసరమే లేదనిపిస్తుంది నాకు. మీ బాడీ చూస్తుంటే నలభయ్యో ఏట తలనెరిసినట్టు వుందిగానీ మీకు అరవయ్యేళ్ళు దాటాయని అనుకోవటం చాలా కష్టం. వీళ్ళు పాపం మీలా గాకాదుగదా''

సిన్సియర్‌గా చెబుతున్న సుధ మొహంలోకి చూసి, ఆమె మాటలు నిజమే అయ్యుంటాయని నమ్మాడు మహాలింగం. పైగా చేతకాని వాళ్ళు వుండాల్సినచోట తనకు ప్రవేశం కావాలని పట్టుబట్టటం అతని మిలిటరీ మనస్తత్వానికి సమంజసంగా అనిపించలేదు. అంచేత యిక దెబ్బలాడలేదు.

''సరేనమ్మా... నువ్వు యింతగా చెబుతున్నావ్ కనుక ఒప్పుకుంటున్నాను... అది సరేగానీ యిక పోట్లాట అయిపోయింది కనుక నన్ను కూడా 'బాబాయ్' అనే పిలువు. నేను అప్పట్నించీ చూస్తున్నాను - వాళ్ళందరితోపాటు, యిదిగో ఈ కొత్తగా వచ్చినాయన్ని కూడా 'బాబాయ్' అనే పిలుస్తున్నావుగానీ నన్ను మాత్రమే 'మావయ్యా' అన్నావు. నీకు యిష్ట

మైనవాళ్ళను 'బాబాయ్' అంటావన్నమాట... అంతేకదా?''

''ఓకే బాబాయ్'' నవ్వుతూ అంది సుధ- ''ఇదిగో నా అడ్రెస్... నువ్వు యిల్లు తీసుకోగానే నాకు కాలేజీకి వచ్చి నీ అడ్రెస్ చెప్పు. నేను అప్పుడప్పుడూ వస్తాను, నిన్ను చూడ్డానికి''

''ఆ, మళ్ళీ కాలేజీ అడ్రెస్ ఎందుకమ్మా. ఇక్కడెవరున్నారు, మీ అమ్మా, నాన్నా? వాళ్ళన డిగితే చాలుగదా'' సంతోషంగా అన్నాడు మహాలింగం, సుధ తనను అప్పుడప్పుడూ వచ్చి చూస్తానన్నందుకు.

''ఆ అమ్మాయికి యిక్కడివాళ్ళంతా బంధువులే. వాళ్ళ అమ్మనాన్నలు ఊళ్ళో వున్నారు'' చెప్పాడు శంకర్‌రెడ్డి.

''అంతా బంధువులేనా? అదేంటి?''

''దేవుడు అంతటా వున్నాడూ అనంటాంగానీ నిజానికి ఎక్కడా లేడుగదా ఇదీ అంతేనండీ మహాలింగంగారూ. ఆ అమ్మాయికి మేమెవ్వరమూ బంధువులు కాదు గానీ, మా అందరినీ బంధువుల్ని చూడటానికొచ్చినట్టుగా ప్రతీ ఆదివారం వచ్చి, పలకరించి వెళుతుంది'' చెప్పాడు రాజారాం.

''సోషల్‌వర్క్?'' అడిగాడు మహాలింగం.

''సోషల్‌వర్క్ లేదూ పాడులేదు. మాది చాలా పెద్ద కుటుంబం. అందరూ వూళ్ళో వున్నారు. నేనేమో ఒక్కదాన్ని యిక్కడ కాలేజీలో చదువుకోవటానికి హాస్టల్లో వుంటున్నాను. అంతమందిమధ్య గడిపి యిక్కడ ఒక్కదాన్ని వుండాలంటే బోర్‌కొడుతుంది. అందుకే ప్రతి ఆదివారం యిక్కడికొచ్చి, టైంపాస్ చేస్తుంటాను బాబాయ్'' వివరించింది సుధ.

''బాగుందమ్మా... నీ వయసు పిల్లల్లో యిలా నలుగురికీ పనికొచ్చే హాబీ వున్నవాళ్ళు నాకుమాత్రం కనిపించలేదు''

సంతోష్‌రెడ్డి అనే ఆయన వారంరోజుల్లో అమెరికా వెళ్ళిపోతున్నాడు. ఆయన వెళ్ళగానే వచ్చి చేరొచ్చునని దశరథరామయ్యకు చెప్పాడు శంకర్‌రెడ్డి. సంతోష్‌రెడ్డి పిల్లలంతా అమెరికాలో సెటిలైపోయారు. ఏడాదికింద భార్య పోయిన తర్వాత వున్న యిల్లు అమ్మేసి, డబ్బంతా బ్యాంకులో వేసేసి, ఒంటరిగా వుండలేక ఆశ్రమంలో చేరాడు సంతోష్‌రెడ్డి. ఆయన తమతోపాటు వుండటానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేసి, తమదగ్గరికొచ్చేయమని చెప్పారు పిల్లలు. పుట్టిన వూరు, సొంత దేశం వదిలి వెళ్ళటానికి మనసొప్పుకున్నా చివరి నాలుగు రోజులూ పిల్లలతో హాయిగా వుండొచ్చని అమెరికా వెళ్ళటానికి సిద్ధపడ్డాడాయన.

మహాలింగంలోని పోట్లాడే స్వభావం ముగ్గురు మిత్రులకూ బాగా నచ్చింది. పదినిమిషాల్లో వాళ్ళంతా మిత్రులయ్యారు. తోటలో ఓ మూల సుధతో కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. సాయంత్రందాకా అక్కడే వుండిపోయాడు మహాలింగం కూడా. మాటలమధ్యలో పోలీసుకాపలా విషయం ప్రస్తావించింది సుధ-

''అవును బాబాయ్... మొన్న సండే నేను రాలేదు. ఇక్కడేదో అల్లరి జరిగిందని చెప్పాడు కరీం - ఏమయింది?''

జవాబు చెప్పకుండా ముగ్గురూ ముసిముసిగా నవ్వుకోవటం మొదలెట్టారు. వెంటనే సుధకు అర్థమయింది, వాళ్ళే ఏదో చేశారని. రెండుమూడుసార్లు అడిగిన తరువాత చెప్పాడు చలపతి గర్వంగా-

''ఇక్కడున్నవాళ్ళమంతా కాటికి కాళ్ళు చాచుకుని, రేపో, మాపో పోయేవాళ్ళమేకదా. మాకు ఆపద కలిగిదంటే ఎవరైనా పట్టించుకుంటారా, లేదా చూద్దామని చిన్న నాటకమాడాం. పాపం, అందరూ సిన్సియర్‌గా వచ్చారు. ప్లానుమాత్రం కుంభకర్ణుడు కృష్ణమూర్తిగాడు లేడూ... వాడిదమ్మా. వెధవకు ఆ నిద్ర ఒక్కటి తప్పిస్తే, బలే తెలివితేటలున్నాయి''

''అసలు నేనుంటే యింకా బలే చేసేవాణ్ణిరా. అన్యాయంగా మీరంతా నన్ను తరిమేస్తున్నారుగానీ'' బాధపడ్డాడు మహాలింగం, పరమ ఉత్సాహంగా.

ఐదు నిమిషాల్లో 'మీరు'నుండి 'నువ్వు'కొచ్చి, అరగంటలో 'నువ్వు' నుండి 'ఓయ్'గా మారి, మధ్యాహ్నంకల్లా 'ఏరా' అంటే 'ఏరా' అనుకుంటూ వాళ్ళల్లో కలిసిపోయిన మహాలింగంనూ, చేసిన చిలిపిపనిని సగర్వంగా చెబుతూన్న మిగతావాళ్ళనూ చూసి చాలా తమాషాగా అనిపించింది సుధకు. వాళ్ళంతా

వయసుడిగిన ముసలాళ్ళలా కాక కాన్వెంటుకె ళ్ళే పసిపిల్లలుగా అనిపించారామెకు. వాళ్ళ చిలిపిపనుల గురించి విన్నప్పుడల్లా ఆమెకు కాసేపు సరదాగా అనిపిస్తుంది. అదిగానీ బైట పడితే ఏం ముంచుకొస్తుందోనని భయంగా అనిపిస్తుంది. మానేయమని చెబుతుంటుంది గానీ వాళ్ళు పట్టించుకోరు. పైగా తమ రహస్యా న్ని తనకు కూడా చెబుతూండటంతో ఓరకంగా సంతోషంగానూ అనిపిస్తుంది. ఐనా, అలాంటివి తనతో చెప్పినప్పుడల్లా వాళ్ళను హెచ్చరిస్తూనే వుంటుంది.

"మరీ పోలీసులతోనూ, ఫైర్ స్టేషన్‌తోనూ జోకులేంటి బాబాయ్"

"అయ్యో పిచ్చిదానా... సీరియస్ వాళ్ళతోనే జోకులు బాగా పేలతాయి. గబగబా స్కూటర్ దిగి వచ్చినప్పుడు మన శంకర్‌రెడ్డి మొహం చూడాల్సిందసలు నువ్వు. నేను కిటికీలోంచి చూస్తూ కూచున్నాను" ముసిముసి నవ్వులు నవ్వుతూ చెప్పాడు చలపతి.

"ఒరేయ్ మేగలింగం" భుజమ్మీద కొడు తూ ఉత్సాహంగా ఏదో చెప్పబోయిన థామస్‌ను కసురుకున్నాడు మహాలింగం.

"మేగలింగం, మేకలింగం కాదురా, 'మ హా'లింగం"

"ఆ, సరే లేరా, ఒరేయ్ 'మహా'లింగం, ఆరోజు ఇన్‌స్పెక్టర్ వచ్చేసరికి నేను యిద్దరికి ఆసనాలు నేర్పిస్తున్నాను..."

చెబుతున్న థామస్‌వంక చూస్తూ, ఎగతా ళిగా పాడాడు చలపతి.

"మహాభారత్, మహాభారత్... ఆజ్‌కీ కహానీ..."

"చాల్లేవోయ్" ఉడుక్కున్నాడు థామస్.

"ముప్పై రెండోసారిరా నువ్వు చెప్పటం" అన్నాడు చలపతి, విసుగ్గా.

ఎవరైనా చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెబు తుంటే మహాభారతం చెబుతున్నాడన్నట్టుగా, టీవీ సీరియల్ టైటిల్ సాంగ్‌ను పాడి ఎగతాళి చేయటం వాళ్ళకు మామూలు. నవ్వుకుంది సుధ, వాళ్ళ పోట్లాటకు.

"అసలు నా గదిలో కొచ్చేసరికి నేను భగవ ద్గీత చదువుకుంటూ కూచున్నాను. అంత సేపూ పశ్చాత్తాప పడుతున్నవాడికి, మన శ్శాంతి కలిగిందిరా"

"అబ్బో పెద్ద భక్తుడు" ఎగతాళిగా అన్నా డు మహాలింగం.

"భక్తికాదురా, న్యూఓల్డ్ ఫెలో... అయ్యో నేను చేసిన తప్పుడు ఫోన్ కాల్ వల్ల ఎంత పాపం కలుగుతుందో అనుకుంటున్నానా, భగ వద్గీత చదివేసరికి ఆ బాధపోయింది. చేసేదీ, చేయించేదీ తానేనని చెప్పాడు కృష్ణుడందులో. నేను నిమిత్తమాత్రుణ్ణని తెలుసుకోగానే మనసు కుదుటపడింది"

"మరీ భగవద్గీతమీద కూడా జోకులేస్తే ఎలా బాబాయ్"

ఆ సాయంత్రం దాకా సరదాగా గడిచింది అందరికీ. వెళ్ళేటప్పుడు భారమైన మనసుతో కదిలాడు మహాలింగం. మరోగది ఖాళీ అవ గానే అతనికే రిజర్వు చేయిస్తామని హామీ యిచ్చారు ముగ్గురు మూర్తులు.



పెట్రోల్ బంకులో ఉద్యోగం చేస్తూ, వేరే ఉద్యోగాలకోసం ప్రయత్నం చేయసాగాడు రాజు. ఇంటర్మీడియట్ చేయకపోవటం పెద్ద తప్పుగా అనిపించింది రాజుకు. పూర్తి చేసే యాలని నిర్ణయించుకున్నాడు. పత్రికల్లో ప్రక టనలు చూస్తూ, చిన్నచిన్న ఉద్యోగాలకోసం వెళ్ళటం, అవేమంత మెరుగైనవిగా అని పించకపోవటంతోనూ, చేద్దామనుకున్నా అంత సులభంగా దొరక్కపోవటంతోనూ, క్రమంగా ఉద్యోగాల కోసం తిరగటం మాని, తానుగా ఏదైనా చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఐనా ఇరానీ హొటల్లో పేపర్ కనిపించినప్పు డల్లా ఉద్యోగ ప్రకటనలు చదవటం మాత్రం




# నోటితో చిత్రలేఖనం

పట్టుదల అనేది ఉండాలేగాని మనిషి సాధించలేనిది ఏముంటుంది? పక్షవాతం కారణంగా చేతులు, కాళ్ళు పడిపోయినా ఏమాత్రం నిస్పృహ చెందక నోటితో చిత్రాలు గీస్తూ 'నోటెడ్ ఆర్టిస్ట్'గా గుర్తింపుపొందుతున్నాడు బ్రూస్‌హాప్‌కిన్స్. తన పదహారోఏట పక్షవాతం సోకినప్పటినుండి ఊరికే కూర్చుండలేక కాలక్షేపంకోసం చిత్రలేఖనం ప్రారంభించాడు అక్లాండ్‌కు చెందిన ఈ యువకుడు. క్రమేణా అతని చిత్రాల్లో క్వాలిటీ పెరగడంతో అచిరకాలంలోనే ప్రముఖ చిత్రకారుడైపోయాడతను. అతను చిత్రించే కళాఖండాలు వేలాది డాలర్లు పలకడం మొదలెట్టాయి.

చిత్రలేఖనంలోని ప్రక్రియలన్నింటిలోనూ పరిణతి సాధించిన బ్రూస్ తనేదో కాలక్షేపంకోసం ఆరంభించిన విద్య తనని ఇంతవాడ్ని చేస్తుందనిగానీ, ఇంత డబ్బు ఆర్జించిపెడుతుందనిగానీ ఊహించలేదంటాడు.

ఒక పొడవాటి పుల్లకు బ్రష్‌ని కట్టి రెండవ చివరను తన నోటిలో ఉంచుకుని కాన్వాస్‌మీద నోటితో చిత్రాలు చిత్రించడం అంత తేలికైన విషయం కాదు. అలా చేయడమేగాక దేశం గర్వించే స్థాయి ఆర్టిస్టుగా మారడమే బ్రూస్ ప్రత్యేకత. అతనికి ఈ విషయంలో అనుక్షణం ప్రోత్సాహమిస్తూ ఇంతవాడిని చేసిన ఘనత అతని స్నేహితురాలు మేరిన్‌దేనట.

మానుకోలేకపోయాడు.

ఒకసారి పేపర్‌లో ఓ ప్రకటన కనిపించింది. అది చాలా తమాషాగా అనిపించింది. ఓ అరవయ్యేళ్ళ వృద్ధునికి తోడుగా వుండటానికి యిరవయ్యేళ్ళు దాటని చురుకైన యువకుడు కావాలనీ ఇంట్లో వుంచుకుని, భోజనం పెట్టి నెలకు ఐదొందల జీతం యిస్తామనీ దాని సారాంశం.

ఇంట్లో వుండటం అన్నమాట రాజును బాగా ఆకర్షించింది. ఎవరో ఒకరి ఇంట్లోవుండి, ఇంటి భోజనం చేస్తూ, అక్కడే వుండటంలో చాలా లాభాలున్నాయి. ముఖ్యంగా ఒక ఇంట్లో వుండటంలోని అనుభవం తనకు తెలియదు. భోజనం ఖర్చూ, గది అద్దె ఖర్చూ తప్పిపోతుంది. అంటే వచ్చే జీతమంతా మిగిలినట్టే దాదాపుగా. అదీ కాక వృద్ధునికి తోడుగా వుండటమంటే, బహుశా ముసలాయనైవుంటాడు. ఆయనతో యింట్లో వుండేంత తీరిక ఎవరికీ వుండదేమో. అందరూ ఉద్యోగాలు చేస్తూండి వుంటారు. అంటే, మధ్యాహ్నంపూట తను యిల్లు కదలకుండా వుండాలి. అదైనా రోజంతా ఆయనకు చేసే సేవలేం వుంటాయి. ఆ ఉద్యోగంలో చేరితే తనకు చదువుకోవటానికి కావలసినంత సమయం దొరుకుతుంది. ఇలా ఆలోచించాడు రాజు. తనకు దొరుకుతుందా, దొరకదా అన్నది వేరే విషయం, ప్రయత్నించి చూస్తే పోయేదేముంది. రాకపోతే తన ఉద్యోగం ఎటూ తనకుంది. అడ్రసు నోట్ చేసుకుని సాయంత్రం ఆరు గంటలకు బంకు యజమాని అనుమతి తీసుకుని బయలుదేరాడు.

"ఆ ముసలాడెవడో గుటుక్కుమంటే మళ్ళీ నువ్వు రోడ్డెక్కాలిరా రాజూ" అన్నాడు, పెట్రోల్ బంకు యజమాని, రాజు వెళుతుండగా.

ఒక్కక్షణం మనసు చివుక్కుమనిపించింది రాజుకు. ఏ హానీ చేయని ఎవరో నిస్సహాయుడైన ముసలాయన చావు గురించి నిష్కారణంగా ప్రస్తావించినందుకు బాధనిపించింది. ఆ తరవాత ఆలోచన అటువైపు మళ్ళింది. నిజంగా ఆ ముసలాయనగానీ చచ్చిపోతే, తను భయపడాల్సిన పనేముంది? ఏదో ఒక వుద్యోగం దొరక్కపోదు. పైగా ఆయనతోనే తన ఉద్యోగం ముడిపడివున్నందున, ఆ ముసలాయన మరిన్ని సంవత్సరాలు హాయిగా బతకాలని ఆయన వాళ్ళతోపాటు తనూ రోజూ దేవుణ్ణి ప్రార్థిస్తాడు కూడానూ.

బస్సుదిగి కాలనీలో అడుగుపెట్టాడు. ఒక మూల ఓ ముసలాయన మిరపకాయ బజ్జీల బండీ దగ్గర నిలుచుని, చకచకా బజ్జీలు వేస్తున్నాడు. ఆయన పక్కన బహుశా ఆయన భార్యలాగుంది. ఆయనకు పనిలో సహాయం చేస్తూంది. జనం గుంపుగా నిలబడి, కాగుతున్న బాణలివంక అసహనంగా చూస్తున్నారు. బండిపక్క నుండి వెళుతుండగా కమ్మటి బజ్జీల వాసన గుప్పున ముక్కును పరామర్శించి, నాలుకలో కోరిక రేపింది. రెండు బజ్జీలు తిందామా, అనుకున్నాడో క్షణంపాటు. ఆ వాసనా, ఆ జనమూ చెబుతున్నాయి, అవి చాలా కమ్మగా వుండి వుండాలని. ముందుగా పనిపూర్తి చేసుకుని తరవాత తీరిగ్గా తినొచ్చు వెళ్ళేటప్పుడనుకుని, ముందుకు నడిచాడు.

క్వార్టర్స్‌లో కొన్ని అలాగే వుండిపోయి, వాటిని కట్టించినప్పటి వాస్తుశాస్త్రాన్నీ కట్టించిన కాలాన్నీ సగర్వంగా ప్రకటిస్తున్నాయి. మరికొన్నిటిపైన అంతస్థులు లేచాయి. మరికొన్ని రూపు మారిపోయి పెద్ద భవంతులైనాయి. ఇంకా కొన్ని మట్టిలో కలిసిపోయి, తమ సమాధులపై లేచిన మహాకట్టడాల బరువుకు భూమిలో మరింతగా కుంగిపోయాయి. ఓ అందమైన పెద్దమేడ, దాని ముందు చాలా పెద్ద గేటు, 'సరళానిలయం' అని ఓ పక్కనా, 'పి.రమాకాంత్' అని మరోపక్కనా నల్లపాలరాతిలో బంగారు రంగు అక్షరాలున్న పలకలు... కుతూహలంగా తెరిచివున్న గేటువంక చూశాడు. అందమైన తోట కనిపించింది. క్షణకాలంపాటు తన ఉద్యోగం ఆ భవంతిలోనైతే ఎలా వుంటోందో ఊహించుకున్నాడు, అంతలోనే

'యూస్‌లెస్ రోగ్' అన్న తియ్యని గొంతు వినిపించి వెనుతిరిగి చూశాడు. పదహారు, పదిహేడేళ్లమ్మాయిలు ఇద్దరు నిలుచున్నారు. అందులో తనను తిట్టినమ్మాయి ఎవరో సులభంగానే పోల్చుకున్నాడు రాజు. కారణం, ఆ అమ్మాయిని తను అంతకుముందే మరో సందర్భంలో చూడటమే.




"వెనకపడటాలు మానేసి, ముందుపడటం నేర్చుకున్నారన్నమాట రోమియోలు. ఇల్లు కను క్కుని ఏం చేస్తాడో చేసుకోమను చూద్దాం" రాజుకు వినిపించేటట్టుగానే తన స్నేహితురా లితో అంటూ, లోపలికి నడిచిందా అమ్మాయి.

నిస్సహాయంగా నిట్టూర్చాడు రాజు. అంటే అప్పట్నించీ ఆ ఇద్దరమ్మాయిలూ తన వెనకే వస్తూ, వాళ్లవెంట పడుతున్నాడనుకున్నారన్న మాట. అసలింత పెద్ద మేడలో వుండే అమ్మా యికి అలా రోడ్డుమీద నడిచి రావలసిన అవసరం ఏమొచ్చిందోగానీ, అది తనమీద తప్పుడభిప్రాయం కలిగించిందా అమ్మాయికి. అందులో ఆ అమ్మాయి తప్పు కూడా ఏమీ లేదు. అంతకుముందుగా ఆ అమ్మాయిని కలిసిన సందర్భం గుర్తుతెచ్చుకుంటూ ఆ మేడను దాటి నడక ప్రారంభించాడు రాజు.

ఓ వారం రోజులకిందట, కాస్త మంచి బట్టలు కొనుక్కుందామని, ఫుట్‌పాత్ మీది దుకాణాలు వదిలేసి, రెడీమేడ్ షాపులోకి వెళ్లా డు రాజు. బట్టలు కుట్టించుకోవటంకన్నా కుట్టిన బట్టలు కొనుక్కోవటమే చౌకగా కని పించింది. అలాంటి రెడీమేడ్ షాపులు బైట నించి చాలాసార్లు చూశాడు కానీ ఎన్నడూ లోపలికి వెళ్లలేదు రాజు. అంచేత అందులోకి నడిచిన దగ్గర్నించీ కాస్త కంగారుగానే వుందత నికి.

పసిపాపల బట్టలోవైపూ, నాలుగైదేళ్ళ పిల్ల ల్లో ఆడపిల్లలవోవైపూ, మగపిల్లలవోవైపూ, మళ్లీ పదేళ్లపిల్లలకు వేరే కౌంటర్లూ, పదిహేనే ళ్ల పిల్లలకు వేరే కౌంటర్లూ, షాపులో అండర్ గ్రౌండూ, పెద్దవాళ్ళ బట్టలకు చాలా కౌంటర్లూ, జీన్స్ ఓవైపూ, టీషర్ట్‌లోవైపూ, కుర్తా పైజామాలో వైపూ, చలికాలం బట్టలోవైపూ అవన్నీ చూసి మతిపోయింది రాజుకు. నగరంలోనే జీవిస్తున్న పేదవాళ్ళ గుడిసెలూ, మురికివాడలూ డబ్బు న్నవాళ్లకు తెలియవనుకున్నాడే కానీ, డబ్బున్న వాళ్లకోసం వుండే హంగామాలు బైటికి కని పించిన దానికంటే, లేనివాళ్లకు కనిపించనివి లోపలెంతగా వుంటాయోనని అనిపించింది రాజుకు. ఈ లెక్కన తను బైటనుండే చూసి ఆశ్చర్యపడిన స్టార్ హోటళ్ళూ, క్లబ్బులూ, భవనాలూ వంటి వాటిలోపల ఎంత గొప్పగా వుంటుందో కదాని ఆశ్చర్యపోయాడు. ఆ తర వాత ధరల గురించి భయమేసింది. ఐనా బిడియంగానే అడిగేశాడు, కౌంటర్‌లో వున్న అమ్మాయిని.

"రెండొందల రూపాయల్లో ప్యాంటూ, యా భై, అరవైరూపాయల్లో షర్టూ దొరుకుతాయా?"

"మీకు ఎన్ని కావాలంటే అన్ని ఎన్ని రకాలంటే అన్నిరకాల్లో దొరుకుతాయి సార్" ఉత్సాహంగా చెప్పింది సేల్స్‌గర్ల్.

నిట్టూర్చాడు రాజు. ఆ అమ్మాయి చూ పించిన వెరైటీల్లో ఏది కొనుక్కోవాలో అర్థంకాలే దు. చివరకు ఆ అమ్మాయే కొన్ని తీసి చూ పించింది రాజుకు.

"మీకు ఈ రంగులూ, ఈ డిజైన్లూ బావుంటాయి సార్"

అందులోంచి రెండు ప్యాంట్లు ఎన్నుకున్నా డు, ఓ దాన్ని తీసి తన పొడుగుకు సరిపో తుందని చూసుకోబోయాడు.

"పక్కన ట్రయల్ రూముంది" అటువైపు చూపిస్తూ చెప్పిందా అమ్మాయి.

ప్యాంటును తీసుకుని, ఆశ్చర్యంగా అటు వైపు నడిచాడు, తలుపుతీసి లోపలికి వెళ్లాడు. నిలువెత్తు అద్దంలో చిన్నగది. దానికోవైపున బట్టలు తగిలించుకోవటానికి వంకీలున్నాయి ఆ ప్యాంటు తొడుక్కుని, ఆ అద్దంలో చూసుకో వాలన్న కోరికతో తను తొడుక్కున్న ప్యాంటు విప్పేసి, వంకీకి తగిలించాడు. కొత్త ప్యాంటు తీసి తొడుక్కోబోతుండగా, తగిలించిన ప్యాంటు కిందపడింది. ఒకకాలు ప్యాంటులో దోపింది అలాగే పట్టుకుని, కిందికి వంగి, పడిపోయిన ప్యాంటును మళ్లీ వంకీకి తగి లించబోతుండగా చటుక్కున డోర్ తెరుచు కుని ఒకమ్మాయి లోపలడుగు పెట్టింది.

పరధ్యానంగా వచ్చిన ఆ అమ్మాయి ముందుగా రాజును గమనించలేదు. పూర్తిగా లోపలికొచ్చేసి, తలుపును కాలితో తంతూ, అప్పుడు చూసింది. అసలే అమ్మాయి లోపలికొ చ్చినందుకు కంగారుపడుతున్న రాజు, ఆమె తలుపు మూయటంతో మరింతతికమక పడ్డా డు. తనున్న పరిస్థితి చూసుకున్నాడు. ఒకకా లు నగంవరకూ ప్యాంటులో వుంది. వెంటనే ప్యాంటును అడ్డంగా కప్పుకోవటానికి కిందికి వంగాడు. అతని తల ఆ అమ్మాయి గుండె



లకు తగిలింది. చటుక్కున వెనక్కి జరిగింది ఆ అమ్మాయి. దాంతో, లోపలివైపు తెరుచుకునే తలుపుకు తనే అడ్డంగా నిలుచుండిపోయింది. రాజు కంగారు చెప్పనవసరంలేదు. వెంటనే అతిమెల్లిగా అన్నాడు-

"సారీ"

"తలుపు గొళ్లెం పెట్టుకోవాలని తెలియదా" అనేసి, ముందుకు జరిగి, డోర్ తెరుచుకుని, తన వెనకే తలుపు మూసేస్తూ బైటికి నడిచింది.

"రాణీ, ఏమయింది" అడిగింది, అక్కడ వెయిట్ చేస్తున్న అమ్మాయి స్నేహితురాలు మాధవి.

"అ, ఏంలేదు. చూసుకోనవసరంలేదులే బానే వున్నాయి తీసేసుకుంటాను" అంది, తన చేతిలోని బట్టల్ని సేల్స్‌గర్ల్‌కు అందిస్తూ.

"నో ప్రాబ్లం మేడమ్. మీకేమైనా బాగాలేదనిపిస్తే, రేపు రిటర్న్ చేయొచ్చు. కానీ బిల్ మాత్రం తీసుకురండి చాలు" బిల్లు అందిస్తూ చెప్పింది సేల్స్‌గర్ల్.

రాణి ట్రయల్ రూంలోంచి బైటికి వెళ్లగానే రాజు చేసిన మొదటిపని తలుపు గొళ్ళెం పెట్టటం. ఆ తరవాత అప్రయత్నంగా తల తడుముకున్నాడు. మెత్తగా తగిలిన ఆ అమ్మాయి హృదయభాగం గుర్తుకొచ్చి, గుండె జివ్వుమంది. కాసేపు ఆ తన్మయత్వంలో అలాగే వుండిపోయాడు.

ఆ అమ్మాయేమనుకుందోననిపించింది ఆ తరవాత. కొంపదీసి బైట అందరికీ చెప్పిందేమోనని భయమేసింది క్షణకాలం. ఆ తరవాత సర్దిచెప్పుకున్నాడు. గొళ్ళెం పెట్టుకోకపోవటం తన తప్పు కావచ్చుగానీ, లోపల మనిమన్నాడన్న విషయం గమనించకుండా వచ్చేయటం కూడా తప్పేకదా.

ప్యాంటు తొడిగి చూసుకుని, బైటికొచ్చి, జాగ్రత్తగా అటూ, ఇటూ చూశాడు. రాణి ఎక్కడా కనిపించలేదు. హాయిగా నిట్టూర్చి, మరోసారి అపురూపంగా తడుముకున్నాడు తలని. కౌంటర్ దగ్గరికెళ్ళి, మరో ప్యాంటు తీసుకున్నాడు. బిల్లు ఇచ్చి, కౌంటర్‌లో డబ్బు కడితే, ప్యాకెట్ ఇస్తారని చెప్పింది సేల్స్‌గర్ల్. టీ షర్ట్స్ కూడా తీసుకుని, పైకెళ్ళి, డబ్బులు కట్టాడు.

డెలివరీ కౌంటర్‌లో రసీదు చూపించి, తన బట్టలు తీసుకుంటూ యధాలాపంగా పక్కకు చూసి ఉలిక్కిపడ్డాడు. పక్కనే రాణి, మాధవిలు నిలుచునున్నారు. అదేక్షణంలో ఇటు తిరిగిన రాణి కూడా రాజువైపు చూసింది. అప్రయత్నంగా రాణికన్నా ముందుగా తనే కళ్ళు దించుకున్నాడు రాజు.

"అయితే ఆ అమ్మాయి ఇల్లు ఇదన్నమాట. ఆ ఇంటి వైభవం గుర్తుకు రాగానే క్షణంపాటు కలవరం కలిగింది మనసులో. పొరపాటున తానుగానీ మళ్ళీ ఆ ప్రాంతంలో కనిపిస్తే, వాళ్ళ పనివాళ్ళతో డొక్క చించేయిస్తుందేమోననిపించింది. రాణి ఇల్లు దాటిన తరువాత రెండో వీధిలో అతను వెతుకుతున్న ఇల్లు కనిపించింది. క్వార్టర్స్ కట్టినప్పుడు ఎలా వుందో అలాగే వుంది, కాకపోతే కొంచెం పాతగా వుంది. చిన్న గేటు, చుట్టూ కాంపౌండు, కాంపౌండ్‌లో చెట్లు. బైట కారు కాదుకదా, కనీసం ఓ స్కూటర్ కూడా లేదు. ఆమాత్రం ఇంట్లో నెలకు ఐదొందలిచ్చి మనిషిని కనిపెట్టుకునేందుకు నియమించుకునేంత డబ్బున్న వాళ్ళుంటారంటే నమ్మబుద్ధి కాలేదు రాజుకు. మధ్యతరగతి యిల్లులాగా వుందది. ఎందుకైనా మంచిదని ఓసారి తను నోట్‌చేసుకున్న అడ్రెస్ స్లిప్ తీసి చూసుకుని, అదేనని నిర్ధారించుకున్నాడు. గేటు తీసుకుని వెళ్ళాడు లోపలికి. గుమ్మం తలుపు తీసేవుంది.

"ఏమండీ..." పిలిచాడు నెమ్మదిగా.

ఎవరూ రాలేదు. మరో రెండు పిలుపులు గట్టిగా పిలిచాడు.

"వస్తున్నా" అంటూ గుమ్మంలోకొచ్చాడు మేజర్ మహాలింగం.

చెయ్యెత్తు మనిషి, భారీ శరీరం, బుంగమీసాలూ, మెళ్ళో బంగారు గొలుసు, వేళ్ళకు బంగారు ఉంగరం. ఆయన్ని చూడగానే కొంచెం ధైర్యం వచ్చింది రాజుకు. తను వచ్చిన పని చెప్పాడు. లోపలికాహ్వానించి కూచోబెట్టాడాయన.

"పొయ్యిమీద టీ మరుగుతోంది. రెణ్ణిమిషాలు కూచోవోయ్, వచ్చేస్తాను" అంటూ లోపలికెళ్ళాడు మహాలింగం.

రకరకాలుగా ఆలోచిస్తూ కూచుండిపోయా





డు రాజు. అన్నట్టుగానే రెండు నిమిషాల్లో వచ్చేశాడాయన. రెండు స్టీలు గ్లాసుల్లో టీ తీసుకొచ్చి, ఒకటి రాజుకు అందించి, వాలుకు ర్చీలో కూర్చున్నాడు. టీ తాగుతూ ఇంటర్వ్యూ మొదలెట్టాడు-

''ఆ... యిప్పుడు చెప్పవయ్యా... నీ పేరేంటి?''

ఖంగుమంటున్న మహాలింగం గొంతు వింటుంటే పాతకాలం సినిమాల్లోని ఎస్వీ రంగారావు గుర్తొచ్చాడు రాజుకు. వినయంగా బదులిచ్చాడు-

''రాజు''

''అబ్బో... ఏదేశానికి?'' నవ్వుతూ అన్నాడు మహాలింగం - ''మీ నాన్నేం చేస్తాడయ్యా?''

''నాకు అమ్మా, నాన్న లేరండీ... నేను అనాథాశ్రమంలో పెరిగాను'' మామూలుగా చెప్పాడు రాజు.

''ఏమిటీ? అనాథాశ్రమంలో పెరిగావా? నిజంగానేనా లేక యింట్లో దెబ్బలాడిగానీ పారిపోయి వచ్చావా?''

''లేదండీ... నిజంగానే నాకు ఎవ్వరూ లేరు''

''అయితే మరిప్పుడు ఆశ్రమంలోనే వుంటున్నావా?''

వివరించాడు రాజు. అంతా విన్నాక అడిగాడు మహాలింగం-

''మరి ఆ ఉద్యోగం ఎందుకు మానేయాలనుకుంటున్నావు?''

''కలకాలం దానిమీదే ఆధారపడి బతకగలిగేంత పెద్ద ఉద్యోగం కాదుగదండీ అది. కాస్త తీరికి దొరికే ఉద్యోగమైతే చదువుకోవటానికి వీలుంటుందని...''

''సరేనయ్యా... ఇక్కడ ఉద్యోగమంటే ఉద్యోగం కాదు. కానీ జీతం, అదీ యిస్తాననుకో. నువ్వు చూసుకోవాల్సిన ఆ వృద్ధుణ్ణి నేనే. పోతే నీ ఉద్యోగమేమిటంటే, నాకు కొడుకుగా నటించాలోయ్''

''ఏమిటీ? కొడుకుగా నటించాలా?'' ఆశ్చర్యంగా అడిగాడు రాజు.

''అవునయ్యా... అదే ఉద్యోగం. ఏం యిష్టంలేదా? లేదంటే వెళ్ళిపో''

''అదికాదండీ... మీరు నిజంగానే అంటున్నారా, జోక్‌చేస్తున్నారా?''

''అంటే, జోకులకోసం రెండొందలు పెట్టి పేపర్లో వేయించానంటావా?'' గయ్యిమన్నాడు మహాలింగం.

''నేను ఏదో ఉద్యోగమనుకున్నాన్సార్''

''ఇదీ ఉద్యోగమేనయ్యా. కాకపోతే యిలాంటి ఉద్యోగాలేవీ యింతవరకూ వెలుగులోకొచ్చి వుండవు. అందుకే నీకు ఆశ్చర్యంగా వుంది''

''అంటే డ్యూటీలు ఏముంటాయి సార్?''

''అదీ... అలా అడుగు చెబుతాను. అసలు అంతకన్నా ముందుగా నీకు కొన్ని విషయాలు చెప్పాలి. నాకు... నాకు... అదే... నాకు పిల్లలు లేరోయ్. ఆరునెల్లకిందట మా ఆవిడ పోయింది. ఒంటరివాణ్ణయిపోయాను. జీవితమంతా మిలిటరీలో గడిపాను. సరే, ఈ ముసలి వయసులోనైనా హాయిగా ఆనందంగా వుందామంటే చాలా ముఖ్యమైన లోటు మనసువిప్పి మాట్లాడుకోవటానికి మనిషి లేకపోవడమని తెలిసింది. హోమ్‌ఫర్ ఏజ్‌డ్‌లో వుందామనుకుంటే అక్కడ ఖాళీలు లేవు. అంతలో ఈ ఐడియా వచ్చింది. ఎవరో ఒకరిని కొడుకుగా నటించమంటే ఎలా వుంటుందీ అని ఆలోచించాను. చాలా బాగా అనిపించిందోయ్. అంతే, పేపర్లో ప్రకటన వేయించాను. ఈ నాలుగు రోజుల్లో పది, పన్నెండుమందిదాకా వచ్చారు. అందులో సగంమంది ఏదో పనివాడి ఉద్యోగమనుకుని వచ్చినవాళ్ళే. మిగతావాళ్లల్లో కూడా ఒక్కడూ నాకు సరిపోయేవాడు లేడు. నువ్వు నాకు నచ్చావు. ఉద్యోగంలో చేరిపోతానంటే చేరిపో. ఎటూ వెళ్ళి చెప్పిరావటానికి ఎవరూ లేరంటున్నావు కనుక యిప్పుడిలాగే కంటిన్యూ ఐపోవచ్చు'' ఊపిరి పీల్చుకోవటానికి ఆగాడాయన.

అయోమయంగా చూస్తున్న రాజును చూసి నవ్వి, మళ్ళీ చెప్పాడు.

''ఇక డ్యూటీలంటే ప్రత్యేకంగా డ్యూటీలేమీ లేవు. నన్ను కన్న తండ్రిలాగా చూసుకోవాలి. బాగా చూసుకోవాలి. అలా అయితేనే వుంచుకుంటాను. ఏమిటీ, అలా చూస్తావ్. నువ్వు నన్ను బాగా చూసుకుంటే నేనూ నిన్ను



బాగానే చూసుకుంటాను సొంత కొడుకులా చూసుకుంటాను. మరి చెప్పు నీ సంగతి, చేస్తావా, మానేస్తావా?''

తన ధోరణిలో తను చెప్పుకుపోతున్న మహాలింగం, రాజు కళ్లల్లో నీళ్లు చూడగానే ఆగిపోయాడు. ఆశ్చర్యంగా చూశాడు. రాజు ఎందుకేడుస్తున్నాడో ఆయనకు అర్థంకాలేదు.

గుండెల్లోంచి తన్నుకొచ్చి, కళ్లల్లోంచి ఉబికి వచ్చి, బొట్లుగా మారి, ధారలుగా కారి, వెక్కిళ్లుగా ఊపిరిపోసుకుని, మళ్ళీ హృదయంలో గడ్డకట్టిన మంచును వగులగొట్టి, ఎగశ్వాసగా పరిణమించి, కారుతున్న ధారలు, రాజు చేతుల్తో తుడుచుకుంటే ఆరిపోవడంలేదు. గుండెలోని బడబానలంతో కాగి, వెచ్చబడిన వేడినీటి ఊటల్లా తన్నుకొస్తున్నాయి. కుర్చీ కోడుమీద తల వాల్చుకుని, కుళ్ళి కుళ్లి ఏడ్చాడు రాజు.

కాస్సేపు అయోమయంలో పడిపోయి, అచేతనంగా వుండిపోయిన మహాలింగం యిక తట్టుకోలేక కుర్చీలోంచి లేచి, రాజు దగ్గరికొచ్చాడు. రాజు పక్కన నిలుచుని ఓదార్పుగా అతని తలపై నిమిరాడు. దాంతో మహాలింగాన్ని అలాగే వాటేసుకుని బావురుమన్నాడు రాజు.

''బాబూ, బాబూ, రాజూ, ఊర్కో'' ఆప్యాయంగా భుజం తట్టాడు.

కాస్సేపటికి, ఆయన పొట్టలో దాచుకున్న తన తలను పైకెత్తి, వెక్కిళ్లతో ఆగి ఆగి, చెప్పాడు రాజు-

''అమ్మా, నాన్నా కావాలని ఆశ్రమంలో వున్న పద్దెనిమిది సంవత్సరాలూ ఎంతో ఆశగా ఎదురు చూశాను. ఎవరో ఒకరు నన్ను పెంచుకుంటారని ఆశపడ్డాను. కానీ ఎవ్వరూ పెంచుకోలేదు. ఆశ్రమంలోంచి బైటికొచ్చిన తరవాత, నాకష్టమో, సుఖమో, నోరు విప్పి చెప్పుకుందామంటే ఒక్క మనిషిలేడు. అనాథబ్రతుకు ఎంత దీనమైందో, ఎంత భయంకరమైందో అప్పుడర్థమయింది. అలాంటి నిరాశలో మీరు యిస్తానంటున్న ఉద్యోగం నాకు వరం సార్. దేవుడిచ్చిన వరం''

''మనిద్దరికీ ఎవరూ లేరు. అందుకే మనల్ని కలపటానికే దేవుడు నాకా బుద్ధి పుట్టించి వుంటాడురా. పద, వెళ్లి, ముఖం కడుక్కో''

చొక్కా అంచులకు తుడుచుకున్నాడు కళ్లు. లేచి నిలుచున్నాడు.

''మరి నువ్వు చేరుతున్నట్టేగదా''

చటుక్కున వంగి మహాలింగం కాళ్లకు నమస్కరించాడు రాజు.

''దీర్ఘాయుష్మాన్‌భవ'' దీవించి, ఆప్యాయంగా లేవనెత్తాడు మహాలింగం-

''ఔను కానీ ఒరేయ్, ఇలా పాతకాలం కొడుకులా కాదు. మాడ్రన్‌గా వుండాలి. ఫాస్టగా వుండాలి''

సరేనన్నట్టు తలూపాడు రాజు.

''మరి, ఒక్కసారి నన్ను 'నాన్నా' అని పిలవరా''

ఎన్నో నాళ్లుగా, ఎన్నో ఏళ్లుగా పిలవాలనుకున్న పిలుపు, ఇక ఈ జన్మలో ఎవర్నీ అలా పిలిచే అదృష్టం లేదనుకున్న పిలుపు, గుండె లోతుల్లోంచి లావాలా ఎగదన్నుకుని గొంతుదాకా వచ్చి, స్వరపేటికలో చిక్కుబడిపోయింది. ఈ క్షణం నిజమేనా, లేక ఆశ్రమంలో వున్నప్పుడు తానూహించుకున్న కల్పనల్లో మరొకటిగా కలగా వచ్చి కరిగిపోనున్నదా? స్వప్నాలు సత్యాలుగా మారి, స్వర్గాలు కళ్లముందు ఉయ్యాల లూగుతుంటే, ఇంకా మాటలురాని పాపాయి ఉయ్యాలలో ఊగుతూ, తల్లి చెబుతున్న పదాన్ని పలకటానికి తపన పడుతున్నట్టుగా వుంది. కోయిల గొంతుకు పదునుపెట్టి కూయించటానికి మొలకలేసిన మావి చివురుల వసంతంలా, వచ్చగా, అమ్మ వడిలా వెచ్చగా, తొలకరి చినుకులా హాయిగా, అపురూపమైన వరంలా తీయగా ఉక్కిరి బిక్కిరవుతున్నట్టుగా వుంది రాజుకు. తన ఎదురుగా నిలుచున్న మహాలింగం రూపం...

''నాన్నా'' తన గొంతులోంచి ఆ పిలుపు ఆ వేళ రాదేమో ననుకున్నాడు రాజు. కానీ లెక్కలేనన్నిసార్లు అలాగే పిలుస్తూండి పోయానని గమనించలేక పోయాడు.

★ ★ ★

తెల్లవారుఝామున ఐదున్నరకల్లా లేచి మార్నింగ్ వాక్‌కు బయలుదేరారు రాజారాం, చలపతి, థామస్‌లు. బైటికి వెళ్లబోయే





ముందు కృష్ణమూర్తినికూడా వెంటతీసుకుపోదామని ఆగారు. అంతకు ముందురోజే కృష్ణమూర్తికూడా తానూ పొద్దున్నే లేచి మార్నింగ్ వాక్కు వస్తానని చెప్పాడు వాళ్ళతో.

నెమ్మదిగా తలుపు తట్టాడు చలపతి. తెరుచుకోలేదు. కాస్సేపటికి పిలిచాడు

"కృష్ణమూర్తీ, కృష్ణమూర్తీ"

ఎంత పిలిచినా బదులు వినిపించలేదు. ఇక విసిగిపోయి, కాస్త గట్టిగానే పిలిచాడు

"ఒరేయ్ కిట్టిగా, కిట్టిగా, లేవరా బాబూ" ఐనా బదులు రాకపోయేసరికి పాటందుకున్నాడు, నిస్సహాయుడైన భక్తుడి ధోరణిలో.

"తెల్ల ఏనుగు వచ్చి వాకిటా నిలిచింది, నల్లనీ నా స్వామి మేలుకో, మేలుకుని మమ్మేలుకో" విసుగొచ్చి, రెండు చేతులూ జోడించి చెప్పాడు చివరకు

"నావల్ల కాదురా బాబూ"

కాస్సేపు రాజారాం కూడా పిలిచాడు. లాభంలేక పోవటంతో చిరాగ్గా అన్నాడు

"ఒరేయ్, కొంపదీసి ఈ ముసలి పీనుగ పోయాడేమో" మాట పూర్తవకముందే తల మీద ఠక్కున మొట్టికాయ పడటంతో ఉలిక్కిపడి తల తడుముకుంటూ వెనక్కి చూశాడు. అక్కడ కృష్ణమూర్తి నిలుచునున్నాడు.

"ముసలిపీనుగ, పోయాడేమో, అంటావ్రా గుడ్డినాకొడకా, గదికి తాళం వుంది. కనిపించటంలే?"

కృష్ణమూర్తినీ, ఆ తరవాత తాళం వేసివున్న తలుపునీ చూడగానే రాజారాంకు ఉక్రోషం ముంచుకొచ్చింది.

"అయితే మాత్రం అంత దెబ్బ కొడతావ్రా నిద్రమబ్బుమొహం,నువ్వూనూ"

"నిద్రమబ్బు మొహాలు మీరు. నన్ను చూడండి. ఎంచక్కా పొద్దున్నే లేచి, వళ్లుతోముకుని, స్నానం కూడా చేసి, ఇస్త్రీ బట్టలు తొడుక్కుని తలుపుకు తాళం కూడా వేసి, ఎంత చక్కగా తయారైపోయాను"

అందరూ బైటికి బయలుదేరారు.

"అయితే నిన్నిప్పుడు వెర్రిమాలోకం అనాల్రా నిద్రమబ్బూ" అన్నాడు థామస్. "లేపోతే మార్నింగ్ వాక్కు వెళ్ళే బుద్ధున్న మనిషెవడన్నా స్నానం చేసి, యిస్త్రీ బట్టలు తొడుక్కుంటాడ్రా"

"నిద్రమబ్బు కాదురా వానమబ్బూ నీరంగు చూసి ఎటూ ఏ అమ్మాయీ వెంటపడదు. నువ్వేలాంటి డ్రెస్సు వేసుకున్నా సరే. కానీ నా సంగతి అలా కాదే. మనడ్రెస్సు చూసి పడిపోవాలి అమ్మాయిలు"

"బుర్రలో తెలివితేటలుండాలి కానీ డ్రెస్సులకు పడిపోరురా అమ్మాయిలు"

"బుద్ధిలేదురా, ఈ వయసులో అమ్మాయిలేంటిరా. బీపీ పెరిగి ఛస్తారు. బుద్ధిగా సినిమాలు చూసుకోక" గసిరాడు చలపతి.

"ఏవీ, నగ్న యవ్వన కామ సుందరీమణులు, హార్నైట్సులేనా" చలపతి చూసే సినిమాల విషయం ప్రస్తావించి థామస్ ఎగతాళి చేస్తే, రాజారాం మాత్రం చలపతి మాటలకు కోపం తెచ్చుకున్నాడు

"బీపీలు రావటానికి యిదేం బాడీ అనుకుంటున్నావు. బత్తాయి రసాలు, పిస్తాబాదంలూ పోసి పెంచిన ఐరన్ బాడీ విత్ స్టీల్‌నర్వ్స్"

"అబ్బో ఐరన్ బాడీ. పాదరసం బుర్రా. లవ్‌దాకా ఎందుకు ఒక్క అమ్మాయికి లవ్ లెటర్ రాసి, నువు చెప్పిన చోటుకు రప్పించు కనీసం. చూద్దాం నీ తెలివి తేటలు"

"నన్ను రెచ్చగొట్టకు" గట్టిగా అరిచాడు రాజారాం.

"అరవకురా. ఏ పోలీసో వింటే నక్సలైట్‌వనుకుని కాల్చిపడేస్తాడు"

"వీడు నక్సలైటేంట్రా? పెద్ద ట్యూబ్‌లైట్"

"చలపతీ, హు, ముగ్గురూ ఒక్కటైపోయారా. సరేకానీ. చెప్పండిరా, ఏ అమ్మాయికి లవ్ లెటర్ రాయాలో. ప్రేమలేఖలు రాయటంలో నేను కాలేజీ ఫస్ట్ తెలుసా"

"ఓహో, పరీక్షల్లో కూడా అవే రాసి, అందుకే బియ్యే ఫైవియర్ కోర్స్ చేశావా?"

"నోర్ముయ్యవోయ్ ఇప్పటి సంగతి చెప్పండి"

కాస్సేపు ఆలోచించి చెప్పాడు కృష్ణమూర్తి

"ముందుగా ఎక్కడైనా కాఫీ తాగేసి ఆ

సెంటర్‌లో నిలుచుందాం. మనం నిలుచున్న తరవాత అటుగా వచ్చే మొట్టమొదటి అందమైన అమ్మాయి వెంటపడి, యిల్లు కనిపెట్టి ఆ అమ్మాయికి లవ్ లెటర్ రాసి, మేం చెప్పిన చోటుకు రప్పించాలి''

''మొట్టమొదటి అందమైన అమ్మాయా! కొంపదీసి ఏ ఇన్‌స్పెక్టర్ గారమ్మాయో అయితే?'' సందేహం వెలిబుచ్చాడు చలపతి.

''అవన్నీ మనకు సంబంధం లేనివిషయాలు. ఎవరైనా సరే, చివరకు లేడీ ఇన్‌స్పెక్టరైనా సరే, జాన్‌తానై''

''ఓకే, ఛాలెంజ్'' కాలర్ ఎగరేశాడు రాజారాం.



రమాకాంత్ ఢిల్లీకి బయలుదేరాడు. పొద్దున్నే తండ్రిని ట్రెయిన్ ఎక్కించటానికి తనే కారు తీసుకుని బయలుదేరింది రాణి. ఆయన ట్రెయిన్ కదలగానే తిరిగివస్తూ కార్ స్టీరియో ఆన్‌చేసి, అది వింటూ, నిర్మానుష్యమైన రోడ్డు మీద, హాయిగా వున్న వాతావరణంలో హుషారుగా కారు నడుపుతూ యింటిదారి పట్టింది.

ఎప్పుడూ కిటకిటలాడే మెయిన్‌రోడ్డుమీంచి మెత్తగా జారిపోతూంది కారు. దూరంగా ఎవరో ఒకాయన ఫుట్‌పాత్‌మీదినుండి రోడ్డుమీదకు దిగటం చూసి, కారుని స్లో చేసింది. అక్కడో స్పీడ్‌బ్రేకర్ కూడా వుంది. కనుక కూడా స్లో చేయాల్సివచ్చింది. సరిగ్గా స్పీడ్ బ్రేకర్ పైకెక్కిన కారు కిందికి దిగే సమయానికి ఫుట్‌పాత్ మీద పడిపోయాడాపెద్దమనిషి, కారు పక్కన. కెవ్వున కేకేశాడు. అతను కృష్ణమూర్తి!

బ్రేక్‌వేసి, కిటికీలోంచి చూసింది రాణి. తన కారు తగలకపోయినా, మానవతా దృష్టితో కారాపి, కిందకు దిగి, కృష్ణమూర్తికి చెయ్యందించి, నిలుచోబెట్టింది.

''నాకారేమీ తగల్లేదుకదండీ. ఎందుకట్లా అరిచారు!'' ఆశ్చర్యంగా అడిగింది.

''సడన్‌గా కారుని చూశాను. తగులుతుందేమోనని భయమేసింది'' తన వయసుకు తగిన విధంగా గొంతులో వణుకు తెచ్చుకున్నాడు కృష్ణమూర్తి.

''నడవగలరా?''

''ఫరవాలేదమ్మా... నువ్వెళ్ళు. థాంక్యూ'' అన్నాడు.

కృష్ణమూర్తి రోడ్డుదాటేవరకూ ఆగి, కారుని కదిలించింది రాణి. ఆ కారును అనుసరించిందో ఆటో. అందులో రాజారాం వున్నాడు.

తన స్నేహితుడి కూతురు చెడుతిరుగుళ్ళు తిరుగుతూందనీ కనీసం ఎక్కడికి వెళుతుందో తెలిసినా, ఆ కుర్రాడికిచ్చి పెళ్ళి చేస్తానని తన స్నేహితుడు వాపోతే, ఆ అమ్మాయిని కనిపెట్టటానికి తాను కాచుక్కూచున్నాననీ ముందుగానే ఆటో అతనికి చెప్పివుంచాడు రాజారాం. ఓ కన్నతండ్రి ఆవేదననూ, ఆ తండ్రికోసం ఓ మిత్రుడు పడుతున్న తపననూ హృదయ విదారకంగా వర్ణించాడు రాజారాం, ఆటో అతనికి. ఆ కథను నమ్మాడుగానీ, ఆ అమ్మాయి రాజారాం కూతురే అయివుంటుందని భావించాడు ఆటో వాలా. అదేగానీ, అతనా అమ్మాయికి లవ్ లెటర్ రాసే నిమిత్తం, ఇంటి అడ్రెసకనుక్కోవటానికి వెళుతున్నాడని తెలిస్తే అదిరిపోయేవాడు.

★ ★ ★

మహాలింగం యింట్లో చేరిన దగ్గర్నించీ రాజుకు మరో జన్మ ఎత్తినట్టుగా వుంది. మొదటి వారంరోజులు కొంచెం కొత్తగా, యిబ్బందిగా అనిపించిందిగానీ ఆ తరవాత అలవాటైపోయింది. తను జీవితంలో పొందలేకపోయిందేమిటన్నది అప్పుడు స్పష్టంగా అర్థమయింది రాజుకు. ఇద్దరూ ఒకే యింట్లో వుంటున్నారు. తను మహాలింగంను 'డాడీ' అని పిలుస్తున్నాడు ఆయనా తనను 'రాజూ' అనీ, 'ఒరేయ్' అనీ, 'వెధవా' అనీ రకరకాలుగా పిలిచినా ఆ పిలుపులో వున్న దగ్గరి





తనం అతన్ని మురిపింపజేసింది.

రోజూ పొద్దున్నే లేవటం నీళ్లు పొయ్యిమీద పడేసి తండ్రిని నిద్రలేపటం, ఆలోగా తనూ తయారవటం, బజారుకెళ్ళి పేపరూ, కూరలూ తీసుకురావటం, ఆ తరవాత వంట చేయటం, వంటలో తండ్రికూడా సహాయం చేస్తుంటాడు, తను వద్దంటుంటాడు. మొత్తంమీద వంట చేసేయగానే భోజనాలుపూర్తయితే, ఆయన పేపర్ చదువుతూనో, రేడియో వింటూనో గడుపుతుంటాడు. తను చక్కగా చదువుకోవటం తప్ప పనేమీ వుండదు. మధ్యలో ఎప్పుడైనా ఆయనకు టీ చేసివ్వటంలాంటి చిన్న చిన్న పనులు తప్ప వేరే ఏమీ వుండదు.

సాయంత్రాలు యిద్దరూ కలిసి షికారుకు వెళుతుంటారు. అలా వెళ్ళినప్పుడల్లా ఏదో ఓ చిరుతిండి తినటం మహాలింగంకు అలవాటు. తను మహాలింగం దగ్గరికొచ్చిన మొదటి రోజున తినాలనుకుని, మరిచిపోయిన మిరపకాయ బజ్జీల్ని మూడోరోజు వాకింగ్‌కు వెళుతున్నప్పుడు తిన్నాడు రాజు. అక్కడంత రష్ ఎందుకుంటుందో అర్థమయిందతనికి. తను ఎంత వద్దన్నా మూణ్నాలుగు రోజులకోసారి తప్పకుండా అవి తినటానికి మహాలింగం ఉబలాట పడటంలోనూ అతనికి ఆశ్చర్యపోవాల్సిన పని లేదనిపించింది.

నువ్వులపిండీ, వామూ కలిపిన చింతపండు గుజ్జుతోనింపిన లేత మిరపకాయలు, ఎర్రగా కరకరలాడేట్టు వేయించి పళ్లెంలో వేస్తే, వాటిని చూస్తేనే మింగేయాలనిపిస్తుంది. అవి అలాగే యివ్వకుండా, వాటిని కత్తితో చీల్చి, సన్నటి ఉల్లిపాయ ముక్కలూ, కొత్తిమీరా చల్లి, నిమ్మరసం పిండి మరీ యిస్తారు. అంతటా రూపాయికి మూడైతే ఇక్కడ రెండే యిస్తారు. అయితేనేం. వాటి రుచి అద్భుతం. దానికి తోడు ప్రతి వాళ్లతోనూ ఆప్యాయంగా మాట్లాడే ఆ భార్యా భర్తలు. వాళ్ళిద్దరూ ఆ పని చేయాల్సిన వాళ్ళు కాదని అనిపించేది రాజుకు. ఆ యిద్దరూ విశ్వనాథం, అన్నపూర్ణలు!

రోజూ పొద్దున్న ఆ పక్కనున్న యింటి దగ్గర యిడ్లీలు, వడలూ చేస్తారని తెలిసి, అప్పుడప్పుడూ పొద్దున్న రాజును టిఫిన్ చేయవద్దని చెప్పి, ఆ యిడ్లీలు తెమ్మని పంపించేవాడు మహాలింగం. ఆ యిడ్లీలూ అంతే. ఆ మినప వడలూ అంతే. నెల రోజులయ్యేసరికల్లా వాళ్లకు చాలా దగ్గరివాడైపోయి, విశ్వనాథం స్కూలు టీచర్‌గా చేసి రిటైరయ్యాడని తెలుసుకున్నప్పుడు ఎంతో బాధపడ్డాడు రాజు.

"ఇందులో బాధపడాల్సిందానికన్నా సంతోషించాల్సిందే ఎక్కువుంది బాబూ. కనీసం ఈ వయసులోనైనా నాలోని శక్తి సామర్థ్యాలను సరిగ్గా ఉపయోగించుకుంటున్నాను. ముఖ్యంగా నాకోసం ఉపయోగించుకుంటున్నాను. కాకపోతే శరీరకష్టం చేస్తున్నాను. అంతేకదా తేడా...

స్కూలు టీచర్‌గా వున్నన్నిరోజులూ నేనేమీ చేయలేననుకునేవాణ్ని. నాలో ఇప్పుడు ఆత్మవిశ్వాసం పెరిగింది. ఒక చిన్న డబ్బాలో యిడ్లీలు పెట్టుకుని తిరగటంతో ప్రారంభించాను. మీ పిన్ని చేతి మహిమ... ఏడాది తిరిగే సరికల్లా తిరగటం మానేసి యింటి పట్టున కూచునేంత వరకూ వచ్చాను. ఒకటికి రెండుగా సాయంత్రం మిరపకాయ బజ్జీలు కూడా మొదలెట్టాను. నీకో రహస్యం చెప్పనా... మనదేశంలో ఏ స్కూలు టీచరు కూడా తాను సంపాదించగలనని ఊహించనైనా లేనంత మొత్తం నెల నెలా సంపాదిస్తున్నాను. ఈ ఎండాకాలంలో వడియాలూ, అప్పడాలూ చేద్దామంటూంది మీ పిన్ని. వాటితోపాటు మసాలా పొడులు కూడా ప్రారంభించాలనుకుంటున్నాను. నన్ను చేతకాని వాణ్నని ప్రభుత్వం రిటైర్ చేసిందిగానీ నాకు ఏం చేతనవునో నేను చేసుకుంటూనే వున్నాను. నాకు చాలా సంతోషంగా వుందయ్యా ఇప్పుడు. ముఖ్యంగా మీ పిన్నికి మనసు కుదుటపడిందిప్పుడు"

తానేమీ చేయలేననీ, తనకెవరూ సహాయం చేయరనీ చాలామంది బాధపడుతూ కూర్చుంటారుగానీ అసలేమైనా చేద్దామనే ఆలోచనే చేయరు. లక్ష్యంలేని బాణంలాగా అలాంటి వాళ్లలోని శక్తిసామర్థ్యాలన్నీ నిష్ప్రయోజనాలే కదా. జీవితానికి ఓ గమ్యం నిర్ధారించుకుని అటువైపు చేరుకోవటానికి ఎంత కష్టమైనా సరే కృషి చేయటంలో ఆనందమూ, సంతృప్తీ వుంది. అంతేకాదు, ఏదో ఒకనాటికి ఆ లక్ష్యాన్ని చేరుకోగలుగుతా

ము. అంతేకానీ ఏదీ మనవల్లకాదనే నైరాశ్యం వలన ఒరిగేదేమీ వుండదు. తోడులేకుండా బతకలేరనుకున్న ముసలి దంపతులు తమకు తామే పని కల్పించుకుని, భవిష్యత్తులో సుఖంగా జీవించటంకోసం తమ వయసును లెక్కచేయకుండా కొత్త జీవితాన్ని ప్రారంభించారు ఓ రకంగా యిప్పటికే వాళ్లు విజయం సాధించారనుకోవచ్చు. వెయ్యి మైళ్ల ప్రయాణం కూడా ఒక అడుగుతోనే ప్రారంభమవుతుంది కదా. ఆ మొదటి అడుగే సంకల్పశుద్ధి. దాన్ని వేయించేది ఆత్మవిశ్వాసం. గమ్యం చేరుకోకపోయినా దానికీ మనకూ వున్న దూరం కొన్ని అడుగులైనా తగ్గుతుందికదా. ఆ వృద్ధ దంపతులకు భగవంతుడు తోడుగా నిలవాలని కోరుకున్నాడు రాజు.

పాలూ, పేపరూ, కూరలూ తేవటానికి వెళ్ళినప్పుడల్లా రాణి యింటిముందునించే వెళ్ళాల్సివచ్చేది. అలా అప్పుడప్పుడూ రాణి ఎదురవుతుండేది. ఆ అమ్మాయి కనిపించినప్పుడల్లా అతని వయసు చెలరేగిపోయేది. మనసు దాన్ని అదుపులో పెట్టేది. తన తలను పునీతం చేసిన గుండెల్లో తలదాచుకునే అదృష్టం కలిగితే ఎంత బావుణ్ణని తియ్యని కలలు కనేవాడు. అంతటితోనే ఆ విషయం మరిచిపోవటంకూడా అలవాటు చేసుకున్నాడు. తీరవని తెలిసిన కోరికల్ని పెంచి పెద్దచేసుకుని, గోటితో పోయేదాన్ని గొడ్డలితో నరకాల్సినంత దృఢంగా పెరగనిచ్చి బాధపడటంకన్నా ఆ కోరికను పగటికలల్లో తీర్చేసుకుని సంతృప్తిపడి, మరిచిపోవటం మంచిదని భావించాడు. అతని మనసులో ఒక డ్రీమ్‌గర్ల్‌లా నిలిచిపోయింది రాణి.

మహాలింగం మంచితనం మూలంగా కొద్దిరోజులకే తను నటిస్తున్న కొడుకనే విషయం మరిచిపోయాడు రాజు. నెల రోజులయ్యేసరికల్లా, ఆయన తన కన్నతండ్రి అనే భావించుకునేంతగా కలిసిపోయాడు. తను కేవలం నెల రోజుల క్రితమే మొట్టమొదటిసారిగా ఆయన్ను చూశానని అతనికి గుర్తురావటంలేదు. కొన్ని సంవత్సరాలుగా అదే యింట్లో ఆయనతో పాటే వుంటున్న అనుభూతి నిండిపోయింది రాజు మనసులో. కన్నవాళ్లు కావాలనే కోరిక ఆ విధంగా అంత విచిత్రంగా, అంత అందంగా తీరటం కేవలం రాజు అదృష్టమనే చెప్పాలి.

ఆ కోరిక తీరిన తరవాత రాజులో మరో కోరిక కలిగింది. ఎడారిలో తిరుగుతున్నప్పుడు నీడ కావాలనీ, నీడ దొరికాక నీళ్లు కావాలనీ నీళ్లు దొరికాక కడుపునింపుకోవాలనీ, కడుపునింపుకున్నాక పడక కావాలనీ, యిలా అంతులేకుండా కోరికలు కలుగుతూనే వుండటం చాలా సహజమైన విషయం. పైగా రాజు కోరికకు ఒక ముఖ్యమైన కారణం మహాలింగం స్వభావం.

మహాలింగంతో కలిసిపోవటానికి రాజుకు వారం రోజులు పట్టిందిగానీ, మహాలింగం మాత్రం రెండో రోజునే రాజు తన కొడుకనే భావనలో మునిగిపోయాడు. కల్మషం లేకుండా మనసులో వున్నదేదో మాట్లాడేసే ఆయన మనస్తత్వంవల్ల రాజులోని బెరుకు చాలా తగ్గిపోయింది. రాజు మూలంగా తనకు మాత్రమే చాలా వుపకారం జరిగిందని భావించుకోసాగాడు మహాలింగం. రాజు మూలంగా తన ఒంటరితనం దూరమైపోవటం ఆయనకు అన్నిటికన్నా సంతృప్తి నిచ్చిన విషయం. అందువల్ల రాజును తన కన్నకొడుకుగా స్వీకరించి, అతన్నలాగే చూసుకోసాగాడు. మంచి బట్టలు కొనిపెట్టాడు. ఓ జత చెప్పులూ, ఓ జత బూట్లూ కొనిపెట్టాడు. వెంటపెట్టుకుని తిరగటం, పనుల్లో సహాయం పొందటం, అప్పుడప్పుడూ వంటపని మాన్పించి హోటల్‌కు తీసికెళ్లటం, బలవంతంగా సినిమాలకు పంపించటం, యిలాంటి వాటితో ఆ నెలరోజుల్లో రాజు, మానసికంగా మహాలింగం కొడుకైపోయాడు. కన్నవాళ్లు కావాలనే కోరిక తీరిన తరవాత రాజులో మరో కోరిక అందుకే అంత తొందరగా కలిగింది. తనకో తమ్ముడో, చెల్లెలో వుంటే బావుణ్ణనేది ఆకొత్త కోరిక. తండ్రి ప్రేమ వేరు, తోబుట్టువు ప్రేమ వేరు. అడుగడుగునా తన పనులకు అడ్డుతగులుతూ, ముద్దు ముద్దుగా అడిగి తనతో సేవలు చేయించుకుంటూ తనకోసం ప్రేమగా యింట్లో ఎదురుచూసే ఓ తమ్ముడో, ఓ చెల్లెలో వుండటం ఎంత అందమైన వరం! అది తీరే మార్గం లేదని తెలుసు రాజుకు. అయితే రాణి ప్రేమను పొందే విషయంలో వీలవదని రాజీ పడిపోయినంత సులభంగా ఈ విషయంలో మాత్రం రాజీపడి, ఆ కోరికను చంపేసుకోలేకపోయాడు. కానీ తీరే

మార్గం మాత్రం లేదు.

తల్లిదండ్రులు కావాలన్న కోరిక తీరి, తోబుట్టువు కావాలన్న కోరికతో వున్న రాజుకు, ఆ రోజు మహాలింగం జీతం చేతిలో పెట్టగానే ఆకాశాలనుండి అగాధాలకు పడిపోయిన భావన కలిగింది. జీతం వల్ల ఖర్చుపెట్టుకోవటానికి మరింత డబ్బు దొరికిందని సంతోషిస్తాడనుకున్నవాడు చాలా ముభావంగా మారటంతో తికమకపడ్డాడు మహాలింగం.

ఆ రోజంతా ముభావంగానే వుండిపోయాడు రాజు. ఆయనకేమీ అర్థంకాలేదు. ఎన్నిరకాలుగా ప్రయత్నించినా రాజులో సంతోషాన్ని కలిగించలేకపోయాడాయన. ఏం జరిగిందో మట్టుకు అర్థంకాలేదు. మరునాడు కూడా అలాగే అంటీముట్టనట్టుగా వున్నాడు రాజు. ఏదైనా పని చెబితే కానీ లాభంలేదని ఆలోచిస్తుండగా ఆయనకు హఠాత్తుగా సుధ గుర్తొచ్చింది. సాయంత్రం వరకూ ఆగి, సుధ యిచ్చిన అడ్రెస్ తీసుకుని, రాజును వెంటబెట్టుకుని, బయలుదేరాడు.

కాలేజీలో అడుగుపెట్టగానే రాజుకు కనిపించిన రెండో మనిషి రాణి. రాజు తన వెంటపడుతున్నాడని భావించిన రాణిలో క్రమంగా చిరాకు మాయమై ఆ స్థానంలో కుతూహలం పుట్టింది. రాజును చూడగానే సన్నగా స్నేహపూర్వకంగా నవ్వింది. కానీ రాణిలోని ఆ మార్పుకూడా అతనిలో సంతోషాన్ని కలిగించలేదు. మహాలింగం అక్కడికి ఎందుకు తీసుకొచ్చాడో కూడా తెలియదు. అంచేత రాణి నవ్వుకు ప్రతిస్పందనేమీ వ్యక్తపరచకుండా నిర్లిప్తంగా వుండిపోయాడు. అతని పక్కనున్న మహాలింగాన్ని చూసి, ఆ కారణంగా అతనలా నటిస్తున్నాడనుకుంది రాణి. ఆమె వెళ్ళిపోయింది. కాస్సేపటికి సుధ కనిపించింది. మహాలింగంను చూడగానే చిరునవ్వుతో పలకరించింది సుధ.

''బావున్నావా బాబాయ్. ఇన్ని రోజులకు గుర్తొచ్చాననన్నమాట నేను''

''అబ్బే, అదేం లేదమ్మా. నిన్ను మరిచిపోతానా చెప్పు. ఏదో పనులతో తీరిక దొరకలేదు. ఏంటీ, వీణ్నలా చూస్తున్నావ్. నా కొడుకు. నీకు అన్నయ్యన్నమాట''

రాజువైపు చూసి, సన్నగా నవ్వింది సుధ. బంధువులమ్మాయి అయుంటుంది- అని పించగానే, ముఖ్యంగా సుధ ఆప్యాయంగా మాట్లాడటంవల్లా మహాలింగం పైనున్న కోపం మరింత ఎక్కువయింది రాజుకు. సుధపైన అసూయ కూడా కలిగింది కానీ అదేమీ పైకి కనిపించనీయలేదు.

మహాలింగం సుధను యింటికి ఆహ్వానించాడు గానీ, ఎగ్జామ్స్ దగ్గరికొస్తున్నందున చదువుకోవాల్సినవి చాలా వున్నాయని చెప్పి, తిరస్కరించింది సుధ. దగ్గర్లో వున్న పార్కులో కూచున్నారు ముగ్గురు.

''అవును బాబాయ్, నీకు పిల్లలు లేరని చెప్పావ్''

'పిల్లలు లేరుకదా' అనకుండా, 'లేరని చెప్పావు' అంటుందేమిటీ అమ్మాయి, అని ఆలోచించాడు రాజు. అంటే, ఈ అమ్మాయెవరో... కేవలం పరిచయస్తురాలన్నమాట.

''అప్పుడు లేడు కనుక లేడని చెప్పాను. ఇప్పుడున్నాడు కనుక వున్నాడని చెబుతున్నాను''

''ఫో బాబాయ్. నామీద నీకు కోపం పోనట్టుంది. లేపోతే నాకు చెప్పటానికేం. దత్తత తీసుకునుంటావు... అవునా?''

'అబ్బే, వీడు జీతానికి కొడుకులా నటిస్తున్న అనామకుడు' అని చెబుతాడు... అంతేకదా. అప్పుడా అమ్మాయి తననెలా చూస్తుంది. ప్రేమ అవసరమైనవాడికి అమ్ముకునే నీచుడనుకుంటుందేమో తనను, అనుకుంటూ రాజు, మహాలింగం జవాబుకోసం ఆత్రంగా ఎదురు చూడసాగాడు.

''దత్తత తీసుకోవాల్సిన ఖర్మ నాకేమిటమ్మా. వీడు నాకు వరపుత్రుడు. నాకోసం నడిచొచ్చే కొడుకుని పంపిచాడమ్మా భగవంతుడు''. సంతోషంగా చెప్పాడు మహాలింగం.

ఆ జవాబు వినగానే రాజుకు చాలా ఆశ్చర్యం కలిగింది. మహాలింగం మనసులో ఏముందో అర్థంకాలేదు. కానీ మనసులోంచి సగం దిగులు పారిపోయింది.

మళ్ళీ రెట్టించకుండా అంతటితో వదిలేసింది సుధ-



''సరే, మొత్తానికి నీగురించి బెంగపడాల్సిన అవసరం లేకుండా నాకు సగం భారం తగ్గించాడు అన్నయ్య''

సుధ తనను 'అన్నయ్యా' అని సంబోధించటం మొదటిసారిగా అప్పుడే ఆనందం కలిగించింది రాజుకు. ఈ అమ్మాయే తన చెల్లెలైతేనా, ఎంత అపురూపంగా చూసుకునేవాడు - అనుకున్నాడు మనసులో.

ఓ గంటసేపు కూర్చున్న తరువాత, మరోసారి తప్పకుండా వస్తానని చెప్పి, బయలుదేరింది సుధ.

''అన్నయ్యా, బాబాయ్‌తోపాటు నువ్వూ రావాలి. నిన్ను చూస్తుంటే అచ్చం మా చిన్నన్నయ్యను చూసినట్టే వుంది'' వెళుతూ చెప్పింది సుధ, రాజుతో.

ఆ మాటలతో రాజు మనసులోని దిగులంతా పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది. సుధ వెళ్ళిపోయిన తర్వాత, ఆ అమ్మాయి తనకెలా తెలుసో చెప్పాడు మహాలింగం.

''అవునుగానీ, ఆ అమ్మాయి నాగురించి అడిగితే అలా మాట దాటించావేం డాడీ?''

''మాట దాటించేదేం వుంది. వున్న మాటే చెప్పాను'' ఆశ్చర్యంగా అన్నాడు మహాలింగం.

''అదే... నేను కొడుకుగా నటిస్తున్నానని ఎందుకు చెప్పలేదు?'' అతి ప్రయత్నంమీద అడిగాడు రాజు.

''ఎవడంటాడా మాట. పళ్ళు రాలకొడతాను. నా కొడుగ్గా నటించటమేంటి. నువ్వు నా కొడుకువి. దట్సాల్'' కాస్త కోపంగా అన్నాడాయన.

ఆ మాటతో రాజులోని అనుమానాలన్నీ పటాపంచలయ్యాయి. వెంటనే తనను అంతగా బాధపెట్టిన మహాలింగంమీద కోపమొచ్చింది.

''మరైతే, నెలవగానే అంత గుర్తుపెట్టుకుని నాకు జీతం ఎందుకిచ్చావ్?'' - ఆ ప్రశ్న అడగటంలో రాజులో కనిపించిన భావాలు స్పష్టంగా అర్ధమయ్యాయాయనకు.

వెంటనే సగం కోపం, సగం ఆప్యాయతతో చెప్పాడు-



''ఒరి పిచ్చివెధవా, అందుకా నిన్నట్నించీ నామీద అలకపూనావు. డబ్బులిస్తే కోపమేంట్రా వెర్రిసన్నాసీ''

''ఔనుమరి. నువ్వలా డబ్బులిస్తే నాకు చాలా బాధేసింది డాడీ. నేను నీదగ్గర జీతంకోసం పనిచేయటంలేదు. కావాలంటే నేనే ఉద్యోగం చేసి, నీకు డబ్బులిస్తాను. అంతే కానీ నన్నుమాత్రం అలా చూడొద్దు డాడీ... నాకైతే అసలు నిన్న చచ్చిపోదామనిపించింది తెలుసా?''

ఇక లాభంలేదని ధోరణి మార్చాడు మహాలింగం-

''చచ్చిపోవాలనిపించిందా వెధవా చంపేస్తాను జాగ్రత్త'' అన్నాడు కోపంగా. కాసేపటి తరువాత చెప్పాడు మహాలింగం మళ్ళీ-

''ఒరేయ్, నిన్ను యిన్నిరోజుల్నించీ గమనిస్తున్నాను. ఒకటి కావాలని ఎన్నడూ అడగవు. డబ్బులిచ్చానని నిన్నట్నించీ అలిగావు. ఈ లోకంలో, డబ్బు ఎంత విలువైందో నీకు తెలియదురా''

''డబ్బు చాలా విలువైందని నాకు తెలుసు డాడీ. కానీ అంతకన్నా విలువైంది నీదగ్గర దొరికింది నాకు. దాని విలువేమిటో, బహుశా, అనాథాశ్రమంలో పెరిగినవాళ్ళకు తప్ప అర్థంకాదు. అందుకే నీకలా విచిత్రంగా అనిపిస్తూండవచ్చు''

''డబ్బుకంటే కన్నవాళ్ళ ప్రేమ విలువైందని నువ్వంటున్నావు. కానీ దానికోసం కన్నవాళ్ళను యింట్లోంచి తరిమేసిన పిల్లలున్నారు తెలుసా లోకంలో''

''నేను నమ్మను డాడీ. అవన్నీ పట్టి కథల్లో మాత్రమే జరుగుతాయి''

''హు... లోకం గురించి నీకేం తెలుసు కనుకరా పిచ్చివాడా. నా పిల్లలు నా సొంత పిల్లలు నన్ను యింట్లోంచి తరిమేశారు తెలుసా?''

నిర్విణ్ణుడయిపోయిన రాజు చాలాసేపటివరకూ మాట్లాడలేకపోయాడు. చేష్టలుడిగిన అచేతనావస్థనుండి తేరుకుని అన్నాడు-

''నాకు తెలీదు డాడీ. కానీ ఎవరైనా కోటి రూపాయలిస్తాం, నిన్నొదిలేయమని అంటే

నేనొదిలేయను... తెలుసా?"

★ ★ ★

మహాలింగంలాంటివాణ్ణి ఆయన పిల్లలు బైటికి తరిమేశారంటే రాజు నమ్మలేకపోయాడు. తనేమో కన్నవాళ్ళు లేరని బాధపడుతుంటే వాళ్ళేమో వున్న తండ్రిని బైటికి తరిమేశారు. ఆర్థికంగా తనకుతాను నిలదొక్కుకుని, ఎవరి అవసరం లేకుండా బతకగలిగినప్పటికీ తనకే ఒక తల్లీ, ఒక తండ్రీ కావాలనీ, వాళ్ళ అజమాయిషీలో, ఆదరణలో పెరగాలనీ అంత కోరికగా వుంటే, పిల్లల్ని కని, పెంచి, తన జీవితమంతా వాళ్ళకోసం కష్టపడి, అలసిపోయిన మహాలింగంలాంటివాడికి తనను కనిపెట్టుకునే ఓ కొడుకు కావాలనిపించటంలో అసహజమేమీ కనిపించటంలేదు. కానీ మనుమల్లో యిన్ని వైరుధ్యాలు ఎందుకుంటాయో రాజుకు అర్థంకాలేదు.

ఇక మహాలింగంకు రాజు అవసరం అయ్యాడు. అమాయకుడైన రాజు అవసరాలను కనిపెట్టి తీర్చటంలోనే ఆయనకు సగం ఆనందం కనిపిస్తూంది. తాను కూడా నిజమైన కొడుకులా వుండాలని రాజు నిశ్చయించుకున్నాడు. పొద్దున్నే టిఫిన్ చేసేయగానే యిద్దరూ ఆరోజు గురించి మాట్లాడుతూ కూర్చున్నారు.

"డాడీ..." పిలిచి ఏమీ చెప్పకుండా వుండిపోయాడు రాజు.

"ఏంట్రా?"

"ఏంలేదు... నాకు..."

"ఆ నసుగుడేమిటోయ్... ఏంటి, నీకు?"

"నాకు..."

"ఒరేయ్, నాకు చిరాకెత్తిందంటే తాట వలిచేస్తాను. తొందరగా చెప్పెయ్"

"నాకు ఓ సైకిల్ కావాలి డాడీ. బ్యాంకుకెళ్ళి డబ్బులు తెచ్చుకుంటాను"

"దానికంత నసుగుడెందుకోయ్, వెధవ సైకిలేం పెద్ద యిదా ఏంటి? నీ అబ్బదగ్గర బోల్డు డబ్బు మూలుగుతుందిరా, స్కూటర్ అడుక్కో కొనిచ్చేస్తాడు" రహస్యం చెప్పినట్టుగా చెప్పాడు మహాలింగం.

"సైకిలంటే సైకిల్ కాదు, మోటార్ సైకిల్ నేనడిగింది"

"ఇంకేం, నీ అకౌంట్లో డబ్బులున్నాయిగదా, ఒకటేంటి, పది మోటార్ సైకిళ్ళు కొనుక్కో"

"నా అకౌంట్లో డబ్బులు సరిపోవు. ఐనా బ్యాంకులో దాచుకున్న డబ్బులన్నీ ఏంచేసుకుంటావ్?"

"అవన్నీ నీ తాతగాడి సొమ్ము కాదు. స్కూటర్ కొనివ్వాలని నేను అనుకుంటున్నాను కనుక కొనిస్తాను... దట్సాల్"

"నాకేం అక్కర్లేదు. నువ్వే నడుపుకో. కొంటే మోటార్ సైకిల్ కొను. అది కూడా హొండా. లేకపోతే మానెయ్యి"

"మోటార్ సైకిలే ఎక్కువనుకుంటే హొండా కావాలా. ఎంతవుతుందో తెలుసా?"

"ఎంతైతే ఏంటట? నాతోపాటు నువ్వూ తిరగొచ్చుగదా. ఐనా మిలిట్రీలో పనిచేసినవాడికి, స్కూటర్ కొనటమేంటి. అమ్మాయిలు నడుపుతారు స్కూటర్లు"

"అబ్బో, పేద్ద మగాడు బయలుదేరాడు. నేను స్కూటరే కొంటాను... అంతే"

"కొనుక్కో... నాకుమాత్రం హొండా కొనేవరకూ నేను అన్నం తినను"

"ఒరేయ్, ఒరేయ్, నిజంగానే అంటున్నావా?"

"మధ్యాహ్నంవరకు చూడు, అర్థమవుతుంది"

"మరీ, మోటార్ సైకిలేంట్రా, రెండూ ఒకటేగదా. ఈసారికి నా మాట విన్రా బాబూ"

"ఈసారికి... అంటే నువ్వేదో నెలకో బండి కొంటావా ఏంటి?"

"సరేరా వెధవా, మరీ నెత్తికెక్కి కూచుంటున్నావు. నీకు తొందరగా పెళ్ళి చేసేస్తే నా బాధ్యత తీరుతుంది. అప్పుడా వచ్చే పిల్ల, నెత్తినెక్కుతుంది. అప్పుడర్థమవుతుందిరా నీకు"

"మరో పదేళ్ళదాకా నో మ్యారేజ్"

"పదేళ్ళేం, ఇరవయ్యేళ్ళదాకా ఆగు. అప్పుడసలు చాలా బాగుంటుంది. రాస్కెల్ తన్నానంటే... అమ్మో, నీకు మోటార్ సైకిల్ కొనిస్తానంటున్నదెందుకు? అదెక్కి జల్సాగా తిరుగుతూ ఏ అమ్మాయికో లైను కలుపుతావన్రా"





చటుక్కున రాణి గుర్తొచ్చింది రాజుకు.

"అమ్మాయిలంతా స్కూటర్లూ, మోటార్‌సైకిళ్ళూ చూసి వెంటబడుతున్నారనుకుంటున్నావా డాడీ? ఇది మీ కాలం కాదు. ఇప్పుడు అమ్మాయిలు చాలా తెలివిమీరిపోయారు. ఆస్తిపాస్తులూ, ఉద్యోగాలూ చూసిగానీ ప్రేమించటంలేదు"

"సరేరా, నీకంత తెలివితేటల్లేకపోతే నేనేంచేసేది. కష్టేఫలీ అన్నారోయ్. ఓ అమ్మాయిని వల్లో వేసుకోవటం అంత సులభం కూడా కాదురోయ్. దానికి బోల్డు తెలివితేటలుండాలి. బోల్డు కష్టపడాలి. అంత చేసినా ఒక్కోసారి మన కష్టమంతా వేస్టయిపోవచ్చు. అసలు నేను వయసులో వున్నప్పుడు ఓ అమ్మాయిని ప్రేమించాను"

"నువ్వా!"

"అవున్రా... ఇప్పుడంటే ముసలాణ్ణిగానీ వయసులో వున్నప్పుడు యిలా నీలాగా పప్పుసుద్ద మొహంకాదురోయ్ మనది. సరే, ప్రేమ సంగతి చెబుతున్నాను గదూ. మా కాలేజీలో ఓ అమ్మాయుంది. అచ్చం సావిత్రిలా వుండేది"

"సావిత్రా? ఆవిడెవరు మధ్యలో"

"అబ్బో! సావిత్రి గురించి ఎందుకడుగుతావురా. ఇప్పుడు మీరు శ్రీదేవీ, దివ్యభారతీ అంటారు చూడు, అప్పట్లో ఆ లెవలన్నమాట... నువ్వూరికే మధ్యలో అడ్డుతగలకు. ఆ అమ్మాయి నాన్న పేరు సుబ్రమణియన్. అయ్యో, అసలా అమ్మాయి పేరు చెప్పనేలేదు కదూ. నిర్మల. వాళ్ళ నాన్నపేరు తెలియగానే వాళ్ళు అరవ్వాళ్ళని అర్థమయింది. అసలు అంతకుముందే నాకు ఆ అమ్మాయి వాలకం చూస్తే అనుమానంగా వుండేది. బొట్టుకింద సన్నగా విభూది పెట్టుకునేది. సరే, యికా పిల్లను లవ్వు చేయాలని అందరికన్నా డిఫరెంట్ వేలో వెళ్ళాలని అనుకున్నాను. 'ముప్పైరోజుల్లో తమిళభాష' పుస్తకం కొని, నేర్చుకుని, ఆ తరువాత అరవ చందమామలూ, అరవ పత్రికలూ చదివి, అరవ సినిమాలు చూసి, మొత్తమ్మీద ఆరు నెలల్లో అరవం నేర్చుకున్నాన్రా. అంటే ఈ ఆర్నెల్లూ కాలేజీకి వెళ్ళలేదనికాదు. వెళుతూనే వున్నాను. ఆ అమ్మాయితో అందరిలాగా మాట్లాడుతూనే వున్నాను. అదికాక ఈ లాంగ్వేజ్ లెర్నింగ్ పార్ట్‌టైమన్నమాట. ఓ మాంఛిరోజున ఆ అమ్మాయి దగ్గరికెళ్ళి,

'నల్ల యిరికియా' అన్నాను.

ఆశ్చర్యంగా చూసి, 'నల్లా ఇరికేన్... మీకు తమిళం వచ్చా' అంది ఆశ్చర్యంగా.

వచ్చునన్నట్టుగా స్టైల్‌గా నవ్వాను, నాగేశ్వ్రావ్ స్టైల్లో.

'నాకుమాత్రం ఈ రెండు మాటలు తప్ప రాదండీ' అంది.

'అదేంటి, మీ మాతృభాష తమిళంకాదా'

'అవుననుకోండి... కానీ యిక్కడే పుట్టి, యిక్కడే పెరిగాంకదా. తమిళం నేర్చుకోలేదు. అవసరం కూడా రాలేదు'

-ఇక అప్పుడు నా మొహం చూడాల్సిందిరా నువ్వు... అదిరిపోయాననుకో'

ఆయనతోపాటు రాజు కూడా నవ్వాడు.

"ఒరేయ్, అన్నట్టు మరిచిపోయాను. ఇవాళ నేను బ్యాంకుకెళ్ళి పెన్షన్ తీసుకోవాలి. అట్నించటు ఓ తెలిసినాయన దగ్గరికెళ్ళివస్తాను. వెళ్ళి నీ హొండా ఎంతవుతుందో కనుక్కుందాం. అక్కడ ఫోరమ్‌దగ్గర పార్కుంది కదా. ఐదుకల్లా నేను పార్కుకొస్తాను. ఇద్దరమూ కలిసి షోరూంకెళదాం. నువ్వా పార్కులో తగలడు ఐదుకల్లా"

అంతసేపూ మోటార్‌సైకిల్ ప్రహసనమంతా వట్టిదే అనుకున్నాడు రాజు. అందుకే సరదాగా తనూ వాదించాడు. మహాలింగంకేం కావాలో అప్పుడర్థమయింది రాజుకు. ఆయనకు అస్తమానమూ చిలిపి తగాదాలూ, పోట్లాటలూ, వాదనలూ, అలకలూ, బతిమాలటాలూ, బతిమాలించుకోవటాలూ కావాలి. సందడి కావాలి. అలాంటివాడు ఒంటరిగా వుండటమంటే కష్టమేమరి.

నాలుగ్గంటలకు బయలుదేరాడు రాజు, యింట్లోంచి. పార్కుకెళ్ళటానికి యిరవై నిమిషాలకన్నా ఎక్కువవదు కానీ, పొరపాటున లేటయితే మహాలింగం అరుస్తాడు. ఆయనకు పంక్చువాలిటీ అంటే మహాయిష్టం. అందుకే తొందరగా బయలుదేరాడు రాజు.

★ ★ ★

పార్కులో రోజ్‌గార్డెన్ దగ్గర కూర్చునున్నారు, రాణీ, ఆమె స్నేహితురాళ్లూ.

"ఏమే, నిజంగా వస్తాడంటావా?" అంది మాధవి.

"ధైర్యముంటే వస్తాడు. కానీ వచ్చాడనుకో, చచ్చాడన్నమాటే"

"వాడేనంటావా?"

"ఖచ్చింతా వాడే. మొన్న కాలేజీలో కనిపిస్తే పొరపాటున నవ్వాను. అది అలుసుగా తీసుకుని లవ్‌లెటర్ రాసేశాడు ఏకంగా"

"లెటర్ తీసుకొచ్చావా" మరో అమ్మాయడిగింది.

"తెచ్చాను... ఏం?"

"అబ్బ చదవ్వే ఓసారి. ఏం రాశాడో చూద్దాం"

హ్యాండ్‌బ్యాగ్‌లోంచి ఉత్తరం తీసింది రాణి.

'మై స్వీట్ హార్ట్ రాణీ... సూటిగా, స్వీటుగా చెబుతున్నాను. ఐ లవ్‌యూ...'

"వావ్, ఎంత డేర్‌గా రాశాడే?"

"షటప్... సరే! విను! 'ఐ లవ్‌యూ రాణీ... ప్రేమకు కులమతాలూ, సిరిసంపదలూ, వయసులూ ఏవీ అడ్డంకాదు...'"

"వయసులేంటే? కొంపదీసి వీడెవడో ఎల్కేజీ కుర్రాడు కాదుగదా!"

"అబ్బ... ఆగవే, దాన్ని చదవనీ"

'మనిద్దరం కళ్ళూ కళ్ళూ చూసుకుంటూ, ఒళ్ళూ ఒళ్ళూ తగిలేలా కూచుని, మనసూ మనసూ కలుపుకుని మాట్లాడుకుందాం'

"అబ్బ,ఎవడయితేనేం, బ్రహ్మాండంగా రాశాడు ఐ లైక్‌హిమ్ వెరీమచ్"

"లైక్ కాకపోతే, లవ్వే చేసుకోగానీ, వినవే ముందు... నువ్వు చదువు రాణీ"

'కనుక, నువ్వు శుక్రవారంరోజున సాయంత్రం నాలుగున్నర గంటలకు లవర్స్ పార్కుకు రాగలవు. నీకోసం ఎదురుచూస్తుంటాను. ఇట్లు, నీ డ్రీమ్‌బాయ్, రాజా...'

"ఖచ్చితంగా ఆ మంకీబ్రాండ్‌గాడే"

"ఎవరే?"

"నీకు తెలీదు... మాధవి చూసింది రెండు సార్లు"

"అయ్యో, అతనా, మరి మంకీబ్రాండ్ అంటావేంటే. అచ్చం హిందీ సినిమా హీరోలా వున్నాడు"

"నేను హిందీ సినిమాలు చూడను. నీకు తెలుసుగదా"

"అందుకే అలా అంటున్నావు. యింతకూ మనమిప్పుడు ఏం చేయబోతున్నాం?"

"ఏముంది, నాలుగు దులిపెయ్యటమే"

"ఎందుకే దులిపెయ్యటం. నీకిష్టంలేకపోతే వదిలెయ్యి. పద పోదాం"

"అసలు అతనో కాదో తెలుసుకుందాం"

"తెలుసుకుని ఏం చేస్తావు... అవునూ, అంతలోనే 'వాడు' నుండి 'అతను'దాకా వచ్చావు. మొన్నేమో కాలేజీదగ్గర కనిపిస్తే నవ్వానన్నావు... ఇంతకీ ఆ లెటరొచ్చినప్పుడు నేను కూడా చూశాననేనా ఈ దొంగవేషాలు" కన్నుగీటి అడిగింది మాధవి.

"నీ మొహం, నోరు మూసుకో" చిరుకోపంగా అంది రాణి.

"ఐతే, అమ్మాయిగారికి ఓకేగానీ, స్టెప్‌బైస్టెప్ రాకుండా లాంగ్‌జంప్‌లో లవ్‌లెటర్ రాశాడనేకదా కోపం"

"షటప్" కసిరింది రాణి.

"అబ్బ, అనవసరంగా దులపటమూ, ఉతకటమూ కార్యక్రమాలెందుకే పార్కులో. పోనీ నీకంతగా కోపంగా వుంటే కాస్సేపు ఏడిపిద్దాం... ఓకే?"

"ఇదేదో బాగుందే రాణీ. లేదంటే ఆ తిట్టేదేదో నువ్వు తిట్టుకో. మేం వెళ్ళిపోతాం"

అయిష్టం నటిస్తూనే ఒప్పుకుంది రాణి. ఏంచేయాలో వాళ్ళు మాట్లాడుకుంటూండగా రోజ్‌గార్డెన్‌వైపొస్తున్న రాజు కనిపించాడు. అతన్ని అందరికీ చూపించింది.

ఇక్కడిలా వుండగా, రోజ్‌గార్డెన్‌కు పదిగజాల దూరంలో రాజారాం తదితరులు కూర్చుని ఆసక్తిగా రాణి బృందాన్ని పరిశీలిస్తున్నారు.

"మరి వెళ్ళవేంటోయ్ డ్రీమ్‌బాయ్" రాజారాంను వెక్కిరించాడు చలపతి.

"వెళ్ళడమేంట్రా. లవ్‌లెటర్ రాయటంలోని నా ప్రతిభ చూపించాను. అన్నమాట ప్రకారం నా లెటర్ మహత్యంతో ఆ పిల్లను




చెప్పిన సమయానికి, చెప్పిన చోటుకు రప్పించాను''

''కానీ ఒక్కర్తీ రాలేదు. కోతిమూకను వెంటే సుకొచ్చింది. కనుక వీపు విమానంమోత మోగించే కార్యక్రమమేదో వుందిగానీ నువ్వన్నట్టుకాదు''

''ఏదో ఒకటిలేరా... వాణ్ణి వదిలేయ్. వాళ్ళ తిప్పలు చూస్తూ కాస్సేపు సరదాగా కూచుందాం''

''ఒరేయ్... అటుచూడండ్రా... ఆ కుర్రాడెవడో, వాణ్ని ఏదో చేసేట్టున్నారు...''

''కొంపదీసి, నేను రాసిన లెటర్ వాడు రాశాడనుకున్నారేమో''

''ఓ ఐడియా... పాపం, ఆ కుర్రాడి బాధలకు మనమే కారణం గనుక వాణ్ణి మనం కాపాడుదాం''

''ఇందులో ఐడియా ఏముంది, నీ బొంద''

''అబ్బా, కాపాడిన తరువాత మనం వాడికి ట్రెయినింగిద్దాంరా''

''ట్రెయినింగ్ యివ్వటానికి యిదేమైనా యోగాసనాలు అనుకుంటున్నావా''

''ముందు పదండ్రా బాబూ'' అందరూ లేచి అటుగా నడిచారు.

అక్కడ రాజు పరిస్థితి అయోమయంగా, పిచ్చెక్కేట్టుగా వుంది. అసలు వాళ్ళంతా ఎవరో, తనను ఎందుకలా అంటున్నారో అర్థంకాలేదు.

రాణి బృందంలోని జలజొచ్చింది ముందుగా లెటర్ తీసుకుని. ఆ లెటర్ రాసింది తాను కాదు కనుక రాజుకు ఆ అమ్మాయి పిచ్చిదేమోననిపించింది. అంతలో సంయుక్త వచ్చింది. వస్తూనే, 'ఆ అమ్మాయెవరు. నన్ను మరిచిపోయావా' అని మొదలెట్టింది. అంతలో మరో అమ్మాయి మరో రకంగా, యింకో అమ్మాయి యింకోరకంగా. ఆ తరువాత మాధవొచ్చింది. వస్తూనే ఏడుపుమొహం పెట్టుకుంది.

''నువ్విలాంటివాడివనుకోలేదు. నెలరోజులుగా నా మొహం చూడకపోతే, ఊరికెళ్ళావనుకున్నాను. మా అమ్మానాన్నేమో పెళ్ళికి తొందరపెడుతున్నారు. నాకన్నా వీళ్ళు అందంగా వుంటే వాళ్ళతోనే తిరుగు. కానీ పెళ్ళిమాత్రం నన్ను చేసుకోకపోతే నాకు చావు తప్ప గత్యంతరం లేదు రాజా''

మరీ ఆ ఓవర్ యాక్షన్ చూడటంతో వాళ్ళంతా ఎందుకో తనను ఆటపట్టించటానికి చూస్తున్నారని అర్థమయింది రాజుకు. లేచి నిలుచుని సీరియస్‌గా చెప్పాడు-

''ఇక చాలు ఆపేయండీ. ఇంతసేపూ నాకు తికమకగా వుందిగానీ యిప్పుడర్థమయింది. టైంపాస్‌కోసం చేశామంటే సరే, కూచోండి. కాస్సేపు సరదాగా మాట్లాడుకుందాం. లేదంటే వెళ్ళిపొండి. ఇంకా ఓవర్‌యాక్షన్ చేశారంటే బాగుండదు''

అప్పుడొచ్చింది రాణి. ఆమెను చూడగానే రాజు ముఖంలో ఫీలింగ్స్ మారిపోయాయి.

''ఎందుకు బావుండదు. నువ్వు నాకు లవ్ లెటర్ రాయటం బావుంటుందా?''

''నేను, నీకు లవ్‌లెటర్ రాశానా? నాకసలు నీ పేరు కూడా తెలీదు''

''అబ్బ, తెలీకుండానే 'రాణీ' అని రాశావా? సరే, నీ పేరేంటి చెప్పు?''

''రాజు''

''మరింకేం... ఆ లెటరియ్యావే.... చూసుకుంటాడు''

లెటర్ యిచ్చింది జలజ. దాన్ని తీసుకుని కింద సంతకం చూశాడు.

''ఇక్కడ 'రాజా' అనుంది. నాపేరు రాజు. ఈ రైటింగు కూడా నాదికాదు''

'''జా'కూ, 'జు'కూ పెద్ద తేడా ఏముందనీ''

''ఏంటమ్మా గొడవ? ఏంటయ్యా, ఏంటీ, ఆడపిల్లల్ని అల్లరిపెట్టొచ్చా'' పెద్దమనిషి తరహాలో అన్నాడు అటొచ్చిన రాజారాం.

అతనితోపాటు చలపతి, థామస్‌లు కూడా వున్నారు.

''నేను కాదు సార్. వీళ్లే నన్నల్లరిపెడుతున్నారు''

''ఈ లెటర్ సంగతి తెలీకపోతే పార్కుకెందుకొచ్చావ్ మరి?'' అంది రాణి.

''నీకు లెటర్ రాస్తేనే పార్కుకు రావాలా ఏంటి? ఇదిగో ఈ తాతగారు కూడా పార్కుకొచ్చారు. ఇంకా ఆయనంతటాయనే నిన్ను పల



కరించాడు. ఆయనే రాశాడంటావా?''

గతుక్కుమన్నాడు రాజారాం. సర్దుకుని వాళ్లు చెప్పేదంతా విన్నాడు తనకు ఏమీ తెలీనట్టు. చివరకు చెప్పాడు-

''తనా లెటర్ రాయలేదని ఆ కుర్రాడంటున్నాడు. ఓసారి ఆ కుర్రాడి చేతిరాత చూస్తే సరి. ఏమోయ్ నువ్వు రెడీయేనా?''

''దొంగను పరీక్షించినట్టు ఏమిటండీ యిది?''

''నువ్వొప్పుకోకపోతే, అది రాసింది నువ్వేనని అనుకోవాల్సి వస్తుందయ్యా... ఒప్పుకో'' నలహాయిచ్చాడు థామస్.

''సరే... కానీ నా రైటింగ్ కాదని తెలీగానే 'సారీ' చెప్పాలి'' రాణివంక చూస్తూ చెప్పాడు రాజు.

''ముందు రాయి, అప్పుడు చూద్దాం'' అంది రాణి.

''ఏం రాయమంటారు?'' చలపతిని అడిగాడు రాజు.

''వేరేదేదో రాస్తే ఎలా. ఆ ఉత్తరంలో వున్నదే రాయి. ఆ ఏంటదీ... మై స్వీట్ హార్ట్ రాణీ, ఐ లవ్‌యూ...'' చెప్పాడు చలపతి.

అదే కాగితంలో పక్కన రాశాడు రాజు. తను రాసింది అందిస్తూ అన్నాడు-

''అసలీ కోతిరాత నాదెలా అవుతుంది సార్, చూడండి నా రైటింగ్''

రాజువంక కొరకొరా చూశాడు రాజారాం, తన రాతను కోతిరాతన్నందుకు. ఆ ఉత్తరం రాజు రాసింది కాదని తేలిపోయింది. ఎవరూ అడక్కుండానే సిన్సియర్‌గా చెప్పింది రాణి-

''సారీ''

వెంటనే రాజు మనసు కరిగిపోయింది.

''ఛ...ఛ... కోపంలో అన్నానుగానీ నీ తప్పు మాత్రం ఏముంది?''

మదనుడు రాణి కళ్ళల్లో కాపురంపెట్టేసి, రెండు చూపుల బాణాలు విసిరాడు. అవి సూటిగా వెళ్ళి రాజు గుండెల్లో గుచ్చుకున్నాయి.

''మా తప్పు కూడా లేదు బ్రదర్. ఏదో స్నేహితురాలిని ఆదుకుందామని చేశాం'' చెప్పింది మాధవి.

''మరి మనం వెళ్ళిపోదామా, కాసేపిక్కడే వుందామా'' అడిగింది జలజ.

తడబడింది రాణి జవాబు చెప్పటానికి.

''ఇక్కడెందుకూ వెళ్ళిపోదాం'' రాజువైపు తిరిగింది. ఈసారి ఆమె కళ్ళల్లో దూరిన మన్మధుడు బాణాలు వదిలేసి, గాలం పట్టుకున్నాడు- ''బై, సీయూ'' - గిరుక్కున వెనుతిరిగింది రాణి.

అమ్మాయిలంతా వెళ్ళిపోయారు. మన్మధుడేసిన గాలానికి చిక్కుకుని రాజు మనసు, రాణితోపాటే వెళ్ళిపోయింది. మనసు దోచుకున్న దొంగలా ఆ అమ్మాయి వెళ్ళిపోతుంటే మనసుపోగొట్టుకున్న రాజు బండరాయిలా నిలుచుండిపోయాడు. అమ్మాయిలంతా కనుమరుగైపోగానే రాజుతోపాటు కూర్చుండిపోయారు ముగ్గురుమూర్తులూ.

''ఇంతకీ ఆ లవ్‌లెటర్ నువ్వు రాయలేదా?''

''లేదండీ... నా రైటింగ్ కూడా చూశారు కదా''

''రైటింగ్‌దేముందిలే, ఎడంచేత్తో రాయొచ్చు''

''అంతవసరం ఏముందండీ... ఐనా నేనే రాయాలనుకుంటే, అంత దరిద్రంగా రాయను. ఆచార్య ఆత్రేయ లెవల్లో రాస్తాను''

''ఆ లెటర్‌లోని రాతనూ, భావాలనూ అంతయిదిగా తిట్టకయ్యా. అది రాసింది నేనే'' అన్నాడు రాజారాం.

''మీరా!'' ఆశ్చర్యపోయాడు రాజు.

''ఔనయ్యా... లవ్‌లెటర్లు రాసి చాలాకాలమయింది. మనలో యింకా ఆ టాలెంట్ వుందా, లేదా అని చూసుకుందామని చిన్న ట్రయల్ వేశాను... అంతే''

''మీరు, యిలాంటి అల్లరి పనులు చేస్తారా?''

''వృద్ధాప్యమంటే మళ్ళీ వచ్చిన బాల్యం అన్నారోయ్... తెలీదా. మరి అల్లరిపనులు చిన్నపిల్లలుకాక ఎవరు చేస్తారు?'' అందుకున్నాడు చలపతి.

''ఔనుగానీ, ఎందుకసలు అలా చే





యటం?''

''హోమ్ ఫర్ ఏజ్‌డ్‌లో పొద్దున లేచింది మొదలు చీకటి పడేవరకూ ఏం చేయాలో తోచదు. చీకటి పడినా పదీ, పదకొండుదాకా నిద్రపట్టదు. ఏంచేయమంటావు మరి?''

''అంటే హోమ్ ఫర్ ఏజ్‌డ్‌లో వుండేవాళ్ళంతా మీలాగే వుంటారా?''

''ఎందుకుంటారు... అందరూ మునలిపీనుగులు, చవట సన్నాసులు. పుస్తకాలు చదువుకుంటూ, తోటపని చేసుకుంటూ, రేడియో వింటూ, టీవీ చూస్తూ రకరకాలుగా గడుపుతుంటారు. అసలు మాదగ్గర వెంకట్రావ్ అని ఒకడున్నాడు. ఇప్పుడు బియ్యే పరీక్ష రాస్తాట్ట. అస్తమానమూ పుస్తకాలు చదువుకుంటాడు. రాసి ఏం సాధిస్తాడో తెలీదు''

''ఏదో ఆడవాళ్ళంటే కుట్లూ, అల్లికలూ చేసుకుంటూ గడుపుతారు. మాదగ్గర ఒకావిడుంది, రుక్మిణని. పెయింటింగులు చేస్తుంది. భలే వుంటాయిలే ఆవిడేసే బొమ్మలు. మరిక మేమున్నామంటే చదువుదామంటే కళ్ళు లాగుతాయి. రేడియో విందామంటే తలనొప్పి. ఏవైనా పనులు ఈ వయసులో ఏం నేర్చుకోగలం చెప్పు. అందుకే పొద్దస్తమానమూ మాలో మేము తన్నుకుచస్తుంటాం. నీలాగా ఎవరైనా దొరికితే ఇదిగో యిలా మాట్లాడుతూ కూచుంటాం. అలా ఏమీ తోచనప్పుడల్లా యిలాంటి కోతిపనులు చేస్తే బలే సరదాగా వుంటుంది. ఆ తరువాత తలుచుకుని, తలుచుకుని ఓ వారంరోజులైనా నవ్వుకోవచ్చు''

''ఏదో కాలేజీల్లో, మాలాంటి కుర్రాళ్ళు అల్లరిపనులు చేస్తారని తెలుసు. కానీ మీరు చెబుతుంటే నాకు సరదాగా, గమ్మత్తుగా అనిపిస్తూంది''

'''కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులూ' - అన్నాడోయ్ శ్రీశ్రీ. కానీ కొంతమంది మాలాంటివాళ్ళు చచ్చేదాకా యువకులేమరి'' చెప్పాడు చలపతి.

''అదీగాక నీక్కూడా గమ్మత్తుగా వుందంటున్నావా. కనుక మాకు యింకా ఎంత గమ్మత్తుగా వుంటుందో ఆలోచించు''

''కానీ ఎవరో ఒకర్ని ఏడిపించటమంటే పాపం కదండీ''

''మరేం చేయమంటావయ్యా. అయినా ఎదుటివాడి బాధలోనుండే హాస్యం పుడుతుందని ఎవరో అన్నారులే. నాకు గుర్తుంది కూడాను. ఏమీ తోచిచావదు. నువ్విలా మాట్లాడుతున్నావు గనుక సరిపోయింది. రోజూ ఇలా ఎవరు దొరుకుతారు చెప్పు. ఆదివారాలంటే ఓ పూటంతా సుధొస్తుంది గనుక సరిపోతుంది. ఇలాంటి పిల్లలంతా సోషల్ వర్క్‌లాగా రోజుకో ఇద్దరు ముగ్గురు మా ఆశ్రమానికొచ్చి మాతో వుంటే ఎంత బావుంటుంది. కానీ సుధలాంటి పిల్లలు ఎక్కడున్నారయ్యా ఈ కాలంలో'' నిట్టూర్చాడు.

''సుధంటే, వుమెన్స్ కాలేజీలో బియ్యే ఫస్టియర్ చేస్తోంది. ఆ అమ్మాయా?'' అడిగాడు రాజు.

''అవును! నీకెలా తెలుసు?''

''మా డాడీ పరిచయం చేశాడు''

''మీ డాడీయా. అవునూ మీ డాడీ ఎవరు, ఏం చేస్తుంటాడు?''

''మహాలింగంగారు. రిటైర్డ్ మేజర్''

''ఒరి, ఒరి, మా మహాలింగంగాడి కొడుకువా నువ్వు?''

''మా డాడీ మీకు తెలుసా?''

''తెలుసేంటి, చిన్నప్పుడు ఇద్దరం గోళీలాడుకునేవాళ్లం. ఓసారి హోమ్ ఫర్ ఏజ్‌డ్‌లో చేరతాననొచ్చాడు వెధవ. మళ్లీ ఒక్కసారే కనిపించాడు. ఏం చేస్తున్నాడు?''

''ఇక్కడే నిలుచున్నానోయ్. నువ్వు అబద్ధాలు చెప్పటం ఇంకా మానలేదన్నమాట''

మహాలింగం గొంతువిని అందరూ అటు చూశారు. వాళ్ల పక్కనే కూచుండిపోయాడు ఆయన మాట్లాడుతూ.

''ఎప్పుడొచ్చి నిలుచున్నావురా. అసలేమైపోయావ్? రెణ్నెల్లయింది కనిపించక... పోయావేమోననుకున్నాను నేను''

''నేనెందుకు పోతాన్రా నీకన్నా ముందుగా. అవునూ వీడు మీకెలా తెలుసు? ఏంటీ వాణ్ణి చంపుతున్నారు అప్పట్నించీ''

''అదేంలేదు డాడీ. ఒక్కణ్ణే కూచుంటే బోర్ కొడుతుందిగదా. వీళ్ళతో మాట్లాడుతూ కూచు

న్నాను''

అందరినీ ఇంటికి తీసికెళ్లాడు మహాలింగం. ఎనిమిదిదాకా కూచుని వెళ్ళిపోయారు ముగ్గురూ. వాళ్ళున్నంతసేపూ ఇల్లంతా మహా సందడిగా వుంది. రాజునసలు పట్టించుకోలేదు మహాలింగం అంతసేపూ. నలుగురు వృద్ధులు కలిసి అంత సరదాగా వుండటం చూసి, చాలా తమాషాగా అనిపించింది రాజుకు. తరచుగా వాళ్లను పిలవటమో, తండ్రినే అక్కడికి తీసుకుపోవటమో చెయ్యాలనుకున్నాడు. 'హోమ్ ఫర్ ఏజ్డ్' అంటే 'అనాథ వృద్ధ శరణాలయం'. అదెలా వుంటుందో. అనాథాశ్రమంలో బిక్కు బిక్కుమనే పిల్లలుంటారు. మరి అనాథ వృద్ధుల శరణాలయంలో వున్న వాళ్లు వృద్ధులు. వాళ్లు ఎలా వుంటారో... ఓసారి చూడాలనిపించింది రాజుకు.



హోమ్ ఫర్ ఏజ్డ్ గేటుబైట మోటార్సైకిల్ దిగి, లోపలికి నడిచాడు రాజు. అప్పుడప్పుడే సూర్యుడు ఆకాశంలోకి ఎగబాకుతున్నాడు. ఇంకా ఎనిమిదవలేదు సమయం. రాజారాం బృందాన్ని ఆరోజు తమ ఇంటికి భోజనానికి పిలవటానికి వచ్చాడు రాజు, మహాలింగం కోరికమీద. అంతకుముందోసారి మహాలింగంతో కలిసి ఓ ఆదివారం రోజున అక్కడికొచ్చాడు రాజు. అప్పుడు సుధ కూడా వచ్చింది.

మొదటిసారి అక్కడికొచ్చినప్పుడు ఆ వాతావరణమంతా చాలా విచిత్రంగా కనిపించింది రాజుకు. విశాలమైన తోట, గేటునుండి ఇరవైగజాల దూరంలో ఓ భవనం, భవనం చుట్టూ వసారా వుంది. పాతకాలం భవనం అది. ఎవరో ధనవంతుడు విరాళంగా ఇచ్చాడు దాన్ని. లోపల చిన్న చిన్న గదులు. పాతకాలం భవనాల్లో అంత చిన్నగదులు సాధారణంగా కనిపించవు. ఒకప్పుడది సత్రంగా వుండేది. ఆ తరవాత రకరకాల చేతులు మారి హోమ్ ఫర్ ఏజ్డ్గా స్థిరపడిపోయింది.

చెట్ల నీడల్లోనూ, వసారాలోనూ కొందరు కూచున్నారు. కొందరు విశ్రాంతిగా కూర్చున్నారు. ఇంకా కొందరు నిద్ర లేచినట్టులేదు. మరికొందరు తమ తమ గదుల్లో వున్నారు. రాజారాం బృందాన్ని చూసి, అక్కడంతా సందడిగా వుంటుందని ఊహించుకున్న రాజు అంచనా తలకిందులయింది. తన అనాథాశ్రమంలో వున్నంత గోల కాదుకదా, చివరకు జైలు కూడా అంత నిశ్శబ్దంగా వుండదేమోననిపించింది.

మహాలింగం, రాజుల్ని గమనించిన వాళ్లంతా కుతూహలంగా చూశారు. ఎవరికోసమో వచ్చివుంటారు, ఎవరా అదృష్టవంతులు- అన్నట్టుగా వున్నాయి చాలామంది చూపులు. ఇన్ని రోజులకోసారని వాళ్ల దగ్గరికి ఠంచనుగా వచ్చేవాళ్లు దాదాపు ఎవ్వరూ లేరు. దేవుడితో సమానులని చిన్నప్పుడు భావించిన అడ్డాలనాటి బిడ్డలే, గడ్డాలనాడు వాళ్ల పాలిట శనిదేవతలు.

ఏ రెండు నెలలకో, మూడు నెలలకో ఎవరో ఒకరు వచ్చి పలకరించి వెళ్లిపోతారు. అంటితే ఆ వార్ధక్యం తమకూ అంటుకుంటుందన్నంత ఇదిగా అంటీముట్టనట్టు నాలుగు మాటలు మాట్లాడివెళ్ళిపోతుంటారు, అతిదగ్గరి బంధువులు. ఇక దూరపుబంధువుల్లాంటి వాళ్ళు వచ్చినప్పుడు మాత్రం ఓ పూట కూర్చుని మంచీ, చెడూ మాట్లాడి, వీలైతే భోజనం చేసి వెళుతుంటారు. అక్కడున్నవాళ్ళు ఎన్ని కష్టాలు పడుతున్నా విని ఓదార్చటం తప్ప మరే బాధ్యతా వీళ్లకుండదు. చాలా కొద్దిమంది విషయంలో ఆ వచ్చేవాళ్లు వెంట ఏ పండో, ఫలమో తీసుకుని వస్తారు. లేదా ఏదో ఓ పనికొచ్చే వస్తువు కొనుక్కొస్తారు. ఆ ఆశ్రమంలో వున్న ఇద్దరే ఇద్దరికి వాళ్ల పిల్లలు ఠంచనుగా డబ్బులు పంపిస్తారు. ప్రతి పండక్కి గ్రీటింగ్ కార్డులూ, అప్పుడప్పుడూ చిన్న చిన్న వస్తువు

లూ పంపటంతోపాటు డబ్బులు కూడా పంపిస్తుంటారు. మరొకావిడకు ఇద్దరు కొడుకులు. చెరోనెలా డబ్బులు పంపాలని తీర్మానించుకున్నారు. అతను పంపాడనుకున్నానని ఇతనూ, ఇతను పంపాడనుకున్నానని అతనూ ఎవ్వరూ పంపకుండా వుండేవాళ్లు ఒక్కోసారి. శంకర్‌రెడ్డి ఉత్తరాలు రాసిన తరవాత ఆ నెలాఖరుకు ఎప్పుడో పంపిస్తుండేవాళ్లు. ఆశ్రమంలోంచి పంపేస్తారేమోనని ఆవిడ భయం. డబ్బులొచ్చేదాకా సరిగ్గా తిండి తినేదికాదు. నిద్రపోయేది కాదు. రోజూ పోస్ట్‌మాన్ రాగానే అడగటం, పంపలేదని తెలియగానే ఆదుర్దాపడటం, ఇలా వుండేదామె. డబ్బు ఎప్పుడో ఒకప్పుడు అందినా, శంకర్‌రెడ్డి ఏమీ అనకపోయినా, తనేదో పరాయివంచనపడి తింటున్నట్టుగా భావించుకునేదామె. చివరకు శంకర్‌రెడ్డి ఇద్దరికీ ఉత్తరాలు రాసి, నెలలు పంచుకోవటం కాకుండా ప్రతినెలా ఇద్దర్ని చెరిసగం సొమ్ము పంపించమని రాసేవరకూ ఆవిడ గతి అట్లాగేవుంది. ఎప్పుడో మనవడు రాసే ఉత్తరాలే తప్ప, ఆమెకు తనవాళ్లతో సంబంధాలే లేవు.

ఓసారి మరొకావిడ తమ్ముడొచ్చాడు ఆమెను చూడటానికి. ఆమె బాధ చూసి అప్పటికప్పుడు ఆమెను అక్కణ్ణించి తీసుకుపోయి తనతో వుంచుకున్నాడు. అంత అదృష్టవంతులు చాలా అరుదు.

ఏ పండగలో, పబ్బాలో వచ్చినప్పుడు కొందర్ని చూడటానికి వాళ్ల పిల్లలో, కోడళ్లో, మనవలో, ఎవరో ఒకరు వస్తుంటారు. చాలామంది అలా వచ్చినప్పుడు వాళ్ళను సినిమాకో, షికారుకో తీసుకుపోవటం, హోటల్లో భోజనం పెట్టించటం, ఓ స్వీటుబాక్సో, నాలుగు పళ్ళో, ఒకజత బట్టలో కొనివ్వటమో, పదో, పరకో చేతిలో పెట్టటమో చేస్తుంటారుగానీ, తమతోపాటు ఇంటికి తీసుకుపోయి నాలుగురోజులు వుంచుకునే ప్రతిపాదనలు మాత్రం చేయరు. అలా ఒకసారి తీసుకెళితే, మళ్ళీ ఇంట్లోంచి కదలనంటారేమోనని భయం.

నెలకూ, రెణ్ణెళ్లకూ ఓసారి వచ్చే ఉత్తరాలే వాళ్ళకు తమ వాళ్ళతో మిగిలిపోయే బంధం. వాటికోసమే కళ్లు కాయలు కాచేలా చూస్తుంటారు. చదువొచ్చిన వాళ్ళంతా తరచుగా ఉత్తరాలు రాస్తుంటారు గానీ వాళ్లకు బదులు అందటం అంత తరచుగా జరగదు. ఒంట్లో బాగా లేదని వాళ్ళు రాసినా, సీరియస్‌గా వుందని ఆశ్రమం తరఫున రాసినా, అది తగ్గిందని ఖచ్చితంగా నిర్ధారణయ్యేవరకూ ఎట్టి పరిస్థితుల్లోనూ రారు. ముక్కూ, మొహం తెలీని ఏ ఆఫీసు ప్యూనునో, ఏ స్నేహితుణ్ణో యదాలాపంగా చూసినట్టు చూడమని పంపుతుంటారు కొందరు.

అందుకే మహాలింగంతో రాజు మొదటిసారిగా అక్కడికి వెళ్ళినప్పుడు వాళ్ళిద్దరినీ కుతూహలంగా చూశారు అక్కడి వృద్ధులు.

ఆ తరవాత మహాలింగం తన మిత్రులతో కబుర్లు చెప్పుకుంటూ గడిపేయగా, సుధతోపాటు వాళ్లందరినీ చూస్తూ, సుధ చెప్పిన మాటలు విని అందులో కొందరి గురించి తెలుసుకుని నిస్సహాయంగా నిట్టూరుస్తూ గడిపాడు రాజు అక్కడున్నంతసేపూ.

తన మిత్రుల్ని రమ్మని చెప్పమని మహాలింగం పంపటంతో మళ్ళీ రెండోసారి వచ్చాడిప్పుడు. ముందుగా శంకర్‌రెడ్డి ఎదురయ్యాడు. ఆప్యాయంగా పలకరించి, మహాలింగం క్షేమసమాచారాలు కనుక్కున్నాడు. అంత కొడుకుండగా, మహాలింగం ఆశ్రమంలో చేరటానికొచ్చాడంటే, ఆ తప్పు ఈ కొడుకుదే అయి వుండాలనిపించిందాయనకు. అందుకే పెద్దరికంతో రెండు మంచి మాటలు చెప్పాడు.

"బాబూ, ముసలాణ్ణి. చాదస్తంతో చెబుతున్నాననుకోకు. మాతృదేవోభవ, పితృదేవోభవ- అంటూ జన్మనిచ్చిన తల్లిదండ్రుల్ని పూజించమని చెప్పే సంస్కృతి మనది. ఏదైనా సంపాదించుకోగలం కానీ, అమ్మా, నాన్నలు ఒక్కసారి చచ్చిపోతే మళ్లీ వాళ్లను పొందలేమయ్యా. అదీగాక వయసుడిగిన వాళ్ళను పసిపావల్లా చూసుకుని ఆదరించటం మన కర్తవ్యం. మీ నాన్నను బాగా చూసుకో. అది నీ దగ్గర నేర్చుకుని, రేపు నీ పిల్లలూ నిన్ను బాగా చూసుకుంటారు"

ఆయనలా ఎందుకు చెప్పివుంటాడో అర్థమై, ఏమీ బదులివ్వకుండా మౌనంగా తలూపి, నమస్కారం చేసి అక్కణ్ణించి కదిలాడు రాజు.

ముగ్గురు మిత్రులూ బైటికెళ్ళినవాళ్ళు



# పరిణముత్యాలు

★ తప్పులు చేయకుండా ఉండటంలో కాదు- చేసిన ప్రతి తప్పును దిద్దుకోవడంలోనే ఉంది మనిషి నిజమైన గొప్పతనం.

— కన్ఫ్యూషియస్

★ మన తప్పుల గురించి ఎప్పుడూ మనల్ని మనమే మోసపుచ్చుకుంటాం. ఆఖరుకు వాటినే మన సద్గుణాలుగా భావిస్తాం.

— హేస్

★ మతం వంట ఇంట్లో ప్రవేశించింది. మన దేవుడు వంటపాత్రల్లో ప్రవేశించాడు. 'నేను పవిత్రుడను, నన్ను ముట్టకండి' వద్దకు వచ్చింది మన మతం. మరొక శతాబ్దంపాటు మన మతం ఇలాగే వుంటే మనమందరం పిచ్చాసుపత్రికి చేరవలసిందే.

— వివేకానంద

★ మతాలన్నీ గొప్పవే. వాటిలో దోషమేమీలేదు. ఉన్న దోషమంతా వాటిని అనుసరించే మానవులలో మాత్రమే ఉంది.

— గాంధీజీ

★ మతం కారణంగా మనుషులు క్రూరులైనప్పుడు అది ఉండేనేం, పోతేనేం?

— బెంజమిన్ ఫ్రాంక్లిన్

★ నీ హృదయం పవిత్రమైంది. అయితే నీవు చేసే పనులు మంచివై ఉంటాయి. నీవు మంచిపనులు చేసినప్పుడు నీ కుటుంబంలో శాంతి నెలకొని ఉంటుంది.

— చైనా సామెత

★ నేరస్థుడికి శిక్ష విధించడంలో ప్రయోజనం ఉండాలి. ఒక వ్యక్తికి ఉరిశిక్ష విధిస్తే దానివల్ల ఏం ప్రయోజనం లేదు.

— వాల్టేర్

★ వాడు నాబిడ్డ అని మాత్రమే ప్రేమిస్తున్నాను. కాని వాడు మంచివాడని మాత్రంకాదు.

— ఠాగూర్

★ కొత్తగా పుట్టే ప్రతి శిశువూ దేవుడు ఆశాజీవి అని నిరూపిస్తుంది.

— ఠాగూర్

★ సంసారంలో సుఖశాంతులకు పునాది భార్యపై నమ్మకం. ఆ నమ్మకం లేనివానికి ఎన్ని భోగభాగ్యాలున్నా సుఖంవుండదు.

— లాండర్

★ మనలోని మతతత్వం ఒకరినొకరు అసహ్యించుకునేలా చేస్తోందేకాని ఒకరినొకరు ప్రేమించుకొనేలా చెయ్యదు.

— స్విఫ్ట్

★ పోట్లాటలవల్ల, వాదప్రతివాదాలవల్ల ధర్మం అవగతమయ్యే వస్తువుకాదు.

— శరత్

సేకరణ: **సలబెల్లి శ్రీమన్నారాయణ**

ఇంకా తిరిగి రాలేదని తెలుసుకుని వాళ్లకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఐదునిమిషాల్లో వచ్చేశారు ముగ్గురూ.

"మీ లవర్ పిల్లతో ఏదో ప్రోగ్రాం వేసుకున్నావేమిటీ? మీ బాబునుండి తప్పించుకోవటానికి మమ్మల్ని వాడికంటగట్టి పోదామనా?" అడిగాడు చలపతి.

"లవర్ పిల్లా, ఎవరు?" ఆశ్చర్యపోయాడు రాజు.

"అబ్బా, తెలీనట్టు వేషాలు, వీడికన్ని అబ్బ బుద్ధులే వచ్చాయిరా. చిన్నప్పట్నించీ ఇంతే వెధవ"

అప్పుడు స్పురించింది రాజుకు. వాళ్ళు రాణి విషయం మాట్లాడుతున్నారని. కానీ రాణి విషయం వీళ్ళకెలా తెలుసు? ఆ సంఘటనేదో కాకతాళీయంగా జరిగిపోయిందనుకోవాలి గానీ, రాణి అంతకుముందే తనకు తెలుసునని వీళ్ళకు తెలియటానికి వీల్లేదుగదా.

లవ్‌లెటర్ సంఘటన జరిగిన తరవాత మరునాడే కనిపించింది రాణి బస్టాపులో. తనే పలకరించింది దగ్గరికొచ్చి.

"హలో"

"హలో" భయపడుతూనే అన్నాడు రాజు.

"నామీద మీకు కోపమేమీ లేదుకదా?"

"మీమీద నాకెందుకండీ కోపం!"

"నిన్న జరిగిందానికి అయామ్ వెరీ సారీ అండీ. నిజానికి మా ఫ్రెండ్స్ చేశారు అదంతా"

"ఫరవాలేదండీ. అందులో మీ తప్పు మాత్రం ఏముంది గనుక"

"ఏం చేస్తున్నారు మీరు?"

"ప్రైవేట్‌గా ఇంటర్ రాస్తున్నాను"

"అదేంటి, ప్రైవేటుగా ఎందుకు?"

"అదంతా చెప్పాలంటే పెద్దకథ"

"కథలంటే నాకు చాలా ఇష్టం" చిలిపిగా అంది రాణి.

నవ్వాడు రాజు৷

"కానీ బస్టాపులో కథలు చెప్పుకుంటే ఎలా?"

"అయితే ఈసారి కలిసినప్పుడు చెప్పాలి. మరి వస్తానండీ, బై"

"బై"

ఇంటివైపు దారితీసింది రాణి.

బస్టాపులో చెప్పటం వీలు కాదంటే ఈసారి కలిసినప్పుడు చెప్పాలనేసి వెళ్ళిపోయింది. అంటే దానివల్ల రెండు విషయాలు తెలుస్తున్నాయి. ఒకటి మళ్ళీ కలుస్తాననే హామీ. రెండోది ఈసారి కలిసినప్పుడు ఎక్కువసేపు మాట్లాడుకోవాలనే కోరిక. కనుక ఆ అమ్మాయి కూడా తన గురించి ఆలోచిస్తుందనుకోవచ్చు అనుకున్నాడు హుషారుగా.

కానీ రెండోసారి కూడా ఇద్దరూ బస్టాపులోనే కలుసుకున్నారు. ఈసారి రాణి కాలేజీకి వెళుతున్నప్పుడు.

మామూలు పలకరింపులైపోయాక అంది రాణి৷

"పొద్దస్తమానమూ ఇంట్లో కూచుని చదువుకోవటమేనా?" అప్పుడప్పుడూ అలా పార్కులకూ, సినిమాలకూ వెళ్ళటంలేదా?"

"మీలాగా నాకెక్కడ వీలవుతుంది చెప్పండి"

"మాకు మాత్రం ఎక్కడ వీలవుతుంది. ఏదో, శుక్రవారం లాస్ట్ పీరియడ్ వుండదు గనుక అలా పార్కుకెళ్ళి కాసేపు కూర్చుంటాం"

మరునాడు శుక్రవారం. పార్కులో కలుసుకుందామనేనా కవి హృదయం... మరి లాస్ట్ పీరియడ్ ఎప్పుడో ఎలా తెలుస్తుంది... కాలేజీ నాలుగింటికి అయిపోతుంది గనుక మూడుకల్లా పార్కుకు వెళితే సరి... మూడు గంటలకు పార్కుకెవరైనా వెళతారా! వెళ్లరు గనుకనే ఏకాంతంగా ఉంటుంది గనుకనే కాసేపు మాట్లాడుకోవచ్చని అయుంటుంది. ఏం మాట్లాడుతుంది. తనేం మాట్లాడాలి... ఆ రాత్రి రాజుకు నిద్రపట్టలేదు.

మరునాడు పార్కుకు వెళ్లాక ఎక్కడ కూర్చోవాలో అర్థం కాలేదు రాజుకు. కొద్దిసేపు ఆలోచించిన తరవాత మరో పార్కులో రోజ్‌గార్డెన్ దగ్గర జరిగిన లవ్‌లెటర్ సీన్ గుర్తు తెచ్చుకుని, ఆ పార్కులోని రోజ్ గార్డెన్ దగ్గర కూర్చున్నాడు. అటువైపుగా రాణి రావటం చూసి, 'తెలివైనదే' అనుకున్నాడు. అక్కడ

ఉన్న రాజుని చూసి 'చురుకైనవాడే' అనుకుంది రాణి.

అనుకోకుండా పార్కులో కలుసుకున్నట్టే పలకరించుకున్నారు ఒకరినొకరు. రాణి బియ్యే చదువుతోందని తెలుసుకున్న రాజు మనసు ఒక్కక్షణంపాటు బాధగా మూలిగింది. ఆమె తనకన్నా ఎక్కువ చదువుకుందని కాదు. అన్నీ బాగుంటే తను ఆమెకన్నా ఓ క్లాసు ఎక్కువుండేవాడనే ఆలోచనతో.

రాజు అనాథాశ్రమంలో పెరిగాడనీ, మహాలింగం అతని సొంత తండ్రి కాదనీ తెలుసుకుని రాణి చాలా ఆశ్చర్యపడింది. ఆశ్రమం గురించీ, అక్కడి పరిస్థితుల గురించీ అడిగింది. ఇద్దరూ అయిదున్నరదాకా కూర్చున్నారు. ఇంటిదారి పట్టిన తరవాత గేటుదాకా రాగానే సంశయిస్తూనే అడిగాడు రాజు౹

"నువ్వేమీ అనుకోనంటే... మోటార్‌సైకిల్ మీద లిఫ్ట్ ఇస్తాను"

"అనుకునేదేముంది. పద... వియార్ ఫ్రెండ్స్" క్షణం కూడా ఆలోచించకుండా అంది రాణి.

అంతసేపూ ఇద్దరూ ఒకరినొకరు తగలనైనా లేదు. 'ఐ లవ్ యూ', 'ఐ లైక్ యూ' లాంటివేమీ చెప్పుకోలేదు. స్నేహితుల్లాగా కబుర్లు చెప్పుకున్నారంతే.

రాజు మోటార్‌సైకిల్ స్టార్ట్ చేయగానే వెనక సీటుమీద కూర్చుంది రాణి. అతని భుజమ్మీద ఒకచెయ్యి వేసింది. మోటార్‌సైకిల్ ముందుకు పరిగెత్తింది.

తన భుజాన్ని అనుకునున్న ఆ చేతిని అందుకునే అదృష్టం తనకుందా అని ఆలోచిస్తూ, ట్రాఫిక్ మీదకు దృష్టి మరల్చాడు రాజు.

ఈ సంగతులేవీ వీళ్ళకు తెలియడానికి వీల్లేదే. కానీ ఎంతదాకా వచ్చిందని అడిగారు మరి. ఎందుకడిగివుంటారా అనుకుంటూ బదులేమీ ఇవ్వకుండా వుండిపోయాడు.

"పిలిచి ఇంటి భోజనం పెడతానంటే అందునా మహాలింగంగాడి దగ్గరికి ఎందుకు రాముగానీ నీ లవర్ సంగతేంటంటే మాట్లాడవేంట్రా బాబూ"

"భలేవారండీ. లవర్‌లేదు. ఏంలేదు. లెటర్ రాసింది మీరు. నన్ను అడుగుతారేంటి?"

"లెటర్ మూలంగానేకదా, ఆ అమ్మాయి నీకు కనిపించింది. అంతటితో వదిలేస్తాడా మూతిమీద మీసమున్న మగాడెవడైనా. అందునా, అంత తన్మయంగా చూస్తూ 'సారీ' చెప్పిన తరవాత. ఛఛ, మా ఆశలన్నీ నిరాశలు చేశావు"

"ఒకవేళ మళ్లీ కలుద్దామనుకునుంటాడు గానీ, ఆ పిల్ల ఆ పార్కుకు రాలేదేమోరా. నీకు ఇంటి అడ్రెస్ తెలుసుకదా, చెప్పి పుణ్యం కట్టుకో"

"నేను వెళతాను బాబాయ్" ఇబ్బందిగా చూస్తూ అన్నాడు రాజు.

"లాభం లేదురా. వీణ్ణి మన కృష్ణమూర్తిగాడే కాపాడాలి. పద, ప్రేమగీత నేర్చుకుందువుగాని"

బలవంతంగా కృష్ణమూర్తి గదివైపు తీసికెళ్లారు. తప్పనిసరిగా వాళ్ళ వెంట నడిచాడు రాజు.

"అర్జునా, ప్రేమను ఆయుధములు ఛేదింపజాలవు. అగ్ని దహించలేదు. నీరు తడిపివేయలేదు. గాలి ఆర్పివేయనూ సమర్థమైనది కాదు. ఈ ప్రకారముగా తెలిసుకొని నీవు సిగ్గుపడుట వదిలివేయుము- అనీ ప్రేమ పరబ్రహ్మయోగములంటూ వివరించ సమర్థుడు మా కృష్ణమూర్తి" అని చెప్పి కృష్ణమూర్తి గది దగ్గరకు రాగానే పద్యం అందుకున్నాడు చలపతి- "అదిగో ద్వారక, ఆలమందలవిగో... ఓ..."

"ఓ... ఓ బాగానే వుందిగానీ ఈ వెధవింకా లేచినట్లు లేదు. కిట్టిగా, ఒరేయ్ కిట్టిగా..." దబదబా తలుపులు బాదాడు థామస్.

"నాలుగురోజులు మార్నింగ్ వాక్‌కు వచ్చేసరికి అలుపొచ్చింది వెధవకి. వారంరోజుల్నుంచీ దుమ్మా కొడుతున్నాడు" కృష్ణమూర్తినుద్దేశించి తిడుతూ, తనూ పిలిచాడు రాజారాం- "కృష్ణమూర్తీ నాయనా కృష్ణా, ఒరేయ్ మూర్తీ, కుంభకర్ణా"

"కొంపదీసి తాళం లేదుగదా"

అందరూ గబుక్కున తాళంవైపు చూశారు. తాళం లేకపోవటంతో రెట్టించిన ఉత్సాహంతో




ద్విగుణీకృతమైన వినుగుతో పిలవసాగారు.

ఈలోగా ఆ గదికున్న కిటికీ తలుపు తెరిచి వుండటం చూసి, దాన్ని కొద్దిగా లోపలికి తోశాడు రాజు.

చేతులు పైకి చాచుకుని నగం మంచంమీదా, నగం గాలిలోనూ వేళ్ళాడుతూ అసహజమైన రీతిలో పడున్న కృష్ణమూర్తి కని పించాడు రాజుకు. మరుక్షణంలోనే అతను చనిపోయాడని అర్థమయింది.

ఆ విషయం ఎలా చెప్పాలని తటపటాయి స్తున్నంతలో రాజు భుజాలమీదినుంచి థామస్ తొంగిచూశాడు. అతని అరుపులతో ఒకరిద్దరు పరిగెత్తుకొచ్చారు. కాస్సేపటికి దాదాపు ఆశ్ర మంలోని వాళ్లంతా కృష్ణమూర్తి గదిముందు చేరారు. కరీం గెడ విరగ్గొట్టాడు. ఎవరో శంకర్‌రె డ్డికి ఫోన్ చేశారు.

కృష్ణమూర్తి శవాన్ని మంచంమీద సరిగా పడుకోబెట్టాడు రాజు. ఆ ప్రాణంలేని దేహంమీ దపడి భోరుమన్నారు ముగ్గురు మిత్రులూ-

"ముసలి పీనుగా, ముసలిపీనుగా అని తమాషాగా అన్నాన్రా, నిజంగానే పీనుగువైపో తావనుకోలేదురా" బావురుమన్నాడు రాజా రాం.

"డెబ్బయ్యేళ్లు దాటాయి. నన్ను తీసుకుపో కుండా నిన్ను తీసుకుపోయాడేంరా పాడుదేవు డు" జవాబులేని ప్రశ్నలడుగుతున్నాడు చల పతి.

ఆ దృశ్యం వర్ణించటానికి వీల్లేనిది. భోరున ఏడుస్తున్నవాళ్లు ముగ్గురేగానీ అందరి కళ్లల్లో నూ నీళ్ళు. మనసుల్లో బాధ. కష్టాలూ, కన్నీ ళ్ళూ లేని లోకాలకు తరలి వెళ్ళిపోయిన వాడి గురించి, ఇక కనిపించడని తెలిసి కళ్ళు కాలువలయ్యాయి.

కాస్సేపటికి రాజుకు సైగచేసి అతన్ని బైటికి తీసుకువెళ్లాడు థామస్.

"ఆఫీసు రిజిస్టర్‌లో కృష్ణమూర్తి కొడుకుల ఫోన్‌నెంబర్లుంటాయి. ఫోన్ చెయ్యి బాబూ"

ఆ ఇద్దరూ ఇంకా ఆఫీసులకు రాలేదు. మరో అరగంటకల్లా వచ్చేస్తారు. రాగానే చెబు తామన్నారు, ఆయా ఆఫీసుల్లో ఫోనులు రిసీవ్ చేసుకున్నవాళ్లు.

అంతలో. శంకర్‌రెడ్డి వచ్చాడు. సరాసరి కృష్ణమూర్తి గదిలోకి వెళ్లాడు.

"ఎలా జరిగింది, ఏమయింది?" ప్రశ్నించా డెవరినో.

"కాలం తీరింది. వెళ్లిపోయాడు. మంచంలో తీసుకునిపోకుండా సుఖంగా పోయాడు పుణ్యా త్ముడు"

"శవాన్ని హాల్లోకి మార్పించాడు కృష్ణమూర్తి. ఒకదీపం వెలిగించి తల దగ్గర పెట్టాడు థామస్. దేవుడి పూజకోసం గుచ్చిన పూల దండ ఎవరో ఇస్తే వేశారు. రాజారాంని, చలప తిని మాత్రం అక్కణ్ణించి ఎవ్వరూ కదిలించలే కపోయారు. వాళ్ల వేదనను ఆపలేకపోయారు.

"ఎప్పుడూ కుంభకర్ణుడు, కుంభకర్ణుడు అనేవాణ్ణి, పాపిష్టివాణ్ణి. ఇలా ఇక లేవకుండా దీర్ఘ నిద్రపోతున్నాడు చూడండి"

"ఎన్నడూలేంది ఓ నెలరోజుల్నుంచీ రోజూ పొద్దున్నే లేచి మాతోపాటు వాకింగ్‌కు రావటం మొదలెట్టాడు, ఓ వారంరోజుల్నించీ మళ్ళీ మానేశాడు. మామూలుగా అలిసిపోయాడు. నిద్రలేవటం లేదనుకున్నాంగానీ ఇంతలో ఇలా ముంచుకొస్తుందని అనుకోలేదు"

"నిన్న కూడా మామూలుగా వున్నాడు. సాయంత్రమంతా ఇద్దరం క్యారంబోర్డు ఆడు కున్నాం. ఈరోజు నేను ఫామ్‌లో లేను. రేపు మాత్రం నిన్ను తుక్కుకింద ఓడిస్తాన్రా, మూ లన కూచుని భోరున ఏడవాలి- అన్నాడు. ఇలా ఏడిపిస్తాడనుకోలేదు"

కృష్ణమూర్తి గురించి తలుచుకుని, తలుచు కుని బాధపడుతున్నారు రాజారాం, చల పతిలు.

థామస్ మాత్రం కాస్త నిబ్బరంగా కనిపిస్తు న్నాడు.

కృష్ణమూర్తిని అంతవరకూ చూడకపో యినా, వాళ్లందరితోపాటు తాను కూడా భోరున ఏడ్చేశాడు రాజు. థామస్ వచ్చి, భుజంతట్టి హెచ్చరించేవరకూ తాను ఏడుస్తున్నానన్న విషయం కూడా తెలీదు రాజుకు. రెండు మూడు నిమిషాల తరవాతగానీ తేరుకోలేకపో యారు.

"ఏమండీ, వాళ్ళబ్బాయిలకు మీరు ఫోన్‌చే శానన్నారుగదూ" థామస్‌ని కనుక్కున్నాడు



శంకర్‌రెడ్డి.

"ఆ చేయించాను. రాజు చేశాడు. ఆఫీసుకు రాగానే పంపిస్తామని చెప్పారట ఆఫీసులో వాళ్లు"

"ఇంతవరకూ రాలేదేంటి మరి. ఒకవేళ సెలవుగానీ పెట్టారేమో, ఆఫీసుకు రాకుండా" తనలోతనే అనుకున్నట్లుగా అన్నాడు శంకర్‌రెడ్డి. "మళ్ళీ ఓసారి చేసి చూస్తాను" అంటూ అక్కణ్ణించి కదిలాడు.

థామస్, రాజూ ఆయన వెంట వెళ్లారు.

"ఇంటి అడ్రెస్‌లుంటే ఇవ్వండి. నేను వెళ్ళొస్తాను" చెప్పాడు రాజు దారిలో.

"ముందుగా ఆఫీసులో కనుక్కుని చూద్దాం బాబూ... కరీం, వీళ్ళు రాలేదా"

"రాలేదు సార్. మిగతా ఏర్పాట్లన్నీ పూర్తికావస్తున్నాయి. ఓ గంటకల్లా అంతా రెడీ చేస్తారు" వివరించాడు కరీం, తను చేసిన ఏర్పాట్ల గురించి.

"ఇద్దరూ ఆఫీసులనుంచి బయలుదేరారట"- ఫోన్ ద్వారా తెలిశాక అన్నాడు శంకర్‌రెడ్డి- "బహుశా, ఇంటికెళ్ళి వాళ్ళ వాళ్ళను తీసుకొస్తూండి వుంటారు"

రాజారాం బృందాన్ని వదిలేస్తే మిగతావాళ్లల్లో ఇద్దరు, ముగ్గురికి తప్ప మిగతావాళ్లకు అంత పరిచయం లేదు కృష్ణమూర్తితో. కానీ ఎవ్వరూ ఆ పూట టిఫిన్లు చేయలేదు. శంకర్‌రెడ్డి ఎంతగా చెప్పినా ఎవ్వరూ తినలేదు. రెండు సంవత్సరాల క్రితం ఓ వృద్ధుడు చనిపోయినరోజున కూడా ఎవ్వరూ భోజనాలు చేయలేదు. అది గుర్తున్నప్పటికీ, వాళ్లందరి శారీరక పరిస్థితి దృష్ట్యా శంకర్‌రెడ్డి పేరు పేరునా చెప్పాడు. కానీ ఒక్కరూ ముద్ద ముట్టుకోలేదు. మళ్లీ కాఫీలు చేసివ్వమని వంటవాళ్లను పురమాయించాడు.

"ఇవాళ ఉప్మా చేశాను సార్. చాలామంది మొహం చిట్లిస్తారుగానీ, ఉప్మా అంటే ప్రాణంలా తినేవాడు సార్. తనూ తిన్లేదు. ఎవరూ తినకుండా చేశాడివాళ" కళ్లనీళ్లు పెట్టుకుని చెప్పాడు వంటతను.

బ్రాహ్మడొచ్చాడు. శవవాహకులొచ్చారు. పాడె సిద్ధం చేశారు. సుమారు పదకొండున్నర యింది. కానీ కృష్ణమూర్తి కొడుకులు రాలేదు.

రాజారాం, చలపతిలు కాఫీ కాదుగదా మంచినీళ్లు కూడా ముట్టుకోలేదు. శవం వున్నంతసేపూ, కళ్ళెదురుగా ఆత్మలేని దేహాన్ని కర్మసంచిక గేహాన్ని చూస్తూంటే గుండెకోత పెరుగుతూవుంటుంది తప్ప తగ్గదు. ఏంచేయాలో అర్థం కాలేదు శంకర్‌రెడ్డికి. మిగతా పనులన్నీ చేయమని పురమాయించాడు.

తను వెళ్లి చూసొస్తానని ఇద్దరి అడ్రెస్‌లూ తీసుకుని బయలుదేరాడు రాజు. ఆ పరిసరాలనుండి దూరంకాగానే రాజుకు గుర్తొచ్చిన మొట్టమొదటి విషయం మహాలింగం. బహుశా తనకోసం ఎదురు చూస్తుండివుంటాడు. వెళ్ళి విషయం చెప్పటం మంచిది. లేకపోతే ఆదుర్దా పడతాడు. కానీ కృష్ణమూర్తి కొడుకులు ఏమయ్యారో తెలుసుకోకుండా తన పని చూసుకోవటానికి మనస్కరించలేదు రాజుకి.

ఇద్దరూ కుటుంబసమేతంగా బయలుదేరి చాలా సేపయిందని పక్కిళ్ళవాళ్లు చెప్పారు. ఈపాటికి చేరుకుని వుంటారనుకుని, మహాలింగం ఇంటివైపు దారితీశాడు. కృష్ణమూర్తి మరణించాడనగానే తనూ రాజు వెంట బయలుదేరాడు మహాలింగం. తీరిగ్గా తండ్రి దగ్గరికి వెళ్ళి ఆయన్ని వెంటబెట్టుకుని తను హోమ్ ఫర్ ఏజ్‌డ్ ముందు దిగితే ఎంత అన్యాయంగా కనిపిస్తుందోనని లోలోపల బాధపడుతూ చేరుకున్నాడు. అతను వెళ్ళేసరికి వాళ్ళిద్దరూ రాలేదని తెలిసి ఆశ్చర్యపోయాడు.

"ఏం చేద్దామిప్పుడు?" అడిగాడొకాయన.

"ఇక్కడ ఏం ఖర్చులవుతాయో, ఏం ఇచ్చుకోవాల్సివస్తుందోనని ఇద్దరూ ముఖం చాటేసినట్లు కనిపిస్తోంది"

శంకర్‌రెడ్డి మాటలకు ఆశ్చర్యపోయాడు రాజు.

"ఏమో, ఏమైవుంటుందో. ఎంతైనా కన్న తండ్రి చనిపోయాడంటే రాకుండా వుంటారా ఎవరైనా"

రాజు మాటలకు థామస్‌లో ఆవేశం ముంచుకొచ్చింది-

"కన్న తల్లిదండ్రులు పెంచి పెద్దచేసేవరకే బాబూ. మా పిల్లలకేగానీ మామీద ప్రేమ వుంటే ఈ ఆశ్రమంలో దిక్కులేనివాళ్లుగా





ఇంతమందిమి ఎందుకు వడుంటామయ్యా. మనిషి మాంసం తినటానికేగానీ వనికొస్తే, వట్టిపోయిన గొడ్లను అమ్మినట్టు అమ్మా, నాన్న ల్ని కూడా కసాయికొట్లో అమ్ముకునేవాళ్లయ్యా ఈ పిల్లలు. వీళ్లకు తండ్రి చావు ఓ లెక్కా. అప్పుడో, ఇప్పుడో ఇచ్చే డబ్బులు కూడా మిగి లాయనీ బహుశా పార్టీ చేసుకుంటూవుంటారు ఇద్దరూ''

తాము చచ్చిపోయినప్పుడు తమ తమ పిల్లలు ఏంచేస్తారో, ఇలాగే తమని చూడటాని కి కూడా రారేమో, తమ శవాలను మున్సిపా లిటీ బండ్లోవేసి తీసుకుపోయి చెత్తకుప్పలతో పాటు తగలేస్తారేమో, తాము చచ్చిపోయామని ఒక్క కన్నీటి బొట్టయినా విడుస్తారో విడవరో, కర్మకాండ చేయకుండా, తలకొరివి పెట్టకుండా తమను పున్నామ నరకంలోకి తోస్తారేమో- ఇలా రకరకాల ఆలోచనలు కలిగాయి అక్కడున్న వాళ్లకు. బతుకేకాక చావు కూడా ఎంత భయంకరమైనదోనని అనిపించినాక, ఎంత తొందరగా ప్రాణంపోతే కష్టాలనుండి గట్టెక్కు తామా అని ఎదురుచూస్తున్నవాళ్లకు కూడా చావంటే మరింత భయం మొలకెత్తింది.

"కానీయండిక కానీయండి. కొడుకులు పుట్టగానే వంశాన్ని నిలబెట్టేవాడు వచ్చాడని సంతోషిస్తాం కానీ, శవాన్ని ఎత్తటానికి కూడా రారు కొడుకులు''

"తీరా అంతా అయిపోయాక వాళ్ళొస్తే నాకు మాటొస్తుందేమోనని చూస్తున్నాను'' చె ప్పాడు శంకర్‌రెడ్డి.

"ఏమిటండీ మాటొచ్చేది? ఆఫీసులో అడి గితే బయలుదేరారంటారు. ఇళ్ళ దగ్గరడిగితే బయలుదేరారంటారు. చెప్పటానికి వెళ్ళిన మనిషి తిరిగొచ్చాడు. ఇంతవరకూ అతీ గతీ లేరు. ఒక్కడంటే, దారిలో ఏమయిందో ఏమిటో అనుకోవచ్చు. ఇద్దరూ అంతే అంటే కూడబలు క్కుని ఆగిపోయారని అర్థమవటంలేదూ''

అరగంట సేపు తర్జన భర్జనలు జరిగిన తరవాత యిక లాభం లేదని శవయాత్రకు సన్నాహాలు ప్రారంభించారు. కొడుకుల కోసం ఎదురు చూస్తున్న కృష్ణమూర్తి శవాన్ని పాడె పైన పడుకోబెట్టారు.

ఏడ్చీ, ఏడ్చీ సొమ్మసిల్లి పోయినట్టున్న చల పతి, పాడెను పైకెత్తే సమయానికి దానిపైన పడి భోరుమన్నాడు. అందర్నీ పక్కకు నెట్టేస్తూ, గట్టిగా అరవసాగాడు

"వద్దు, నా కృష్ణమూర్తిగాణ్ని తీసుకుపోవద్దు. నేను తీసుకు పోనీయను, తీసుకుపోవద్దూ''

అందరికీ గుండెల్ని గానుగలో పెట్టి మెలితి ప్పి నలగ్గొట్టినట్టనిపించింది ఆ దృశ్యం చూ స్తుంటే. కృష్ణమూర్తి విషయం వదిలేసి, చలప తిని సముదాయించసాగారు. మహాలింగం అంతటి మనిషినీ చులాగ్గా నెట్టి పారేసి, పాడెమీద అడ్డంగా పడిపోయాడు చలపతి.

రెగ్యులర్‌గా ఆశ్రమంలోని పేషెంట్లను చూ డటానికొచ్చిన డాక్టర్, కృష్ణమూర్తి శవాన్ని తీసికెళ్ళేదాకా వుందామని వుండిపోయాడు. చలపతి హిస్టీరిక్‌గా మారటం గమనించి, అతనికి బలవంతంగా మత్తు యింజక్షనిచ్చా డు. చలపతిని లోపల పడుకోబెట్టించి, అతన్ని చూసుకోమని చెప్పాడు శంకర్‌రెడ్డి.

మహాలింగం, రాజు, శంకర్‌రెడ్డి, మరో ము గ్గురు శవవాహకులూ పట్టి, పాడెను లేవనెత్తా రు. రాజారాం నిప్పుకుండపట్టుకుని ముందు నడిచాడు. ఆశ్రమంలోని వాళ్ళంతా మరోసారి బావురుమన్నారు. కన్నీళ్ళు వరదలై పారాయి. కొంతమంది శవం వెంట బయలుదేరారు. ఓపికలేని వాళ్ళు ఆగని కన్నీళ్ళను తుడుచు కునే వృథా ప్రయత్నం చేస్తూ గేటు దగ్గరుండి పోయారు.

శవయాత్ర గేటుదాటుతుండగా వచ్చారు కృష్ణమూర్తి కొడుకులు సుదర్శన్, చక్రధర్‌లు. ఇద్దరూ ఒకే స్కూటర్‌పైన దిగి, "నాన్నా'' అనుకుంటూ ఎదురొచ్చారు.

ఎవరూ అడగకముందే చెప్పాడు చక్రధర్

"హఠాత్తుగా వదినకి బీపీ రావటంతో ఆసు పత్రికెళ్ళాం. ఇంత తొందరపడతారనుకోలే దు''

అదినిజం కాదని అందరికీ అర్థమయింది. కానీ ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఐదు నిమి షాల్లో నిప్పుకుండ సుదర్శన్ చేత పట్టుకోగా మళ్లీ మొదలయింది శవయాత్ర. ఆశ్రమానికి కిలోమీటరు దూరంలోనేవుంది శ్మశానం.

వాళ్ళు వెళ్ళేటప్పటికే అక్కడి ఏర్పాట్లన్నీ పూర్తి చేశాడు కరీం. పదినిమిషాల్లో కృష్ణమూర్తి



భౌతిక కాయం తనకు మూలమైన పంచభూతాల్లో కలిసిపోనారంభించింది. కాలిపోతున్న చితిని చూసి భోరుమన్న రాజారాంను పొదివి పట్టుకుని ఓదార్చాడు మహాలింగం.

రాజు మనసంతా వికలమైపోయింది. అసలు చావంటే ఏమిటి? చచ్చిపోయిన వాళ్ళు ఏమవుతారు? అసలెందుకు పుట్టాలి. ఎందుకు మరణించాలి? ఈ ప్రాణులన్నిటి చావు, పుట్టుకలకు కారణం ఎవ్వరు? దేవుడా? ఆయన ఎక్కడున్నాడు? ఎందుకిలా చేస్తున్నాడు? ప్రతిరోజూ కొన్ని కోట్ల ప్రాణుల్ని సృష్టించి, మరికొన్ని కోట్ల ప్రాణుల్ని నిర్జించి వాటిమధ్య బాధలూ, బంధాలూ, సుఖాలూ, దుఃఖాలూ, యివన్నీ ఎందుకిలా ఏర్పాటు చేయాలి... ప్రేమలూ, కోరికలూ, త్యాగాలూ, కష్టాలూ అని అనుకుంటాం. ఏదో చేయాలని ఆశపడతాం. ఏదో సాధించాలని తపన పడతాం. ఏవో లేవని కుంగిపోతాం. ఏదో గెలిచామని సంతోషిస్తాం. కానీ అవన్నీ చాలా తాత్కాలికమైనవేనని ఎందుకు తెలుసుకోము. మూణ్ణాళ్ళ ముచ్చట లాంటి ఈపాటి జీవితం కోసం ఎందుకింత తాపత్రయం. ఎందుకీ మోసాలూ, ద్వేషాలూ, ద్రోహాలూ, యుద్ధాలూ, మమకారాలూ, ఈర్ష్యలూ, అహంకారాలూ... అన్నీ వట్టిదే, ఏదీ శాశ్వతం కాదు. మనం చచ్చిపోవటంతోనే మనకూ, ఈ లోకానికీ రుణం తీరిపోతుంది. ఆ మాత్రానికి యింత శ్రమా, యింత ఆరాటం... అన్నీ వృధా... యిలా ఆలోచించసాగాడు రాజు. అదే శ్మశాన వైరాగ్యం.

కాస్సేపటికి సగం కాలిన కృష్ణమూర్తి చితిని కాటి కాపరికి వదిలిపెట్టి, అక్కణ్నించి తిరుగు ముఖం పట్టారందరూ. కాటి కాపరి చేతిలో యిరవై రూపాయలు పెట్టాడు శంకర్‌రెడ్డి. కృష్ణమూర్తి కొడుకులుకూడా వాళ్ళతో పాటే ఆశ్రమానికి బయలుదేరారు. తమ తండ్రి ఎలా చనిపోయాడు, వగైరా వివరాలు కనుక్కుంటారేమో, ఒకవేళ వాళ్ళు చెప్పిందే నిజమేమో అనుకున్నాడు శంకర్‌రెడ్డి.

మార్చి నెలకే ఎండలు మండిపోవటం మొదలెట్టాయి. సమయం సుమారుగా రెండు కావస్తూంది. ఎర్రటి ఎండలో ఆశ్రమానికి తిరిగి రాగానే చాలామంది నీరసంగా గదుల్లోకెళ్ళి పడకలపై నడుం వాల్చారు. కూర్చున్న వాళ్ళందరికీ వంటవాడు టీ తెచ్చిచ్చాడు. చలపతి ప్రశాంతంగా నిద్ర పోతుండటంతో అతన్ని లేపే ప్రయత్నం చేయకుండా వుండి పోయారందరూ. కృష్ణమూర్తి కొడుకులు కూడా టీ తీసుకున్నారు, ముందుగా నిరాకరించి. చావు పుట్టుకల గురించి ఒకటి, రెండు మాటలవగానే, హఠాత్తుగా అడిగాడు చక్రధర్

"మా నాన్న ఒంటి మీద ఓ గొలుసూ, ఓ వుంగరం వుండాలి. ఏమయ్యాయి?"

వాళ్ళు వెంటనే ఎందుకొచ్చారో అర్థమయింది శంకర్‌రెడ్డికి.

శుక్రగ్రహం మీది నుండి దిగిన వింత ప్రాణుల్ని చూసినట్టుగా చూశాడు రాజు, వాళ్ళ వైపు.

మౌనంగా లేచి, ఆఫీసుగదిలోకెళ్ళి, అవి తెచ్చిచ్చాడు శంకర్‌రెడ్డి. ఆత్రంగా పొట్లం విప్పి, చూసుకున్నారిద్దరూ.

"ఓసారి మా నాన్న గది తాళాలిస్తారా?"

"పొద్దున్న తలుపులు విరగ్గొట్టాం. తెరిచే వుంది గది"

"అయ్యయ్యో, తెరిచేవుందా... సామానులన్నీ భద్రంగా వుంటాయా?"

సూటిగా సుదర్శన్‌వైపు చూశాడు శంకర్‌రెడ్డి. వెంటనే కళ్ళు దించుకున్నాడతను. వీలైనంతమామూలుగా వుండటానికి ప్రయత్నిస్తూ చెప్పాడు శంకర్‌రెడ్డి

"ఆయన చచ్చిపోయాడన్న బాధనుండే ఎవరూ కోలుకోలేదింకా. గదిని దోచుకోవాలనే ఆలోచనెవరికీ వచ్చివుండదు, యిక్కడున్న వాళ్ళల్లో"

"అబ్బే, దోచుకుంటారని కాదు" వెకిలి నవ్వు నవ్వాడు సుదర్శన్.

కృష్ణమూర్తి చచ్చిపోయిన తరవాత ఆ లోగిట్లో వినిపించిన మొట్టమొదటి నవ్వది.

శుక్రగ్రహం నుండి దిగొచ్చిన ప్రాణి భయంకరంగా అరిచినట్టు వినిపించిందది రాజు చెవులకు.

"సామాన్లన్నీతీసికెళదామనీ, అనవసరంగా యిక్కడుంచితే మీకు యిబ్బంది కలుగుతుంది కదా"




''మీకు యిబ్బంది కలగకపోతే చాలు బాబూ.... కరీం, వీళ్ళకు గది చూపించు''

కరీం వెంట కృష్ణమూర్తి గదివైపు వెళ్ళారు యిద్దరన్నదమ్ములూ. వాళ్ళతోపాటు ఎవ్వరూ వెళ్ళలేదు. నాలుగైదు నిమిషాలకల్లా సుదర్శన్ బైటికొచ్చి స్కూటర్ మీద వెళ్ళి, ఆటోను వెంటబెట్టుకొచ్చాడు.

ఆసరికి చక్రధర్ గదిలోవున్న సామాన్లన్నీ సర్దేశాడు. టేబుల్ మీదున్న చిల్లరా, గూట్లోవున్న నోట్లూ, పర్సులో పెట్టుకుని, బ్యాంకు పాస్ బుక్ మాత్రం చేతిలో పట్టుకున్నాడు. కృష్ణమూర్తికి సంగీతమంటే ప్రాణం. అందుకని ఆయన ఓ వాక్మన్ కొనుక్కున్నాడు. ముందు రోజున దాన్నడిగి తీసుకున్నాడు చలపతి. అది తీసుకొచ్చి అందించాడు థామస్. తీసుకుని, ''థాంక్సండీ'' అన్నాడు చక్రధర్.

వస్తువులన్నీ తీసుకున్నట్లుగా ఓ ఫారం మీద యిద్దరి సంతకాలూ తీసుకున్నాడు శంకర్‌రెడ్డి.

''ఇవాళ ఖర్చు ఎంతయిందో ఏమిటో చెబితే రేపొచ్చి యిస్తామండీ'' సంతకం పెడుతూ అన్నాడు చక్రధర్.

''అవసరం లేదు బాబూ... మా నియమాల ప్రకారం ఎవ్వరూ లేనివాళ్ళకు పెట్టాల్సిన పరిమితిలోనే ఖర్చు పెట్టాం. మీరు తిరిగి యివ్వనవసరం లేదు''

సామాన్లన్నీ ఆటోలో ఎక్కించి చక్రధర్ ఆటోలో కూచున్నాడు, చివరిసారిగా మళ్లీ కన్నీళ్ళు తెచ్చుకుంటూ. తనూ కన్నీళ్లు తుడుచుకుంటూ స్కూటర్ స్టార్ట్ చేశాడు సుదర్శన్.

బరువెక్కిన గుండెలతో బయలుదేరారు రాజు, మహాలింగం.

దూరంగా గుళ్ళోంచి భగవద్గీత రికార్డు వినిపిస్తూంది.

''వాసాంసి జీర్ణాని యథావిహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయజీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ...

జీర్ణమైన పాత వస్త్రములను విడిచి మనుష్యుడు కొత్త వానినెట్లు ధరించుచున్నాడో, అట్లే దేహమును ధరించిన ఆత్మయునూ శిథిలములైన పాత శరీరములను వదిలి కొత్త శరీరమును ధరించుచున్నది''



''ఏం బాబూ, వారం పదిరోజులపైనే అయినట్టుంది. నువ్వురాక'' ఇడ్లీల కోసంవచ్చిన రాజును పలకరించింది అన్నపూర్ణమ్మ.

''ఏమీ లేదండీ, ఊరికే... అంతే'' అన్నాడు రాజు నిర్లిప్తంగా.

''ఏమీలేదా, లేక మొన్న మోటర్ సైకిల్ వెనకెక్కి వచ్చిన ఆ పచ్చకారు అమ్మాయి ఏమైనా అలిగిందా?'' నవ్వుతూ అన్నాడు విశ్వనాథం.

గతుక్కుమన్నాడు రాజు.

''మన కాలనీలోనే వుంటుందికదా, గుర్తుపట్టి లిఫ్ట్ అడిగితే దింపాను అంతే'' అనేసి పొట్లం తీసుకుని అక్కణ్నించి వెనుదిరిగాడు.

కృష్ణమూర్తి చనిపోయిన తరవాత శుక్రవారం రాణి కోసం పార్కుకు వెళ్లలేదు రాజు. అసలతనికి రాణి గుర్తు రాలేదు. కృష్ణమూర్తి చావుకన్నా ఎక్కువగా, ఆయన కొడుకుల ప్రవర్తన కదిలించింది రాజును. మరునాడు తనకు తనే వెళ్ళాడు హోమ్ ఫర్ ఏజ్డ్‌కు. ఆ ముగ్గురు మిత్రుల్లో తప్ప, మరెవరిలోనూ క్రితం రోజు సంఘటన ఛాయలు కనిపించలేదు. మళ్ళీ ఓ రెండు రోజుల తరవాత వెళ్ళాడు. శ్మశానంలో కృష్ణమూర్తి చితాభస్మం కూడా అతని కొడుకులు తీసుకుపోలేదని కాటికాపరి కబురు పెడితే, తాము తీసుకురావటానికి వెళుతున్నామని చెప్పారు. దగ్గర్లోవున్న నదిలో కలిపేసి వస్తామని అన్నారు వాళ్ళు. ఆరోజు

మళ్ళీ రాజుకు అదే ఆలోచనలు. తనలాంటి అనాథలు కన్న ప్రేమకోసం అలమటిస్తుంటే, తల్లితండ్రుల్ని అనాథలుగా వదిలేసే కొడుకులు ఎలా వున్నారీ లోకంలో...

అన్ని రోజుల్లో రాణి గుర్తురాకపోవటమేకాక, దారిలో కూడా ఎక్కడా ఎదురవలేదు. తన గురించి ఏమనుకుందో పాపం, ఆరోజు ఎంత సేపు ఎదురు చూసిందో. ఎన్ని రకాలుగా తిట్టుకుందో తనను. పరిపరి విధాలుగా ఆలోచిస్తూ యింటి దారి పట్టాడు.

రోజంతా రాణిని గురించిన ఆలోచనలే ఉక్కిరి బిక్కిరి చేశాయి. కాలేజీకి వెళదామనుకున్నాడు గానీ ఆమె స్నేహితురాళ్లు చూస్తే బావుండదనుకుని ఊరుకున్నాడు. రాణి కాలేజీ నుండి వచ్చే సమయానికి వెళ్ళి, తమ కాలనీలోని బస్టాపు దగ్గర నిలుచున్నాడు.

అరగంట తరవాత బస్సు దిగింది రాణి. దిగుతూనే అనుకోకుండా రాజువైపు చూసింది. వెంటనే పలకరింపుగా నవ్వాడు రాజు. గిరుక్కున ముఖం తిప్పుకుని, చకచకా నడిచివెళ్ళింది అక్కణ్ణించి. ఆమెతో పాటే వేగంగా అడుగులు వేసి, కంగారుగా పిలిచాడు.

''రాణీ''

చటుక్కున తలతిప్పి చురుకుగా చూసింది రాజువైపు. ఆ చూపులవేడికి తట్టుకోలేక అలాగే ఆగిపోయాడు రాజు. చకచకా వెళ్ళి పోతున్న రాణివైపు నిస్సహాయంగా చూస్తూ నిలుచుండిపోయాడు. ఆ రాత్రి చాలాసేపు నిద్రపట్టలేదు రాజుకు.

మరునాడు యింట్లో పనులన్నీ చకచకా ముగించుకుని మోటర్ సైకిల్ తీసుకుని బయలుదేరాడు. బస్టాపుకు ఐదారు గజాల దూరంలో ఆపి, దాన్ని రిపేరు చేస్తూ కూర్చున్నాడు. తన పక్కనించి వెళుతున్న రాణి వైపు దీనంగా చూశాడు గానీ అతనివైపు చూడకుండా వెళ్ళిపోయి బస్టాపులో నిలుచుంది రాణి. బస్సుకోసం అటు తిరిగి చూస్తూ, తన వైపు చూస్తుందేమో ననుకున్నాడు గానీ, బస్సుకోసం కూడా తలతిప్పలేదు రాణి. తనను అక్కడ చూసిందని అర్థమైపోయింది. రాణి బస్సెక్కగానే, మోటర్ సైకిల్ స్టార్ట్ చేసి, బస్సును అనుసరించాడు.

మరో స్టాపులో కాలేజీవుందనగా బస్సును ఓవర్ టేక్ చేసి, కాలేజీ గేటు దగ్గర, రోడ్డు కటువైపు నిలుచున్నాడు. అతనివైపు చూడకుండానే కాలేజీలోకి వెళ్ళిపోయింది రాణి. హతాశుడైపోయాడు. కాలేజీ విడిచిన తరవాత కూడా డిటో.

శుక్రవారం దాకా అదే డ్యూటీ చేశాడు రాజు. ఆరోజు పార్కుకు కూడా రాదని అనిపించసాగిందతనికి. రాణికి చాలా కోపం తెప్పించాడు తను. ఏం చేయాలి? ఎలా పరిష్కరించాలీ సమస్యను. రాణి స్నేహితురాళ్ళతో జరిగింది చెబితే... పరమ దరిద్రంగా వుంటుంది. పోనీ లెటర్ రాస్తే... అది మరెవరి చేతిలోనైనా పడితే... క్లాస్‌మేట్‌నని చెప్పుకుని నూటిగా యింటికి వెళితే, అక్కడ పోట్లాడలేదుకదా. ఏదో తంటాలు పడి జరిగింది చెప్పుకోవచ్చు. కానీ రాణి చదువుతున్నది వుమెన్స్ కాలేజీలో, తను క్లాస్‌మేట్‌నంటే నమ్ముతారా. పైగా ఆ యింటి వాతావరణం చూస్తే తనను బైటే నిలబెట్టి, గూర్ఖాలోపలికెళ్ళి పర్మిషన్ అడిగొచ్చే రకంలావుంది. ఛీ, తనకసలు బుద్ధిలేదు. లేకపోతే రాణిని మరిచి పోవటమేంటి? రకరకాలుగా ఆలోచిస్తూ పార్కులోకి అడుగుపెట్టాడు. ఎండమండిపోతూంది. పార్కులోకి జనమొచ్చే సమయం కాలేదు. గడియారం చూసుకున్నాడు. మూడు కావటానికి యింకా రెండు నిమిషాలుంది. తనిక్కడ పార్కులో ఎదురు చూస్తూ కూర్చుంటే, రాణి అట్నించటు యింటికి వెళ్లిపోతే? పోతే చేసేదేముంది గనుక. అప్పుడు ఆలోచించుకోవచ్చు, రేపు ఏం...

ఉలిక్కిపడ్డాడు రాజు. పార్కులో క్రితంసారి వాళ్ళిద్దరూ కూర్చున్న చోట తనకేసే చూస్తూ కూర్చునుంది రాణి. రాజు తనను గమనించగానే కోపంగా తలదించుకుంది. నెమ్మదిగా అడుగులేస్తూ రాణి వైపుగా నడిచాడు.

ఎదురుగా నిలుచుని, దీనంగా ముఖం పెట్టి చెప్పాడు

''సారీ''

మూతి తిప్పుకుని, ముఖం మరో వైపు తిప్పింది.

''ప్లీజ్, అసలేం జరిగిందో విను. తరవాత నీ యిష్టం''





"నేనేం వినను. నాకేం అవసరం లేదు"

"పోనీ, ఏం చేస్తే నీకోపం పోతుందో చెప్పు"

"నీ మీద కోపం తెచ్చుకోవటానికి నేనెవ ర్నని. ఆఫ్టరాల్ ఆయామే నోబడీ"

"రాణీ, ప్లీజ్"

"నాతో మాట్లాడకు, పో, వెళ్లిపో" జీరవో యింది రాణి గొంతు.

ఆమెను తానెంత బాధపెట్టాడో ఆ గొంతులో ధ్వనించిన ఆర్ద్రత విప్పి చెప్పిందతనికి. తన మీద తనకే కోపం వచ్చింది.

"నన్ను తిట్టు కావాలంటే. అంతేకానీ, నువ్వు నువ్వు ఏడవొద్దు"

"నేనేడిస్తే నీకేం" కళ్ళనిండా నుళ్ళు తిరి గిన నీళ్ళు గొంతును సరిగ్గా పెగలనీయలేదు.

ఏం చేయాలో అర్థం కాలేదు రాజుకు

"ఒక్కసారి నావైపు చూడు" నిస్సహాయంగా అన్నాడు.

"చూడను, ముందు పోయిక్కణ్నించి" ము క్కు ఎగబీల్చుకుంటూ అంది.

ఆమె అలా ఏడుస్తూంటే గుండెలో ముళ్లు గుచ్చినట్టుగా అనిపించింది రాజుకు. ఇక అలా ఊరికే నిలుచోలేకపోయాడు.

"రాణీ ప్లీజ్..." ఆమె భుజాల మీద చేతు లు వేసి తనవైపు తిప్పుకున్నాడు.

నిప్పుకణిక తాకిడికి కరిగిపోయిన హిమ తుషారంలా, మలయ మారుతం స్పర్శకు వర్షించే వాన మొయిలులా, హిమవత్సానువు ల్లోంచి వెల్లువెత్తిన గంగా, యమునల్లా కన్నీరు పొంగిపొరలిన కన్నుల కలువల ముఖ సరోవ రాన్ని తన చేతులతో పట్టుకున్న అతని అరచే తుల్లో దాచుకుని బావురుమంది. వెక్కివెక్కి కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్న రాణిని అరనిమిషం పాటు అలాగే పొదవి పట్టుకుని, యిక లాభం లేదని, ఆమె పక్కనే కూర్చుని, భుజమ్మీద చెయ్యివేసి గుండెలకు అదుముకున్నాడు ఆమె ముఖాన్ని. ఎగిసెగిసి పడుతున్న గుండెల తాకిడికి కదులుతున్న వీపును మరింత గాఢంగా అదిమి పట్టుకున్నాడు. కాస్సేపటికి చటుక్కున అతని దగ్గర్నించి జరి గింది దూరంగా.

ఇంకా ఆగని ఎక్కిళ్ళతో, ఎర్రబారిన ముక్కు ను ఎగబీలుస్తూ, ఆగుతూ, ఆగుతూ, అలక నిండిన కోపంతో అంది

"ఇప్పుడొచ్చి, సారీ అని చెబుతావా... ఆరోజు... ఆరోజు నీకోసం ఎదురు చూసి, ఎదురు చూసీ... ఎంతకూ రాకపోతే నీకే మైందో, మోటర్ సైకిల్ యాక్సిడెంట్ చేసుకు న్నావో, ఒంట్లో బాలేదో, ఎందుకు రాలేదో అని... ఎంత విలవిల్లాడిపోయానో తెలుసా... పోనీ మరునాడైనా కనిపిస్తావేమో, కారణం అడుగు దామనుకుంటే... మాయమైపోయావు... వచ్చి కనుక్కుందామంటే, మీ యిల్లు తెలియదు. ఒకరోజు, రెండు రోజులు, మూడు రోజులు... ఒక్కొక్క క్షణం లెక్క బెట్టుకుంటూ, నీకే మైందో, ఏ ఆపద కలిగిందో, ఏ జ్వరం వచ్చిందో, ఏ యాక్సిడెంట్ జరిగిందోనని... రకరకాలుగా ఆలోచించి ఎంత బాధపడ్డానో తెలుసా... పెద్దగొప్ప... ప్లీజ్ ఏడవకటః.. రోజూ రాత్రి నిద్రపట్టక, ఎవరికి చెప్పుకోవాలో తెలీక ఎంత కుళ్లి కుళ్ళి ఏడ్చానో తెలుసా... పో, నేనసలు నీతో మాట్లాడను" కోపంగా అటు తిరిగి కర్చీఫ్‌తో కళ్ళుతుడుచుకుంటూ కూచుంది.

రాణి మనసులో తను అంతగా పీఠం వేసుకుని కూచున్నానని తెలియని రాజుకు, తనేదో తప్పు చేస్తున్న ఫీలింగ్ కలిగింది. రాణికి అన్యాయం చేస్తున్నానేమో అని కూడా అనుకున్నాడు.

"రాణీ, మనిద్దరి పరిచయం జస్ట్ ఫ్రెండ్ షిప్ అని మాత్రమే అనుకున్నాను"

గబుక్కున రాజువైపు తిరిగింది, మళ్లీ కో పంగా చూసింది

"సిగ్గులేదూ అలా అనటానికి. జస్ట్ ఫ్రెండ్ షిప్‌కే కనిపించిన మగాడితోనల్లా మోటర్ సైకిల్ వెనకెక్కి తిరుగుతాననుకున్నావా"

తనడగ్గానే మోటర్ సైకిల్ వెనకెక్కి కూచు న్నప్పుడు, సిటీలో పెరిగింది కదా, ఫాస్ట్ గర్ల్ అనుకున్నాడుకానీ, అంత సెన్సిటివ్ అని అను కోలేదు రాజు.

"రాణీ, ఎందుకు నన్నంత యిదిగా ఊహించుకుంటున్నావు"

"నాకు బుద్ధీ, జ్ఞానం లేదు కనుక" ఆ

చెప్పిన ధోరణికి క్షణం పాటు నవ్వొచ్చింది రాజుకి. ఆ నవ్వును కనిపెట్టేసింది రాణి.

"అవును నీకు నవ్వులాటగానే వుంటుంది. ఒక్కసారి పలకరించగానే పార్కు కొచ్చేశాను. ఒక్కరోజు నువ్వు కనిపించలేదని ఏడ్చాను. నేను పిచ్చిదానిలా కనిపిస్తున్నాను కదూ నీకు"

"అవును రాణీ, నిజంగా నువ్వు పిచ్చిదానివే. లేకపోతే, లేకపోతే నీకు నా దగ్గర ఏం కనిపించింది? నీతో పోల్చుకోకపోయినా నాకు ఏం వుందని? కనీసం చదువులో కూడా నీకంటే తక్కువ వాణ్ని"

"ఐతే నువ్వు బియ్యే పూర్తి చేసేదాకా నేను ఫెయిలవుతూ వుంటాను చాలా?"

"అదే, ఎందుకని?"

"ఎందుకంటే నాకు తెలియదు. నువ్వు నాకు నచ్చావు. నువ్వంటే నాకిష్టం. ఏ మనిషిలోనూ కనిపించని నిజమైన మనిషి కనిపించాడు నాకు నీలో. ఆవేశంతో చెప్పటంలేదు. నీ కోసం పూరి గుడిసెకు రమ్మన్నా వస్తాను. నాకు డబ్బు, హోదా, ఆస్తులు, అంతస్తులూ ఏవీ వద్దు. నాకు ప్రేమ కావాలి"

"ప్రేమ నీకేం తక్కువయిందని"

"ప్రేమ నాకెప్పుడూ దొరకనేలేదు. మా మమ్మీ డాడీల ప్రేమంతా డబ్బుకే దక్కింది గానీ, అందులో చిల్లికానీకి దక్కినంత ప్రేమ కూడా నాకు దొరకలేదు. వాళ్ళకు కూతురు, ప్రేమ అనేవి కూడా స్టేటస్ కోసమే. కనీసం నాకో తమ్ముణ్నో చెల్లెల్నో ఐనా యివ్వకముందే యిద్దరూ హనీమూన్ మర్చిపోయి, మనీమూన్ లైపోయారు. నా పక్క గదిలోనే వుంటూ, నాకు అందని చందమామలైపోయారు.

పుట్టగానే ఆయా దగ్గర పాలు తాగాను. పనివాళ్ళ చేతుల్లో పెరిగాను. కుక్క పిల్లలతోనూ, గులాబి మొక్కలతోనూ గడిపాను తప్ప మనసు విప్పి మాట్లాడుకునేందుకు నాకు మనిషే దొరికేవాడుకాదు. డబ్బులో పుట్టి, డబ్బులో పెరిగి; దాన్నేపీలుస్తూ దాన్నే తింటూ నాకు డబ్బుమీద ఎలర్జీ పుట్టుకొచ్చింది. బొమ్మలు, పుస్తకాలూ, బ్యాంకు పాస్ బుక్కూ, కారూ ఏవీ నాకు సంతోషాన్ని కలిగించవు. మా అమ్మ నన్ను పలకరించటం వరం. మా నాన్ననాతో మాట్లాడితే పండగ. అసలు వాళ్ళిద్దరూ నాకు అమ్మా, నాన్నలు కారు, మమ్మీ, డాడీలు. వాళ్ళు నన్ను కన్నారా, లేక స్టేటస్ కోసం బొచ్చుకుక్కను కొనుక్కున్నట్టు కొనుక్కున్నారా అని పిస్తుంటుంది అప్పుడప్పుడూ"

"అమ్మా నాన్నలున్న వాళ్ళంతా ఎంత అదృష్టవంతులో అనుకునేవాణ్ణి యింతకాలమూ. కానీ అమ్మా నాన్నలు కాదన్న మాట కావలసింది, ఆదరణ, ప్రేమా కూడా కావాలి వాళ్ళ దగ్గర్నించి"

కాస్సేపు మౌనంగా వుండిపోయి మళ్ళీ చెప్పాడు రాజు

"నాకిప్పుడేమనిపిస్తూందో తెలుసా? భోరున ఏడవాలనిపిస్తూంది. నేన్నీకు న్యాయమే చేస్తానో, అన్యాయమే చేస్తానో తెలీదు. కానీ కానీ నా కోసం కంటతడిపెట్టే ఒక మనిషి ఈ లోకంలో వున్నదన్న సంతోషంతో నిజంగా భోరున ఏడవాలనిపిస్తూంది" ఆశువుగా రాబోతూన్న అశ్రువుల్ని కనుకొలుకుల్లోంచి బైటికి రానీకుండా ఆపుకున్నాడు.

నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే కదా వచ్చేది.

"మా డాడీ నాకిచ్చిన స్థానం వేరు. నువ్వు నాకిచ్చిన స్థానం వేరు. ఈ తృప్తితో యిలా చచ్చిపోతే చాలనిపిస్తూంది తెలుసా?"

"చంపేస్తాను అలా మాట్లాడితే" కోపంగా అంది రాణి, రాజు పెదాలను తన చేత్తో మూసేసి.

"లేపోతే, యిదంతా కలేమో. మళ్ళీ కళ్ళు తెరిస్తే మా డాడీగానీ, నువ్వుగానీ కనిపించకుండా మాయమైపోయి, బిక్కుబిక్కుమంటూ అనాథాశ్రమంలో వుంటానేమో అని భయమేస్తూంది"

"అవునూ, మీ డాడీని చూపించవా నాకు" మూడ్ మార్చటానికి అడిగింది రాణి.

అరగంట క్రితం బేలగా కన్నీళ్ళు పెట్టిందీ ఆ అమ్మాయే. ఐదు నిమిషాల క్రితం ఆనందంతో కన్నీళ్ళు తెప్పించ గలిగిందీ ఆ అమ్మాయే. అరక్షణంలో చలాకీగా మారిపోయి నవ్వులు చిందిస్తున్నదీ ఆ అమ్మాయే.

మట్టి ముట్టుకున్నాడని కోప్పడి, మరునిమిషంలో కడుపునిండా బువ్వపెట్టి, ఆటలాడించి





లాలించి, అలసిపోగానే జోకొట్టే అమ్మ ప్రతి అమ్మాయిలోనూ వుంటుంది. స్త్రీలో 'ఆడతనం' కన్నా 'అమ్మతనం' చూసుకోగలిగినప్పుడు మనసూ, బుద్ధీరెండూ వికసిస్తాయి. ఎందు కంటే మనిషి బుద్ధితో ఆలోచిస్తే అమ్మ మన సుతో ఆలోచిస్తుంది. ఆ మనసును గుర్తించ గలిగినప్పుడు మాలిన్యం లేని మానవత్వం సమాజమంతా పరిమళిస్తుంది. వయసులోవు న్న ఆడదైనా తన మనసులో స్థానం యిచ్చిన మగవాణ్ణి పసిపాపలాగే కనిపెట్టుకు నుంటుంది. ఓ సామ్రాజ్యం గెలుచుకోవ టంకంటే, ఓ స్త్రీ హృదయం గెలుచుకోవటం చాలా గొప్పది. అందుకే అశోకుడు, అలె గ్జాండర్ లాంటి చక్రవర్తుల కన్నా గొప్పవాడు యిప్పుడు ఈ రాజు.

★ ★ ★

"పెద్దవాణ్ణి చెబుతున్నాను, చాదస్తమను కోకు. మోటర్ సైకిల్ ప్రేమలూ ఒంటికి మంచివి కాదు" చెప్పాడు విశ్వనాథం.

"ఏదో కాసేపు కూచుందామనొస్తే పిల్లా ణ్నిలా నసపెట్టి, భయపెడతారేంటీ"

నవ్వాడు రాజు

"మీరనుకున్నంత యిదేమీ లేదండీ"

"అప్పుడింకా డేంజరు. టైంపాస్ కోసం అమ్మాయిల చుట్టూ తిరగటం మంచిది కాద య్యా బాబూ, అదేమైన బఠాణీలూ, మిరవ కాయ బజ్జీలూ తినటమా ఏంటీ?"

"మిరవకాయ బజ్జీలంటే గుర్తొచ్చింది, ఏదో కొత్త వ్యాపారం మొదలెడుతున్నామన్నారు. ఎక్కడి దాకా వచ్చింది?"

"నా వరకూ నా ప్రయత్నాలు బాగానే వున్నాయి. రిజిస్ట్రేషన్ కోసమనీ, దానికోసమనీ, దీని కోసమనీ ఆఫీసుల చుట్టూ తిరగటమే కొంచెం కష్టంగా వుంది. నలుగురు పనివాళ్ళ ను మాట్లాడి పెట్టాను. ఎండలు కూడా మొదల య్యాయి. వచ్చేవారం మొదలెడదామను కుంటున్నాను"

"ఇడ్లీలూ, మిరపకాయ బజ్జీలూ వేరు. ఇలాంటి వ్యాపారం వేరు. జాగ్రత్తగా వుండండి కాస్త"

"అన్నీ ఆలోచించి, దుకాణాల చుట్టూ తిరిగి, ఏవి ఎలా అమ్ముడవుతున్నదీ కను క్కుని, మార్కెట్లోవున్న ప్రతి అడ్డమైన బ్రాండు ను కూడా వదలకుండా అన్నీ కొనుక్కొచ్చి రుచిచూసీ, లెక్కలూ గట్రా వేసుకునే మొదలె ట్టాను"

"ఏదో ఆయన చెబుతున్నారుగానీ అనవస రంగా శ్రమపడి పెద్ద పనులు నెత్తినేసుకోవటం నాకు మాత్రం యిష్టం లేదు బాబూ"

"అన్నీ అమ్ముడవకపోతే ఎలా మాస్టారూ"

"ముందుగా రెండు, మూడు కాలనీలకు సరిపడేంత వరకే చేయిస్తున్నాను. మంచి కంపెనీలవి వంద గ్రాముల పాకెట్ ఐదు రూపాయలుంది. అందులో షాపువాడి కమీషన్ రూపాయి. మనవి పాకెట్ ఐదున్నర. షాపు వాడి కమీషన్ రూపాయిన్నర. అంటే వేరే కంపెనీల వాళ్ళకు లాభాలొస్తే మనకూ వస్తాయన్న మాట"

"షాపులవాళ్ళకు ఎందుకు కమీషన్ ఎక్కువ?"

నువ్విలా అడుగుతావని నాకు తెలుస య్యా. అందుకే సమాధానం కూడా రెడీగా వుంది. పిల్లాడు క్లిష్టమైన ప్రశ్న అడిగినప్పుడు సమాధానం వెంటనే చెప్పగలగాలి తల్లి.. సరే, నేనిప్పుడు అలాగే అన్వేషించిన పరిశోధనాంశాలన్నీ నీకు చెబుతున్నాను. మనది కొత్త బ్రాండ్. మనం ఎక్కువగా ప్ర చారం చేయలేము. అలాగని ప్రచారం అసలే చేయటం లేదనుకోకు. పోస్టర్లకూ, వాటికీ పది వేలు వేశాను. ఐనా సరే, మనవే జనం కొనుక్కో వాలి. అందుకు మనకు కావలసిన మరో రకమైన పబ్లిసిటీ దుకాణదారే. 'అమ్మా, కొత్త కంపెనీ. అర్ధ రూపాయెక్కువగానీ, చాలా బావు న్నాయి' అనీ 'సార్, మా యింట్లో వాడి చూశాను సార్, అందుకే మీకిస్తున్నాను. అన్యా యంగా మీకు అంటగడితే నాకొచ్చేదేముంది' అనో దుకాణదారు చెప్పాలంటే అతనికి మనం చూపించే అట్రాక్షన్ ఈ అదనపు అర్ధరూ పాయి...

ఇక మన ప్రొడక్టును మనం ఇరవై తొమ్మిదో తేదీన రిలీజ్ చేస్తున్నాం. జీతాలొచ్చే వారం. అందరికీ పుష్కలంగా డబ్బులుంటాయి. కనుక ఓ ఐదు రూపాయలు పెట్టి వడియాలో అప్పడాలో కొనుక్కోవటానికి వెనుకాడరు. ఒక

సారి కొన్నవాళ్ళు బావున్నాయనుకుంటేనే మన కంపెనీ నిలుస్తుంది గనుక బాగోలేకపోయే సమస్యేలేదు.

ఇక పోతే మనం విడుదల చేస్తున్నది కేవలం వందకిలోలే. అవీ నాలుగు వెరైటీలు. అంటే యాభై షాపులకు రకానికో ఐదు పాకెట్లు... ఆ మాత్రం కూడా అమ్ముడవకపోతే మనం వ్యాపారం చేయనవసరంలేదు. ఈలోగా మరో వందకిలోలు సిద్ధం చేసుకుంటాం. అన్నీ అమ్ముడయ్యాయా సరేసరి. లేదా ఏ హొటలు వాడికో హొల్ సేల్ రేట్‌లో అంటగట్టేయటమే. అదీగాక అప్పడాలూ, వడియాలూ అమ్ముడు పోవనే సమస్యేలేదు...

ఇక మనం అర్ధరూపాయి ఎక్కువ ధర వేస్తున్నది షాపువాడికియ్యటంకోసం కాదు, అసలుమాటకొస్తే మనం రెండోబ్యాచ్ విడుదలచేసే అవకాశమేవస్తే మూడోసారి కొత్త కాలనీలపైకి దండయాత్ర చేస్తాం. అప్పుడు అందరిలాగా, అంటే పెద్ద కంపెనీలలాగా ఫిఫ్టీ పర్సెంట్ కమీషన్ ఆఫర్ చేస్తాం. అంటే పాకెట్ మీద ఎనభై ఐదు పైసలు మాత్రమే యిస్తాం. అప్పటికే మన ప్రొడక్టుకు పేరొచ్చింది గనుక షాపువాళ్లు కళ్ళు మూసుకుని తీసుకుంటారు. ఇక ఈ ధర ఎక్కువ ఎందుకంటే, కొత్త ప్రోడక్టు అనేసరికి వెనకడుగు వేసేవాళ్ళల్లా, అర్థరూపాయి ఎక్కువనగానే చాలా మంచిదై వుంటుందనుకుని, మళ్ళీ ముందడుగేస్తారు. అలా మనం మునుముందుకు పోతాం...''

''మొత్తానికి గాలిలో మేడలు బాగానే కడుతున్నారు''

''కానీ మాస్టారూ, ఇన్ని ఆలోచనలు యింత కాలం ఏమయ్యాయి?''

''ఏమీ అవలేదు... వున్నాయి. కానీ నెసెసిటీ ఈజ్ మదరాఫ్ ఇన్వెన్షన్. అంటే అన్వేషణకు దారితీసేది అవసరం అని. ఇప్పుడు అవసరం కనుక అన్వేషించి పట్టుకుంటున్నాను''

''చాలా బావుంది మాస్టారూ, నా సహాయమేమైనా కావలిస్తే చెప్పండి... సంతోషంగా చేస్తాను''

''నిజానికి నీకే ఏమైనా సహాయం కావాలంటే చేస్తానయ్యా. సేల్స్ రిప్రజెంటేటివ్‌గానో, సేల్స్ బాయ్‌గానో చేరు. సెక్యూరిటీ డిపాజిట్ అడగకుండా, యింటర్వ్యూ లేకుండా ఉద్యోగమిస్తాను''

''చాల్లెండి, కుర్రాణ్ని మరీ అలా ఎగతాళి చేస్తారేంటి?''

మరికాస్సేపు కూర్చుని అక్కణ్నించి కదిలాడు రాజు. తన సహాయం అవసరంలేదన్నందుకుగానీ, కావాలంటే తానే ఉద్యోగమిచ్చి సహాయం చేస్తానన్నందుకుగానీ విశ్వనాథంమీద కోపం రాలేదు రాజుకు. చిన్న బుచ్చుకోలేదు కూడా. యువరక్తంలో కూడా కనిపించని వేడీ, వేగం ఆ వయసులో ఆయనలో వున్నందుకు సంతోషం కలిగింది. ఆయనలోని ఉత్సాహాన్ని ప్రేరణగా తీసుకోవాలనిపించింది.

అదే ఊపుతో తిన్నగా యింట్లో అడుగుపెట్టి, ప్రకటించేశాడు-

''డాడీ, నేను ఉద్యోగం చేద్దామనుకుంటున్నాను''

''ఏం వుద్యోగం? అది నీకిస్తానని కాచుక్కూచున్న ఆ చవటసన్నాసెవడు?''

''అబ్బ, సీరియస్‌గా చెబుతున్నాను డాడీ''

''ఎన్ని డిగ్రీల సీరియస్ రోయ్''

''థర్మామీటర్ పగిలిపోయి పాదరసం బైటికొచ్చేంత సీరియస్. అంటే యమ సీరియస్సన్నమాట''

''హఠాత్తుగా, యింత భయంకరమైన ఆలోచన ఎందుకొచ్చిందిరా నీకు?''

''నీకన్నీ ఎగతాళే, ఏంటి డాడీ. మునలాళ్ళందరూ సంపాదిస్తుంటే కూచుని తినాలంటే సిగ్గనిపిస్తూంది నాకు''

''నిన్నకాక మొన్న అంత గడ్డం మొలిచి, షేవింగ్ చేసుకోగానే పెద్ద మగాణ్నై పోయాననుకుంటున్నావా? నువ్వు ఉద్యోగాలు చేసుకుంటూ కూచుంటే చదువెవడు వెలగబెడతాడు, నీ బాబు?''

''గొంతులో కొంచెం మార్దవం తెచ్చుకుని, కాస్త గంభీరంగానే చెప్పాడు రాజు.

''ఎంత చదువుకున్నా మళ్ళీ ఉద్యోగాలు చేయాల్సిందే కదా డాడీ. ఆ మాత్రానికి చదువుకుంటూ టైం వేస్ట్ చేసుకోవడమెందుకు! ఎటూ నేను కాలేజీకి వెళ్ళేదేంలేదు...రాత్రుళ్లు

చదువుకుంటూ, పగలు ఉద్యోగం చేస్తాను. అలాగని నిన్ను పట్టించుకోననుకునేవు. నీ తర వాతే మిగతావన్నీ''

''ఎందుకురా, ఏమైందసలు? ఎవరైనా ఏమైనా అన్నారా?''

''ఎవరో ఎందుకనాలి డాడీ. అసలు ఫారి న్‌లో పదిహేనేళ్లు దాటిన పిల్లలంతా ఏదో ఓ పార్ట్ టైం జాబ్ చేస్తూ, సంపాదించుకుటారట. పంతొమ్మిదేళ్ళొచ్చాయి. ఇంకా, సినిమాకు పోవాలి డాడీ పదిరూపాయలియ్యి, బండిపై బలా దూర్ తిరుగుతాను పెట్రోల్ పోయించు, అని అడుక్కోవటం సిగ్గుగా అనిపిస్తూంది డాడీ''

''అంత గొప్ప ఉద్యోగమేం దొరుకుతుందిరా నీకు?''

''దొరికిందే గొప్పదనుకుంటాను''

''ఒరేయ్ రాజూ, తప్పదంటావా''

''నువ్వొద్దంటే మానేస్తాను''

''మళ్లీ అదో క్లాజెందుకూ... సరే ఏడువ్. నాకు తెలిసిన యిద్దరు ముగ్గురున్నారు. వాళ్ల దగ్గరికి తీసికెళ్తాను. టైపింగూ, అదీ ఏదో ఏడిచానన్నావ్‌గదా, గుర్తుందా మళ్ళీ మొదలె ట్టాలా?''

''నువ్వు టైపిస్టు ఉద్యోగమిప్పించి చూడు''

''తెలివితేటలు ఎక్కువయ్యాయి భడవా, నోరు మూసుకో''



**రో**జూ పొద్దున్నే నిద్రలేవటం, ఎనిమిదికల్లా వంటపనంతా పూర్తిచేసి టిఫిన్ తినేసి, భోజనం హాట్‌ప్యాక్‌లో సర్దేసి తొమ్మిదవక ముందే బైటపడి ఆఫీసుకు చేరుకుంటే మధ్యాహ్నం భోజనానికి యింటికొచ్చి, తండ్రితో పాటు భోజనం చేసి, హడావిడిగా ఆఫీసుకు పరిగెత్తటం, సాయంత్రం ఆరుకల్లా ఇంటికి చేరుకుంటే టీ చేసి, తండ్రితోపాటు కూచుని తాగుతూ ఆఫీసు సంగతులూ, అవీ మాట్లా డటం, రాత్రి వంట చేసి తొమ్మిదికల్లా భోజనా లు పూర్తిచేసుకుని, పదకొండు, పన్నెండయ్యేవ రకూ చదువుకోవటం, అలా తీరిక దొరక్కుండా అయింది రాజుకు, ఉద్యోగంలో చేరిన దగ్గ ర్నించీ.

సాయంత్రం తొమ్మిదివరకూ మహాలింగంతో తప్పనిసరిగా గడపటం విధిగా అలవాటు చేసుకున్నాడు. ఒక్కోసారి ఆఫీసునుండి రాగానే వంట పూర్తిచేసి యిద్దరూ బైట తిరిగి తొమ్మిదికల్లా యింటికొచ్చి భోంచేసేవారు. మామూలుగా అయితే భోజనం చేసిన తర వాత ఎనిమిదింటికి నిదానంగా కబుర్లు చెప్పు కుంటూ ఓ గంటసేపు అలా కాలనీరోడ్లన్నీ తిరిగి యింటికొచ్చేస్తుంటారు. ఆ యిద్దరినీ చూసి కాలనీలో చాలామంది ఆదర్శప్రాయు లైన తండ్రీ-కొడుకులుగా చెప్పుకోవటం మొద లెట్టారు.

తండ్రిని యిబ్బంది పెడుతున్నానేమోనని ఆలోచించి ఆయన రోజంతా ఏం చేసిందీ తరచి, తరచి అడుగుతుండేవాడు మొదట్లో. రాజు ఆఫీసుకు వెళ్లగానే నిదానంగా నడుచు కుంటూ కాలనీ మరో చివరనున్న హొటల్‌దా కా వెళ్ళి, అక్కడ టీ తాగి పేపర్ కొనుక్కుని పదింబావు, పదిన్నరకల్లా యింటికొచ్చేసి, విసుగొచ్చేవరకూ పేపర్ చదువుతూ కూర్చుంటాడు మహాలింగం. ఇంట్లో వుంటే పన్నెండున్నరకు తెలుగు వార్తలు వినటం ఆయనకు అలవాటు. వార్తల తరవాతొచ్చే ఏదో కార్యక్రమమో, సినిమా పాటలో వినటం యిప్పుడు అలవాటు చేసుకున్నాడు. రాజు రాగానే యిద్దరూ కలిసి భోజనం చేశాక, రాజు వెళ్లిపోగానే ఓ అరగంటసేపు కునుకు తీస్తాడు. అంతకన్నా ఎక్కువసేపు పడుకుంటే రాత్రి నిద్రపట్టదని భయం. ఆ తరవాత రాజు వచ్చేవరకూ ఏం చేయాలన్నది తోచదు. బైటికి వెళ్లాలంటే ఎండ. ఇంట్లో కూచుంటే విసుగు. ఈ విషయం ఆయన చెప్పకపోయినా రాజు గ్రహించాడు.

బాగా ఆలోచించినమీదట రాజుకో విషయం గుర్తొచ్చింది. చపాతీలు చేసినప్పుడ





ల్లా పక్కన కూచుని మాట్లాడుతూ పిండి ముద్దతో ఎలుక పిల్లలు చేసి, యిలాంటివి చిన్నప్పుడు వినాయకుడి బొమ్మ వెనకాలనున్న బంక మట్టితీసి చేస్తుండేవాళ్ళమని చెబుతుండేవాడు మహాలింగం. ఎలుకను ఏనుగుగా వినాయకుడి తలలాగా, యిలా రకరకాలుగా చేసి రాజుకు చూపిస్తుండేవాడు. 'అదే ఆయన హాబీగా చేసుకోగలిగితే' అనే ఆలోచనొచ్చింది.

ఓ రోజు మట్టితో బొమ్మలు చేసుకునే విధానం వివరించిన 'డూ యిట్ యువర్‌సెల్ఫ్' పుస్తకం కొనుక్కొచ్చాడు రాజు. ఇవ్వటం మరిచిపోయినట్టుగా మరునాడు దాన్ని టేబుల్‌మీద వదిలేసి వెళ్ళాడు. సాయంత్రం వచ్చేసరికి మహాలింగం ఆ పుస్తకం మొత్తం చదివేశాడు.

"మట్టి బొమ్మలు చేయడం యింత ఈజీ అని నాకు తెలియదురా. ఎందుకు కొన్నావురా ఆ పుస్తకం"

"అదా, నిన్న మా కొలీగ్‌తోపాటు బుక్‌షాపుకెళితే అతను కొన్నాడు. పొరపాటున నేను పట్టుకొచ్చేశాను"

"అంటే రేపు యిచ్చేయాలా?"

"పోనీ, నీకు కావాలంటే వుండనీ డాడీ. ఇంకొకటి కొని ఆయన కిస్తాను. కానీ చదివేశావు గదా, యింకా ఎందుకు?"

"అబ్బ, వుండనీయవోయ్. రేపు చేసేటప్పుడు ఏమన్నా అనుమానాలొస్తే చూసుకోవటానికి వుంటుంది"

"ఏంటీ, చిన్న పిల్లాడిలాగా మట్టితో బొమ్మలు చేసుకుంటూ కూర్చుంటావా"

"చిన్నపిల్లలే చేయాలని ఎక్కడా రాసిపెట్టిలేదు. పైగా అది ఒక ఆర్ట్, తెలుసా? నీకెందుగ్గానీ మరోపుస్తకం కొంటావా, నన్నెళ్ళి తెచ్చుకోమంటావా చెప్పు"

"సరే, నీ యిష్టం"

తెల్లవారి ఆదివారం, విశ్వనాథం కొట్లో యిడ్లీలు తినేసి తండ్రి, కొడుకులిద్దరూ ఓ కుమ్మరి దగ్గరికెళ్ళి బంకమట్టి కొనుక్కొచ్చారు. బంకమన్ను కావాలనగానే ముందుగా కుమ్మరి విచిత్రంగా చూశాడిద్దరినీ. ఆ తరవాత అమ్మటానికి అంత సులభంగా ఒప్పుకోలేదు. బంకమన్ను తెచ్చుకోవటానికి తాము ఎన్నిపాట్లు పడతారో ఏకరువుపెట్టాడు. చివరకు అడిగినన్ని డబ్బులిస్తామనగానే యిచ్చేసాడు.

ఇక ఆ రోజంతా బంకమన్ను దగ్గర్నించి కదల్లేదు మహాలింగం. రాజు మధ్యాహ్నం భోజనానికి పిలిస్తే కూడా, ఆడుకుంటున్న పిల్లాణ్ని తల్లి భోజనానికి పిలిచినప్పుడుపడేంత విసుగుపడి, కోపంగా చిందులేసి, అరగంట తరవాతగానీ అక్కణ్నించి కదల్లేదు.

మరుసటి ఆదివారం యిద్దరూ ఫుట్‌పాత్‌ల మీద పెట్టే పుస్తకాల షాపులు తిరిగారు. జపనీస్ పేపర్ కత్తిరింపు నుండి మొదలుపెట్టి, 'చేసి చూడండి' అని కనిపించిన ప్రతి పుస్తకాన్నీ కొన్నాడు మహాలింగం. అవన్నీ సెకండ్ హ్యాండ్ పుస్తకాలు కనుక చాలా చౌకలో దొరికాయి. ఆ రోజు ఎండకు బాగా అలసిపోయినా మహాలింగంకు చాలా సరదాగా గడిచింది. రకరకాల పుస్తకాలు చూస్తూ, కొన్ని తిరగేస్తూ, వాటిల్లో కొనాలనుకున్నవాటిని పరిశీలించి చూసి, బేరమాడుతూ, మధ్యమధ్యలో కొబ్బరినీళ్లో, పుచ్చకాయ ముక్కలో తీసుకుంటూ రకరకాల మనుషుల్ని చూస్తూ, మూసేసిన దుకాణాలమధ్య అతివలుచగా వున్న ట్రాఫిక్‌తో కొత్తకొత్తగా కనిపించే నగర వీధుల్ని చూస్తూ తిరగటం ఓపికుంటే మంచి కాలక్షేపమే. బాగా అలసిపోవటంతో ఆ రాత్రి మంచి నిద్రపట్టింది మహాలింగంకు.

మరునాడంతా తను కొనుక్కొచ్చిన పుస్తకాలు చూస్తూ గడిపాడు. ఆ రోజు సాయంత్రం ఆఫీసునుండి వస్తూ రంగుల కాగితాలు తెచ్చాడు రాజు. అవి చూసి సంతోషించాడుగానీ, పేపర్ కటింగ్‌కన్నా ఎక్కువగా ఆయన్ని ఆకర్షించింది 'థింగ్స్ ఎ లిటిల్‌బాయ్ కెన్‌డూ' అనే చిన్న పిల్లల పుస్తకంలోని వస్తువులు. బంగాళాదుంప ముక్కకి అడ్డంగా కోసి, దాన్ని ఓ సెంటీమీటర్‌మందం కావాలనుకున్న ఆకారంలో చెక్కేసి, మిగిలినదానితో తయారైన డిజైనుకు సిరా పూసి కాగితాలమీద అద్దితే డిజైను కావలసినన్నిసార్లు అచ్చుపడుతుంది. అలాంటివన్నీ చేసి చూడాలని మహా ఉబలాటం పెరిగిపోయిందాయనకు. యాకొవ్ పెరెల్మాన్ 'నిత్య జీవితంలో భౌతికశాస్త్ర ఉపయోగాలు' పుస్తకంలోని ప్రయోగాలన్నీ చేసి చూడటం, రాజుకు చూపించి అతన్ని ఆశ్చర్యపర

చటం చాలా సరదాగా అనిపించిందాయనకు. క్రమంగా, రాజు వచ్చేసరికి బిక్కుబిక్కున ఎదురుచూడటంపోయి, రాజు వచ్చిన తర వాత కూడా టీ తాగమని పిలిస్తే, 'రెండు నిమిషాలు ఆగరా, యిది పూర్తిచేయనీ' అనేంత తీరికలేకుండా అయిపోయాడు. దాంతో పెద్ద సమస్య తీరినట్టయింది రాజుకు. మధ్యలో రాజారాం బృందం వారం, పదిరోజు లకోసారి రావటం, తనూ ఓసారి వెళ్ళిరావ టంలాంటివి కూడా మామూలుగా వుండి ఆయ నకు రెండునెలలకల్లా జీవితంమీద కొత్త ఆసక్తి కలిగింది.

ఓరోజు రాజు యింటికొచ్చేసరికి యింట్లో అమ్మాయిగా కలిసిపోయి, మహాలింగంతో కబుర్లు చెబుతూకూర్చున్న రాణి కనిపించింది. ఆశ్చర్యంతోపాటు తడబాటు కూడా కలిగింది- ఏంచెప్పిందో ఏంటోనని. కానీ తనను రాణికి పరిచయం చేయటంతో తేలిగ్గా నిట్టూర్చాడు.

"వీడు మా అబ్బాయి రాజమ్మా. ఒరేయ్ రాజూ, ఈ అమ్మాయి నీకు తెలీదుగదూ. పేరు రాణి, ఆ పక్కవీధిలో పెద్ద మేడవుందిచూడూ, 'సరళా నిలయం' అనీ... వాళ్ళమ్మాయి. ఇవ్వా ళ్టినుండీ నా ఫ్రెండు" అని పరిచయం చేశా డు.

"హలో" తప్పనిసరిగా అన్నాడు రాజు.

"హలో" అని రాజుకు చెప్పేసి, మహా లింగంతో అంది రాణి- "మీ అబ్బాయా ఈయన. వీధిలో చాలాసార్లు చూశాను కానీ మీ అబ్బాయని తెలీదు మావయ్యా..."

'మావయ్యా' అన్న సంబోధన విని మరోసారి తెల్లబోయాడు రాజు. బట్టలు మార్చుకోవటానికి లోపలికి దారితీశాడు.

"ఒరేయ్, అమ్మాయిక్కాస్త కాఫీయో, టీయో యిస్తే బావుంటుందిరా" కేకేశాడు మహా లింగం.

"ఓ అమ్మాయి హాయిగా కుర్చీలో కూర్చు నుంటే, మగాళ్ళు కాఫీ తయారుచేస్తే బావుండ దు మావయ్యా... నేను చేసి తెస్తాను" అంది రాణి లేస్తూ.

"ఇదేదో బావున్నట్టుందే... రాజూ, అమ్మాయి కాఫీ చేస్తానంటుందిరా. ఏమంటావ్"

"పెద్దవారు, మీరు సరేనంటే, ఆయన వేరే ఏమంటారు మావయ్యా" అంటూ, వంటగది లోకి నడిచింది రాణి.

బట్టలు మార్చుకుని మొహం కడుక్కోవటా నికి వంటగదిలోంచి పెరట్లోకి వెడుతూ, తండ్రి పరిసరాల్లో లేడని గమనించి, రాణి దగ్గరికి నడిచాడు రాజు-

"ఏయ్, ఏంటి, యిలా దాడిచేశావ్? మా డాడీ కనిపెడితే ఎలా వుంటుందో ఆలో చించావా?"

"ఆ, ఏమీ కనిపెట్టడు, మంచి మస్కాకొట్టా నులే" హామీయిస్తూ అంది రాణి.

"సరేగానీ, నువ్వు చేయడమేంటి, వెళ్లి హాల్లో కూర్చో. నేను చేసుకొస్తాను"

"ఈమాత్రానికి నేనేమీ అరిగిపోనులే. నాకెంత బావుందో తెలుసా? నువ్వెళ్ళి మొహం కడుక్కో, మళ్ళీ మావయ్యకు అనుమానమొ స్తుంది" భయంగా హాలువైపు చూసింది.

రాజు పెరట్లోకెళ్ళాడు. రాణి కాఫీ చేసి, కప్పుల్లో పోసి హాల్లోకెళ్లి మహాలింగంకు అందించింది. రాజుక్కూడా ఓ కప్పు అందించింది. తనూ ఓ కప్పు తీసుకుంది.

"అసలు యింట్లో ఆడవాళ్లుంటే ఆ అందమే వేరమ్మా"

"ఔను మావయ్యా. మీకేం తక్కువ. మీ అబ్బాయికి పెళ్ళి చేసేస్తే కోడలొస్తుందిగదా"

"ఎవరో వచ్చి మాకేం సలహాలివ్వనక్కర్లేదు. మాయింట్లో ఏం చేసుకోవాలో మాకు తెలుసు" ముభావం నటించాడు రాజు.

"అదేం మాటరోయ్. ఓ విషయం చెప్పటా నికి యింట్లో వాళ్ళే చెప్పాలని ఎక్కడైనా రాసుందా ఏమిటి? నువ్వేమీ అనుకోకమ్మా, వాడి తీరే అంత"

"ఫర్వాలేదు మావయ్యా. బాగా మాట్లా డటం కూడా ఓ కళ. అందరికీ వస్తుందా ఏమిటి?"

"సరే... మీరు మాట్లాడుకుంటూ కూర్చోండి. డాడీ, నీకేమైనా పనుందా? సినిమాకెళ్లక చాలా రోజులయింది, వెళదాం" అది రాణికి చెప్పిన మాట. రాణికి అర్థమయింది.





"నేను సినిమాలు చూడను, నీకు తెలుసు గదా. పైగా నాకు బోల్డు పనుంది. నిన్న కాల్చిపెట్టిన బొమ్మకు రంగులెయ్యాలిరా"

"నేను వెళతా మావయ్యా. ఆలస్యమైతే యింట్లో కోప్పడతారు ఖచ్చితంగా ఆరున్నరక ల్లా అడుగు యింట్లోపెట్టకపోతే మా మమ్మీ చంపేస్తుంది" ఆరున్నరకల్లా వచ్చేస్తానని భావం.

"మంచిదమ్మా... రేపు తప్పకుండా రావాలి సుమా. ఈ బొమ్మ నీకే ప్రజెంట్ చేస్తాను. రేపటికల్లా చూసుకో, ఎంత బాగా తయారవు తుందో"

"థాంక్యూ మావయ్యా, వస్తానండీ" రాజు వైపు కోపంగా చూసి వెళ్ళి పోయింది.

ఇద్దరూ ఆరున్నరకల్లా వీధి చివర కలుసు కున్నారు. మోటర్‌సైకిల్ పైనెక్కి కూచుంది రాణీ. వెంటనే ముందుకు దూకించాడు రాజు.

"ఏయ్... ఎన్నడూలేంది సినిమాకేంటి కొ త్తగా. నేను రానుబాబూ"

"ఎందుకు?"

"ఎందుకేంటి? మీ మగబుద్ధులు నాకు తెలుసుగానీ బీచ్‌కెళదాం పద"

"బీచ్‌లో అయితే ఫరవాలేదా?"

"ఇదిగో రౌడీమాటలు మాట్లాడకు, పద"

"ఇద్దరూ బీచ్‌లో కూచున్నారు.

"ఇప్పుడు చెప్పు... బీచ్‌కూ, సినిమాకూ తేడా ఏంటి?"

"సినిమాలో పక్కపక్కన కూచుంటాం. చీకటి, చీకటి అవకాశాలు కలిగిస్తుంది. నువ్వే మైనా చేసినా, నేనూ నీలాంటి దాన్నే కనుక వద్దనటానికి మనసు రాకపోవచ్చు. బీచ్‌లో అయితే, పిచ్చిపనులు చేయటానికి సంస్కారం, సభ్యతా అడ్డొస్తాయిగదా"

"నామీదంత నమ్మకంలేదా? అంత పోకిరీ లాగా కనిపిస్తున్నానా?"

"నువ్వేంటి, నేనూ పోకిరీదాన్నే. అవకాశం దొరకనంతసేపు మన బుద్ధి, మన మనసుల్ని అదుపులో వుంచుతుంది. పెళ్ళయ్యేదాకా 'అ లాంటి' పనులే కాదు, మాటలు కూడా మాట్లాకో వద్దు. అప్పుడే పెళ్ళికో విలువుంటుంది"

"అవునూ, పెళ్ళంటే గుర్తొచ్చింది. మా నాన్ననేంటి 'మావయ్యా' అని వరస కలిపే సావ్ అప్పుడే. ఆయన గుర్తుపడితే ఎలా వుంటుంది?"

"అసలు నేనారూట్లో వస్తేగదా ఆయన కని పెట్టడానికి. కాలేజీనుండి వస్తూవస్తూ తిన్నగా మీయింటి ముందరాగాను. గేటు తీసుకుని, లోపలికొచ్చాను. నమస్కారమండీ- అన్నాను. రోజూ యిటుగా వెళుతూ మీరు మట్టిబొమ్మలు చేయటం, అదీ చూస్తున్నాను. అలాంటి చేతిప నులంటే నాకు చాలా యిష్టం. కానీ వచ్చి పలకరిస్తే మీరేమనుకుంటారోనని యిన్నాళ్ళు గా తటపటాయించాను. చివరకు యివాళ ధైర్యంచేసి ఏమనుకున్నా అనుకోనీయమని వచ్చేసాను, అన్నాను. అయ్యో, యిందులో అనుకోవటానికేముందమ్మా- అన్నాడాయన సంతోషంగా. ఆయన చేసిన బొమ్మలూ, చేయా లనుకుంటున్నవీ, అవీ, యివీ, అన్నీ వివ రించాడు. మధ్యలో ఎప్పుడో, అది కాదు మావ య్యా- అని మొదలెట్టి, అవునా మావయ్యా నాకు తెలీదు మావయ్యా - అంటూ కలిపేసా ను. అంతే"

"మన విషయం మీఫ్రెండ్స్‌కెవరికైనా తెలుసా?"

"మాధవికి తెలుసు. నేనే చెప్పాను. అది నీలాగా భయపెట్టలేదు. నీ అదృష్టమే... నీకంతగా నచ్చినవాడు దొరకటం- అంది. పేదరికం భరిస్తాననటం మాటలు చెప్పినంత సులభం కాదు. చాలా కష్టం- అని ఎలాంటిక ష్టమో వివరించింది. తరవాత ఎలాంటి నిరాశ లు ఎదురవుతాయో వివరించింది"

"ఏం చెప్పింది!"

"చాలా చెప్పింది. ఓరకంగా నాకు ఎంతో మేలు చేసిందది. అది నాకు చిన్నప్పటి ఫ్రెండ్. అది మాయింటికొస్తే మా మమ్మీ మొహం చిట్లిస్తుంది. కానీ నాకది ప్రపంచం గురించి చాలా నేర్పింది. దానికోసమే నేను కాలేజీకి బస్సులో వెళ్ళటం మొదలెట్టాను. దాని మూలంగానే మన విషయంలో ధైర్యంగా నిలు చోగలిగాను. ఇప్పుడు నేను మధ్యతరగతి జీవితం నేర్చుకుంటున్నాను. ఏ.సీ. ఆపేశాను నాగదిలో. నా గుడ్డలు నేనే ఉతికి, యిస్త్రీ చేసుకుంటున్నాను. నేలమీద బెడ్‌షీట్ వేసు

కుని పడుకుంటున్నాను. వంట చేయటం కూడా నేర్చుకుంటున్నాను. అసలు జీవిత మంటే యిదే అనిపిస్తూంది నాకు. మన పనులు మనం చేసుకోవటంలో ఎంత తృప్తి వుంది, ఎంత ఆనందం వుంది. ఇవన్నీ నాకేమీ భయంకరంగా అనిపించటంలేదు, తెలుసా?''

''నాకు ఏం మాట్లాడాలో తెలీటం లేదు''

''కొన్ని కావాలనుకున్నప్పుడు కొన్ని వదులుకోవాలి. ఇది జీవితసత్యం. దాన్ని ఒప్పుకోవటం నేర్చుకో. నేను నీకోసం త్యాగాలు చేయటంలేదు. నాకోసం చేస్తున్నాను. నాకు ఆనందం కలిగించే జీవితంకోసం చేస్తున్నాను. డబ్బులో సుఖం వుందేమో కానీ సంతోషం లేదు రాజా. నేన్నీకు తగనేమోనన్న ఇన్‌ఫీరియర్ కాంప్లెక్స్ లోంచి బైటపడి ఆలోచించు. మానాన్నకున్న డబ్బు మూలంగా నన్ను అంటరానిదాన్నిగా చేయకు. అదే నువ్వు నాకు చేయగల సహాయం''

''నాకు నువ్వు దొరకటం నా అదృష్టం రాణీ. నాకు నువ్వు కావాలి. కానీ యిన్నిరోజులూ నువ్వన్నట్టుగానే ఆలోచించి, నీ మంచికోసం నీకు దూరంగా పోవాలని అనుకునేవాణ్ని. నువ్వన్నట్టు ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ కూడా వుండవచ్చు నాలో. అందుకు నేను పెరిగిన పరిస్థితులు కారణం. అందుకే ఎప్పుడైనా నేను పిరికివాడిగా మారిపోతే, నాకు నువ్వు ధైర్యం చెప్పి నిలబెట్టు. మీ అమ్మా నాన్నలు కాదన్నానరే, మనం పెళ్ళి చేసుకుంటాం''

''నీకు ఇన్‌ఫీరియర్ కాంప్లెంక్స్ వుందన్నాను. నాకు ఇన్‌సెక్యూర్ కాంప్లెక్స్, అభద్రతా భావనుంది. చిన్నతనంలోనే తల్లిగానీ, తండ్రిగానీ చనిపోయినా, తల్లిదండ్రులు విడాకులు తీసుకున్నా అన్తమానమూ కీచుటాడుకుంటున్నా పిల్లల్ని సరిగ్గా పట్టించుకోకపోయినా, పిల్లల్లో తమకు భద్రతలేదనే భావన పెంపొందుతుంది. ఇలా పెరిగిన పిల్లలే ప్రేమకోసం అంతర్లీనంగా తపిస్తుంటారు. అంటే సబ్‌కాన్షస్‌లో ప్రేమరాహిత్యభావన పాతుకుపోయివుంటుంది. అందుకే యిలాంటి పిల్లలంతా తమకు దగ్గరగా వచ్చిన ఏ టీచర్‌నో అతిగా ప్రేమించేసి, మానసికంగా వాళ్ళతో అనుబంధం పెంచుకుంటారు. లేదా ఏ ఫ్రెండ్‌నో అతిగా ప్రేమించేసి, విడవకుండా వుంటారు. వాళ్ళు మరొకరితో మాట్లాడినా, స్నేహం చేసినా, తమ సొత్తు ఎవరో లాక్కుపోతున్న ఫీలింగ్‌తో తగువు పెట్టుకుని వాళ్లనూ దూరం చేసుకుని మరింత తీవ్రంగా అభద్రతా భావనకు లొంగిపోతారు. టీనేజ్‌లో అతి తొందరగా లవ్ ఎఫెయిర్స్‌లో చిక్కుకునేదీ వీళ్ళే...

అలా ఆశ్చర్యంగా చూడకు. నేనూ అలాంటి దాన్నే. కానీ నాలో కొద్దో గొప్పో విచక్షణాజ్ఞానం వుండటంవల్ల అలాంటి వాటిలో తొందరపడకుండా వుండగలిగాను. నాలో వున్న అభద్రతా భావన కారణంగానే ఆ రోజు పార్కులో ఏడ్చి, నిన్ను కంగారుపెట్టాను. కానీ ఆ క్షణంలో నాకు తెలీదు. అందుకే నీతో యింతగా కలిసిపోయాను. సో, నన్ను కోటలోంచి వచ్చిన రాజకుమారిగా చూడకు. రాణిగా చూడు. అర్థమయిందా... ఇంకో విషయం చెప్పనా, ఇలాంటి వాళ్లు, ప్రేమ వ్యవహారాల్లో విజయంపొందలేకపోతే ఆత్మహత్య చేసుకోవటానికి వెనుకాడరు... అదీసంగతి''

''ఛీ... నోర్మూయ్''

''నా సంగతి కాదులే. నేను చచ్చినా ఆత్మహత్యచేసుకోను'' నవ్వుతూ అంది.

''ఇంకోసారి అనొద్దన్నానా'' కోపంగా అన్నాడు రాజు.

''చావంటే అంత భయమెందుకు. ప్రతి మనిషి ఎప్పుడో ఒకప్పుడు చచ్చిపోక తప్పదు''

''అందరి సంగతి వేరు. నువ్వు మాత్రం మళ్ళీ మాట్లాడకు''

''ఇందాక చెప్పానుగదా. కొన్ని జీవితసత్యాలు ఎంత భయంకరంగా అనిపించినా ఒప్పుకోక తప్పదు. నీకో విషయం చెప్పనా. ఆ రోజు నువ్వు రాకపోతే చచ్చిపోదామనుకున్నాను తెలుసా? ఒంటిమీద కిరోసిన్ పోసుకుని అంటించుకుని...'' నవ్వుతూ చెప్పింది రాణి.

''ఇదిగో మళ్ళీ చావుగురించి మాట్లాడితే చెంప పగిలిపోతుంది'' చిరుకోపంతో మందలించాడు రాజు.

''ఏదీ, కొట్టు చూద్దాం'' కవ్వించింది రాణి.

''నువ్వన్నప్పుడని · చెప్పాను'' ఉడు




క్కుంటూ అన్నాడు రాజు.

"సరే, అంటున్నాను. నువ్వు నన్ను పెళ్ళి చేసుకోనంటే మణికట్టు బ్లేడుతో కోసుకుని, చివరి నెత్తుటి బొట్టు పోయేదాకా నీపేరు కలవరిస్తూ చచ్చిపోతాను... ఛాలెంజ్"

ఈడ్చి కొట్టాడు రాజు, రాణి చెంపమీద.

"యూ, నన్ను కొడతావా?" రోషంగా అంది రాణి.

"మరి, చచ్చిపోతానంటావా?"

"అంటే మాత్రం?"

"అనొద్దు... ఆ ఆలోచనే యింకోసారి రావొద్దు"

"నాకు నిజంగా కోపమొచ్చిందనుకున్నావా, నువ్వు కొట్టినందుకు... ఊహు... నిజానికి నువ్వు కొడతావనుకోలేదు కానీ, నేను చచ్చిపోతానంటే అంతగట్టిగా కొట్టావంటే, నీకు నామీద ఎంత ప్రేమ వుందని!"

"నువ్వు పిచ్చిదానివి"

"యస్... నేను పిచ్చిదాన్నే. సో వాట్?"

"కాసేపుంటే రక్కుతావేమో. పద పోదాం"

సాయంకాలం రాజు ఆఫీసునుండి వచ్చేసరికి గుమ్మంలో రకరకాల చెప్పులు కనిపించాయి. కొత్త గొంతులు చాలా వినిపిస్తున్నాయి. ఎవరొచ్చారో అర్థంకాలేదు. ముక్కూ మొహం తెలీనివాళ్లను కూడా యింట్లో కూర్చోబెట్టి కబుర్లు చెప్పడం మహాలింగంకు అలవాటు. అలాంటి అలవాటువల్ల ఒక్కోసారి ప్రమాదాలు ఎదురుకావచ్చునని రాజు ఎంతగా చెప్పినా వినడు.

ఇల్లిల్లూ తిరిగి బిస్కట్లూ, సబ్బులూ లాంటివి అమ్మే సేల్స్ గర్ల్స్‌నూ, మీటర్ చూడటానికొచ్చిన ఎలక్ట్రిసిటీ డిపార్ట్‌మెంట్ మనిషినీ, యిలా యింటి గేట్లోకొచ్చిన ప్రతి మనిషినీ ఓ పది నిమిషాలైనా కూర్చోబెట్టి, ఫ్లాస్కులో వున్న టీయో, కాఫీయో పోసి కబుర్లు చెప్పటం ఆయనకు మహా సరదా. వాళ్లకు కూడా అంత మాత్రం మాట్లాడే మనుషులెవరూ దొరకరు గనుక మరీ అంత తొందరపని లేకపోతే సులభంగా ఓ పదినిమిషాలు కూర్చుండిపోతారు. చివరకు పోస్ట్‌మ్యాన్‌ను కూడా కూర్చోబెట్టేస్తుంటాడొక్కోసారి. డెలివరీ చేయాల్సిన ఉత్తరాలు తక్కువగా వున్నప్పుడు ఆ వీధి ఉత్తరాలు చివరకు యిచ్చేయటం అలవాటు చేసుకున్నాడు పోస్ట్‌మ్యాన్ కూడా. నిజానికి తీరికలేకుండా పనిచేసే బస్‌కండక్టర్‌నూ, పోస్ట్‌మాన్‌లాంటి వాళ్లను చాలామంది యంత్రాల్లా చూస్తుంటారు. అందుకే తమ వృత్తిపరంగా పరిచయమైన వాళ్లు రెండు మాటలు మాట్లాడి పలకరిస్తే వాళ్ళు కూడా సంతోషిస్తుంటారు. తనను మరో మనిషి గుర్తించటం అనేది ప్రతి మనిషికీ అంతో యింతో ఆత్మసంతృప్తినిస్తుంది కూడా.

ఇవాళ యిల్లు పావనం చేసిందెవరోనను కుంటూ లోపల అడుగుపెట్టాడు రాజు. అతని మోటర్‌సైకిల్ శబ్దం విని, అప్పటికే అతని రాకకోసం నిరీక్షిస్తున్నట్టుగా వాళ్లంతా గుమ్మంవైపు ఆసక్తిగా చూస్తున్నారు.

ఇద్దరు మగాళ్ళూ, యిద్దరు ఆడవాళ్లూ, ఓ పదేళ్ల కుర్రాడూ వున్నారు. వాళ్ల వయసులు ముప్పై, నలభై మధ్య రకరకాలుగా వుంటాయి. రాజు గుమ్మంలో కనిపించగానే ఉత్సాహంగా చెప్పాడు మహాలింగం-

"వీడేనర్రా రాజు"

మర్యాదగా నమస్కారం చేశాడు రాజు.

"వీళ్ళు ఎవరా అని చూస్తున్నావు కదూ. వీడు నా కొడుకు, యితను అల్లుడు, ఈ అమ్మాయి కోడలు, యిది కూతురు, వీడు అమ్మాయి కొడుకు, అంటే మనవడు, నీకు మేనల్లుడు" పరిచయాలు చేశాడు మహాలింగం.

ఐదు నిమిషాల తరవాత రాజు బట్టలు మార్చుకోవటానికి లోపలికి వెళ్లగానే అతనితోపాటు లోపలికి నడిచాడు మహాలింగం. రాజును పెరట్లోకి లాక్కుపోయి, చిన్న గొంతుతో చెప్పటం మొదలెట్టాడు-

"పొద్దున నేను పేపర్‌కోసం వెళ్లగానే వచ్చినట్టున్నారు. వచ్చేసరికి గుమ్మంలో కూర్చునున్నారు. జరిగింది జరిగిపోయింది. వచ్చి తమతోపాటు వుండమని ఒకటేపోరు. ఏం చేయాలో నాకు తోచటంలేదు" ఆయన ధోరణి చూస్తే వెళ్ళాలన్నట్టే వుందిగానీ, అందుకు ఎవరో ఒకరు సపోర్ట్ యిచ్చి వెళ్ళమని చెబితే బాగున్నన్నట్టు అనిపించింది.

"ఇందులో ఆలోచించడానికేంవుంది డాడీ"

"మరి నీసంగతేంట్రా?"

శరాఘాతంలా తగిలిందామాట రాజు మనసుకు. అవును, తనకు ఆయన దూరం అయిపోతాడు. తనది ఆలోచించనేలేదు. వాళ్ళు ఎందుకొచ్చివుంటారా అనే ఆలోచిస్తున్నాడు అప్పట్నించీ. అవునుమరి, తన సంగతేంటి...

"నాదేముంది డాడీ... నాకేం తక్కువనీ?"

తనకేం తక్కువవుతుందో రాజు చెప్పకనే చెప్పినట్టనిపించిందాయనకు.

"పోనీ... నువ్వు కూడా నాతోపాటు వచ్చేయరా. వాళ్ళు ఎంత కన్నబిడ్డలైనా, నిన్ను వదిలి వెళ్ళాలంటే మనసొప్పటంలేదురా"

ఆ మాటలు మనస్ఫూర్తిగానే అన్నాడు మహాలింగం. కొడుకూ, కూతురూ వచ్చి బతిమాలటం, వాళ్ళందరిమధ్యా మళ్ళీ మనవలూ, మనవరాళ్ళతోపాటు తన యింట్లో వుండటానికి అవకాశం రావటం సంతోషంగానే వున్నప్పటికీ, రాజు ఏమైపోతాడోనని ఆయన పొద్దుట్నించీ రకరకాలుగా ఆలోచిస్తూనేవున్నాడు.

మహాలింగం వట్టి బోళామనిషి. ఎవ్వరిమీదా కోపం తెచ్చుకోడు సాధారణంగా. కోపమొచ్చినా ఆప్యాయంగా మందలిస్తాడేగానీ, మనసులో పెట్టుకోడు. మనుమలతో చాలా తొందరగా కలిసిపోతాడు. ఓసారి ఆయనతో మాట్లాడిన మనిషి తప్పకుండా మరోసారి మాట్లాడటానికీ, ఓ పదినిమిషాలైనా ఆయన్తో గడపటానికీ ఉత్సాహం చూపిస్తాడు. తనకోసారి పరిచయమైనవాళ్ళను ఆయనా అంత తొందరగా మరిచిపోడు కూడా. అలాంటిది, యిన్ని నెలల పరిచయంలో ఆయనకు వరపుత్రుడుగా మారి సేవలు చేసిన రాజు ఆయన మనసులో చాలా స్థిరంగా పాతుకుపోయాడు. రాజును వదిలి వెళ్ళాలంటే ఆయనకు చాలా బాధగా వుంది. రాజును తనతోపాటు తీసుకుపోతానంటే ఎలా వుంటుందోనని ఆలోచించి తనవాళ్ళతో మాట్లాడాడు. వాళ్ళు సులభంగానే ఒప్పుకున్నారు కూడా.

మహాలింగం మాటలకు రాజు మనసు అర్థమైపోయింది. అసలాయనకూ, తనకూ అనుబంధమేమిటని. అన్నాళ్ళూ తనను సొంతకొడుకులా ఆదరించాడు. తను అనాథాశ్రమంలో పెంచుకున్న ఆశలన్నీ నిజంచేశాడు. రాణిలాంటివాళ్ళు తల్లిదండ్రులుండీ పొందలేనంత ప్రేమను తనకందించాడు. అది చాలు... అంతకన్నా ఆయన్నించి ఆశించటం తన స్వార్థమవుతుంది. ఈ వయసులో ఆయన తనవాళ్ళమధ్య హాయిగా వుండగలుగుతాడు. ఎందుకొచ్చిందో వచ్చింది, ఆయన పిల్లల్లో పశ్చాత్తాపం వచ్చింది. ఇప్పుడు మామూలుకన్నా బాగా చూసుకుంటారు. నాలుగురోజులు అక్కడున్నాడంటే కలిసిపోతాడు. ఆయన పిల్లలూ ఆయనలాంటివాళ్ళు కానవసరంలేదు. ఒకవేళ సహృదయంతోనో, తండ్రికోసం మొహమాటంతోనో వాళ్ళు తనను అభ్యంతరపరచకపోయినా, తనకు బావుండదు. ఇలా ఆలోచించాడు రాజు.

"మనసొప్పటానికేముంది డాడీ. నువ్వు యుద్ధభూమికి వెళ్ళినప్పుడు వాళ్ళను వదిలిపెట్టి వెళ్ళలేదూ. అంటే మనస్ఫూర్తిగా వదిలిపెట్టావా. లేదుకదా. కర్తవ్యంకోసం చేసినట్టే యిదీ నీ కర్తవ్యమేకదా. నీ పిల్లలు నిన్ను చూసుకోవటం వాళ్ళ బాధ్యతైతే, వాళ్ళకు కూడా నీ ఉనికిలోని ఆనందం యివ్వటం నీ బాధ్యత. నాదేముంది, ఒంటరిగా వుండటం నాకలవాటే"

"ఏం అలవాటోయ్. రమ్మన్నప్పుడు రావచ్చుగదా"

"నామాట విను. మీ... యిల్లు ఈ వూళ్ళోనే గదా. అంతగా కావాలంటే నేను ఎప్పుడైనా వస్తుంటాను. పద నువ్వు, మనం యిట్లా మాట్లాడుకుంటే వాళ్ళేమైనా అనుకుంటారు"

-అన్నిరోజులూ ప్రతిదీ 'మన', 'మన' అని అలవాటైపోయి, ఆయనతో 'మీ యిల్లు' అని అనాలనేసరికి అంత సులభంగా గొంతు పెగలక మాటలు సరిగ్గా రాలేదు రాజుకు.

మరో గంటకల్లా అన్నీ సర్దుకున్నాడాయన. రాజుకన్నా ఎక్కువగా మహాలింగం పిల్లలే ఆయనకు సహాయం చేశారు. అంతసేపూ రాజుకు ఏవేవో చెబుతూనే వున్నాడు మహాలింగం. అదిచూసి, చివరకు ఆయన కూతురు అడిగింది రాజును-

"పోనీ, నువ్వు కూడా రా తమ్ముడూ... నాన్నకు హాయిగా వుంటుంది. ఇన్నిరోజులూ చేసినదానికే బాధపడుతున్నాం. మళ్ళీ ఆయ





న్ని బాధపెట్టాలంటె మనసొప్పటంలేదు''

''వద్దండీ. డాడీదేముంది, చాదస్తం. నాలు గురోజులు పోతే కుదుటపడతాడు'' సున్నితంగా చెప్పాడు రాజు.

ఆటోలొచ్చాయి. సామానులన్నీ ఆటోల్లో పెట్టేశారు.

''ఏమండీ, డాడీని జాగ్రత్తగా చూసుకోండి. పెద్దవాడు, చాదస్తంతో ఏమైనా అన్నా పట్టించుకోవద్దు'' అంపకాలు పెడుతున్నట్టుగా చెప్పాడు రాజు.

ఎంత వద్దనుకున్నా రాజు మనసు భారంగా మారి, గొంతులో జీర కొట్టొచ్చినట్టు కనిపిస్తూంది. తను ఒక్కక్షణం బేలగా కనిపిస్తే ఆయన బాధపడతాడని, బలవంతంగా కన్నీళ్ళు దిగమింగుకున్నాడు.

మహాలింగం కాళ్ళకు నమస్కరించాడు రాజు. వంగి రాజును లేవనెత్తి, గట్టిగా గుండెలకు అదుముకున్నాడు మహాలింగం. ఆయన కళ్ళల్లోంచి జలజలా కన్నీళ్ళు రాలి రాజువీపును తడిపేశాయి. రాజుకు ఉద్వేగం తన్నుకొస్తూందిగానీ, తను కూడా ఏడిస్తే, ఆయన వెళ్ళటం కష్టమని, అతికష్టంగా మనసును అదుపులోకి తెచ్చుకుని, ఆయన్ని ఓదార్చాడు.

''తప్పు డాడీ ఏడవకూడదు'' బలవంతంగా పెదాలమీద నవ్వు తెచ్చుకున్నాడు- ''యువారే మిలిటరీ మాన్... బీ బ్రేవ్'' ఆయన మాట్లాడే ధోరణిలో చెప్పాడు.

''ఒరేయ్... డాడీని మరిచిపోవద్దు. వారానికో సారైనా నా దగ్గరకు రావాలి. కనీసం ఉత్తరమైనా రాయాలి. ఇంట్లో ఫోనుంది, ఫోనైనా చెయ్యాలి''

గుండెలోతుల్లోని కన్నీటిపొరలు నిబ్బరపు రాతిపొరల్ని చీల్చుకుని ఎగదన్నుకొచ్చి గొంతును తడిపేసి, మరింత ఉధృతంగా పైకి చిమ్ముకుని కనుల సరోవరాల్ని ముంచెత్తి జలప్రళయం సృష్టించే ప్రయత్నం చేస్తున్నాయి. తను గొంతు విప్పితే తెలిసిపోతుందని, ఆయన మాటలకు మౌనంగా తలూపాడు రాజు.

మహాలింగం ఆటోలో కూర్చుని చెయ్యూపాడు. మిగతావాళ్లు కూడా ఊపారు. ఎంత ఉత్సాహం తెచ్చుకుందామనుకున్నా తలకన్నా పైకి చేతిని లేపలేకపోయాడు రాజు. మౌనంగా నిలుచుని అలాగే చెయ్యూపాడు.

ఆటోలు కదిలాయి.

'ఏమౌతోందీ...'

'తన ప్రాణం విడిచిన దేహం వెళుతోందీ...'

కళ్ళముందునుండి మరుగైపోయిన ఆటోల శబ్దం వినిపిస్తోంది-

'తన మనసును మరిచిన మనసెటు వెళుతోందీ...

పున్నమిలేని వెన్నెల మిగిలింది...'

★ ★ ★

మహాలింగం వెళ్ళిపోయాక రాజుకు ఒంటరితనంలోని బాధ ఎక్కువనిపించింది. అమృతాన్ని అరక్షణం రుచిచూసి వదిలేసినట్టు, కొన్ని నెలలు ఆయనతో కలిసివుండి విడిపోయాక 'తన' అనే మనిషి వున్నప్పుడుండే సంతృప్తి, అలా లేనప్పుడుండే వెలితి మూలంగా మరింతగా ఎక్కువైనట్టు అనిపించింది.

రాణి తనకివ్వగల ఆనందం ఏమిటో అప్పుడు మరింత స్పష్టంగా అవగతమయింది. గుండెల్లోని బరువు తీరిపోయేట్టు ఆర్తిగా పెనవేసుకునే తోడు కావాలన్న తపన మరింతగా కలచివేయసాగింది. రాణిని పెళ్ళిచేసుకోవటమంటే, తన పరిస్థితికి ఆమె తల్లిదండ్రులు ప్రళయం సృష్టించవచ్చు. కానీ ఎక్కువరోజులు ఒంటరిగా వుంటే తనకు పిచ్చెక్కిపోతుందేమోననిపించసాగింది.

అప్పుడు ఓరోజు రాజారాం బృందం వచ్చారు సాయంత్రంపూట. మహాలింగం అక్కడ వుండటంలేదని, పక్కనే వున్న ఇంటియజమాని చెప్పడంతో ఉత్సుకత ఆపుకోలేక సాయంత్రంకల్లా రాజును అడగాలని మళ్ళీ వచ్చారు వాళ్ళు. వాళ్ళను చూడగానే ఆ వృద్ధుల జీవితంలోని నైరాశ్యం ఏమిటో మరో సారి స్పష్టంగా అర్థమయింది రాజుకు.

తనకు ఏమీకాని మహాలింగంతో కొన్నినెలల పాటు కలిసుండి విడిపోతే, వయసులోవున్న తనకే అంత వెలితిగా అనిపిస్తే జీవిత చరమాంకంలో వున్నవాళ్ళకు తమ పిల్లల్ని వదిలేసి, ఎవరూ లేని అనాథల్లాంటి జీవితం గడపాల్సిరావటం ఎంత నిస్తేజంగా, నిస్పృహ



కలిగించేదిగా వుంటుందొకదానసిపించింది. దాన్ని అధిగమించటానికి చిలిపి పనులుచేసి, యితరులను అల్లరిపట్టించి ఆనందించ టంలాంటిది చేస్తుంటారనిపించింది. కానీ అది కూడా ఎంత దయనీయమైన స్థితి, కన్నబిడ్డల ఆదరణలో, ఇంటిపెద్దగా, హాయిగా, ఆనందంగా వుండాల్సిన వయసులో, ఎంత సరదాగా వుండటానికి ప్రయత్నిస్తున్నప్పటికీ, ఎవరూలేని దిక్కులేని బతుకీడుస్తూ, చావుకోసం ఎదురుచూడటం ఎంత నిర్భాగ్యమైనది.

"ఏమిటోయ్, ఆలోచనలో పడ్డావు. మీ లవర్ పిల్లతో అపాయింట్‌మెంట్ ఏమైనా వుందా చెప్పు, వెళ్ళిపోతాం" అన్నాడు చలపతి.

"విణ్ణి చూస్తే తెలీటంలేదూ. పప్పుసుద్ద మొహం. ఆ పిల్లతో కనీసం మళ్లీ ఓసారి మాట్లాడైనా వుండడు" పెదిమ విరిచాడు రాజారాం.

"ప్రేమ. ప్రేమించటంలోని విధముల గురించి బోధిస్తాను. దణ్ణం పెట్టుకో. వల వెయ్యటం ఎలా, వశపరుచుకోవటం ఎలా, వదిలించుకోవటం ఎలా, వశీకరణ మంత్రాలు, ప్రయోగ, ఉపసంహరణలు, కామసూత్రం మంచిదా, మాలా-శ్రీ మంచిదా అన్నదానిపై చర్చ, వగైరా, వగైరా, సంప్రదించండి, త్వరపడండి, సీట్లు పరిమితం, ఆలసించిన ఆశాభంగం"

చలపతి చెబుతున్న విధానానికి నవ్వొ



చ్చింది రాజుకు.

"నవ్వుతావేంట్రా సన్నాసీ. తలలు పండిన వాళ్ళం, నీ అదృష్టంకొద్దీ నీకు దొరికాం. మా దురదృష్టంకొద్దీ మాకు నువ్వుతప్ప మరొకరు దొరకలేదు" నిట్టూర్చాడు రాజారాం.

"అవున్రా, మనం ముగ్గురమూ కలిసి సెక్స్ ఎడ్యుకేషన్ స్కూలొకటి పెడితే ఎలా వుంటుందిరా. ఇటు కాలక్షేపం, అటు ఆదాయం" హుషారుగా అన్నాడు చలపతి.

"ప్రాక్టికల్స్ వుంటే తప్ప ఎవరూ రారు. లేపోతే నేను ఎప్పుడో పెట్టేవాణ్ని" అన్నాడు థామస్.

"అవునురోయ్... అందరూ వీడిలాంటి బుద్ధభగవానులే వుండరుకదా"

"బుద్ధభగవానుడు కూడా సంసారం చేసి కొడుకును కన్నాడురా బాబూ, అందుకేగదా 'కామిగానివాడు మోక్షకామిగాడ'ని అన్నాడు వేమన్న"

రాణితో తన పరిచయం ఎంతదూరమొచ్చిందో వాళ్ళకు చెప్పి, వాళ్ళ రియాక్షన్ చూడాలన్న కోరికను మనసులోనే వుంచేసుకుని, లోలోపల నవ్వుకున్నాడు రాజు.

"నోట్లో బెల్లంముద్ద పెట్టుకున్నట్టు అలా మాట్లాడకుండా కూర్చుంటావేంట్రా"

"ముందుగా మీరు భోజనం యిక్కడ చేస్తారా చెప్పండి. వంట చేయటమా, హోటల్లో తినటమా తేల్చుకుంటే తరువాత మాట్లాడుకోవచ్చు"

"ఇవాళ మా కరీంగాడు చేపలు పట్టుకొచ్చాడు. అక్కడ వంటవాడేమో పులుసుకోసం మసాలా నూరుతున్నాడు. ఈసారికి వదిలెయ్యరా బాబూ"

"ఐతే పదండి, ఇక్కడ విశ్వనాథంగారని, మిరపకాయ బజ్జీలేస్తాడు. నాలుగు తినేసి వచ్చి కూచుందాం. లేదా నన్ను వెళ్ళి తెమ్మంటే తీసుకొస్తాను"

"విశ్వనాథంగారేమిట్రా మిరపకాయ బజ్జీల వాడిని. వాడి కూతురుకేమైనా లైను కలిపావేంటీ?"

"ఆయన రిటైర్డ్ టీచరు. బతుకుతెరువు కోసం ఏదో చేసుకుంటున్నాడు. చాలా మంచాయన. ఆయనదో పేద్ద కథ... చెబుతాను పదండి"

"ఐతే వెళ్లటమే బెస్టు. ఆ అవతార పురుషుడెవరో చూసి తరిద్దాం పదండి" అంటూ లేచాడు థామస్.

ఇల్లు తాళంవేసి,. అందరూ బైటపడ్డారు.

బజ్జీలు కూడా బండి తీసేసి, ఓ కుర్రాణ్ని పెట్టుకుని యింటిదగ్గరే చేయిస్తున్నాడు విశ్వనాథం.

"మీ బజ్జీలేదో లడ్డూలంత తియ్యగా వుంటాయనీ, తినకపోతే జీవితం వేస్టనీ చెబుతున్నాడు మావాడు. ఓ నాలుగు తినిపించుకోండి" అన్నాడు చలపతి.

"లడ్డూల్లాగా వుంటే ఈపాటికి కొట్టు మూసేసుకుని ఇంట్లో కూచునేవాణ్ని. సిసలైన ఆంధ్రా మిరపకాయ బజ్జీలలాగే వుంటాయి. తిని చూడండి ముందుగా" అన్నాడు విశ్వనాథం.

"పదినిమిషాలు చూసుకోరా, యిలా కూచుంటాను" అని, వ్యాపారం కుర్రాడికి అప్పగించి, వాళ్ళతోపాటుగా అరుగుమీద కూర్చున్నాడు విశ్వనాథం.

"ఎలావుంది మాస్టారూ, అప్పడాల వ్యాపారం" అరాతీశాడు రాజు.

"ఈ నెలలో ఈ రెండూ మూసేద్దామనుకుంటున్నానయ్యా. కొత్తకాలనీల్లో కూడా బాగా అమ్ముడవుతున్నాయి. పుంజుకుంటున్న టైంలో [illegible] మంచిదికాదు" అన్నాడు



విశ్వనాథం.

"ఓహో, 'పెన్నార్‌ఫుడ్స్' అని పోస్టర్లు చూశాను. మీదేనా అది. ఆంధ్రావడియాలకు అరవపేరు పెట్టారేంటీ?" అడిగాడు థామస్.

"పొరుగింటి పుల్లకూర రుచి సామెత మీకు తెలుసుకదా. పేరునుబట్టి తమిళదేశానివనుకుంటే తప్పకుండా కొని, ఎంతైనా అరవాడు అరవాడే, ఏదీ మనవాళ్ళను చేయమను యిలాంటివి, అనుకుంటూ తింటారు"

"ఏదో మసాలాపొళ్ళు కూడా చేస్తున్నానన్నారు... అదేమయింది" ప్రశ్నించాడు రాజు.

"ధనియాలపొళ్లూ, కారంపొళ్ళూ యింకా కొంటారా జనం. బోల్డు కంపెనీలున్నాయిగదా" అన్నాడు రాజారాం.

"అబ్బే... అవికాదు. మా ఆవిడ చేతిరుచి అందరికీ చూపిద్దామని ప్రయత్నం. టమాటా కూర మసాలా, గుత్తొంకాయ కూరమసాలా, యిలా వెరైటీ మసాలాలు చేద్దామని అనుకున్నాను. ప్రస్తుతానికి వాయిదా వేయాల్సివచ్చింది"

"అప్పడాలూ, వడియాలకన్నా బాగా అమ్ముడవుతాయండీ. అసలు రానివాళ్ళకూ, ఓపికలేనివాళ్లకూ చాలా అందుబాటులో వుంటాయి" చెప్పాడు చలపతి.

"అసలు మా స్లోగన్ కూడా అదే - వంటరానివారికి వరం, వంట తెలిసినవాళ్ళకు సుఖం, కావేరీఫుడ్ పౌడర్స్. కానీ ప్యాకింగ్ కవర్లదగ్గరొచ్చింది చిక్కు. ఫాయిల్‌ప్యాక్ తప్ప వేరేది బావుండదు. ముందు చూడటానికి గొప్పగా లేకపోతే జనం కొనరు. కానీ ఫాయిల్ ప్యాకింగంటే అతి తక్కువ కవర్లకు యాభైవేల రూపాయలవుతుంది. అంతకన్నా తక్కువ ఆర్డర్ తీసుకునేవాళ్ళు లేరు. అందుకే వచ్చే సంవత్సరం, కాస్త నిలదొక్కుకున్నాక మొదలెడదామనుకుంటున్నాను"

"మీలాంటివాళ్ళకు పిల్లలుంటే చాలా ఆనరాగా వుండేది. పిల్లలు లేకపోవటం మీ దురదృష్టం. మా పిల్లలు వుండే మాకు పనికిరాలేదనుకోండి" నిట్టూర్చాడు రాజారాం.

"మరి యింకా ఎందుకండీ పిల్లల గురించి అనుకోవటం" తేల్గ్గా తీసేశాడు విశ్వనాథం.

"మిమ్మల్ని చూస్తుంటే మాక్కూడా ఏమైనా చేయాలనిపిస్తూంది. కానీ పెట్టుబడి పెట్టేవాడే

లేదు. ఏంచేయాలో కూడా తోచదు'' అన్నాడు చలపతి.

''మొదలెట్టినప్పుడు నా పెట్టుబడి వంద రూపాయలండీ. అంతే... డబ్బు విషయం వదిలేయండి. మీరేమైనా చేయాలని నిజంగా అనుకుంటే నాకు సహాయంచేయండి. ఏంచేయాలో ఏమిటో తరువాత తీరిగ్గా మాట్లాడుకుందాం''

''తిరగటం, అమ్మటం, యిలాంటివన్నీ చేసే ఓపికలేదండీ''

''మీరు చేయాలనుకుంటే చేయగలిగినపనులే చెబుతాను. అజమాయిషీ చేయటం, లెక్కలు రాయటం, యిలా ఎన్నో వున్నాయి. బాదరబందీలేని మీలాంటివాళ్ళను నమ్ముకుంటే మోసంచేస్తారనే భయం కూడా వుండదు నాకు. 'గ్రాడ్యుయేట్స్ హోటల్' అనీ, 'పోస్ట్‌గ్రాడ్యుయేట్స్ సర్వీసెస్' అనీ చాలా కనిపిస్తున్నాయిామధ్య. వెరైటీగా మనది 'సీనియర్ సిటిజన్స్ ఫర్మ్' అవుతుంది.

''సీనియర్ సిటిజన్స్! ఎంత అందంగా చెప్పారు మీరు. పాశ్చాత్య దేశాల్లో వయసుమీరినవాళ్ళను మనలాగా ముసలాళ్ళని తీసిపారేయకుండా అలా గౌరవంగా పిలుస్తారట. బస్ ఛార్జీలు, ట్రెయిన్ ఛార్జీలులాంటివాటిల్లోనేకాక హోటళ్ళు, సినిమాలువంటి ప్రైవేట్‌వాళ్ళదగ్గర కూడా వాళ్ళకు కన్సెషన్లిచ్చి ఆదరిస్తారట. మనదగ్గర అలాంటిరోజులు ఎప్పుడొస్తాయో'' నిట్టూర్చాడు థామస్.

''ఎవరూ, ఏదీ చేయటంలేదనుకోవటంకన్నా మనకు మనం ఏం చేసుకోగలమో ఆలోచించుకోవటం మంచిదండీ. నామట్టుకు నాకు అలాగే అనిపిస్తూంది'' అన్నాడు విశ్వనాథం.

''మీకు పిల్లలు లేరుగనుక అంత తేలిగ్గా అన్నారు. జీవితమంతా కష్టపడి, వాళ్ళను పెంచి, వృధాప్యంలో ఆదుకుంటారనుకుంటే, యిలా వదిలేసినప్పుడు కలిగే మనస్తాపం చెబితే అర్థమయ్యేది కాదండీ'' భారంగా చెప్పాడు చలపతి.

''వయసూ, ఆరోగ్యం, శక్తీ యివన్నీ పోయాయి. వాటితోపాటే పిల్లలూ అనుకుని సరిపుచ్చుకోవాలి. కొన్నింటిని మరిచిపోవటంకన్నా పరిష్కారంలేదండీ''

''మీ వ్యాపారం చెడగొడుతున్నట్టున్నాం. మరి వెళతాం మాస్టారూ'' అందరూ అక్కణ్ణించి కదిలారు.

చాలాసేపు విశ్వనాథం గురించే మాట్లాడుకున్నారు. ఎనిమిదింటికి వాళ్ళను ఆటో ఎక్కించేసి, హోటల్లో భోజనంచేసి యింటిదారి పట్టాడు రాజు. ఇంటికివెళ్ళేదాకా ఆ వృద్ధులగురించీ, అలాంటి అనేకమంది గురించే ఆలోచిస్తూ యిల్లుచేరాడు. పుస్తకాలు ముందేసుకుని పదినిమిషాల్లో అన్నీ మరిచిపోయి వాటిలో నిమగ్నమైపోయాడు.

★ ★ ★

''ఇవన్నీ సరిగ్గా చదువు. డౌట్సేమైనా వుంటే రేపు... ఒకే'' పుస్తకాలు మూసేస్తూ అంది రాణి.

''మరి బయలుదేరదామా?'' అడిగాడు రాజు.

''అమ్మో, ఏడయింది, పదపద'' అంది రాణి లేచి నిలుచుంటూ.

''ఎప్పుడెళ్ళినా యింట్లో అడిగేవాళ్ళు లేరుగదా, ఎందుకంత కంగారు'' పుస్తకాలు సర్దుకుని లేచి నిలబడుతూ అన్నాడు రాజు.

''అడగేవాళ్ళు లేరుగనుక పెళ్ళికాని అమ్మాయి రాత్రిదాకా షికార్లు కొట్టొచ్చా ఏంటి? నీకేం, నువ్వు మగాడివి'' చిలిపిగా అంది రాణి.

''నిజంగా నిన్నర్థం చేసుకోవటం చాలా కష్టం. ఎప్పుడేం మాట్లాడుతావో తెలీదు''

''నన్నర్థం చేసుకోకున్నా మునిగేదేమీ లేదు. ఎటూ నిన్నే పెళ్ళిచేసుకుంటాను. కానీ కాస్త పాఠాలు అర్థంచేసుకోవటంలోమాత్రం అశ్రద్ధ చేయకు. నేనుగానీ నీ టీచర్‌నైతే రోజూ తన్నేదాన్ని'' మోటార్‌సైకిల్‌పైన కూర్చుంది రాణి.

''నువ్వు టీచర్‌కాకపోవటంవల్ల బోల్డుమంది కుర్రాళ్ళ వీపులు సురక్షితంగా మిగిలిపోయాయన్నమాట... శుభం!''

రాజు భుజమ్మీదానించిన చేత్తో గట్టిగా గిల్లింది. కెవ్వుమని అరిచాడు రాజు.

''అబ్బ... మరీ అంత గట్టిగానా'' వాపోయాడు.

''ప్రేమవున్నవాళ్ళే గట్టిగా గిల్లుతారు... బాధపడకు''



"నీ ప్రేమ సూత్రాలు బానే వున్నాయిగానీ, యింత రాక్షసిప్రేమ భరించటంమాత్రం చాలా కష్టం"

"ఇప్పుడే ఏంచూశావ్, పెళ్ళయ్యాక చూపిస్తా నా తడాఖా"

కోపంతో స్పీడుపెంచాడు రాజు. మోటార్‌సైకిల్‌పైన కూర్చున్నా భుజం పట్టుకోవటం తప్పిస్తే, అనుకుని కూచోదు రాణీ. అతను స్పీడు పెంచటంతో కుదురుగా కూర్చోవటం కుదర్లేదు. గట్టిగా అరిచింది వెంటనే-

"ఏయ్, స్పీడ్ పెంచితే చెయ్యొదిలేస్తాను, నీయిష్టం"

వెంటనే మామూలుగా వెళ్ళే స్పీడ్‌లోకొచ్చింది మోటార్‌సైకిల్.

"ఇలాంటివి చేశావంటే అసలు నీ మోటార్ సైకిల్‌మీద రానింకోసారి" బెదిరించింది.

"సారీ" అన్నాడు రాజు వెనక్కి తిరిగి చూసి.

"సారీ ఎందుకు. నిజానికి ఈమాత్రం చిలిపిదనం వుండాలనుకో. కానీ నేనిలా వాటికి తందానా పాడకుండా కూడా వుండాలి. అదే సరదాకదా"

మహాలింగం వెళ్లిపోయినప్పట్నించీ రాణిని ప్రతిరోజూ కలుసుకోవటం మొదలెట్టాడు రాజు. అతనికోసం ఐదున్నరదాకా కాలేజీ లైబ్రరీలోనో, స్పోర్ట్స్‌రూంలోనో గడపటం అలవాటు చేసుకుంది రాణి. పదినిమిషాల్లో యిద్దరూ బీచ్‌కి వెళ్ళిపోతారు. ఓ గంటసేపు కూచుని యింటిదారి పట్టేవారు. ఓసారి తనకు అర్థంకాని విషయమేదో చెప్పాడు రాజు, ఎంత చదివినా తలకెక్కలేదంటూ. అది అర్థమయేట్టు వివరించి చెప్పి, రాణే అతనికి సలహా యిచ్చింది-

"రోజూ చచ్చుపుచ్చు కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవటంకంటే ఏదో ఓ పుస్తకం తెచ్చుకో. ఇద్దరమూ కలిసున్నట్టూ వుంటుంది. నువ్వు చదువుకున్నట్టూ వుంటుంది. ఎగ్జామ్స్ సెప్టెంబర్‌లోకదాని అలక్ష్యం చేయడమెందుకూ. ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యావనుకో, ఏ నైట్‌కాలేజీలోనో చేరొచ్చు"

అప్పట్నించీ యిద్దరికీ అదే అలవాటయిపోయింది. రాణి చదువులో కూడా చాలా తెలివైనదని గ్రహించాడు రాజు. ఎంత క్లిష్టమైన పాఠమైనా అరటిపండు వొలిచినంత సులభంగా చెప్పేది. కబుర్లు చెబుతున్నట్టుగానే వుంటుందిగానీ ఓ పాఠం పూర్తయిపోతుంది. చెప్పినంతసేపూ సీరియస్‌గా, సిన్సియర్‌గా చెబుతుంది. అంతసేపూ లెక్చరర్‌లాగే కనిపించేది రాజుకు.

రాణివిషయంలో రాజుకు అదే ఆశ్చర్యమనిపిస్తుంది. పాఠాలు చెప్పినంతసేపూ ఓరకంగా వుంటుంది. ఆ తరువాత కాస్సేపు చిలిపిగా అల్లరి చేస్తుంది. ఓసారి చిన్నపిల్లలా మారాం చేస్తుంది. మరోసారి ఆరిందాలాగా హెచ్చరిస్తుంది. ఎన్నిరకాలుగా వున్నా ఒద్దికగా కనిపిస్తుంది. అలాంటి అమ్మాయిని తనలో ఏం ఆకర్షించివుంటుందాని అప్పుడప్పుడూ ఆశ్చర్యపడుతుంటాడు. ఏమీతోచక తన అదృష్టం అనుకుని సరిపెట్టుకుంటాడు

రాఖీపండుగరోజు అనాథాశ్రమం గుర్తొచ్చింది రాజుకు. రెండు, మూడుసార్లు వెళ్ళివచ్చాడు ఆశ్రమానికి. ఉద్యోగంలో చేరిన తర్వాత బొత్తిగా వీలుచిక్కడంలేదు. అంతేకాక, అనాథపిల్లలకంటే అనాథ వృద్ధులు ఎక్కువగా ఆలోచింపచేసేవారు. రాఖీపండుగరోజు ఎవరో ఒకరు సోషల్‌వర్కర్స్ వచ్చి మగపిల్లలందరికీ రాఖీలు కట్టి, స్వీట్లు పెట్టేవాళ్ళు. చిన్నప్పుడు తనక్కూడా రాఖీ వుందీ - అని సంతోషం కలిగేదిగానీ, పది, పన్నెండేళ్ళు వచ్చిన తరువాత అది సంతోషం కలిగించలేదు. ఏదో మొక్కుబడిగా వచ్చి రాఖీ కడతారు. 'తమ్ముడూ' అని పిలిచి స్వీటు తినిపిస్తారు. కానీ, అదే స్వంత అక్కయ్య ఐతే, స్వంత చెల్లెలైతే, ఆ యిదే వేరు. వాళ్ళు వచ్చి రాఖీ కట్టి, అలాంటి స్వంతవాళ్ళులేని లోటును మరోసారి గుర్తుచేస్తున్నట్టుగా అనిపించేది రాజుకు.

ఈసారి రాఖీపండుగకు ఆశ్రమానికి వెళ్ళటానికి కూడా టైంలేదు. ఆఫీసుకెళ్ళాలి. అదీగాక అలా మొక్కుబడిగా కట్టే రాఖీ కట్టించుకున్నా ఒకటే, కట్టించుకోకపోయినా ఒక్కటే. అది తీరని లోటని తెలుసు. ఐనా దిగులుమాత్రం అణచుకోలేదు. స్నానం చేసి, కాఫీ చేసుకుని తాగి, హొటల్లో టిఫిన్ చేయొచ్చుననుకుని ఆ ప్రయత్నం మానేశాడు. ఆఫీసుకెళ్ళటానికి





చాలా టైం వుందిగనుక తీరిగ్గా కూర్చున్నాడు.

అప్పుడు గేటు తీసుకుని యింట్లోకొస్తున్న రాణి కనిపించింది. చాలా ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే మహాలింగం వెళ్ళిపోయాక ఎప్పుడూ యింటికి రాలేదు రాణి. ఓసారి రాజు అడిగితే కూడా అలా రావటం బావుండదని చెప్పింది. అలాంటిది, యింతపొద్దున్నే వస్తూండటం చూసి ఆశ్చర్యపడక తప్పలేదు. కానీ మరుక్షణం ఆ ఆశ్చర్యం మాయమయింది. రాణివెంట మాధవి వుంది.

ఒకటిరెండుసార్లు మాధవిని వెంటబెట్టుకునొచ్చింది రాణి పార్కుకు. అప్పుడు మాధవి పేరు తెలిసిందతనికి. 'అన్నయ్యా' అంటూ కలుపుగోలుగా మాట్లాడేది. కూచున్నంతలో సగంటైం రాణిగురించే చెప్పేది. 'నిన్నే నమ్ముకుంది. దాన్ని అన్యాయం చేయకు. బాగా చూసుకో' అనే అర్థం స్ఫురించేదా మాటల్లో.

ఇద్దర్నీ యింట్లోకి ఆహ్వానించాడు రాజు.

''పాలున్నాయా'' రాగానే రాణి అడిగిన మొదటి ప్రశ్న.

కంగారుగా, వున్నాయని చెప్పాడు.

''నేను కాఫీ చేసుకొస్తాను. అన్నా, చెల్లెళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ కూర్చోండి'' అంటూ మరోమాటకు అవకాశం యివ్వకుండా వంటింట్లోకెళ్ళింది.

''అన్నయ్యా... తలంటుపోసుకోలేదా, యివాళ రాఖీ పండుగ, తెలుసా?'' అంది మాధవి.

నవ్వి వూరుకున్నాడు రాజు.

''నీకు రాఖీ కడదామనొచ్చానన్నయ్యా''

అప్పుడర్థమైంది రాజుకు, ఆ అమ్మాయిని వెంటబెట్టుకుని తీసుకొచ్చింది రాణని.

'ఆశయాలలో, ఆవేదనలో నేనున్నానని నిండుగ పలికే తోడొకరుండిన అదే భాగ్యము, అదే స్వర్గము' - నిజంగా తాను ఎంతో భాగ్యవంతుడు. రాఖీపండుగరోజు రాఖీ కట్టేవాళ్ళు లేరని తాను బాధపడతానని ఆలోచించి పెట్టుకుని, తన స్నేహితురాలిని తీసుకుని వచ్చిందంటే రాణికంటే తనకు భాగ్యం ఏంకావాలింకా అనిపించింది రాజుకు.

రాజుకు మాధవి రాఖీ కట్టింది. అపురూపంగా, ప్రేమగా. స్నేహితురాలు పిలిచిందని మొక్కుబడిగా కాకుండా నిండుమనసుతోనే కట్టింది. ఆరోజు, ఆ రాఖీ కట్టించుకోవటంలో నిజంగా ప్రత్యేకత కనిపించింది. కట్టిన మ్మాయి మనస్ఫూర్తిగా కట్టివుండొచ్చు, లేకపోవచ్చు. కానీ ఆ రాఖీ వెనుక మరో మనసుంది.

''దీనికి అన్నదమ్ముల్లేరు. సరే, మనకు యిక ఆడపడుచైనా యిదేకదాని లాక్కొచ్చాను'' అంది కాఫీలందిస్తూ. ''మొదటిసారిగా ఇంటికొచ్చిన ఆడపడుచుకు కాఫీ కూడా పోయకుండా పంపితే తిట్టుకుంటుంది కదా''

కాఫీలందించి కుర్చీలో కూర్చుంది.

కాసేపు కాలేజీ పరీక్షల గురించీ, యింటిగురించీ మాట్లాడుకున్నారు. అంతలో హఠాత్తుగా అంది రాణి-

''రాఖీ కడితే బుద్ధావతారంలా కట్టించుకుని కూర్చోవటమేనా?''

''స్వీట్ పెట్టాలికదూ. ఐదు నిమిషాలు కూర్చోండి, పట్టుకొస్తాను'' నొచ్చుకుంటూ అన్నాడు రాజు లేచి నిలబడి.

''అమ్మో, ఎంత పీనాసివి నువ్వు. చీరో, జాకెట్టో కొనిపెట్టొచ్చుగదా''

''ఛ, వూర్కోవే నువ్వు'' మొహమాటంగా అంది మాధవి.

''ఊర్కునేదేంటి. అసలు దెబ్బలాడి తీసుకోవాలి'' అని మాధవిని కోప్పడి, రాజువైపు తిరిగి ''పర్సిలా యివ్వు'' అంటూ డబాయించింది.

నవ్వుకుంటూ లోపలికెళ్ళి పర్సు తెచ్చి రాణికి అందించాడు.

దాంట్లోంచి మూడు వందనోట్లు తీసుకుంది. పర్సు తిరిగి యిస్తూ చెప్పింది-

''నేను దీనికి స్వీటు తినిపించి, చీర కొనిపెడతానులే''

''అబ్బ, ఎందుకులేవే'' మళ్ళీ అంది మాధవి.

''నీమొహం, నీకు తెలీదు. పండగంటే ఈమాత్రం ఖర్చు కూడా చేయకపోతే పండగ చేసుకున్న మజానే రాదు''

వంటగదిలో ఓ మూలనున్న దేవుడి ముందరి ప్రమిద కడిగి, దీపం పెట్టి, అక్కడి కుంకుమభరిణ తీసుకొచ్చి, మాధవికి బొట్టుపెట్టింది.



"ఏయ్ మొద్దూ, మళ్ళీ బొట్టు పెట్టవే" గసిరింది మాధవిని.

మాధవి కూడా బొట్టుతీసి రాణికి పెట్టింది.

"అసలు పెళ్ళికాని అమ్మాయిలు యిలా బొట్టుపెట్టుకోవచ్చా?" అడిగింది మాధవి.

"బొట్టు పెట్టుకోవటం మన సంప్రదాయం. అందులో పెళ్ళయినవాళ్ళు, కానివాళ్ళు అనీ క్లాజులేం లేవు" భరోసా యిచ్చింది రాణి.

"అన్నయ్యా... సాయంత్రం యింటికి రావాలి. భోజనంచేసి వెళుదువుగానీ" ఆహ్వానించింది మాధవి.

"అబ్బే, ఎందుకమ్మా"

"ఏయ్, అది అంత చక్కగా పిలుస్తుంటే 'అబ్బే, ఎందుకమ్మా' ఏమిటి? తప్పకుండా వస్తాడుగానీ, నువ్వు పదవే, యిక వెళదాం"

ఇద్దరూ వెళ్ళిపోయారు.

ఆరోజు సాయంత్రం పార్కులో కలిసినప్పుడు గుర్తుచేసింది రాణి-

"మాధవి యింటికి వెళ్ళాలి. అది ఎదురు చూస్తుంది. నేను కూడా వస్తానులే, మొహమాట పడకు" అంటూ అడ్రెస్ చెప్పింది.

"నువ్వు కూడా వస్తున్నానన్నావుగా. మళ్ళీ అడ్రెస్ చెప్పటం ఎందుకు?"

"ఇద్దరం కలిసి వెళితే వాళ్ళింట్లో ఏమనుకుంటారు... నేను వెళ్ళాక పావుగంటకు రా నువ్వు" అని చెప్పి, వెళ్ళిపోయింది.

మాధవి యింట్లో ఆ అమ్మాయి తాతయ్యా, నానమ్మలకున్న గౌరవం, విలువా చూసి చాలా ఆశ్చర్యపోయాడు రాజు. మాధవి తల్లిదండ్రులు బాగా ఆదరించారు రాజుని. మాధవి చెల్లెళ్ళిద్దరూ కూడా రాఖీలు కట్టారు. తను తీసికెళ్ళిన స్వీట్సు యిచ్చాడు. మాధవి తండ్రితో మాట్లాడుతూ కూర్చున్నాడు. ఆ యిల్లు స్వర్గంలా కనిపించింది రాజుకు. తల్లి దండ్రులు ఎంత బాగా వుంటే పిల్లలూ అలాగే పెరుగుతారు. ఇల్లూ అలాగే వుంటుంది. అలాంటి యింట్లో పుట్టిన పిల్లలు అదృష్ట వంతులు. అలాంటి పిల్లలున్న తల్లిదండ్రులూ అదృష్టవంతులు అనుకున్నాడు రాజు, ముసలాళ్ళ విషయంలోనూ, పిల్లల విషయంలోనూ.

కన్నతల్లి కొసరి కొసరి తినిపించడమంటే ఏమిటో అప్పుడు తెలిసింది రాజుకు. వాళ్లు పెట్టిన భోజనంతో కడుపునిండటంకన్నా ఎక్కువగా వాళ్ళు చూసిన ఆదరంతో మనసునిండి పోయింది. అందరి దగ్గరా సెలవు తీసుకున్నాడు. మళ్ళీ తప్పకుండా రావాలని మాధవి తండ్రి మరీ, మరీ చెప్పాడు. మోటర్ సైకిల్ ఎక్కి, వీధి మలుపు తిరిగి అక్కడ ఆగిపోయాడు. పదినిమిషాల్లో వచ్చింది రాణి.

"వాళ్ళింట్లో అందరికీ నచ్చావు నువ్వు"

"అంటే, మన విషయం వాళ్ళకు తెలుసా?"

"తెలుసు... మాధవి వాళ్ళమ్మ నిన్ను తీసుకు రమ్మని ఎప్పట్నించో చెబుతూంది. ఇవాళ సందర్భం కుదిరింది గనుక చూపించాను"

"మరి యిద్దరం కలిసివెళదామంటే వద్దన్నావు"

"అవును... వాళ్ళకు తెలిసినంత మాత్రాన పెళ్ళవకుండానే అలా వెళతారా? పెద్దవాళ్ళంటే భయభక్తులుండొద్దూ"

"అది సరే, యిప్పుడేమవుతుంది?"

"రేపు మన పెళ్ళికి మా వాళ్ళు గొడవ చేస్తే మనను సపోర్టు చేయడానికి ఒక్కరైనా వుంటారు"

"రాణీ, మనం పెళ్ళి చేసుకున్నాక మనిల్లు కూడా అలాగేవుంటుందికదూ"

"ఊహుఁ మనకు యిద్దరు మాత్రమే పిల్లలుంటారు"

వీధి మలుపులో రాణిని వదిలేసి, యింటి కెళ్ళాడు రాజు. తాళం తీసి యింట్లో అడుగు పెట్టగానే పొద్దున జరిగిన వన్నీ గుర్తుకొచ్చాయి. రాణి వంటింట్లోంచి కాఫీ తీసుకురావటం, తనతో దెబ్బలాడి తన పర్సులోంచి డబ్బులు తీసుకోవటం, మాధవికి బొట్టుపెట్టటం, మళ్ళీ తనకూ బొట్టు పెట్టమని కసురుకోవటం, మొదటిసారిగా వచ్చిన ఆడపడుచని మాధవిని సంబోధించి చెప్పటం అన్నీ తలుచుకుంటుంటే మధురంగా, అపురూపంగా అనిపించింది. అది గుర్తొచ్చినప్పుడల్లా తామిద్దరూ తొందరగా పెళ్ళి చేసుకుంటే బావుణ్ణని




పిస్తూ వుంటుంది.

మళ్ళీ ఓసారి రాణి యింటికొస్తే బావుణ్ను అనిపించసాగింది.

టక్కున తలమీద మొట్టికాయ పడగానే ఉలిక్కిపడ్డాడు.

"ఏంటీ, నెమ్మదిగా పోనియ్యమంటే కోప మొచ్చిందా రాజాగారికి"

"ఊహు, రాణీగారు నా యింట్లోకి రావా లంటే ఏం చేయాలా అనిఆలోచిస్తున్నాను" బదులిచ్చాడు రాజు.

"నాదేముంది, అంతా నీ చేతుల్లోనే వుంది. ఒక్క వసువుతాడు, మూడు ముళ్ళు, ఏడడుగు లు, ఆ తరవాత నువ్వు పొమ్మన్నా పోకుండా వుంటాను"

"నిన్ను పొమ్మని ఎందుకంటాను. నువ్వు పోతానన్నా కట్టిపడేసుంచుతాను"

వీధి మలుపులో రాణిని దింపేసి, తమ పెళ్లి జరిగితే ఎంత బాగావుంటుందో ఆలో చించుకుంటూ యింటివైపు దారి తీశాడు. గేటు బైట మోటర్ సైకిల్ ఆపి, దిగి గేటు తెరిచాడు. గేటు తీస్తుండగా గుమ్మంలో ఎవరో వున్నట్టు అస్పష్టంగా అనిపించింది.

"ఎవరూ, ఎవరది" అన్నాడు గట్టిగా.

గుమ్మంలోని ఆకారం కదిలింది.

"ఎవరది" మోటర్ సైకిల్ వదిలేసి కుతూ హలంగా నడిచాడు లోపలికి.

నిస్త్రాణగా గుమ్మంలో కూచునున్నాడు మహా లింగం.

"డాడీ" సంతోషంగా అన్నాడు "నువ్వు వస్తున్నానని ఆఫీసుకు ఒక్క ఫోన్ చేస్తే నేనొచ్చి తీసుకొచ్చేవాణ్నిగదా"

ఆయన ముందర కూచున్నాడు.

"తాళం తియ్యి బాబూ, దాహంగావుంది" నీరసంగా అన్నాడు మహాలింగం. ఆయన గొంతులో దీనత్వం తొంగి చూసింది.

"ఏమైంది డాడీ" తాళం తీస్తూ అడిగాడు.

లైట్లు వేసి బైటికొచ్చాడు. మహాలింగం ఒళ్ళంతా దుమ్ముకొట్టుకుపోయివుంది. అక్కడ క్కడా నెత్తుటి మరకలు. అవాక్కయిపోయాడు. ఏం జరిగింటే ఆలోచిస్తూ, ఆయన్ని సాయం పట్టి యింట్లోకి తీసికెళ్ళిమంచంమీదకూచోబెట్టి. వెళ్ళి మంచినీళ్ళు తెచ్చిచ్చాడు. గబగబా తాగేసాడాయన.

ఆయన వాలకం చూస్తే ఏదో జరిగిన ట్టుంది. కానీ ఏం జరిగుంటుందో తోచలేదు.

"డాడీ, భోజనం చేశావా"

లేదన్నట్టు తల అడ్డంగా వూపాడాయన. వెళ్ళి తీసుకు వద్దామంటే ఆయనవున్న స్థితిలో ఆయన్ని వదిలిపోవటానికి మనసు రాలేదు. తీసికెళదామంటే ఆయన కదిలే స్థితిలో లేడు.

"ముందు కాఫీ తెస్తాను డాడీ. అది తాగు తూండు. అరగంటలో భోజనం తయారు చేస్తా ను"

"పద బాబూ, నేనూ వస్తాను" అంటూ రాజుతోపాటు వంటగదివైపు నడిచాడు. ఆయ నకో కుర్చీ వేసి, కాఫీ తయారు చేశాడు. ఆయన కాఫీ తాగుతుండగా బియ్యం పొయ్యి మీద పడేసి, కూరలు తీసుకున్నాడు రాజు, కడగటానికి.

"నన్ను యింట్లోంచి వెళ్ళగొట్టార్రా" ఏ ఉపో ద్ఘాతమూ లేకుండా చెప్పాడు మహాలింగం.

అలాంటిదేదో జరిగివుంటుందనుకున్నాడు గానీ అదే జరిగిందని ఆయన చెప్పేసరికి అప్రయత్నంగా నిశ్చేష్టుడయ్యాడు, నిజంగానే జరిగిందని తెలిసి.

"అలాంటి వాళ్లు ఎందుకు తీసికెళ్ళారట డాడీ!"

"నా కొడుకూ, కూతురూ నా మీద ప్రేమతో వచ్చారనుకుని ఎంతో సంతోషంగా, నిన్ను కూడా అర్థాంతరంగా వదిలేసి వెళ్ళిపోయాను. మావిడితోట నాపేరు మీదే వుందని అది రాయించుకోవడానికి తీసికెళ్ళార్రా నన్ను. బ్యాంకులోవున్న బ్యాలెన్సు కూడా తీసుకున్నా రు. రెండూ ఐపోయిన మరునాటినుండీ నన్ను పనివాడిగా చూడటం మొదలెట్టారు. నిన్ను పెంచుకున్నందుకు తిట్టారు. చివరకు నిన్న యింట్లోంచి బైటికి గెంటేశారు. తాళాలు వేసు కుని ఎక్కడికో వెళ్ళిపోయారు. జేబులో చిల్లిగ వ్వకూడా లేదు. నిన్న రాత్రి నుండీ నడుచు కుంటూ వచ్చేసరికి సాయంత్రమయింది. నీకోసం ఎదురు చూస్తూ గుమ్మంలో కూచున్నా ను"

ఆయన చెప్పింది వింటుంటే కడుపులో దేవినట్టయింది రాజుకు. సుమారు ముప్పై కిలో మీటర్లు, తిండీ, నీళ్ళూ లేకుండా నడిచొచ్చాడనగానే కడుపు తరుక్కుపోయింది. దుర్మార్గులు, ఆస్తి తీసుకుంటే తీసుకున్నారు. తీసుకొచ్చి యిక్కడ దింపేయొచ్చుగదా. కన్న తండ్రి అనే ప్రేమలేకపోతే పోయింది. కనీసం ఆయన వయసు చూసి జాలికూడా కలగలేదా వాళ్ళకు. రాక్షసులంటే కొమ్ములూ, కోరలతో వుండరు ఇలాంటివాళ్ళే నేమో.

కూర పొయ్యి మీద పడేసి, ఆయన పక్కన కాళ్ళు వత్తుతూ కూర్చున్నాడు రాజు.

"నీళ్ళు పెడతాను, స్నానం చేస్తావా డాడీ"

చేస్తానన్నట్టు తలూపాడు. వెంటనే నీళ్ళు కాగబెట్టి, బాత్‌రూంలో పెట్టాడు. వీపురుద్ది, తలంటి, దాదాపు తనే స్నానం పోసాడు. రాజు లుంగీ కట్టుకుని, టవల్ కప్పుకుని కూచున్నాడు మహాలింగం.

అప్పటికి వంట పూర్తయింది వడ్డించాడు. భోజనం చేస్తూ చెప్పాడు మహాలింగం

"నీ దగ్గర వుందామని రాలేదురా, అట్నించటే ఎక్కడికైనా పోదామనుకున్నాను కానీ ఒక్కసారి నిన్ను చూసి పోవాలనిపించి వచ్చానురా"

"ఏం డాడీ, నా దగ్గరుండకూడదా నువ్వు" దీనంగా అడిగాడు రాజు.

"ఏ మొహం పెట్టుకుని వుండాలిరా నీ దగ్గర. ఉన్నదంతా వాళ్ళకు వూడ్చిపెట్టాను. భారమంతా నీ మీద వేసి ఏమని వుండమంటావురా"

"నాకు నువ్వు భారమేంటి డాడీ నువ్వలా అనుకుంటే నేను చచ్చిపోయినంత ఒట్టు. ఐనా ఒకరి దయాధర్మం మీద ఆధారపడాల్సిన ఖర్మ నీకేంటి డాడీ. ఎక్కడున్నా నీ పెన్షన్ నీకు సరిపోతుంది. సరిపోకపోయినా నా దగ్గర పోట్లాడి వుండే హక్కుంది నీకు. నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళొద్దు"

"ఆ క్షణంలో భగవంతుడు నాకా బుద్ధి పుట్టించాడు గనుక నువ్వు మిగిలావురా నాకు. నువ్వు రాజావని తెలుసురా నాకు. ఐనా కన్న పిల్లలే అంత పని చేశారు. నువ్వు నన్ను వుంచుకోవడానికి నీకేం బాధ్యతుందని? నువ్వు కూడా వాళ్ళలాగే వెళ్ళగొడితే ఏ కాశీకో వెళ్ళిపోదామనుకున్నానురా"

"ఎలా అనుకున్నావు డాడీ అలా? వాళ్ళకు ఆస్తి కావాలేమోగానీ, నాకు మాత్రం నువ్వే కావాలి. నా ఉద్యోగమూ, ఈ యిల్లూ, యివన్నీ నువ్విచ్చినవే డాడీ. నేను బతికున్నంత కాలం నువ్వు ఏ చింతా లేకుండా వుండు. నీకు ఏ బెంగా అక్కర్లేదు డాడీ నేనున్నాను"

జలజలా కన్నీళ్ళు కార్చాడు మహాలింగం.



ఓ ఆదివారం పూట మహాలింగంను వెంటబెట్టుకుని హెూమ్‌ఫర్ ఏజ్‌డ్‌కు వెళ్ళాడు రాజు. చాలా ప్రయత్నం మీద ఆయన్ని బయలుదేర దీయాల్సివచ్చింది. మొదటిసారి కంటే రెండోసారి జరిగిన సంఘటన ఆయన్ని బాగా కుంగదీసింది. మునుపటి ఉత్సాహం, చమత్కారాలూ, కోపగించుకోవటాలూ అన్నీ పోయాయి. మనిషి బాగా కుంగిపోయాడు.

భోజనం చేయటం దగ్గర్నించీ స్నానం చేయటం వరకూ ఏ పని మీదా ఉత్సాహం చూపడు. నిస్త్రాణగా కుర్చీలో కూర్చుని శూన్యంలోకి చూస్తుంటాడు. రాజు బలవంతంగా చేయిస్తేగానీ ఏ పనీ చేయడు. మనిషి బాగా కుంగిపోయాడు. ఆయనలో జీవితంపట్ల ఆసక్తి తగ్గిపోయింది. ఆయన్ని మునుపటిలా వుంచటానికి తాను చేయగల ప్రయత్నాలన్నీ చేశాడు రాజు. కానీ ఒక్కటీ ప్రయోజనం కలిగించలేదు.

జరిగిందంతా రాణితో చెప్పుకుని వాపోయాడు రాజు. అప్పట్నించీ రోజూ కాలేజీ నుండి తిన్నగా రాజు యింటికి వచ్చి, రాజు ఆఫీసు నుండి వచ్చేంత వరకూ మహాలింగంతో కూర్చోవటం అలవాటు చేసుకుంది రాణి.




"ఎందుకమ్మా నాకోసం నీకింత తాపత్రయం. ఆడీ పాడే వయసు. హాయిగా నీ పనులు నువ్వు చూసుకోక ఈ ముసలాడి కోసం నీ టైమంతా వృధా చేసుకుంటావు?" నిస్త్రాణగా అన్నాడొసారి.

"మావయ్యా, మీకు తెలీదు కదూ. రాజూ, నేనూ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం"

"నిజమా అమ్మా!" సంతోషంగా అడిగాడు

"ఔను మావయ్యా. మీరేమంటారోనని ఇన్నాళ్ళూ మీకు చెప్పలేదు"

"నీలాంటి కోడలు వస్తానంటే ఏమంటానమ్మా నేను... మీ యింట్లో ఒప్పుకున్నారా?"

"వాళ్ళు ఒప్పుకోరు మావయ్యా. కానీ మీరు సరేనంటే మా పెళ్ళి ఆగదు"

"నేను చచ్చిపోయేలోగా ఆ ఒక్క ముచ్చటా చూడగలనామ్మా

"మీరెందుకు చచ్చిపోవాలి మావయ్యా? రాజు నా ప్రాణం. మీరు రాజు ప్రాణం. అలాంటి మిమ్మల్ని నేనెలా చచ్చిపోనిస్తాను. మా పిల్లల్ని ఎవరాడిస్తారు. వాళ్ళకు తాతయ్యా కావాలంటే మా డాడీ ఎలాగూ రాడు. మరి మీరే కదా వాళ్ళకూ, మాకూ పెద్ద దిక్కు"

"మీ పిల్లల్ని ఎత్తుకుని ఆడించేంత అదృష్టం వుందామ్మా నాకు!"

"నా సంగతి తెలీదు మీకు. నా జాతకంలో రాసిపెట్టుంది. దేవుడిలాంటి మావయ్యా దొరుకుతాడని"

అన్ని రోజుల్లో మొదటిసారి ఉత్సాహంగా, సంతోషంగా మాట్లాడాడు మహాలింగం.

"అంత గొప్ప యింట్లో పుట్టి, సిటీలో పుట్టి పెరిగి, యింత చదువుకునీ, పెద్ద వాళ్ళంటే ఎంత వినయ విధేయతలమ్మా నీకు" ఓరోజు ఆశ్చర్యపడ్డాడు.

"ఎలావున్నా ఏం చేసినా నేను కూడా మనిషినే కదా మావయ్యా. కావాలంటే మాత్రం పెద్దవాళ్ళ సేవ చేసుకునే అదృష్టం అందరికీ దొరుకుతుందా చెప్పండి"

"పెళ్ళవకముందే వాడి రోగిష్టి తండ్రిని యింతలా చూసుకుంటున్నావంటే, యిదంతా మా రాజు అదృష్టమమ్మా, కానీ మీ వాళ్ళు చూస్తే ఈ పెళ్ళికి ఒప్పుకోరంటున్నావు. ఏం గొడవలు జరుగుతాయో, ఏమవుతుందో, మీ పెళ్ళయ్యే వరకూ వుంటానని నమ్మకం లేదమ్మా"

"శుభమాని యివాళ్టినించీ వంట చేద్దామనుకుంటున్నాను. మీరేమో అలా మాట్లాడుతున్నారు. నా చేతి వంట అంత భయంకరంగా ఉంటుందా?"

మహాలింగంకు ఓ కుర్చీ వేసి కూచోబెట్టి, కబుర్లు చెబుతూ వంట చేయటం మొదలెట్టింది రాణి. కోడల్ని యింట్లో చూసుకోవాలన్న మహాలింగం ముచ్చట ఆవిధంగా తీర్చగలిగింది ఆమె.

రాజు ఆఫీసునుండి రాగానే ముఖం కడుక్కోవటానికి బాత్ రూంలో నీళ్ళు పెట్టి, బైటికి రాగానే టవల్‌తో రెడీగా వుంది. కాఫీ అందించింది. ఆరున్నర, ఏడుకల్లా వెళ్ళిపోయింది.

"బంగారంరా అమ్మాయి. నేనెప్పుడు పోతానో తెలీదు. రాణిని మాత్రం కంటికి రెప్పలా చూసుకోరా రాజూ" భోజనం చేస్తూ అప్పగింతలు పెట్టాడాయన.

"అస్తమానమూ అలా మాట్లాడకు డాడీ. మాకు ఎంత కష్టంగా వుంటుందో తెలుసా!"

"ఒరేయ్, మనిషన్నాక ఎప్పుడో ఒకప్పుడు పోక తప్పదురా. ఈ మందులూ, మాకులూ ఎంత కాలం ఆపుతాయి చెప్పు"

ఓరోజు రాజు యింటికొచ్చేసరికి బట్టలన్నీ ఉతికి ఆరేసి, ఇస్త్రీ చేస్తోంది రాణి.

"రాణీ, ఈ పనులన్నీ ఏంటి చెప్పు. నేను చేసుకుంటానుగదా?" మందలించాడు రాజు.

"ఎప్పటికైనా నేను చేయాల్సినవేగా యివన్నీ... నాకేమీ కష్టంగా లేదు... నన్నలా పైనుంచి ఊడిపడ్డ వింత మనిషిలాగా చూడకు. నేనిలా యింట్లో తిరుగుతుంటే మావయ్యకు సంతృప్తిగా వుంది. పైగా ఆఫీసునుండి అలసిపోయొచ్చి, నువ్వు యివన్నీ ఏం చేసుకోగలవు చెప్పు"

"నీ చదువు పాడైపోతుంది. అదీకాక, ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు చెప్పు"

"నేను చదివి ఉద్ధరించేదేమీ లేదు. నాకు ఉద్యోగం చేయటం యిష్టంలేదు. ఇక ఎవ

రైనా చూసి ఏమైనా అనుకోవటానికి యిక్కడ ఎవరికంత తీరికుంది గనుక... అసలు నాక్కూడా ఇలా బాగా అనిపించటం లేదు. మనం తొందరగా పెళ్ళి చేసుకుందాం రాజూ. మన పెళ్ళి జరుగుతుందో జరగదోనని నాకెందుకో భయమేస్తూంది''

''కానీ డాడీ ఆరోగ్యం యిలా వుండగా మనం పెళ్ళి చేసుకుంటే ఎలావుంటుంది చెప్పు? ఆయన కొంచెం కోలుకోగానే ఆలోచిద్దాం''

ఆ హామీతో యిక ఆ ప్రసక్తి తీసుకురాలేదు రాణి.

రాజూ, రాణీ యిద్దరూ ఎంత ప్రయత్నించినా మహాలింగంలోని దిగులు మాత్రం తగ్గలేదు. రాజారాం మిత్రులతో వుంటేనైనా సరదాగా వుంటాడని అనుకున్నాడు రాజు. కాని వాళ్ళు ముగ్గురూ విశ్వనాథం దగ్గర తీరిక లేకుండా అయిపోయారు.

''ప్రభుత్వం మమ్మల్ని పనికిరామని రిటైరు చేస్తే మీరేమో పిలిచి ఉద్యోగమిచ్చారు'' ఆశ్చర్యంగా అడిగాడు థామస్ విశ్వనాథంను.

''ప్రభుత్వం నన్ను కూడా రిటైరు చేసింది. అన్ని బాగావుంటే పెన్షన్ డబ్బులతో యింటిపట్టున కూచుని, మనుమలూ, మనుమరాళ్ళతో కాలక్షేపం చేస్తూ, కృష్ణా, రామా అనుకోవాల్సిన వయసు. కానీ దురదృష్టవశాత్తూ మీ పిల్లలకు మీరు వుంటేనే యిబ్బంది. మీరు మాట్లాడితే నస. మీతో గడపటం టైంవేస్టు. మీరు వాళ్ళ పిల్లలకు చెప్పే కబుర్లు చెడగొట్టే కాకమ్మ కథలు. మీరు వాళ్ళ సరదాకు అడ్డంకి. మీ దగ్గు వాళ్ళ నిద్ర చెడగొడుతుంది. మీరు మంచాన పడితే సేవలు చేయాలనే ఆలోచన వాళ్ళను భయపెడుతుంది. మీరు యింట్లో వుంటే, మీ వంకతో వచ్చే బంధువుల వల్ల వాళ్ళకు ఖర్చు పెరుగుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో విధిలేక హోమ్‌ఫర్ ఏజ్‌డ్‌లో చేరాల్సి వచ్చింది.

కానీ నా దృష్టిలో మీరింకా పనులు చేయగలరు. యువకులు చేసినంత పని మీనుండి ఆశించటం పొరపాటే. మీరు చేయదగినంత పని మీకివ్వగలిగితే అది మీకు కాలక్షేపంలా వుంటుంది. కొద్దోగొప్పో ఆర్థికంగా ఆదుకుంటుంది. యువకులు ఆశించేంత జీతం మీరు కోరుకోరు. పురుళ్ళకూ, పండగలకూ, పబ్బాలకూ సెలవులు పెట్టరు. టీలూ, కాఫీల కోసం బైటికెళ్ళరు. ఎప్పుడెప్పుడు వెళ్ళిపోదామా అనుకోవటానికి బాధ్యతలేమీ లేవు. మీ అనుభవం నాకు ఉపయోగకరంగా వుంటుంది. అన్నింటినీమించి, నాలాగే నా ఏజ్ గ్రూప్ వాళ్ళు గనుక నాకూ సౌకర్యంగా వుంటుంది''

అంత కాలమూ మళ్ళీ ఓ ఉద్యోగం చేయాలన్న ఆలోచన రాలేదు వాళ్ళకు. పైగా వయసుడిగిన వాళ్ళకు ఉద్యోగమివ్వటానికి అందరూ అంత తొందరగా యిష్టత చూపరు. అదీగాక లెక్కలు రాయటం, అజమాయిషీచేయటం లాంటి వుద్యోగాలిచ్చి, విశ్వనాథం వాళ్ళను పనివాళ్ళుగా కాక స్నేహితుల్లా చూసుకోవటం వాళ్ళకు బాగా నచ్చింది. ఏమీ తోచక ఆదివారాలు కూడా వచ్చి, ఓ పూట కూర్చోవటం అలవాటయింది వాళ్ళకు.

అలా వచ్చినప్పుడు కాస్సేపు మహాలింగం దగ్గర కూర్చోవటం ప్రారంభించారు. ఇంట్లో కూర్చుని, కూర్చుని విసుగ్గా వుంటుందని మార్పుకోసం బైటికి వెళదామంటే ఆయన కదలనంటాడు. ఆరోజు బలవంతంగా హోమ్‌ఫర్ ఏజ్‌డ్‌కు బయలుదేరదీశాడు రాజు.

ఇద్దరూ వెళ్ళేసరికి సుధ వుందక్కడ. జరిగిన విషయాలు తెలియవా అమ్మాయికి

''ఏంటి బాబాయ్, ఒంట్లో బాలేదా, యుద్ధ ఖైదీలా ఐపోయావు?''

''బాగాలేకపోవటంకాక బాగుండటం కోరుకోవటానికి నా వయసు నీ వయసు కాదుకదమ్మా. వాలిపోతున్న సూర్యుడిలాగా ఉడుకూ, ఉత్సాహమూ తగ్గిపోతూనే వుంటుంది''

''ఏంటన్నయ్యా, బాబాయ్ వేదాంతం నేర్చుకున్నాడూ!'' రాజును ప్రశ్నించింది.

''ఏంటో ఈమధ్య కొత్తగా నేర్చుకున్నాడు'' ఏం చెప్పాలో తెలీలేదు రాజుకి.

''ఐతే ఓ మంచి గుడ్ న్యూస్ చెబుతాను. నా పెళ్ళి నిశ్చయమయింది బాబాయ్''

''సంతోషమమ్మా, ఎప్పుడు?''

''ఈ వేసవిలోనట. పరీక్షలవగానే ఊరికెళితే యిక మన దగ్గరికి రాదు. దిగులుగానే వుంది





గానీ, అమ్మాయి పెళ్ళి చేసుకుని అత్తారింటికి వెళుతోందంటే, తమకు దూరమైపోతున్నా సంతోషించాల్సిందేగదా, అమ్మానాన్నలు. మేమూ అంతే'' చెప్పాడు చలపతి.

''మీ అందర్నీ వదిలి వెళ్ళాలంటే నాకూ దిగులుగానేవుంది బాబాయ్. ఇన్ని రోజులూ మీతో గడుపుతూ మా అమ్మా, నాన్నలకు దూరంగావున్న బాధ మరిచిపోగలిగాను. మీ అందరినీ నా పెళ్ళికి పిలవాలనివుంది. వీలైన వాళ్ళందరూ తప్పకుండారావాలి''

''మా రాజు పెళ్ళికూడా జరిగితే నాకు యిక ఏ కోరికలూ లేవమ్మా. వీడిపెళ్ళి చూస్తానో చూడనో అని బెంగగావుంది'' చెప్పాడు మహాలింగం.

అక్కణ్నించి బైటపడినాక తిన్నగా యింటికే వెళదామన్నాడు మహాలింగం. తప్పనిసరిగా యింటికే వెళ్ళాల్సి వచ్చింది.

రాను రానూ మహాలింగం ఆరోగ్యం క్షీణించ సాగింది. చిట్టచివరకు ఆయన్ని ఆసుపత్రిలో చేర్పించాల్సివచ్చింది. రాజుకు ఆఫీసులో సెలవులు దొరకటం చాలాకష్టం. ఐతే ఆ కంపెనీ యజమాని మహాలింగం స్నేహితుడు గనక సెలవుమంజూరు చేశాడుగానీ జీతం మాత్రం రాదని తేల్చేశాడు. జీతనష్టం తోనైనా సెలవు దొరికినందుకు కాస్త ఊరట కలిగింది. అదీ దొరకకపోతే ఉద్యోగం వదిలేద్దామనుకున్నాడు. తనకోసం ఆఫీసు మానుకోవద్దని మహాలింగం ఎంత చెప్పినా వినలేదు రాజు. ఆయన మందుల కోసం, ఆసుపత్రి ఖర్చుల కోసం మోటర్ సైకిల్ అమ్మేశాడు. దాదాపు రోజంతా ఆయన దగ్గరే గడపసాగాడు. వేళకు భోజనమూ, నిద్రాలేక రాజుకూడా రోగిష్టిలాగా తయారయ్యాడు. ఐతే ఎంత చేసినా ప్రయోజనం లేకపోయింది. ఆసుపత్రిలో చేరిన నెల రోజుల కల్లా కన్ను మూశాడు మహాలింగం.

ఆయన శవం మీదపడి భోరున ఏడ్చాడు రాజు. చావులూ, చచ్చిపోయినవారి తాలూకు బంధువుల ఏడ్పులూ సర్వసాధారణమైపోయిన ఆసుపత్రి సిబ్బందికి కూడా హృదయవిదారకంగా కనిపించిందా దృశ్యం. ఆసుపత్రికి సంబంధించిన తతంగమంతా రాణే చూసుకోవాల్సివచ్చింది. ''డాడీ, డాడీ'' అని తప్ప మరో మాట రాకుండా విలపిస్తున్న రాజును ఎలా ఓదార్చాలో తెలీలేదామెకు. ముందు తనకొస్తున్న ఏడుపును ఆపుకుని, రాజును ఊరడించడానికి చాలా శ్రమ పడాల్సివచ్చింది.

చివరకు శవాన్ని ఆటోలో తీసుకుని యింటికి బయలుదేరారు. అప్పటికే మహాలింగం కొడుకులకు ఫోన్ చేసింది రాణి. నో రెస్పాన్స్. హోమ్‌ఫర్ ఏజ్‌డ్‌కు ఫోన్ చేసి రాజారాంకూ, విశ్వనాథంకు ఫోన్ చేసీ మహాలింగం చనిపోయిన వార్త తెలిపింది. ఆటో యిల్లు చేరుకునే సరికి అప్పటికే అక్కడ కొందరు చేరారు.

ఆటో ఆగింది. శవాన్ని దింపబోతుండగా యిల్లుగలాయన వచ్చాడు

''బాబూ, శవాన్ని యింట్లోకి తీసుకురాకూడదు''

నిర్విణ్ణుడు అయ్యాడు రాజు

''ఎందుకు?'' నూతిలోనుండి వచ్చినట్టు వినిపించింది రాజు గొంతు.

''ఇంట్లో శవం పెడితే ఎవరొప్పుకుంటారయ్యా, నేనీ యిల్లు మూడు నెలలు పాడుపెట్టుకోవాలి... రోడ్డు మీద పడుకోబెట్టండి''

''దిక్కులేని వాడు కాడండీ మా డాడీ, రోడ్డు మీదపడుకో బెట్టటానికి, ఐనా మీకు అద్దె కడుతూనే వున్నాంగదా'' కన్నీళ్ళతో అన్నాడు రాజు.

నిస్సహాయంగా చూస్తూ నిలుచుండిపోయింది రాణి.

''బాబూ, అద్దె కడుతున్నది మనుమలుండటానికి. శవాలుండటానిక్కాదు'' కాస్త విసుగ్గా అన్నాడు ఇల్లుగలాయన.

''ఏమండీ, మనిషిపోయిన బాధలో ఆయనుంటే మీరిలా మాట్లాట్టం న్యాయం కాదు'' అర్థించింది రాణి, కన్నీళ్ళతో.

''నా యిల్లు కాకపోతే మాటలు నేనూ చెబుతానమ్మా. అంతగా కావాలంటే మీ యిల్లుందిగదా''

కన్నీళ్ళు తుడుచుకుంటూ, పౌరుషంగా చెప్పింది రాణి ఆటో అతనితో

''పద బాబూ, ఆ పక్క వీధికి పోదాం''

అప్పుడు ముందుకొచ్చాడు విశ్వనాథం

''చూడమ్మా, చిన్న దానివి. నీకు తెలీదు

మీ యింట్లోనైనా శవాన్ని తీసుకురావటానికి ఒప్పుకోరు. అట్నించటే ఆసుపత్రినుండి శ్మశానానికి తీసికెళ్ళి వుండాల్సింది. ఎవరం ఏం చేయగలం చెప్పమ్మా''

''కన్న కొడుకులు, ఉన్న యిల్లు లాక్కుని ఆయన్ని రోడ్డుమీదికి నెట్టేశారు. కడుపున పుట్టకపోయినా సొంత బిడ్డకన్నా ఎక్కువే చేశావు. ఇక యింతకన్నా ఏం చేయగలవు బాబూ. ఆయనకా అదృష్టం లేదు. నుదుటి రాత బాబూ. ఇందుకే పూరి గుడిసైనా సరే సొంత యిల్లుండాలని తపన పడతారు. పద బాబూ పద, ఆయనకా ప్రాప్తం లేదు'' అనునయించాడు రాజారాం.

ఇదేమీ పట్టనట్లు మహాలింగం భౌతిక కాయం ఆటోలో వుండిపోయింది. మనిషి చచ్చిపోయాక కూడా సమస్యలు వదలవనటానికి నట్టనడి వీధిలో వున్న మహాలింగం నిర్జీవ శరీరం సజీవ సాక్ష్యంగా నిలుచునుంది. మనిషికి ఒక్కోసారి చావు కూడా సమస్యే. మనుమల్లేని యిల్లులాగే ఆత్మలేని దేహమూ అందరికీ కుతూహలం కలిగిస్తూ వుండిపోయింది.

నిస్సహాయంగా నిలుచుని రోదిస్తూండిపోయాడు రాజు.

''సార్, పోదామా'' సానుభూతిగా అడిగాడు ఆటోవాలా.

అప్పుడు వినిపించిందో గొంతు

''ఏటి బాబూ, మడిసి సెవాన్ని ఎదురుగా పెట్టుకుని ఏడుత్తావుంటే, డబ్బులెక్కలు జూసుకుని సెవాల్ని కూడా ఏడిపిత్తావున్నారా. ఆయనేటి బాబూ, రేపు నువ్వూ, నేనూ అందరమూ పీనుగులైపోయే వోళ్ళమే. సొంత యిల్లుందనీ, రేపు మీరు సత్తే మీ సెవం సెంటుకంపు కొడుద్దా, అద్దెకున్నోడి సెవం పీనుగుకంపు కొడుద్దా... ఎవడు సెప్పొచ్చాడు, రేపు మీ యిల్లు అమ్ముకుని మీరు నచ్చినప్పుడు మీ సెవానికీ యిదే గతి పడుద్దేమో, ఛీ, యెదవ మడుసులు, యెదవ లోకం'' తాగుబోతుగా ఆ కాలనీ అందరితోనూ ఈసడించబడే యెంకటేసు మాటలకు ఇల్లు గలాయన ఎదురు చెప్పలేక మిడిగుడ్లేసుకుని వుండిపోయాడు.

రాజు వైపుకు తిరిగాడు యెంకటేసు

''రా బాబూ, నా యింటికి పోదాం... పెద్దోడి సావుకు పెళ్ళి బాజా, పేదోడి పెళ్ళికి సావు బాజా కొట్టే దగుల్బాజీ యెదవలు బాబూ యీళ్ళు... నీ అయ్య సెవాన్ని నా ఇంటికి పట్టుకు రా బాబూ... బతికున్న అమ్మ అయ్యలకు గుక్కెడేనా నీళ్ళు పొయ్యని దొంగనా కొడుకులున్న లోకంలో అయ్య సెవానికి అంత మర్యాద కోసమని యేడుత్తున్నావా, నా నాయనే. నీ ఏడుపుకు ఎవడు కరుగుతాడ్రా నాయినా, నా యింటికిరా, రా బాబూ, రా''

పూడుకుపోయిన గొంతుతో మాట పెగలక మౌనంగా చేతులెత్తి యెంకటేసుకు నమస్కారం చేశాడు రాజు.

''నీలాటి కొడుకునుగన్న ఆ అయ్య సెవాన్ని అనాద సెవంలా అట్టా యీదినెడితే కురిసే నాలుగు బొట్ల వానలు కూడా వుండవు బాబూ లోకంలో. పద బాబూ''

ముందుకు నడిచాడు యెంకటేసు. అతని వెనుకగా కదిలింది మహాలింగం శవం. దాని వెంట, శ్మశానం దాకా తప్ప వెంట వెళ్ళలేని అప్పులు...

తూలుతూ నడుస్తూ, గొంతెత్తి పాడసాగాడు యెంకటేసు

''ఇల్లు యిల్లనియేవు, ఇల్లు నాదని యేవు
నీ యిల్లు యెక్కడే సిలకా...
ఊరికుత్తారాన వల్లకాటీలోన
కట్టె యిల్లున్నదే సిలకా... రామ సిలకా...''

యెంకటేసు యింటి దగ్గరికి చేరుకున్నాక జరగవలసిన తతంగమంతా విశ్వనాథం, రాజారాం తదితరులు జరిపించారు.

కన్న కొడుకు చేయవలసిన శాస్త్ర కర్మలన్నీ చేశాడు రాజు. మహాలింగం చితికి నిప్పంటించి బోరుమన్నాడు వెక్కివెక్కి ఏడుస్తూ. ఆ కన్నీళ్ళకు కరిగిపోని చితిమంటలు మహాలింగం భౌతికకాయాన్ని తమతోపాటు మండిస్తూ, రాజు హృదయంలోకి పాకాయి. మంటలు ఆరిపోయాక చితిలో బూడిద మిగిలింది. ఆరిపోయిన ప్రమిదలాగా పొగసెగలతో మిగిలిపోయాడు రాజు.

★ ★ ★

మారే కాలం మానే గాయం మనుగడకున్న వరాలు. లేకపోతే లోకంలో చాలా జీవితాలు




శోకంలో మోగ్గి నరకంగా మిగిలిపోయేవి. తండ్రి మరణించిన బాధనుండి క్రమంగా కోలుకోసాగాడు రాజు. మొదటి వారం రోజులూ దాదాపు మంచం పట్టి నట్టయ్యాడు. అంతకుముందే ఆసుపత్రి చుట్టూ నిద్రాహారాలు మాని తిరగటంతో నీరసించిన శరీరం, మానసిక వేదనతో మరింత కుంగిపోయింది. అలా యింట్లో వున్నంత కాలం మామూలు మనిషి కావటం కష్టమని గ్రహించిన రాణి, మహాలింగం కర్మ జరిగిన మరునాడే బలవంతంగా వెంటబెట్టుకుని ఆఫీసుకు తీసుకుపోయింది. మహాలింగం మరణవార్త తెలిసి బాధపడిన ఆయన మిత్రుడైన యజమానికూడా రెండు, మూడు రోజులు రాజు పని విషయం పట్టించుకోలేదు. క్రమంగా దిన చర్యలో పడిపోయి, నెల రోజులకల్లా ఒక మాదిరిగా కోలుకున్నాడు రాజు.

రాణి పరీక్షలైపోయాయి. రోజంతా తీరిక. ఏం చేయాలో తోచదు. పెళ్ళి చేసుకొమ్మని అడగటానికి సమయం కాదు. తమ పెళ్ళి తనకన్నా రాజుకు మంచిదని రాణి ఆలోచన. ఒంటరిగా వుంటున్నాడు. ఇంటిపనీ, వంటపనీ, ఆఫీసుపనీ, చదువూ, యిన్నిటి మధ్యా పలకరించే మనిషి లేకుండా ఒంటరిగా యింట్లో వుండటం, రాజు గురించి ఆలోచించినప్పుడల్లా, అయ్యో తాను ఏమీ చేయలేకపోతున్నానే అని మధనపడసాగింది.

ప్రతీ ఆదివారం యిద్దరూ కలిసి హెూమ్ ఫర్ ఏజ్‌డ్‌కు వెళ్ళటం మొదలెట్టారు. సెలవుల్లో మూడు రోజులు గోళ్ళు గిల్లుకుంటూ యింట్లో కూచున్నాక ప్రతి రోజూ హెూమ్‌ఫర్ ఏజ్‌డ్‌కు వెళితే బాగుంటుందనిపించింది రాణికి. మూడు రోజులముందే ఆ ఆలోచన రాలేదేమాని చింతించింది. పొద్దున పదింటికల్లా భోజనం చేసి, కారు తీసుకుని బయలుదేరింది.

ఆఫీసులో కూచుని పనులు చూసుకుంటున్న శంకర్‌రెడ్డి, రాణిని చూసి ఆశ్చర్యపోయాడు

"ఏమ్మా రాణీ, బాగున్నావా" ఆప్యాయంగా పలకరించాడు.

బదులిచ్చి కూర్చుంది రాణి.

"కొంపదీసి యివాళ ఆదివారంగానీ కాదు కదా" కంగారుగా అన్నాడాయన.

"లేదండీ... కాలేజీకి సెలవులు. ఏం చేయాలో తోచటంలేదు. రోజూ యిక్కడికొచ్చి ఏదో ఒకటి చేద్దామనివుంది. మీ అనుమతి తీసుకుందామనీ..."

"మంచిపని చేయటానికి అనుమతి దేనికమ్మా... ఇంతకుముందు సుధ అని ఒకమ్మాయి వస్తుండేదిక్కడికి, ప్రతీ ఆదివారం. ఆ అమ్మాయి పెళ్లిచేసుకుంటోంది. ఇక అత్తవారింటికి వెళ్ళిపోతుంది. ఆ అమ్మాయి వచ్చినప్పుడల్లా యిక్కడ చాలామందికి సంబరంగా వుండేది"

"నేను కూడా విన్నాను. ఆమె మా సీనియర్. ఇంతకాలం నాకూ అలాంటి ఆలోచన రానందుకు సిగ్గనిపిస్తూంది"

"లోకంలో ఎన్నో సమస్యలున్నాయమ్మా. వాటికి స్పందించేది చాలా కొద్దిమందిమాత్రమే. అందులో ఒక్కొక్కరినీ ఒక్కో సమస్య ఆకర్షిస్తుంది. అంతమాత్రాన మిగతావాటిపట్ల వాళ్ళకు అవగాహనలేదనికాదు. అభిరుచి, మనస్తత్వం, పుట్టిపెరిగిన వాతావరణం, అన్నిటినీమించి అవకాశం. నీకు యిక్కడికి ఎప్పుడు రావాలనిపిస్తే అప్పుడు రావచ్చు. ఎవరితో మాట్లాడాలనిపిస్తే వాళ్ళతో మాట్లాడొచ్చు"

"థాంక్సండీ. కానీ..." ఆగిపోయి ప్రశ్నించింది - "నేను మీ టైం వేస్ట్‌చేయటంలేదుకదా"

"ఈ ఆశ్రమానికి సహాయంచేయటానికొచ్చినవాళ్ళతో మాట్లాడటం నా టైం వేస్ట్‌కాదు. చెప్పమ్మా, ఏమిటి?"

"ఏదో చేయాలనుంది గానీ ఏం చేయాలో తెలీదు. తెలిసీ తెలియక ఏదైనా పొరపాటు చేస్తే, మంచిచేయబోయి అపకారం చేస్తానేమోనని భయంగా వుంది. మీరు నన్ను గైడ్‌చేస్తే కాస్త సులువుగా వుంటుందనీ..."

"ఐతే ముందుగా నువ్వు ఏం చేయాలనుకుంటున్నావో చెప్పు నాకు. అంటే యిక్కడున్న వాళ్ళపైన సానుభూతితో వ ళ్ళకేమైనా చేయాలనుందా. ఎంత టైం స్పేర్‌చేయగలవు? లేదా ఆశ్రమాన్ని మెరుగుపరచడంలో ఏమైనా సహాయం చేయాలనుందా? అది తెలిస్తే చెబుతాను"

"మీరన్నది నాకర్థంకాలేదు..." ఇబ్బందిగా

చూస్తూ చెప్పింది.

చిన్నగా నవ్వాడు శంకర్‌రెడ్డి-

"కొంచెం గజిబిజిగా చెప్పినట్టున్నాను. ఏదో కారణంతో, ఎవరికైనా ఏదైనా సహాయం చేయాలని చాలామందికుంటుంది. అలాంటివాళ్ళు చేయగల పనులు ఎలా వుంటాయో చెబుతాను.

"ఇక్కడి రికార్డ్సు మెయిన్‌టెయిన్ చేయటం, ఆఫీసు పనుల్లో సహాయం చేయటం ఒకటి. అందువల్ల నాకు కాస్త ఊపిరి పీల్చుకునే అవకాశం దొరుకుతుంది. మరికొంత మంది దగ్గరికెళ్ళి మరిన్ని చందాలు తీసుకు రాగలను. ధనసహాయం ఎంత ఎక్కువగా వుంటే అంత ఎక్కువమందికి, వీలైనంత తక్కువలో, ఎక్కువ సౌకర్యాలు సమకూర్చొచ్చు. అలాగే, మాట్లాడి మెప్పించగల తెలివితేటలో, పరపతో వుంటే ఈ ఆశ్రమం గురించి పదిమందికీ చెప్పి చందాలు కూడా తీసుకురావచ్చు. వీలైనంత ఎక్కువమందికి ఉచితంగా ఆశ్రయం కల్పించాలని వుందిగానీ ప్రస్తుతం ముగ్గురిని మాత్రమే అలా వుంచుకోగలిగాం. ఎక్కువ డబ్బుంటే ఎక్కువమందికి సహాయం చేయగలం...

అలాగే, రోజూ పదకొండు గంటలకు డాక్టర్ వస్తాడు. అందరినీ రొటీన్‌గా చూసి, ఆరోగ్యం బాగాలేనివాళ్ళను పరీక్షించి, వాళ్ళకు వాడాల్సిన మందులూ, ఆహార నియమాలూ లాంటివి చెబుతాడు. డాక్టర్ వెంటవుండి, అవన్నీ నోట్‌చేసుకుని అందించటమూ ఓ సాయమే. ఆ పేషెంట్లలో కొందరికి ఏమైనా సేవచెయ్యటమూ ఒకసాయమే...

ఇక శ్రమలేనిదీ, హాయిగా చేయగలిగిందీ, అందరూ చేయగలిగిందీ, కానీ చాలా ముఖ్యమైనదీ ఐనదేమిటంటే, వీళ్ళకు కాసేపు కంపెనీ యివ్వటం. వారంలో ఒకగంటసేపు ఒకరికి కంపెనీ యివ్వటానికి ఓ వెయ్యిమంది నిర్ణయించుకున్నారనుకో, యిక్కడున్నవాళ్ళందరికీ రోజూ ఓ రెండు, మూడు గంటలు కాలక్షేపం అవుతుంది. ఆలోచిస్తే ఎంతో చిన్న సహాయం యిది. ఎన్నోరకాలుగా వృధాచేసే ఎంతో సమయంలో ఒక గంటసేపు ఒక మనిషికి తృప్తినివ్వటానికి గడుపుదామని అనుకుంటే మనకు జరిగే నష్టం ఏమీలేదు. పైగా మానసిక తృప్తి మిగులుతుంది. కానీ ఎవరికుంది అంత ఆలోచన...

కొందరికి వారం, పదిరోజులకోసారి అయినా బైట అలా తిరిగి రావాలనుంటుంది. కానీ ఒంటరిగా వెళ్ళలేరు. అలాంటివాళ్ళను నెలకొక్కసారి ఆటోలో అలా బైటికి తీసికెళ్ళి, ఏ పార్కులోనో ఓ గంటసేపు కూర్చోబెట్టి తీసుకొస్తే, వాళ్ళకు ఎంతో ఉత్సాహంగా ఉంటుంది. మానవత్వంతో ఆలోచిస్తే యిదీ పెద్ద పనికాదు...

ఇలా ఎన్నోరకాలుగా సహాయం చేయొచ్చు. ఇందులో ఏ ఒక్కటైనా, కనీసం నెలలో ఒక్కసారైనా చేయగలిగినా సంతోషమే..."

అమాయకంగా చూస్తూండిపోయింది రాణి, ఓ పదిక్షణాలపాటు. తరువాత అంది-

"నిజంగా మీరు చెబితేగానీ తెలీలేదు. ఇన్నిరకాల పనులు చేయొచ్చా! నా సెలవులైపోయేవరకూ రోజూ ఏపనైనా చేస్తాను. చెప్పండి, ఏంచేయమంటారు?"

"నువ్వు చేయాల్సిన మరో పనేంటంటే నీ స్నేహితులకు కూడా యిలా వివరించి, అందులో కొందరైనా, వారానికోసారో, కనీసం నెలకోసారో, ఓ గంటో, రెండు గంటలో గడిపేట్టు చేయటం. అందువల్ల యిలాంటి పని చేయాలని వున్నా ఏం చేయాలో, ఎక్కడ మొదలెట్టాలో తెలీక ఊరకుండిపోయేవాళ్ళు కొందరు కొంతైనా సహాయం చేయగలుగుతారు"

"తప్పకుండా చెబుతాను. నాక్కూడా యిలాంటి మనుషుల సహాయం అవసరమైన చోటొకటి వుందని రాజు చెప్పేవరకూ తెలియదు. ఇక, నన్నేం చేయమంటారో చెప్పండి. చందాల విషయంలో నేను చేయగలిగినదంతా చేస్తాను. మిగతా విషయాల్లో మీరు చెప్పండి"

"వీళ్ళకు కంపెనీ యివ్వగలవా?"

"చాలా ఈజీగా యివ్వగలను. అసలు నాకు టైంపాస్‌కాక, ఏదో పిచ్చిపని చేసుకుంటూ పొద్దుపుచ్చేబదులు పనికొచ్చేది చేద్దామనొచ్చాను. ఇట్స్ మై ప్లెజర్"

"కానీ అది నువ్వనుకున్నంత సులభమైంది





కాదు. కంపెనీ యివ్వటమంటే వాళ్ళతో కూర్చుని కబుర్లు చెప్పటం'' - ఆగి, చూశాడు రాణీవైపు.

''కబుర్లు ఎన్నైనా, ఎంతసేపైనా చెప్పగలను'' ఉత్సాహంగా అంది రాణి.

చిన్నగా నవ్వి చెప్పాడు శంకర్‌రెడ్డి-

''ఎ గుడ్ కన్వర్సేషనలిస్ట్ ఈజ్ ఎ గుడ్ లిసనర్ - అనేమాట ఎప్పుడైనా నువ్వు విన్నావా?''

''ఏంటీ, మళ్ళీ చెప్పండి!'' ఆశ్చర్యంగా అడిగింది రాణి.

''బాగా కబుర్లు చెప్పటమంటే ఓపిగ్గా వినటమన్నమాట. నిజానికి ఎదుటివారికి విసుగు కలగకుండా కబుర్లు చెప్పటం చాలా గొప్ప కళ. కానీ దురదృష్టమేమిటంటే చాలామందికి యిది చేతకాదు కానీ, తమకు అది చేతకాదనే విషయం వాళ్ళకు తెలియదు. ఇలాంటివాళ్ళందరికీ తాము చెప్పే విషయాన్ని ఓపిగ్గా వినేవాళ్ళు 'మంచి మాటకారి'గా కనిపిస్తారు. ఎందుకంటే ఆ మనిషి ఓపికనుబట్టి ఎంతసేపు వింటే అంతసేపూ యిద్దరూ మాట్లాడుకున్నట్టేగదా''

''ఔను... మీరు చెప్పిన కొటేషన్ వినలేదు గానీ, ఈ విషయం నాకు తెలును'' చెప్పింది రాణి.

''వెరీగుడ్... నువ్వు చేయవలసిన పనేంటంటే ఒక్కొక్కరితోనూ కాసేపు కూర్చుని కబుర్లు చెప్పాలి. అంటే వాళ్ళు చెప్పేది వినాలి'' నవ్వుతూ చెప్పాడాయన.

వెంటనే రాణి అందుకుంది- ''వాళ్ళు మనకు సంబంధంలేని ఏ సంఘటన గురించో, మనిషి గురించో చెబుతారు. తమ కష్టాలగురించో, తాము చేసిన ఘనకార్యాల గురించో చెబుతారు. ఆ కష్టాలు కష్టాలైవుండకపోవచ్చు. కానీ వాళ్ళతోపాటు మనమూ ఆ కష్టానికి ప్రతిస్పందించాలి. ఆ ఘనకార్యాలు అతిమామూలుపనులై వుండొచ్చు. కానీ మనం ఆశ్చర్యపడాలి. వాళ్ళు చెబుతున్న పనికిమాలిన కబుర్లలో, ఏ తెగిపోయిన లింకునో కనిపెట్టి, 'అరెరే మరి ఆయనేమయ్యాడూ చెప్పనేలేదు' అని అతి కుతూహలంగా అడగాలి... యామై రైట్?''

''పర్‌ఫెక్ట్‌లీ'' - సంతోషంగా చెప్పాడు శంకర్‌రెడ్డి.

ఉత్సాహంగా మళ్ళీ చెప్పింది రాణి- ''ఈ మనిషి దగ్గర సరిగ్గా గంటసేపే కూర్చోవాలి - అని టైం లిమిట్ పెట్టుకుని ఆ గంట అయిపోగానే తుంచేసి వెళ్ళిపోకూడదు. చెబుతున్నంతసేపూ వినాలి. తప్పనిసరిగా వెళ్ళాల్సివుంటే వాళ్ళు తమంతట తామే ఆపేసేవిధంగా ఏదో సాకు చెప్పి లేవాలి. అలాగే వెళ్ళిపోయేటప్పుడు, 'హమ్మయ్య, ఐపోయిందిరా బాబూ' అన్నట్టుగా కాకుండా, 'ఏమిటోనండీ, అసలు మీరు మాట్లాడుతుంటే కదలాలనిపించదు. రేపు తీరిగ్గా కూర్చోవాలి మీదగ్గర' అని వెళ్ళటానికి యిష్టంలేనట్టుగా వెళ్ళిపోవాలి, అతిభారంగా''

''వెరీక్యూట్. ఇంకా?'' ప్రోత్సాహంగా అడిగాడాయన.

''కొంతమందికి కబుర్లు అవసరం-వుండకపోవచ్చు. వాళ్ళతో ఏ వైకుంఠపాళీ, చదరంగమో ఆడాలి. ఆట మనకు ఎంత బాగా వచ్చినా ఓడిపోతుండాలి, తరచుగా. అలాగని, కావాలని ఓడిపోతున్నట్టు వాళ్ళకు అనిపించకుండా, సర్వశక్తులూ ఒడ్డి పోరాడుతున్నట్టు కనిపించాలి. 'ప్చ్... యివాళ ఓడిపోయాను గానీ, రేపు చెబుతా మీ సంగతి' అని ఉక్రోషంగా అనటమో, 'ఏమిటోనండీ, ఎంతో మందిని ఓడించానుగానీ మిమ్మల్ని ఓడించలేకపోతున్నాను' అనటమో చేయాలి. మరికొంతమందికి యివేవీ అవసరం వుండదు. వాళ్ళకు కాస్సేపు ఏ న్యూస్‌పేపరో, భగవద్గీతో చదివి వినిపిస్తే సరిపోతుంది. రేడియోలో వార్తలు చదివినట్టు చదవకుండా, మధ్యమధ్యలో చదువుతున్న విషయాలమీద సందేహాలు వ్యక్తంచేసి, వాళ్ళనడిగి తీర్చుకుంటూండాలి'' ఆగి, ఊపిరి పీల్చుకుంది రాణి.

''నిజంగా నువ్వు పాదరసం అమ్మా... తరువాత?'' మెచ్చుకున్నాడు శంకర్‌రెడ్డి.

ఆ తరువాతేంటంటే, నేను వాళ్ళదగ్గర చేయాల్సిన పని మీరు నాదగ్గర చేసి ప్రాక్టికల్‌గా చూపించారు. ఇవన్నీ మీకు తెలిసినా ఎంతో ఓపిగ్గా వింటూ, ఉత్సాహంగా ప్రోత్సహించారు చెప్పమంటూ. మీఅంత ఓపిక కోసం కృషిచేస్తాను'' చిలిపిగా నవ్వుతూ అంది

రాణి.

"యూ నాటీ గర్ల్, గాడ్ బ్లెస్‌యూ"

"థాంక్యూ... నేనిక డ్యూటీలో చేరతాను"

తను చేయాలనుకున్న పని అనుకున్నంత సులభం కాదని మొదటిరోజునే గ్రహించింది రాణి. రెండోరోజున మరింత బోర్ అనిపించింది. విసుగనిపించే పనిని ఆనందంగా చేయాలంటే, విధిగా కొన్నిరోజులు చేయాలనే సూత్రాన్ని గుర్తుతెచ్చుకుంది రాణి. సులభంగా చెప్పాలంటే, 'తినగ తినగ వేము తియ్యనుండు' అని అర్థంచేసుకుంది. మూడోరోజున ఎప్పుడెప్పుడు వెళ్ళిపోదామా అనిపించసాగిందిగానీ, ఓపిగ్గా కూర్చుంది. నాలుగోరోజున తనకోసం ఎదురుచూసే ఆ వృద్ధుల కళ్ళల్లోని ఆరాటాన్నీ, తన రాకతో వాళ్ళకు కలిగే ఆనందాన్నీ గమనించింది. ఐదోరోజున ఆ ఆనందం వాళ్ళకు దూరంచేయకూడదనుకుని వెళ్ళింది. క్రమంగా అలవాటైపోయింది.

ఆదివారంరోజున మామూలుగా రాణితోపాటు కలిసివెళ్ళిన రాజు, అక్కడి వృద్ధుల్లో రాణి సంపాదించుకున్న మంచితనం గమనించి ఆశ్చర్యపోయాడు. అక్కడున్న సమయంలో రాణి, రాజు పక్కనున్నది చాలా తక్కువ సమయం.

సెలవులు ఐపోవస్తున్నకొద్దీ, ఆశ్రమానికి దూరంకావలసి వస్తున్నదనే బాధ ఎక్కువయింది రాణికి. ప్రేమకోసం, ఆదరణకోసం పరితపించే అంతమందితో పోల్చుకుంటే తన విషయం ఓ లెక్కలోది కాదనిపించసాగిందామెకు. మరో వారంరోజుల్లో తన కాలేజీ తెరవనున్నారనే విషయం వాళ్ళకు ముందుగానే చెప్పటం ప్రారంభించింది.

ఆరోజు అనుకోని సంఘటనొకటి జరిగింది. ప్రసాద్ అనే ఓ నలభై ఏళ్ళ వ్యక్తి వచ్చాడు. అతను చలపతికొడుకు. తన తండ్రిని తనతో పాటు తీసికెళ్ళడానికి వచ్చానని చెప్పాడు. వెంటనే మహాలింగం కొడుకులు గుర్తొచ్చారు రాణికి. 'మనిషి' అనే పదాన్ని కళంకం చేసే మనుషులు. తండ్రిదగ్గర ఏం ఆశించి వచ్చాడు మళ్ళీ? ఒకసారి కన్నవాళ్ళను ఆదరించక పోవటమే తప్పంటే మరోసారి పశ్చాత్తాపంతో వచ్చామని చెప్పి, తీసికెళ్ళి మళ్ళీ బైటికి గెంటేయటం అమానుషం. ప్రపంచంలో జరుగుతున్న నీచాతినీచమైన పని అదే.

చలపతి ఉద్యోగానికి వెళ్ళిన విషయం చెప్పి, సాయంత్రంవరకూ తిరిగిరాడని చెప్పింది రాణి. సమయానికి శంకర్‌రెడ్డి లేకపోవటంవల్ల ఆయనొచ్చేవరకూ ఆఫీసులో కూర్చుంది. పది నిమిషాల్లో ప్రసాద్ వచ్చిన విషయం ఆశ్రమంలో అందరికీ తెలిసింది. చలపతి కొడుక్కు అప్పటికైనా బుద్ధొచ్చినందుకు సంతోషించాలని కొందరంటే, అసలా బుద్ధి యిన్నాళ్ళూ ఏమైనట్టని మరికొందరన్నారు. అదంతా నాటకమనీ, ఏదో ప్రయోజనంకోసమే వచ్చాడనీ మరికొందరన్నారు. తమ పిల్లలు అలా వచ్చి తీసుకుపోతే బాగుణ్ణని కొందరు దేవుళ్ళకు మొక్కుకుంటే, అలా తీసుకుపోతే ఎలా వుంటుందో కొందరు కలలు కన్నారు. చాలామంది, ఏదో మిషతో ఆఫీసుగదికొచ్చి, నాలుగుకాళ్ళ మనిషిని చూసినట్టు ప్రసాద్‌ని చూసి, వెళ్ళిపోయారు. అతన్ని కేర్‌చేయాలనిపించలేదు రాణికి. అందుకే పట్టించుకోకుండా వుండిపోయింది.

ఓ గంట తరువాత ప్రసాద్, రాణిని మళ్ళీ ప్రశ్నించాడు- ఎప్పుడు తిరిగి రావచ్చని. ఆరులోపల వచ్చే అవకాశం లేదని చెప్పేసింది రాణి. కూర్చుని, కూర్చుని విసుగొచ్చినట్టయింది. బైటికి వెళ్ళి, ఆశ్రమం పరిసరాల్ని చూస్తూ నిలుచున్నాడతను. వెంటనే విశ్వనాథంకు ఫోన్‌చేసి చలపతితో మాట్లాడింది.

"మీ అబ్బాయట... పేరు ప్రసాద్ అని చెప్పాడు. మిమ్మల్ని చూడాలనీ, ఎప్పుడొస్తారనీ అడుగుతున్నాడు' - తీసికెళ్తానన్నాడనే విషయం కావాలనే చెప్పలేదు రాణి.

"సాయంత్రం వస్తానని చెప్పమ్మాయ్"

"ఇంకేమైనా చెప్పమంటారా?"

"వద్దు... అసలు నాకు ఫోన్‌చేసినట్టు వాడికి చెప్పొద్దు. ఇదిగో రాణీ, ఒకవేళ వాడుగానీ ఆరింటిదాకా వుండటం కుదరదంటే, నాకు వెంటనే ఫోన్ చేయించు. మరిచిపోవద్దు"

"అలాగే" ఫోన్ పెట్టేసింది రాణి.

ఎంతచేసినా పిల్లలమీదకన్నవాళ్ళకుఎందుకింత ఆపేక్షో. ఓవైపు ఆరువరకూ రానని చెప్పమని పట్టుదల. మరోవైపు, ఒకవేళ ఈలో





గానే వెళ్ళిపోతే ఒక్కసారైనా మాట్లాడే అవకాశం వుండదని భయం. అసలు ఆయన కొడుకు ఆయన్ని తీసికెళ్ళడానికి వచ్చాడని చెబితే ఏమని వుండేవాడో. చెప్పకుండా తనేమైనా తప్పుచేసిందాని క్షణంపాటు ఆలోచించింది. ఎందుకో అతను సదుద్దేశంతో రాలేదని పిస్తూంది తనకు. అలాంటప్పుడు ఆ వార్త ఆలస్యంగా చెప్పటంవలన జరిగిన నష్టం ఏముంది గనుక- అని సరిపెట్టుకుంది.

భోజనం చేసి వస్తానని వెళ్ళిపోయాడు ప్రసాద్? అతను వెళ్ళిన కాస్సేపటికి వచ్చిన శంకర్‌రెడ్డికి అంతా వివరించింది రాణి.

"మనం ఏం చెప్పగలమమ్మా... జరుగనున్నది జరుగకమానదు. ఎవరి అదృష్టాన్నిబట్టి వాళ్ళకు ప్రాప్తం.

సాయంత్రం చలపతి వచ్చేవరకూ వుండిపోయింది రాణి.

తండ్రిని చూడగానే ప్రసాద్- "బాగున్నావా నాన్నా" అన్నాడు తప్పుచేసినవాడిలా తల దించుకుని.

"ఏదో యిలా వున్నాను. కోడలూ, పిల్లలూ అందరూ బావున్నారా" ముక్తసరిగా అడిగాడు చలపతి.

"బానే వున్నాం నాన్నా... నిన్ను యింటికి తీసుకుపోదామనొచ్చాను"

కొడుకు మాట వినగానే చివ్వున చూశాడు చలపతి- "ఎక్కడికి?"

"ఇంటికి"

"నాతో యింకా ఏంపని మిగిలుందిరోయ్ యింట్లో? మనకేం ఆస్తిపాస్తులు లేవుగదా" వేళాకోళంచేశాడు చలపతి.

"లేదునాన్నా... జరిగిందంతా మర్చిపో... పద వెళదాం" పశ్చాత్తాపం ప్రకటిస్తూ అన్నాడు ప్రసాద్.

"అమ్మా బాబుల్ని యింట్లో వుంచుకుంటే యింక్రిమెంట్లో, సబ్సిడీలో యిస్తున్నారా ఏంటి గవర్నమెంటువాళ్ళు?"

"నాన్నా నా పిల్లలమీద ప్రమాణంచేసి చెబుతున్నాను- నీదగ్గర్నించి చిల్లిగవ్వ ఆశించటంలేదు. కావాలంటే నీ పెన్షన్ అనాథాశ్రమానికి రాసిచ్చుకో. కానీ నువ్వుమాత్రం నాతో రావాలి"

అతని మాటల్లో నిజాయితీ వుందేమోనని పించింది రాణికి. శంకర్‌రెడ్డికి కూడా అలాగే అనిపించింది. కానీ హఠాత్తుగా అంత పశ్చాత్తాపం ఎలా వచ్చింది?

చలపతికి కొడుకుమీద జాలికలిగింది. అంతేకాదు, మళ్ళీ తనయింట్లో, తనవాళ్ళమధ్య బతకొచ్చు. కష్టమో, నిష్ఠూరమో, అనాథబ్రతుకంత హీనమైంది మాత్రం కాదది. మళ్ళీ యింటికి వెళ్ళొచ్చునన్న ఆశ చిగురించగానే తను యింకా బెట్టుచేస్తే కొడుకు వెళ్ళిపోతాడేమోనన్న భయం వేసింది. కొడుకు చెబుతున్నదంతా నిజమేకావచ్చు. కానీ హఠాత్తుగా అంత పశ్చాత్తాపం ఎలా వచ్చింది?

ఈ ప్రశ్నకు జవాబుకోసం రాజారాం ప్రయత్నించాడు-

"చూడవయ్యా... కన్నతండ్రిని ముసలితనంలో ఇంట్లో వుంచుకోకుండా వెళ్ళగొట్టావు. ఇన్నేళ్ళుగా ఆయన్ని పట్టించుకోనైనాలేదు. ఏడాదికోసారి మొక్కుబడిగా ఓ ఉత్తరం రాయటంతప్ప ఆయన్ని తలుచుకున్న పాపానపోలేదు. ఇంత జరిగాక, హఠాత్తుగా వచ్చి, నువ్వు రమ్మంటే ఎలా నిన్ను నమ్మేది?"

కన్నకొడుకును నమ్మి కన్నతండ్రిని అప్పగించటానికి, ఎలా నమ్మేదని ప్రశ్నించాల్సిన పరిస్థితులు ఎంత దౌర్భాగ్యం!

జవాబు చెప్పటానికేమీ లేనట్టుగా వున్నా చెప్పలేనన్నట్టుగా తల దించుకుని వుండిపోయాడు ప్రసాద్.

జవాబు చెప్పడేం - ఆత్రంగా చూస్తూంది రాణి.

అంతలో థామస్ ఒకించుక ఆవేశంతో అడిగాడు-

"వాణ్ని తీసుకుపోయి రెండు కళ్ళు పీకి అమ్ముకుంటే యిరవైవేలు వస్తాయి. రెండు కిడ్నీలు అమ్ముకుంటే రెండులక్షలొస్తాయి. చివరకు మిగిలిన మాంసంముద్దను ఏ మెడికల్ కాలేజీకో అమ్ముకుంటే మరికొంత గిట్టుబాటవుతుంది. ఇవన్నీ నువ్వు చేయవని నమ్మకమేమిటి?"

మనిషి శరీరానికి అంత విలువుందిగానీ



మనిషి జీవితానికి విలువలేదా? వుంటే ప్రపంచంలోని కోట్లాది జీవితాలు అల్లాడుతుంటే పట్టించుకునే నాథుడు కనిపించడెందుకని?

''మరీ అన్యాయంగా మాట్లాడకండి'' పెదవులు విప్పాడు ప్రసాద్- ''చెప్పుకుంటే సిగ్గుచేటు. ముసలాడైపోయాడుగదా, ఎందుకూ పనికిరాడని మా నాన్నను వదిలేశాను. కానీ నాకూ పిల్లలున్నారు. ఇప్పుడు వాళ్లు పెద్దవాళ్ళవుతున్నారు. మా నాన్నకు నేను చేసిన అన్యాయం గురించి ఆలోచించగలుగుతున్నారు. రేపు నా పిల్లలు నన్నూ యిలాగే చేస్తే నా గతి ఏమవుతుందని ఆలోచిస్తే అనిపించింది, నేనెంత పాపంచేశానో. నేను చేసింది తప్పే. కానీ యిప్పుడు నాకు దాన్ని దిద్దుకునే అవకాశం యివ్వండి. ఆయన్ని పువ్వుల్లో పెట్టి చూసుకోకపోవచ్చు. కానీ నా పిల్లల్ని చూసుకున్నట్టుగా వాళ్ళతో సమానంగా చూసుకుంటాను. మిమ్మల్ని నమ్మించటానికి ఏం చేయమన్నా అది చేస్తాను నన్ను నమ్మండి''

''మాదేముందండీ... మీ నాన్న వస్తానంటే ఆపలేంగదా. ఇన్నాళ్లూ మాదగ్గరున్నాడు గనుక కాస్త మంచీ చెడూ ఆలోచించాల్సిన బాధ్యత వుందని అడగటం. అంతే... చెప్పండి చలపతిగారూ...'' అన్నాడు శంకర్‌రెడ్డి.

రాజారాం, థామస్‌లతో కాస్సేపు గుసగుసలాడాడు చలపతి. చివరకు చెప్పాడు- ''ఎంతైనా వాడు నా కన్నకొడుకు. ఏదో చిన్నతనంకొద్దీ, వాళ్ళూ, వీళ్ళూ చెప్పిన మాటలు విని నిజమనుకునీ నన్ను చూసుకోలేదుగానీ, యిప్పుడు వాడికి అర్థమయింది. అయిందనే అనుకుంటున్నాను. ఒరేయ్ ప్రసాదూ, కావాలంటే నా పెన్షనంతా తీసుకోరా. అన్ని గంజినీళ్లు పొయ్యి చాలు. కానీ, దిక్కూమొక్కూ లేనివాణ్ణి వదిలేసినట్టు వదిలేయకురా మళ్ళీ. అదొక్కటేరా. ఇంత బతుకూ బతికి ఇంటెనకాల చావొద్దనిరా... తరువాత నీ యిష్టం''

''లేదునాన్నా... నాకు బుద్ధొచ్చింది. నీ యిష్టమొచ్చినట్టు వుండు. నీ పెన్షన్ కూడా నాకొద్దు నాన్నా... నువ్వు నాతో వస్తే చాలు''

''డబ్బు చేసేదేముందండీ... పెన్షన్ మీరు తీసుకోకపోయినా ఆయనమాత్రం ఏంచేసుకుంటాడు. దాచిపెడతాడు. ఆయన పోయాక మీకేగదా...''

''రాత్రి తొమ్మిదింటికి ట్రెయినుంది నాన్నా. నీకు ఓపికుందంటే పోదాం. లేదంటే రేపు పొద్దున్న వెళ్ళిపోదాం. నీయిష్టం'' మృదువుగా చెప్పాడు ప్రసాద్.

''ఈ రాత్రికి ఆయన్ని ఏం హైరానా పెడతావుగానీ, పొద్దున వెళ్లొచ్చులేవయ్యా'' రాజారాం చెప్పాడు.

''సార్, ఏమైనా డబ్బులు కట్టాల్సింది వుంటే చెప్పండి... కట్టేస్తాను''

''ఏమీ లేదు. వీలైనంత వరకూ ఎవరు తక్కువ డబ్బులు కట్టినా మేం అడ్జెస్టు చేస్తుంటాం. నేను చెప్పాల్సినవాణ్ణి కాదు. ఆయన మీకు జన్మనిచ్చిన తండ్రి. ఇంకా ఎంతోకాలం బతకడు. వున్న నాలుగునాళ్ళూ ఆయన్ని సుఖపెట్టకపోయినా, సంతోషపెట్టండి. మీరు కష్టపడి తనకేదో పెట్టాలని ఆయనాఅనుకోరు కూడా'' చెప్పాడు శంకర్‌రెడ్డి - ''ఈరాత్రికి యిక్కడ పడుకోవచ్చు మీరు కూడా. నేను ఏర్పాటు చేస్తాను''

ఏడు కావస్తుండటంతో రాణి యింటికి వెళ్ళిపోయింది.

మరునాడు రాణి వచ్చేసరికి చలపతి వెళ్ళిపోయాడని చెప్పారు. ఆయన కొడుకు మహాలింగం కొడుకులా చేయకుండా ఆయన్ని బాగా చూసుకోవాలని దేవుణ్ణి ప్రార్థించింది రాణి.

ఆ రోజు రాణితో మాట్లాడినవాళ్ళందరూ చలపతి విషయమే మాట్లాడారు. ఇద్దరు ముగ్గురు తమ కష్టాలు వివరిస్తూ తమవాళ్ళకు ఉత్తరాలు రాశారు, తమను అక్కణ్ణించి తీసికెళ్ళమని. చలపతి కొడుక్కు తండ్రి విలువ తెలిసినట్టే వాళ్ళకూ తెలిసి తమను తీసికెళ్తారని ఆశ. చీకట్లో దీపానికి మరో పేరు ఆశ. రేపు తనకేదో మంచి జరుగుతుందన్న ఆశే, చాలా మంది దురదృష్టవంతులు ఇవాళ బతికేట్టు చేస్తుంది. మనుగడకు ఆలంబన అదేకదా.

చలపతి గురించి విని, తన తండ్రికి అలాంటి అదృష్టం లేకపోయింది గదా అనుకున్నాడు రాజు.

''డాడీ మళ్లీ వచ్చిన దగ్గర్నించీ మా ఆశ్రమానికి వెళ్ళటమే కుదరలేదు రాణీ. రేపోసారి




వెళ్లొద్దామనుకుంటున్నాను. నువ్వూ వస్తావా?''

''రేపటితో నాకు సెలవులైపోతాయి. రేపు నేను హెూమ్‌ఫర్ ఏజ్‌డ్‌కు వెళ్ళక తప్పదు. రెండుమూడు రోజుల తర్వాత వెళదాం. నాక్కూడా చూడాలనుంది. ఆదివారం వెళదామా?''

''అక్కడ పిల్లలందరికీ చదువుంటుంది గదా. ఆదివారంరోజున సగం మందిదాకా బైటికి వెళతారు. పోనీ శనివారం వెళదాం'' చెప్పాడు రాజు.

''వాళ్లను బైటికి వెళ్లనిస్తారా?''

''వెళ్ళినవాళ్ళు రాకుండా ఎక్కడికో పోతారన్న భయం వుండదు. అదీగాక ఆదివారం రోజున సిబ్బంది కూడా తక్కువుంటారు. దాదాపు ఊహతెలిసిన ప్రతివాణ్నీ వెళ్ళనిస్తారు. అట్లా బైటికి పోయినప్పుడేకదా ఏదో ఒకటి చేసి డబ్బులు సంపాయించుకునేవాళ్ళం'' వివరించాడు రాజు.

''ఏంచేస్తారు, డబ్బులు సంపాదించుకుని!''

''డబ్బులు ఏం చేస్తారేమిటి. ఎన్నో చేయొచ్చు. ఇష్టమైనవేమైనా కొనుక్కుని తింటారు, చాక్‌లెట్లు, ఐస్‌క్రీంలాంటివి. సినిమాలు చూస్తారు. ఓసారి డబ్బు సంపాదించుకునే పద్ధతి తెలిశాక స్కూలు ఎగ్గొట్టి రోజూ వెళ్ళటం మొదలెడతారు. నేనూ అలాగే చేసేవాణ్ణి'' నవ్వుతూ చెప్పాడు.

''నీకు నవ్వొస్తుందా?''

''ఏంచేస్తాం మరి... అప్పుడంటే బాధనిపించేది. చిన్నతనం... ఇప్పుడు తలచుకుంటే అన్ని సంవత్సరాలు అక్కడ వున్నది నేనేనా అనిపిస్తుంది''

''ఇంతమందికి అంత హఠాత్తుగా పనులెక్కడ దొరుకుతాయి'' కుతూహలంగా అడిగింది రాణి.

''పనులంటే ఉద్యోగాలు కాదుకదా, చాలా ముఖ్యమైన పని యినప ముక్కలు, ప్లాస్టిక్ ముక్కలూ ఏరి అమ్మటం. ఇది ఈజీయెస్ట్. ఎవడికైనా ప్లాస్టిక్ దొరికితే అదృష్టమే. కిలో యినప ముక్కలు నాలుగు రూపాయలకు కొంటే, కిలో ప్లాస్టిక్ పన్నెండు రూపాయలకు కొంటారు. పన్నెండు రూపాయలంటే దాదాపు ఓ నెల ఖర్చుపెట్టుకోవచ్చు హాయిగా...

సినిమా థియేటర్లదగ్గర ఇంటర్వెల్‌లో గేట్లు మూసేస్తారుగదా... థియేటర్ కాంటీన్‌లో దొరికే వికాక బైటవేవో కొనుక్కోవాలనిపిస్తుంది కొందరికి. చాలామందికి సిగరెట్లు, కిళ్ళీలు కావాలి. మూసివున్న గేటుదగ్గర నిలుచుంటే వాళ్ళే పిలిచి చెబుతుంటారు తెచ్చిపెట్టమని. లేదా, మేం కూడా అరుస్తుంటాం, 'సార్, ఏమైనా తెచ్చిపెట్టాలా' అని. చాలామంది మిగిలిన చిల్లర యిస్తుంటారు, పదిహేను పైసలో, పావలానో. కనీసం పదిపైసలైనా యిస్తారు. పక్కపక్కన రెండు, మూడు థియేటర్లున్న సెంటరను కో... రూపాయి, రూపాయిన్నర ఈజీగా దొరుకుతుంది. అంటే, ఓ సినిమా చూడగా కొంచెం చిల్లర మిగులుతుంది.

లేకపోతే మార్కెట్లో బరువు సంచీలు మోయలేక అవస్తలుపడే వాళ్ళుంటారు. వాళ్ళ వెంటపడి అడిగితే మోసినందుకు పావలానో, అర్ధరూపాయో యిస్తారు. అబ్బో, చెప్పాలంటే ఎన్నో పనులు''

''రాజూ, నువ్వు... యివన్నీ చేశావా?''

''ఆ, ఒక్క అడుక్కోవటంతప్ప... చాలా మంది చేసేవాళ్ళావని''

''ఎంత పిటీ కదూ''

''మరి ఏం చేయగలం చెప్పు. ఎన్నో ఆశలు, ఎన్నో కోరికలు. అవన్నీ తీరే మార్గం లేదు. కనీసం చిన్న చిన్నవైనా చేతనైనంతలో తీర్చుకోవాలని ప్రయత్నం. సినిమా చూడడమంటే ఎంతో గొప్పవిషయం. ఇంత చేసినా ఒక్కోసారి డబ్బులు దొరకవు. దొరికినా ఏ పదిపైసలో, యిరవై పైసలో దొరుకుతాయి. అవి ఎందుకూ సరిపోవు. ఇక అప్పుడు వచ్చేపోయే జనాన్ని చూస్తూ రోడ్లమీద తిరగటం. అదే గొప్ప ఆనందం. అమ్మా, నాన్నలతో వెళుతున్న పిల్లల్ని చూస్తుంటే వాళ్ళ అదృష్టంమీద ఈర్ష్య. మనకు అలా లేరే అని బాధ. ముఖ్యంగా మారాంచేసే పిల్లల్ని చూస్తుంటే వాళ్ళమీద తెగ కోపమొచ్చేది. అదే మేమైతే మారాంచేయంగదా అని అనుకునేవాళ్ళం. చెప్పుకుంటూపోతే ఎన్నో చెప్పొచ్చు''

''కానీ, ఆశ్రమంలో పిల్లల్ని అలా వదిలేస్తే వాళ్ళకు ఏ ఆక్సిడెంటో జరిగితే... ఎక్కడో



దెబ్బలాడుకుని ఏమైనా ఐతే... ఎవరైనా ఎత్తుకుపోతే...''

''నిజమే... రూల్సుప్రకారం పిల్లల్ని బైటికి వెళ్ళనీయకూడదు. వాళ్ళే వెంటవుండి బైటికి తీసికెళ్ళాలి. కానీ అవన్నీ జరిగే పనులు కావు. అలాగే బైటికి పోనిస్తారంటే అనుమతి యిస్తారనికాదు. వాచ్‌మన్‌కు ఏదో చెప్పి మేమే వెళ్లిపోతుంటాం. అది తెలిసినా తెలియనట్టుంటారు. ఒక్కోసారి అసలు వాచ్‌మన్ వుండడు కూడా. ఎప్పుడో ఓసారి, ఎవరైనా నువ్వన్నట్టు ఏదైనా చేసుకుని వచ్చినప్పుడు అరుస్తారు... కొడతారు. ఓ నాలుగురోజులు ఎవర్నీ బైటికి వెళ్ళనీయరు. తరువాత మళ్ళీ మామూలే. మా పాత వార్డెన్ వున్నప్పుడు మరీ పట్టించుకునేవాళ్ళు కాదు. కొత్త వార్డెన్ సుబ్రహ్మణ్యంగారని వచ్చాడు. ఆయన వచ్చాక మా పరిస్థితి మెరుగుపడింది. మంచి భోజనం పెట్టేవాళ్ళు. బాగా చూసుకునేవాళ్ళు. ఆయనొచ్చాక ఆశ్రమం... నిజంగా ఆశ్రమం ఎలా ఉండాలో అలావుంది.

''కానీ, యిలా ఎందుకుంటుంది? ఈ మనుషులంతా తోటివాళ్లగురించి ఎందుకు ఆలోచించరు. ఇంతమంది, ఇన్ని కష్టాలు పడుతుంటే చూస్తూ ఊర్కోవటం తప్ప మనం ఏమీ చేయలేమా రాజూ'' నిస్సహాయంతో ఆక్రోశించింది రాణి.

''మనం ఏంచేయగలం చెప్పు... మన చేతనైనంతలో వాళ్ళను ఓదార్చగలం. వీలైతే ఏ చిన్న సహాయమో చేయగలం, అంతే''

''అదే మనలాగా అందరూ ఆలోచిస్తే ఎంత బావుంటుంది''

''పిచ్చిరాణీ, ఈ ప్రపంచంలో ఏ యిద్దరు మనుషులూ ఒకలా ఆలోచించరట, తెలీదూ''

★ ★ ★

పెన్నార్ ఫుడ్స్ కంపెనీ దినదినాభివృద్ధి చెందసాగింది. విశ్వనాథం పాత యిల్లు ఖాళీ చేసి, దగ్గర్లో చాలా విశాలమైన స్థలం వున్న ఓ యిల్లు అద్దెకు తీసుకున్నాడు, పనివాళ్లు పెరిగారు. మార్కెట్ పెరిగింది. క్రమంగా రాష్ట్రమంతటా డిస్ట్రిబ్యూషన్ చేయటానికి ఏర్పాట్లు మొదలెట్టారు.

విశ్వనాథంకు తీరిక దొరకటం కష్టమైపోతూంటే, అన్నపూర్ణకు చేద్దామంటే పని కనిపించటంలేదు. రోజూ రెండుసార్లు వంటచేయటం, యిల్లు సర్దుకోవటం, అంతకు మించి పనేమీ కనిపించక తనూ వచ్చి మాన్యుఫాక్చరింగ్‌లో కూర్చుని అజమాయిషీ చేయటం మొదలెట్టింది.

''నీకెందుకు అన్నపూర్ణా. ఇద్దరున్నారుకదా అవన్నీ చేయటానికి'' అన్నాడు విశ్వనాథం.

''చెబితే వినదయ్యా. నువ్వెళ్ళి హాయిగా పడుకోమ్మా అంటే, నేనూ మీలాగే ఏమీ తోచక చేస్తున్నానన్నయ్యా అని వీక్‌పాయింట్ మీద కొడుతుంది. అందుకు గమ్మునూర్కున్నాం'' వివరించాడు రాజారాం.

పనివాళ్ళవైపు తిరిగాడు అంతలోనే ''అయ్యయ్యో, అంత నూనె ఎందుకురా బాబూ. ఇప్పుడు వేయించుకుని తింటావా ఏంటి? నూనె ఎక్కువైతే ముక్క వాసనొస్తుంది. తీసెయ్, తీసెయ్'' అంటూ, అక్కణ్నించి తప్పించుకుపోయాడు.

''ఎన్నేళ్ళొచ్చినా వీడికీ చిలిపితనం పోదు'' ఆరోపించాడు థామస్.

''చిలిపితనం లెక్కలు తరవాతెయ్యొచ్చు. కాస్త నాలుగు రోజులు నాతోపాటు కూర్చోవాలి నువ్వు. డిస్ట్రిబ్యూషన్ సంబంధించి లెక్కలూ అవీ అంతా గందరగోళంగా వుంది. ఒక్కటీ అర్థమైచావటంలేదు'' విసుగ్గా అన్నాడు విశ్వనాథం.

''ఒక్కటీ అర్థంకావటంలేదా? నీకే అర్థంకాకపోతే స్కూల్లో పాఠాలేం చెప్పావ్ యిన్నిరోజులూ'' ఆశ్చర్యం నటించాడు థామస్.

''ఇదిగో, నీ వెధవ జోకులాపు. నాకు మండిపోతూంది. సాయంత్రం భోజనానికి యిక్కడే తగలడండి. బిజినెస్ గురించి మాట్లాడాలి'' అన్నాడు విశ్వనాథం.

''ఇంకా ఎందుకండీ తాపత్రయం. ఇది సరిపోదా మనకు. అనవసరంగా లేనిపోని వాటికిపోయి తలనెప్పులు ఎక్కువ చేసుకోవటం'' అంది అన్నపూర్ణమ్మ.

''చాలును- అనేది లేదు. డబ్బు సంపాదించటం కాదు అన్నపూర్ణా యిది ఒక థ్రిల్. మనం ఎంతవరకూ చేయగలం. ఎక్కువగా ఎందుకు చేయలేం. అని చూసుకోవడం. అన




లు నువ్వు అస్తమానమూ అంటూనే వుండు. నేను చేస్తూనే వుంటాను'' అక్కణ్నించి వెళ్ళిపోయాడు విశ్వనాథం.

''చూశావామ్మా... సాయంత్రం బిజినెస్ పనుందట. ఓవర్టైం చేయాలి. భోజనంతో సరిపుచ్చుకుంటాట్ట. సంపాదనెక్కువైపోతున్న కొద్దీ పిసినారైపోతున్నాడు'' ఆరోపించాడు థామస్.

నవ్వుకుంది అన్నపూర్ణ. భర్త అన్నమాటలు గుర్తుకు రాగానే తామిద్దరూ ఆ ఊరికొచ్చిన రోజు గుర్తొచ్చిందామెకు. ఆరోజు ఎంత ఆందోళన. ఆయనవల్ల కష్టపడటం ఏమవుతుందని ఎంత బాధ. చూస్తుండగానే ఎంత మారిపోయాడాయన. స్కూలు, పిల్లలూ తప్ప మరో విషయం తెలియని వాడు, ఏం కష్టాలు పడతాడో, ఏం బాధలు పడతాడోనని ఎంత తల్లడిల్లింది తను. బతుకుతెరువుకోసం విలవిల్లాడిపోయిన వాళ్ళు, యివాళ పదిమందికి బతుకు తెరువు కల్పిస్తున్నారు. కానీ కానీ... ఏదో చీకటి కోణంలోకెళ్ళిపోయిన ఆలోచనలతో బాధగా మూలిగింది అన్నపూర్ణమ్మ మనసు.

ఏమయ్యా భగవంతుడా, మనిషికిన్ని బాధలెందుకయ్యా కలిగిస్తావూ- అంటే- పిచ్చివాడా, కొండలు పుట్టించిన వాణ్నే లోయలూ పుట్టించాను. ఎండలూ నేనే యిస్తున్నాను. వానలూ నేనే యిస్తున్నాను. ఒకే చెట్టుకు పువ్వుల్నీ ముళ్లనీ పుట్టించాను. ఒకే రోజుకు పగలునూ, రాత్రినీ విభజించాను. గాలినీ, తుఫాన్లనూ వీయిస్తున్నాను. అన్నీ ఒకేలాంటి వుంటే ఎప్పుడూ ఒకేలా వుంటే బావుండదయ్యా, అది నా సరదా- అంటాడేమో.

ఇదివరకటిలా కాక రాణీ కాలేజీ మొదలయ్యాక రాజును కలుసుకోవటం కాస్త యిబ్బందిగా తయారయింది. అంతకు ముందు మోటర్సైకిలుండేది గనుక ఆఫీసు నుండి ఐదునిమిషాల్లో రాణి కాలేజీ దగ్గరికి వచ్చేవాడు రాజే. అది అమ్మేయటంతో బస్సులమీద ఆధారపడి తిరగటంలో అనుకున్నట్టుగా కలవటం వీలుకాక, కలిసినా మళ్లీ బస్సులకోసం చూసుకోవాలని తొందరగా వెళ్లటం, యిద్దరికీ గజిబిజిగా వుంది.

ఆరోజు రాజు ఆఫీసునుండి బైటికొచ్చేసరికి ఆఫీసుబైట కారులో ఎదురుచూస్తూ కనిపించింది రాణి.

''ఎక్కడికైనా బైటికి వెళుతున్నావా!'' అడిగాడు రాజు.

''వెళుతున్నావా, ఏంటి? వెళుతున్నాము'' నవ్వుతూ అంది రాణి.

''ఎక్కడికి!''

''పద, చెబుతాను'' డోర్తీసింది రాణి.

రెండుక్షణాలు తటపటాయించి, కారులోకెక్కాడు రాజు. కారు ముందుకు కదిలింది.

''ఇప్పుడు చెప్పు ఎక్కడికి?''

''ఎక్కడికేముంది. బీచ్కి. రోజూ బస్సులతో చస్తున్నాంగదా. అందుకే కారు తీసుకొచ్చాను''

ఇంకేమీ అనకుండా ఊర్కున్నాడు రాజు.

బీచ్కి చేరుకున్నారు.

''ఎంత హ్యాపీగా వచ్చాం కదూ'' సంతోషంగా అంది రాణి.

''హ్యాపీగానే వచ్చాంకానీ మరోసారి తీసుకురాకు. నాకు బాగా అనిపించటంలేదు''

''అదేం... ఏమయింది?''

''నాగురించి మా వాళ్ళు ఏమంటారో తెలియదు. మన పెళ్ళికి వాళ్లు ఒప్పుకుంటే ఫరవాలేదు. కానీ ఒప్పుకోరని నువ్వే అంటున్నావు. అలాంటప్పుడు మీ నాన్న కారులో నేను తిరగటం ఏం బావుంటుంది చెప్పు''

అర్థమయింది రాణికి. అది ఆత్మగౌరవానికి సంబంధించిన విషయం. వీలుగా వుంది కదాని దర్జాగా ఆయన కారులో తిరిగి, తరవాత ఆయనతో పోట్లాట పెట్టుకుని ఆయన కూతుర్ని పెళ్ళి చేసుకోవటం అంటే ఎబ్బెట్టుగా వుంటుంది. మరీ ముఖ్యంగా ఆ పోట్లాట తప్పదని కారులో తిరుగుతున్నప్పుడే తెలుసుకనుక, తనమీద తనకు గౌరవమున్నవాడెవ్వడూ చేయడలాంటి పని.

''నిజమే'' రాజు మాటకు బదులిచ్చింది- ''రేపట్నించీ తీసుకురాను''

కాస్సేపాగి మళ్ళీ తనే అంది రాణి-

''కారుల్లో తిరిగే అలవాటు మానుకోలేక తెచ్చాననుకోవద్దు. జస్ట్ మనిద్దరికీ యిబ్బందవుతూంది గదాని తీసుకొచ్చాను. అంతే!''

''పిచ్చిదానా మాట్లాడకు. మన్నం అలా

మాట్లాడుకునే రోజులు ఎప్పుడో దాటేశాం''

''ఓయ్... మాటలు సరేగానీ, ఈమధ్య పుస్తకాలు తేవటం లేదేంటి? ఏంటీ సంగతులు?'' కోపంగా అడిగింది.

''ఏమీలేదు. చదువు మీద యింట్రెస్టు పోయింది'' మృదువుగా చెప్పాడు.

''ఏంటీ! చదువుమీద యింట్రెస్టుపోయిందా. ఇలా అయితే లాభంలేదు. మన పెళ్ళి జరగాలంటే డిగ్రీ పాసవ్వాలని రూలు పెట్టేస్తాను. అమ్మా...''

''అలా అయితే చదువుకుంటాను. కానీ యింట్రెస్టు మాత్రం పోయింది. అంతే''

''ఏం?''

''ఏమీలేదుగానీ ముందు నువ్విది చెప్పు. నీకంటే నేను తక్కువ చదువుకుంటే తప్పా. పోనీ నీకిష్టంలేదా. నీకిష్టంలేదంటే చెప్పు, నీకోసం చదువుకుంటాను. తప్పంటే ఒప్పుకోను''

''నాకు అలాంటివేమీ లేవుగానీ, నువ్వు నిజంగా చెబుతున్నావా?''

''అవును''

''జోక్ చేస్తున్నావనుకున్నాను. ఎందుకిలా? హఠాత్తుగా?''

''ఎంత చదువుకున్నా ఏం లాభం. అంతకన్నా పెద్ద చదువులు చదువుకున్నవాళ్ళు చాలామందున్నారు. సరే, ఐనా ఉద్యోగం దొరుకుతుందనుకుందాం. ఏ గొర్రెతోక జీతమో, అంతే... ఇలా ఎంతకాలం బతుకుతాం. ఎదుగూ బొదుగూ లేకుండా, చాలీచాలని డబ్బుల్తో ఏం బతుకుతాం''

''మనకన్నా తక్కువగా సంపాదించుకుని హాయిగా బతుకుతున్నవాళ్ళున్నారు. సంతృప్తిలో వుంది రాజూ ఆనందం. కోరికలు తీర్చుకోవటంలో లేదు''

''నిజమే... డబ్బులో పుట్టిపెరిగిన నువ్వే అలా అంటుంటే నేనూ అవుననే అనాలి. కానీ మనమేకాదుకదా, రేపు మన పిల్లలూ, వాళ్ళ భవిష్యత్తూ. కనీసం ఒక సొంత యిల్లైనా వుండాలని నా కోరిక. వద్దంటావా చెప్పు''

''ఐతే చదువుమానేసి ఏంచేద్దామని?''

''ఏదైనా స్వంతంగా చేసుకుందామని''

''పోనీ, నేను కూడా ఉద్యోగం చేస్తాను. మనిద్దరి జీతంలోనూ ఒకరిది ఇంటి ఖర్చులకనుకుంటే మరొకరిది వెనకేసుకోవచ్చు''

రాణి చేతిని తన రెండు చేతుల్లో పట్టుకుని, ఆ అరచేతిలో సున్నాలు గీస్తూ కూర్చుండిపోయాడు ఓ పదిక్షణాలు. ఆ తరువాత, రాణి వైపు చూస్తూ అన్నాడు-

''ఉద్యోగం చేయటం నీకిష్టంలేదన్నావు, గుర్తుందా?''

''అన్నీ మన యిష్టప్రకారం జరుగుతాయా... ఐనా ఈమధ్య ఆడవాళ్ళంతా ఉద్యోగాలు చేస్తూనే వున్నారు. కొత్తేమీ కాదుకదా'' సర్దిచెప్పింది రాణి.

ఎంతమాత్రమూ వాదించదు. తనకోసం క్షణాల్లో సర్దుకుపోతుంది. ఇలాంటి అమ్మాయిని పెళ్ళిచేసుకుని, చాలీచాలని యింట్లో వుంచి, ఎదుగూ బొదుగూ లేని సంసారం నెట్టుకొస్తూ, ఏ సరదాలూ తీర్చకుండా అలా వుంచెయ్యటమేనా, వీల్లేదు... ఇలా అనుకుని అన్నాడు రాజు-

''ఊహు, నీకిష్టంలేని పని నీతో చేయించను'' స్థిరంగా అన్నాడు రాజు.

''ఇందులో పెద్ద యిష్టాయిష్టాల ప్రసక్తి ఏముంది చెప్పు. నేను యింతదూరం ఆలోచించలేదు గనుక అప్పుడలా అన్నాను. అవసరం అనుకుంటున్నాం గనుక చేస్తానంటున్నాను'' అనునయంగా చెప్పింది.

''అరే... వద్దన్నానుకదా... నిన్ను ఉద్యోగం చేయనీయను'' చిరాకు తెచ్చిపెట్టుకుని అన్నాడు.

''ఏం, నీ నెత్తినెక్కి కూచుంటానని భయమా?''

''నువ్వుకాకపోతే నా నెత్తినెవరెక్కుతారు. నీకు ఉద్యోగం చేసే అవసరం రానీయను''

''నువ్వొద్దన్నా నేను చేస్తానని పంతంపడితే''

''అవసరం వచ్చినప్పుడు నువ్వు పంతం పడతావు. కానీ ఆ అవసరం రానీయనంటున్నానుకదా'' తెలివిగా చెప్పాడు రాజు.

''ఒకవేళ, అవసరం లేకున్నా పంతంపట్టాననుకో, ఉద్యోగం చేస్తానని. అప్పుడు?'' వదల




కుండా అడిగింది రాణి.

"నువ్వలా పంతం పట్టవు. నాకు తెలును" నమ్మకంగా చెప్పాడు.

ఆ జవాబుతో తన ప్రశ్న మరిచిపోయింది రాణి-

"ఏమిటంత నమ్మకం?"

"అదంతే... నీగురించి నాకు కాకపోతే ఎవరికి తెలుస్తుంది?"

"అబ్బా, ఏం తెలునట అంత గొప్ప?"

"ఏం తెలీదు కనుక"

అప్పుడు మళ్ళీ గుర్తొచ్చింది మరిచిపోయిన విషయం-

"అంత తెలుసుకనుకేనా ఉద్యోగం చేస్తానంటే వద్దంటున్నావు" గారాబంగా అంది.

"అవును మరి... నీకెలాంటి జీవితమంటే యిష్టమో తెలును. అందుకే వద్దన్నాను. నువ్వు దేనికైనా పంతంపట్టాల్సినంత అవసరం నాదగ్గర నీకు రాదు. ఇందాక చెప్పానుగదా, నిన్ను నెత్తిమీద పెట్టి పూజించుకుంటాననీ"

"ఎందుకంటా?" మురిపెంగా అడిగింది రాణి.

"నువ్వు నాకు ఎడారిలో దొరికిన ఒయాసిస్సువి. కొంచెం కోపం వస్తేచాలు, నదులు పొంగించి ఒయాసిస్సు నింపేస్తుంటావుగదా. అందుకే నీకు కోపం రానీయను" చిలిపిగా అన్నాడు.

"ఛీ, అల్లరి పిల్లాడా. నేను ఏడుపుగొట్టుదాన్నా"

"నేనలా అన్నానా"

"మరి? కొంచెం కోపమొస్తే ఏడుస్తానని అన్నావుగదా?"

"మరి రోజూ కోపం రాదుగదా"

"గొప్పే... కబుర్లు చెప్పి మాట తప్పిస్తున్నావుగానీ చదువు సంగతి చెప్పలేదు"

"చదువుసంగతి కదూ... ఎంతని చదువుకోగలం చెప్పు. ఎంత చదువుకున్నా మన విజ్ఞానమంతా సముద్రంలోని ఆలిచిప్పలంత చెయ్యదూ అన్నాట్ట ఒకాయన. అసలు సముద్రం ఎంత విచిత్రమైంది కదూ. అంతుతెలియకుండా అలా చూస్తుంటే, ఈ ప్రపంచంలో నిజంగా మనం ఎంతఅల్పులమో అనిపించటంలేదూ. ఆ నీళ్ళు చూస్తుంటే ఓవిధమైన భయం. కానీ ఆ అలలు. పోటీలు పడి డైవింగ్ చేస్తున్నట్టు అలా పరిగెత్తుకొచ్చి, అలుపొచ్చి, ఇలా యిసుకలోకొచ్చి మళ్ళీ వెనక్కి పోతుంటే, అవే చూస్తూ బతుకంతా గడిపేయొచ్చునని పిస్తుంది"

"అసలు దీందేముంది. పున్నమిరోజు చూడాలి. నీకు గుర్తుందా. మనం రెండుసార్లు పున్నమిరోజున కూర్చుని చూశాం. ఎంత అటుపోటులు! ఎంత గమ్మత్తుగా వుంటుంది! కానీ అసలు చంద్రుడికీ, సముద్రానికీ ఆ సంబంధం ఏమిటో యింతవరకూ కనిపెట్టలేకపోయారు కదూ. సముద్రానికీ, నీ చదువుకీ సంబంధమేమిటో కూడా అర్థంకావటంలేదు"

గతుక్కుమన్నాడు రాజు. గయ్యిమంది రాణి.

"ఏయ్, తమాషాగా వుందా నీకు. ఏంటనలు నీ సంగతి. సీరియస్‌గా చెప్పు. అడుగుతుంటే మాట తప్పిస్తావా?"

"ఏదైనా స్వంతంగా చేసుకోవటం మంచిది రాణీ. బ్యాంకులో నాలుగువేలదాకా వుంది. ఓ సెకండ్‌హ్యాండ్ టైప్‌రైటర్ తీసుకుని జాబ్ వర్క్ చేసుకున్నా నెలకో ఐదారువేలొస్తాయి"

"ఏంటీ, టైపింగ్ చేసుకుంటే ఐదారువేలొస్తాయా?"

"ఔనుమరి. లాయర్ల పనుందనుకో, అలాంటప్పుడు ఒక్కోరోజు నేను అరవై, డెబ్బై రూపాయలు సంపాదించేవాణ్ణి తెలుసా నాకు ఇన్‌స్టిట్యూట్‌వాడిచ్చే ఫార్టీపర్సెంట్‌తో"

"ఎప్పుడో ఒకప్పుడు. మరి రోజూ"

"తెలుగు టైపింగ్ ఐతే పేజీకి రెండురూపాయలు. ఇరవై లైన్లకో పేజీ అవుతుంది"

"ఎన్ని టైప్‌రైటర్లు కొంటావు"

"ముందుగా ఒక్కటే అనుకో"

"అంటే ఐదారువేలు వచ్చేది వుట్టిదేకదా"

"అబ్బ, మరీ అంత ఖచ్చితంగా లెక్కలేస్తావేంటీ. నాకు లెక్కలు సరిగ్గా రావు. పోనీ ఓ మూడువేలైనా వస్తాయిగదా"

"కానీ అది గ్యారంటీకాదుకదా. ఉద్యోగమైతే నిలకడవుంటుంధికదా"





"ఔననుకో... టైపింగ్‌తోపాటు ఏదైనా చిన్న సైడ్‌బిజినెస్ లేదా ఇన్సూరెన్స్ ఏజెన్సీయో, ఎన్.ఎస్.సీ. ఏజెన్సీయో తీసుకుంటే సరిపో తుంది"

"ఈ రెండింటికీ ఎలా కుదురుతుంది?"

"అబ్బ, మరీ ఈకకు ఈక, తోకకు తోకా లాగుతావేంటీ? ఏదో మాటవరసకు చెబుతు న్నాను"

"విశ్వనాథం మాస్టారుని చూసి అను కుంటున్నావేమో. ఆ మాటకొస్తే మిరపకాయ బజ్జీల బండీ పెట్టిన వాళ్ళంతా అలా అవుతా రనేవుంది. కొందరైతే నష్టంవచ్చి, బండీ అమ్మే సుకుని పోతున్నారు"

'అది తెలివితక్కువ వాళ్ళ సంగతి"

"అబ్బో, నువ్వు మహాతెలివైన వాడివి"

"ఇదిగో, నా సంగతీ, నా తెలివి సంగతీ తెలీదు నీకు. ఓ సారి మా వార్డెన్‌ని ఏడిపించా ను, చెబితే అదిరిపోతావ్" పౌరుషంగా అన్నా డు.

"ఏంటీ, మీ వార్డెన్నేడిపించావా, చెప్పు, చెప్పు" ఉత్సాహంగా అడిగింది రాణీ.

గడియారాలు వెనక్కి తిప్పి, ప్లేన్‌లో బాంబుందని ఫోన్ చేసి మోహన్‌రావ్‌ని అరెస్టు చేయించిన విషయం చెప్పాడు.

"అచ్చం క్రైం కథలాగుంది. నిజంగా చే శావా?"

"నిజంగానే చేశాను"

"అంతకోపమా!"

"పిల్లిని గదిలో వేసి కొడితే తిరగబడు తుందని విన్లేదూ నువ్వు. అలాగన్నమాట. ఏమీ చేయలేని, ఎవరికీ చెప్పుకోలేని నిస్సహాయుల మని ఆ నిర్లక్ష్యం. ఆశ్రమంలో వుండగా ఎన్నో ఆశలు, ఎన్నో కోరికలు. సరదాగా నవ్వుకున్నా వాడికి చిరాకేస్తే తన్నేవాడు అప్పుడు ఏ ప్రే మకూ, ఏ ఆదరణకూ నోచుకోక అలా కన్నకల లు, కట్టుకున్న ఊహా సౌధాలూ కోకొల్లలు. సొంతయిల్లు కట్టుకోవాలనీ, కాశ్మీర్‌లూ, స్విడ్జ ర్లాండ్‌లూ చూడాలనీ, టేప్ రికార్డర్‌లూ, టెలివి జన్‌లూ కొనుక్కోవాలనీ యిలా ఎన్నో కోరికలు. ఎన్నో కలలు. కానీ నీకోసంగతి చెప్పనా? ఆ కలల్లో నువ్వు మాత్రం లేవు"

"అదేం?" కుతూహలంగా అడిగింది రాణీ.

"బాగా డబ్బు సంపాదించుకుని, పెద్దమేడ కట్టుకుని, రోజుకో కారులో జల్సాగా తిరుగు తుంటే, ఓ బీదమ్మాయి ఎవరో పరిచయమవు తుంది. ఆ అమ్మాయిని ప్రేమిస్తాను. 'నాకింత అదృష్టమా' అని ఆ అమ్మాయి పొంగిపో తుంది. లేదా, 'ఛీ మీ డబ్బున్న వాళ్ళంటే నాకసహ్యం' అంటుంది. అప్పుడు ఆమెకోసం బోల్డు త్యాగాలు చేసి చివరకు ఆమెను పెళ్ళి చేసుకుంటాను. అంతే కానీ, అనగనగా ఓ రాణీ, అనగనగా ఓ రాజును ఎప్పుడూ ప్రే మించలేదా కలల్లో. అందుకే కనని కలే నిజంకాగా లేనిది, కన్న కలలు నిజం చేసుకో కూడదా అని"

"అమ్మో, నీకు చాలా ఆశలున్నాయి"

"అవును. రాణీని పెళ్ళి చేసుకోవటం పెద్ద ఆశ. ఆ రాణీ కష్టపడకుండా చూసుకోవటం చిన్నచిన్న ఆశలు. విశ్వనాథం మాస్టారు చెబు తుంటారు. తృప్తితో ముందడుగులేదని. నిజ మేననిపిస్తూంది నాకు."

"రాజా, నువ్వేం చేసినా నాకిష్టమే. కానీ ఆ కోరికల వేటలోపడి, నాకూ, సంతోషానికీ దూరం కావొద్దనేదొక్కటే నాకోరిక" బేలగా చెప్పింది రాణీ.

"కోట్లు గడించాలని నాకు లేదు రాణీ. కానీ మరికాస్త సుఖంగా, సంతోషంగా వుండటానికి. కొంచెం కష్టపడదామని, అంతే. అదైనా నీకి ష్టంలేని పనేదీ చేయను"

"రేపొచ్చే కష్టాలకోసం సంపాదనలోపడి యివాళ్టి జీవితంలోని ఆనందం అందుకో కుండా వుండొద్దు" అంటారుపెద్దలు.

"అయితే ఉద్యోగం చేస్తూ, చదువుకుంటా ను"

"వద్దు... నువ్వేం చేసినా నేను చెప్పింది వింటావనీ, నాకు దూరం కావనీ నాకు నమ్మక ముంది నీ యిష్టమైందే చెయ్యి. కానీ నా స్టైల్లో చెయ్యి. సుఖమూ, సంతోషమూ రెండూ వుంటాయ్"

ఇద్దరూ యింటి దారి పట్టారు-

"సరే... రేపట్నుంచి ఈ కారు తీసుకురాను. నువ్వు కారొద్దన్నప్పుడే యింకో విషయం అడు

గుదామనుకున్నాను''

"ఏంటీ?''

"ఇంకా ఎంతకాలం నాకీ అరణ్యవాసం?''

"రాణీ... పొరపాటున కూడా సీతతో పోల్చుకో వద్దు'' గబుక్కున రాణి చెయ్యి పట్టుకుని అన్నాడు రాజు.

"సరే...'' తృప్తిగా నవ్వుతూ అడిగింది రాణి- "పోనీ, ఈశ్వరుండనుకూలింపద లంచునో, దలవడో, నాభాగ్యమెట్లున్నదో అను కుంటూ రుక్మిణీదేవిలాగా ఎన్నాళ్ళు వుండ మంటావు, దినదినగండంగా''

"ఒక వారంరోజులు టైమివ్వు. ఆలోచిద్దాం''

"నా భాగ్యమెట్లున్నదో''

"నేర్మానుకో'' కసిరాడు రాజు



విశ్వనాథం తీరిగ్గా కూర్చుని రాజారాం, థామస్‌లతో తన ఆలోచనలు వివరిస్తూ, వాళ్ల అభిప్రాయాలు వింటున్నాడు. ఒకసారి రాష్ట్ర మంతటా పర్యటించివస్తే మంచిదని అను కుంటున్నారు. ఎక్కణ్నుంచి మొదలెట్టి ఎటు వెళ్ళాలి. ఎవరెవరు వెళ్ళాలి, ఎలా వెళ్లాలీ అని చర్చించుకుంటున్నారు. అన్నపూర్ణమ్మ వచ్చి పిలిచింది.

"వంట అయిపోయింది. మీదే ఆలస్యం''

"వస్తున్నాం, ఒక్క ఐదు నిమిషాలాగు'' అన్నాడు విశ్వనాథం.

అన్నపూర్ణలోపలికి వెళ్ళింది. మళ్ళీ మాట ల్లో పడ్డారు. ట్రెయినైతే సుఖంగా వుంటుంది గానీ కారువల్ల టైం కలిసొస్తుంది. కారులో ఎన్నిరోజులు ప్రయాణం చేయొచ్చు. ట్రెయి నైతే ఎన్నిరోజులు ప్రయాణం చేయొచ్చు. వగైరా సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

స్టాకూ, సామాన్లూ, అన్నీ అక్కడే వుండ టంతో ఓ నైట్ వాచ్‌మన్‌ని ఏర్పాటుచేయ డంతోపాటు, ఓ కుక్కని కొన్నాడు విశ్వనాథం. గేటుదగ్గర వాచ్‌మన్‌తో ఎవరో మాట్లాడటం, కుక్క అరవటం వినిపించిందిగానీ ఎవరో, ఏమిటో అని పట్టించుకోలేదు. కాస్సేపటికి, ఓ యిద్దరు మనుషులు గేటు దగ్గర్నించి రావటం కనిపించింది. ఎవరై వుంటారాని ఆలోచిస్తూ, వాళ్లనే చూస్తున్నాడు విశ్వనాథం. రాజారాం, థామస్‌లు కూడా మాటలు ఆపారు.

వాళ్ళిద్దరూ దగ్గరికొచ్చారు. రాజేశ్వర్, గంగా ధర్!

భృకుటి ముడిచాడు విశ్వనాథం. వీళ్ళకు ఎవరు చెప్పారు, ఎలా వచ్చారు!

ఇంకో రెండడుగులు వేయగానే రాజేశ్వర్ ఆత్రంగా పిలిచాడు విశ్వనాథం వంక చూస్తూ-

"నాన్నా''

"నాన్నా బాగున్నావా'' అడిగాడు గంగా ధర్.

రాజారాం, థామస్‌లు వాళ్లవంక ఆశ్చ ర్యంగా చూసి, విశ్వనాథంవైపు తిరిగారు. ఆయన ముఖంలో ఆశ్చర్యంలేదు. ఆనందం కూడాలేదు. విసుగూ, లీలగా గోచరిస్తున్న అస హ్యం కనిపించాయి.

"ఎవరు బాబూ మీరు!'' వ్యంగ్యంగా అన్నా డు విశ్వనాథం.

"ఏమండీ, భోజనం చల్లారిపోతోంది'' అంటూ అప్పుడే అక్కడికి వచ్చిన అన్నపూర్ణ మ్మ కొడుకులిద్దర్నీ చూసి ఆశ్చర్యంగా నిలబడి పోయింది. ఏం చేయాలో ఎలా పలకరించాలో అర్థంకానట్టు భర్తవైపు తిరిగి చూసింది.

తల్లిని చూడగానే యిద్దరూ, ముందుకు కదిలారు.

"అమ్మా, బాగున్నావా''

"బాగున్నాం బాబూ, మీరెలా వున్నారు, ఎప్పుడొచ్చారు'' సంతోషంగా పలకరించింది అన్నపూర్ణమ్మ.

"ఆగండి'' తీవ్రంగా విశ్వనాథం స్వరం విని, ముందుకు కదలబోతున్న వాళ్లల్లా యిద్ద





రూ ఆగిపోయారు.

"అన్నపూర్ణా, నువ్వు లోపలికెళ్ళు" స్థిరంగా చెప్పాడు విశ్వనాథం.

క్షణంకాలం ఆయన్ని విచిత్రంగా చూసి, వెంటనే అక్కణ్ణించి కదిలి, గుమ్మంలో కెళ్ళిపో యింది అన్నపూర్ణమ్మ.

"ఇప్పుడు చెప్పండి, ఏం కావాలి మీకు"

"అదేంటి నాన్నా..."

"మరోసారి నన్నలా పిలవొద్దు. ఎందుకొచ్చా రు"

"ఏదో మనస్పర్థలొస్తాయి, పోతాయి. అంత మాత్రాన కన్నవాళ్ళు కన్నవాళ్ళు కాకుండా పోతారా నాన్నా"

"ఎవర్రా మీకు కన్నవాళ్లు. ఎవర్రా మీ అమ్మా నాన్నలు. ఎందుకొచ్చారు, మీకేం పని క్కడ"

"జరిగిందేదో జరిగింది ఓసారి మిమ్మల్ని చూసి, క్షమాపణలు చెప్పుకుందామనొచ్చాం. ఆమాత్రం క్షమించకూడదా నాన్నా మమ్మల్ని"

"నాకు మీ క్షమాపణలు అక్కర్లేదు. చూశా రుగదా, యిక వెళ్లండి, మళ్లీ ఎప్పుడూ రాకూడ దు. గెటౌట్" గట్టిగా అరిచాడు విశ్వనాథం.

వెంటనే రాజారాం, థామస్‌లవైపు తిరిగారి ద్దరూ-

"ఏం సార్ మీరైనా చెప్పండి. చిన్న వాళ్లం. తెలిసీ తెలియక తప్పులు చేసి వుండొచ్చు. అంతమాత్రాన యిక జీవితాంతం ముఖాలు చూసుకోమా చెప్పండి"

అయోమయంగా చూశారిద్దరూ.

"వాళ్ళు చెప్పేదేంటి, నేను చెబుతున్నాను. మీ ముఖాలు చూడటం నాకిష్టంలేదు. పోండి, వెళ్ళిపోండిక్కణ్ణించీ" మళ్ళీ అన్నాడు విశ్వ నాథం.

అప్పటికే ఆ గొడవకు వాచ్‌మన్ లోపలికొ చ్చాడు.

విశ్వనాథం మాటలకు యిద్దరికీ కోపమొ చ్చింది.

"నువ్వు వెళ్ళమనగానే వెళ్ళిపోవటానికి మేమేం దారిన పోయే దానయ్యలం కాదు. నీకొడుకులం. నువ్వు కాదన్నా యిక్కడుండే హక్కుంది మాకు"

"సింహాద్రీ" పిలిచాడు విశ్వనాథం.

చేతులు కట్టుకుని ముందుకొచ్చాడు వాచ్ మన్. రాజేశ్వర్, గంగాధర్ లిద్దరూ వాచ్‌మన్ వైపు చూశారు. ఆరడుగుల ఎత్తుతో, కండలు తిరిగిన శరీరం బుంగమీసాలు, ఖాకీడ్రెస్సు, బెల్టుకు వేళ్ళాడుతున్న కత్తితో, పోలీస్ ఆఫీ సర్‌లాగా హుందాగా, ఠీవిగా వున్నాడు. ఇద్దర్నీ ఒంటిచేత్తో ఎత్తి గోడవతల విసిరేయగలడని పించింది. అప్రయత్నంగా ఒకడుగు వెనక్కే సారిద్దరూ.

"విశ్వనాథం, తొందరపడకు" వారించాడు థామస్.

అతన్ని ఆగమన్నట్టు చెయ్యూపి, వాచ్‌మన్ వైపు తిరిగాడు విశ్వనాథం-

"సింహాద్రీ, నీ తాగుబోతు కొడుకు నీ వాచ్ అమ్ముకున్నప్పుడు ఏం చేశావు నువ్వు"

"మక్కెలిరగతన్ని యింట్లోంచి వెళ్లగొట్టాన య్యా"

"అదేంటి, నీ కొడుక్కు నీ వాచ్ మీద అధికారం లేదా?"

"ఎలా వుంటుందయ్యా. కాణీ సంపాదన లేకుండా బలాదూర్ తిరిగి, తాగటానికి యింట్లో వస్తువులు అమ్ముకుంటామంటే ఎవ రూరుకుంటారు"

"అది సరే... మరి మీవాడు ఊరుకున్నాడా అంతటితో" మళ్ళీ ప్రశ్నించాడు విశ్వనాథం.

"ఎక్కడూరుకున్నాడయ్యా, తాగుబోతునా కొ డుకు. తనను యింట్లో వుంచుకోవాలని గొడవ చేశాడు. మరెందుకు కన్నావని నిలదీసి అరి చాడు"

ఆసక్తిగా వింటున్నారు శ్రోతలంతా, వాళ్ళి ద్దరి సంభాషణనూ.

"మరి నువ్వేమన్నావు సింహాద్రి"

"అనేదేముందయ్యా... వాడి ఆఫీసుకెళ్లి, అక్కడ ఆఫీసర్‌తో చెప్పాను. ఆయన పిలి పించి అడిగాడు. ఆయనతో కూడా అదే కూత కూశాడు యెదవ. కన్నతండ్రి యింట్లో వుండటం తన హక్కనీ, నేనాణ్ని ఉంచుకోవా లనీ, లేకపోతే కోర్టుకు పోతాననీ కూడా అన్నా డు, ఎవడు నేర్పాడో యెదవకి"

"మరేమయింది... కోర్టుకు వెళ్ళాడా?"

"ఎలా వెళతాడండీ, ఆ ఆఫీసరువాడికి బాగా బుద్ధి చెప్పాడుకదా"

"అంటే ఆఫీసరుకు భయపడిపూరుకున్నాడా?" అడిగాడు విశ్వనాథం, వికసించిన కొడుకుల ముఖాలవంక చూస్తూ.

తామిద్దరివీ గవర్నమెంట్ ఉద్యోగాలు. తమకు అలా చెప్పే హక్కుతమ ఆఫీసర్లకు లేదని వాళ్ళ నమ్మకం. విశ్వనాథం ప్రశ్నతో మళ్ళీ సింహాద్రివైపు తిరిగారు రాజేశ్వర్, గంగాధర్ లిద్దరూ.

సింహాద్రి చెప్పసాగాడు

"లేదండీ, కోర్టుకెళితే ఏమవుతుందో ఆయన చెప్పాడండీ. పద్దెనిమిదేళ్ళు నిండిన పిల్లల్ని అమ్మ, నాన్నలు పట్టించుకోనవసరం లేదట. అంతేకాక ఒకవేళ తండ్రి వుంచుకోవాల్సిందని తీర్పిచ్చినా వాడి జీతమంతా నాకే యియ్యాలట. అలా వచ్చినా మంచిదేననుకున్నాడు వాడు. కానీ జీతమంతా తీసుకుని తిండీ, బట్టాకన్నా యియ్యనని చెప్పానండీ నేను. అంతకన్నా ఎక్కువ కోర్టు కూడా అడగదట. చివరకు అవసరమైతే ఉద్యోగం వదిలేస్తానన్నాడండీ వాడు. అప్పుడు కూడా అంతేనట. ఐనా, వాడికి మాత్రం తెలియదాండీ, కోర్టుకు వెళితే ఎన్నడుతేలుతుందో, ఏమిటోనని"

"సరే కోర్టుకెళ్ళి ఒకవేళ గెలిచి వచ్చాడనుకో. అప్పుడేం చేస్తావ్?"

"కుక్కని చూసినట్టు చూస్తానండీ. ఐనా వున్న ఉద్యోగం వదిలేసుకున్న నా కొడుకుని పోషించాలని ఏ కోర్టు చెబుతుందండీ"

"మంచిది సింహాద్రీ, నువ్వెళ్ళి పక్కన నిలుచో"

విశ్వనాథం చెప్పగానే నాలుగడుగులు పక్కకెళ్ళి నిలుచున్నాడు వాచ్‌మన్.

"ఇంకేమీ లేదనుకుంటాను, మీరు మాట్లాడవలసింది" కొడుకుల వైపుతిరిగి చెప్పాడు విశ్వనాథం "ఒరేయ్, దున్నపోతుల్లా పెరిగి, అడ్డగాడిదల్లా తండ్రి మీదపడి తింటామంటే ఏ కోర్టూ ఒప్పుకోదు. కన్నతండ్రి మనసు కరిగి ఒప్పుకోవచ్చునేమో కానీ నాకు అలా మనసనేది లేకుండా చేశార్రా మీరిద్దరూ. ఇవాళ నేను నాలుగు డబ్బులు సంపాదించుకోగానే మీకు నేను గుర్తొచ్చానా? రిటైరవగానే పనికిమాలిన నాన్న గొప్పవాడు కాగానే పనికొస్తాడన్న మాట. ఒకవేళ ఏ కోర్టయినా మిమ్మల్ని నేను పోషించాలని గానీ, నా ఆస్తిలో మీకు వాటా యివ్వమని గానీ తీర్పు యిచ్చిందే అనుకుందాం. మొత్తం పెట్రోలు పోసి తగలెడతానుగానీ, మీకివ్వను, అర్థమయిందా?"

ఇద్దరూ విశ్వనాథంను కొరకొరా చూస్తూ నిలుచున్నారు.

'సరే నాన్నా ఏం చేయాలో మాకు బాగా తెలుసు"

"మీరు నన్నేమీ చేయలేరు. ఏం చేసినా వున్న ఉద్యోగాలు వూడి రోడ్ల మీద అడుక్కు తింటారు. మురికి గుంటలో పోసే మూత్రం దోసిట్లో పోయమని అడిగినా ఎవ్వరూ పోయర్రా మీలాంటి వాళ్ళకు"

"ఈ వయస్సులో నీకేయింత పౌరుషముంటే మాకెంత వుంటుందో ఆలోచించుకో" క్రూరంగా అన్నాడు రాజేశ్వర్.

"ఆలోచించుకుంటాను. ఒక్క నిమిషం ఆగి వెళ్ళండి... సింహాద్రీ, ఫోన్ తీసుకురా"

సింహాద్రి లోపలికెళ్ళాడు.

ఫోన్ ఎందుకో, తనను ఆగమనటం ఎందుకో అర్థం కాక ముఖాలు చూసుకుంటూ నిలుచున్నారు రాజేశ్వర్, గంగాధర్ లిద్దరూ.

సింహాద్రి ఫోన్ తీసుకురాగానే, నంబర్ కలిపాడు విశ్వనాథం

"హలో, ఇన్‌స్పెక్టర్ నాయుడుగారా, నమస్కారం... బిజినెస్ బాగుండేదెప్పుడు సార్. రోజూ టెన్షనే గదా. ఏం లేదు మీకు చిన్న ట్రబులిస్తున్నాను..."

రాజేశ్వర్, గంగాధర్ లిద్దరికీ అరచేతులు చెమటతో తడిసిపోయాయి. రాజారాం, థామస్‌లు కుతూహలంగా వింటున్నారు. విశ్వనాథం మాట్లాడుతున్నాడు, ఫోన్‌లో

"ఏం లేదు సార్, చిన్నగొడవ జరిగింది. నాకొడుకులిద్దరూ నామీదికొచ్చి దౌర్జన్యం చేశారు... అబ్బే అంత సీరియస్సేమీ లేదు, చిన్న చిన్న దెబ్బలు తగిలాయ్, సమయానికి మా వాచ్‌మన్ లేకపోతే ఏమయ్యేదో... నా ఆస్తిలో వాళ్ళకు వాటా యివ్వాలట. యివ్వనన్నానని





యిలా వచ్చారు. కత్తిలాంటిదేమీ లేదుగానీ, చంపుతామని బెదిరించారు... వాళ్ళ ధోరణి చూస్తే చంపేటట్టే వున్నారు''

రాజేశ్వర్, గంగాధర్ లిద్దరూ అక్కణ్నించి కదలబోయారు. ఇద్దరికీ అడ్డుగా నిలుచున్నాడు సింహాద్రి.

''... అవునుసార్, యిద్దరూ గవర్నమెంట్ ఎంప్లాయిలే... అహహ, యిక్కడ కాదు... కేసు రాస్తే సస్పెండవుతారా, అవనీయండి... ఆ మాత్రం శిక్ష పడకపోతే ఈసారి కత్తులు తీసుకునే వస్తారు... ఓకే. పంపించండి కానిస్టేబుల్నుని... నేనొచ్చి కంప్లెయింట్ రాసిస్తాను... ఏంటి సార్ యింకా సంగతులు... అమ్మాయి పెళ్ళా, ఎప్పుడు లాస్ట్‌వీక్‌లోనా, మీకేం తక్కువసార్... భలే వారే, మీకు కాకపోతే ఎవరికి చేస్తాం... మీ అమ్మాయి పెళ్ళిలో వడియాలవిందే అనుకోండి. నూనెదేముంది సార్, పోనీండి, వేయించి పంపిస్తాను. 'మీ పెళ్లి హాయిగా జరగాలి కానీ మాకు అంతకన్నా ఏం కావాలి. మంచిది సార్, వుంటాను'' ఫోన్ పెట్టేసాడు విశ్వనాథం.

రాజేశ్వర్, గంగాధర్‌లిద్దరూ పరిగెత్తుకొచ్చి విశ్వనాథం కాళ్ళమీద పడిపోయారు. అన్నపూర్ణమ్మ కూడా అప్పటికే గుమ్మంలోంచి అక్కడికొచ్చి నిలుచుంది.

''నాన్నా అన్యాయం నాన్నా''

''తప్పుడు కంప్లెయింటిచ్చి, మమ్మల్ని జెయిల్లో తోయిస్తావా నాన్నా''

''ఛీ, లేవండిరా'' లేచి నిలుచున్నాడు విశ్వనాథం.

ఇద్దరూ లేచి నిలుచున్నారు.

''ఏరా, నాకన్నా ఉడుకు రక్తంలోవున్నారా? ఏమైనా చేస్తారా? అంటే చంపుతామనే కదా? మా యిద్దరినీ చంపితే ఈ కంపెనీ మీకొస్తుందని కదూ. మేం చచ్చిపోతే ఈ మొత్తం హెూంఫర్ ఏజ్‌డ్‌కు చెందాలని ఎప్పుడో వీలునామా రాసిపెట్టాను. ఇక్కడుండే హక్కుందా మీకు? ఏం చేయాలో బాగా తెలుసా? చేయండ్రా, యిప్పుడు చేయండి ఏం చేస్తారో...''

''ఏదో మాట వరుసకు కోపంలో అంటే మా జీవితాలు పాడు చేస్తావా నాన్నా''

''మాట వరుసకు అన్నారా? ఏం హక్కుందిరా మీకు యిక్కడుండటానికి? ఉండొద్దన్నందుకు జన్మనిచ్చిన తల్లితండ్రులనైనా ఆలోచించకుండా, ఏం చేయాలో తెలుసునంటారా. మీరు అంత దూరం పోయాక నేనెందుకు ఆలోచించాల్రా... ఆస్తి కోసం, కక్షలతోనూ కన్నవాళ్ళను చంపిన వాళ్ళు ఎంత మందిలేరు... మిమ్మల్ని యిలా వదిలేసి, నేను రోజూ భయపడుతూ బతకాలా? మీ జీవితాలు పాడై పోతాయా? మీకా జీవితం యిచ్చిందెవర్రా? నేను. మీ కోసం మా జీవితాల్లో సుఖాలనేవి లేకుండా చేసుకుంటే, ఏమీలేని ఆఖరి రోజుల్లో మాతో చెలగాట మాడుకుని, మళ్ళీ యిప్పుడొచ్చి మాతో చెలగాట మాడుతార్రా? కన్నవాళ్ళనే జ్ఞానం అప్పుడు లేదురా మీకు? పోలీసులొస్తారు, వెళ్ళండి. నాలుగు రోజులు లాకప్‌లో తన్నులు తిని, కోర్టులో కేసు పూర్తయే దాకా సస్పెండ్ అయి, తిప్పలు పడితే తెలుస్తుందిరా, దుర్మార్గానికి ఫలితమేంటో...''

''ఏమండీ'' కన్నీళ్ళతో పిలిచింది అన్నపూర్ణమ్మ.

''ఈ దుర్మార్గులకోసం ఎందుకు అన్నపూర్ణా కళ్ళ నీళ్ళు పెడతావ్... ఫర్వాలేదు. ఏమీ కాదు వీళ్ళకు... మనం ఈపని చేస్తేనే మనకు శ్రీరామరక్ష. లేకపోతే మనను చంపించినా చంపిస్తారు. డబ్బు పాపిష్టిది అన్నపూర్ణా''

పోలీసులొచ్చి రాజేశ్వర్, గంగాధర్ లిద్దరినీ తీసుకుపోయారు.

''మరీ అంత కఠినంగా ప్రవర్తించి వుండాల్సింది కాదు విశ్వనాథం'' అన్నాడు రాజారాం.

''మీకు తెలీదు. ఇప్పటికైనా వాళ్ళిద్దరూ పశ్చాత్తాపం ప్రకటిస్తే నా మనసు ఏమైనా కరిగేదేమో. కానీ వాళ్ళ మాటలు విన్నావుగదా. వాళ్ళకు హక్కుందట. ఇవ్వకపోతే ఏం చేయాలో తెలుసట. అంటే మేం అక్కర్లేదు వాళ్ళకు. డబ్బు కావాలి. దాని కోసం మమ్మల్ని ఏమైనా చేస్తారుట. అంత దూరం వచ్చాక ఊరికే వదిలితే చంపినా చంపుతారు. ఈ మాత్రం గుణపాఠం చెప్పకపోతే బాగుండదు''

''ఎంతైనా కన్న బిడ్డలు కదా'' అన్నాడు రాజారాం.

''కన్నబిడ్డలు కనుకే వదలదలుచుకోలేదు.

వేరే ఎవరైనా ఐతే క్షమించి వదిలేసేవాణ్ణి!"

జరిగిన దానికి అన్నపూర్ణమ్మకు కూడా బాధగానే వుందిగానీ, తమ పిల్లలు తన భర్త మనసులో చేసిన గాయం ఎంత రగిలిపోతూందో ఆమెకు తెలుసు. ఆ వుండు మీద యివాళొచ్చి వాళ్ళు కారం చల్లడం కూడా తెలుసు. అయ్యో, కన్న బిడ్డలు అని ఆమె మనసు ఆక్రోసించింది గానీ, భర్తచేసిన దాని మీద ఆమెకు కోపం రాలేదు.

★ ★ ★

ఆరోజు విశ్వనాథం మాస్టారు రిటైరయ్యే రోజు. చదువుకుని స్కూల్లోంచి బైట పెట్టిన కాలుని, మళ్ళీ స్కూల్లోనే పెట్టిన విశ్వనాథం యిక ఆ స్కూలుకు రావలసిన అవసరం మరునాటి నుండీ లేదు.

ఆయనకు రాజకీయాలు తెలియవు. పైరవీలు తెలియవు. ద్వేషాలూ, కక్షలూ తెలియవు. పిల్లలకు చదువు చెప్పటమొక్కటే తెలుసు. ట్యూషన్లంటే ఆయన దృష్టిలో, తను స్కూల్లో అందరితో పాటూ సరిగ్గా చెప్పలేని పిల్లాడికి యింటి దగ్గరైనా చెప్పి అర్థం చేయటమే కానీ ఆర్జన కాదు. కనీసం కరివేపాకు రెమ్మకూడా ఎన్నడూ పిల్లల దగ్గర్నించి తీసుకుని ఎరగడాయన.

అందుకే ఆయన హెడ్‌మాస్టారు కాలేకపోయాడు. అలా అని ఆయనకు ఎన్నడూ బాధ కలగలేదు. బతకలేక బడి పంతులన్నారుగానీ ఆయన మాత్రం తను బతుకుతున్నదే బడి పంతులుగా వుండటం కోసమనుకున్నాడు. అలాగే బతికాడు. ఐనా ఉత్తమ ఉపాధ్యాయులకిచ్చే అవార్డులు కూడా ఎన్నడూ ఆయనకు రాలేదు.

విశ్వనాథం మెడలో పూలమాల వేసి నమస్కరించాడు హెడ్ మాస్టర్. పిల్లలంతా ఉత్సాహంగా చప్పట్లు కొడుతున్నారు. రెండు మాటలేవో మాట్లాడాడు హెడ్ మాస్టర్. తరవాత విశ్వనాథం మాస్టారు మాట్లాడుతారని ప్రకటించాడు.

మాట్లాడటానికి లేచి నిలుచున్న విశ్వనాథంకు ఒక మూల నిలుచుని, కళ్ళు తుడుచుకుంటున్న రాఘవ కనిపించాడు. టేబుల్ దగ్గర్నుంచి లేచి, ఆ పిల్లాడి దగ్గరకు నడిచాడాయన.

మాస్టారొచ్చి తన భుజంపైన చేయివేసి తట్టే వరకూ అది కూడా గమనించకుండా వుండిపోయిన రాఘవ, ఎదురుగా మాస్టారు కనిపించగానే ఆయన పొట్టలో తల దాచుకుని బావురుమన్నాడు.

వాణ్ణి కాస్సేపలాగే ఏడవనిచ్చి, వాడి తల ఎత్తి కన్నీళ్ళు తుడిచి, అడిగాడు విశ్వనాథం,

"రాఘవా, ఎందుకురా ఏడుస్తున్నావ్"

"తెలీదు మాస్టారూ.. మీరు రేపట్నించీ స్కూలుకు రారంటే, మిమ్మల్ని తీసేస్తున్నారంటే ఏడుపొచ్చింది"

అప్పటికి హెడ్ మాస్టర్ కూడా అక్కడికి వచ్చాడు. విశ్వనాథం వైపు తిరిగి అన్నాడాయన

"మాస్టారూ, పిల్లల్ని కన్నబిడ్డల్లా చూసుకున్నారు. విశ్వనాథం మాస్టారొక్కరే నాకు తెలిసిన బెత్తం లేని మాస్టారు. మీరు రేపట్నించీ స్కూలుకు రారని తెలిసి వాడు బైటికి ఏడ్చేసాడు. మేం మనసులోనే మీరు రిటైరయ్యారే అని బాధ పడుతున్నాం" మనస్ఫూర్తిగా చెప్పాడాయన.

తరవాత రాఘవకు వివరించాడు

"రాఘవా... విశ్వనాథం మాస్టారుని తీసెయ్యలేదు. ఇన్ని సంవత్సరాలు కష్టపడి నీలాంటి వందలాది మందికి పాఠాలు చెప్పి, ఆయన అలసిపోయారు. పెద్ద వారయ్యారు. అందుకే యిక ఆయన విశ్రాంతి తీసుకోవాలని ప్రభుత్వం ఆయన్ను రిటైరు చేసింది. మాస్టారు హాయిగా, ఆనందంగా వుండాలని కోరుకుంటూ నవ్వుతూ వీడ్కోలివ్వాలిగానీ యిలా ఏడవకూడదు!"

తెలిసీ తెలియనట్టు తలూపి కళ్ళు తుడుచుకున్నాడు రాఘవ.

చిన్నగా నవ్వి, తన మెళ్ళోని దండతీసి, రాఘవ మెళ్ళో వేసి, వాడి బుగ్గలు పుణికాడు విశ్వనాథం.

"నా పెన్షను విషయం కాస్త మీరు చూడాలి" హెడ్ మాస్టర్‌తో చెప్పాడు.

"తప్పకుండా మీకు ఆ మాత్రం కూడా చేయలేకపోతే ఎందుకండీ మేం" మర్యాదగా చెప్పాడు హెడ్‌మాస్టర్.





ఆయనకు నమస్కరించి, పిల్లలవైపు చూసి చెయ్యూపాడాయన.

పిల్లలంతా పక్కకు జరిగి దారిచ్చారు. ఆయన బైటికి నడిచినంత సేపూ చేతులూపు తూనే వున్నారు.

భారంగా అడుగులేస్తూ బైటికి నడిచిన విశ్వనాథం ముఖాన్ని తన తీక్షణమైన కిరణాలతో చురుక్కున పొడిచాడు వాలిపోతున్న సూర్యుడు.

★ ★ ★

రిటైరైన మరునాటి నుండీ, తనను తీసుకుపోవటానికి వస్తామన్న తమ పిల్లలకోసం ఎదురు చూడసాగారిద్దరూ. ఒకరోజు, రెండు రోజులు, వారం, నెల... ఊహు, వాళ్ళు రాలేదు. ఇద్దరికీ ఉత్తరాలు రాసి కూడా అప్పుడే వారం రోజులయ్యాయి.

వారం రోజులయింది. కానీ యిద్దరిలో ఎవరినుంచీ కనీసం బదులైనా రాలేదు. జీతం అయిపోవస్తూంది. మళ్ళీ జీతం రాదు. పెన్షన్ రావాలి. అదీ యింకా శాంక్షన్ కాలేదు. ఏం చేయాలో తోచలేదు.

ఖాళీగా కూర్చునే బదులు నలుగురికి ట్యూషన్లైనా చెప్పుకోవాలనిపించిందాయనకు. డబ్బులు తీసుకోకుండా చెప్పినంత వరకే విశ్వనాథం మాస్టారు ట్యూషన్లు పనికొచ్చేయి కాని డబ్బులడిగినప్పుడు ఎవ్వరికీ రుచించలేదు. కారణం...

ట్యూషన్లు కుటీర పరిశ్రమల్లాగా చేసుకున్న వాళ్ళకున్నట్టు హంగూ, ఆర్భాటాలూ ఆయన దగ్గరలేవు. పిల్లలు కూర్చోవటానికి బల్లల్లేవు. కనీసం రాయటానికి నల్ల బల్ల కూడా లేదు. పేపర్లు లీక్ చేసుకొచ్చి అందించే శక్తిసామర్థ్యాలు లేవు. పరీక్షలు రాసేటప్పుడు ఇన్విజిలేటర్లను మేనేజ్ చేయగలిగే తెలివితేటలు లేవు. కనీసం పేపర్లు దిద్దే ఎగ్జామినర్లను బుట్టలోవేసే చాకచక్యం కూడా లేదు. చదువుకోసం చదువుతున్న వాళ్ళెందరున్నారు గనుక, అందరికీ డిగ్రీలూ, సర్టిఫికెట్లూ కావాలి.

అప్పటికది ఐదోసారి ఆయన హెడ్మాస్టార్ని కలవటం. తన పెన్షన్ విషయమై మళ్ళీ కలిశాడు. పాపం, ఆ హెడ్మాస్టారు నిజాయితీగానే ప్రయత్నిస్తున్నాడు గానీ అది అంత సులభంగా కదిలేట్టు కనిపించటం లేదు.

"ఏం చేయాలో తోచటం లేదండీ. కనీసం అన్నీ సర్దుకుని వెళ్ళిపోదామన్నా ఇంటి అద్దె అవీ ఐదారువందల దాకా వున్నాయి. మా పిల్లలు ఏం పనుల్లో వున్నారో. వాళ్ళకు సెలవు దొరికిందో లేదో , వాళ్ళేమో రాలేదు"

విశ్వనాథం మాస్టారు గురించి హెడ్ మాస్టర్కు తెలుసు. ఆయనపైసా వెనకేసుకోలేదు. చివరకు మానవత్వంతో చెప్పాడాయన

"మాస్టారూ, ఈ డబ్బులుంచండి. మీ పెన్షన్ సాంక్షనవగానే యిద్దరుగానీ. అనవసరంగా యిక్కడుండి ఖర్చు ఎక్కువ చేసుకోవటం ఎందుకు చెప్పండి. నేను వెళ్ళి గట్టిగా ప్రయత్నించి, వచ్చే నెలలోనైనా మీ పెన్షన్ వచ్చేట్టు చూస్తాను"

కృతజ్ఞతతో నమస్కరించటం తప్ప మరేమీ చేయలేకపోయాడు విశ్వనాథం.

ఇల్లు ఖాళీ చేసి, పెద్ద సామానులన్నీ తెలిసిన వాళ్ళింట్లో పెట్టి, యిద్దరూ పిల్లల దగ్గరికి బయలు దేరారు. ఎవరింటికి వెళ్ళాలనే విషయంలో కాస్సేపు తర్జన భర్జనలు పడ్డారు. చివరకు గంగాధర్ యింటికి ముందుగా వెళదామని నిర్ణయించుకున్నారు. దానికి ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు. గంగాధర్ ఊరిని దాటి పాతికమైళ్ళు వెళితే గానీ రాజేశ్వర్వున్న యిల్లు రాదు. తన యింటికి రాకుండా తన ఊరి మీదనుండి అన్నయ్య దగ్గరికి వెళ్ళారని అతను బాధ పడొచ్చునన్న ఆలోచనే దానికి కారణం.

సాయంత్రం ఆఫీసునుండి వచ్చిన గంగాధర్ తల్లిదండ్రుల్ని చూసి నిర్లిప్తంగా వుండిపోయాడు. ముక్తసరిగా ఒకటి, రెండు మాటలతో సరిపుచ్చుకున్నాడు. ఆఫీసులో పనితో అలసిపోయివుంటాడని వూరుకున్నాడు విశ్వనాథం. పెద్దగా పట్టించుకోలేదు.

మరునాడు ఆఫీసునుండి రాగానే గుమ్మంలోనే తండ్రికి చెప్పాడు గంగాధర్

"నాన్నా మీరొస్తే పంపించమని అన్నయ్య కబురు చేశాడు. అమ్మ నాలుగు రోజులుంటుంది. నువ్వెళితే వెళ్ళిరా"

తనకొడుకుకు తల్లి మీదున్న ప్రేమకు మనసు పొంగిపోయిందాయనకు. చివరకు అన్నపూ

ర్ణ చెప్పినట్టే అయింది. కొడుక్కు తనంటే ప్రాణం. తనను విడిచివుండలేడు, గంగాధర్ దగ్గరే వుండిపోదామని అంది అన్నపూర్ణ. పెద్ద కొడుక్కు మరి కాస్త చిన్న ఉద్యోగం. తాముంటే తమ పెన్షన్ డబ్బులు కలిసొస్తాయిగదాని ఆయన రాజేశ్వర్ దగ్గరుందా మనుకున్నాడు. ఇంట్లోకి నడిచాడు విశ్వనాథం.

ఐదు నిమిషాల్లో టీ తాగుతూ కూచున్న విశ్వనాథం దగ్గరికొచ్చాడు గంగాధర్

"వాడొకటే ఏడుస్తున్నాడు, ఇద్దరినీ వుంచుకున్నానని. మరో అరగంటలో బస్సుంది. బయలుదేరితే దొరుకుతుంది. తొమ్మిది దాకా బస్సులున్నాయి" ముభావంగా చెప్పాడు.

భార్యకు చెప్పి, బయలుదేరాడు విశ్వనాథం. తనూ పెద్దకొడుకుని చూసొస్తానని అన్నపూర్ణమ్మ బయలుదేరిందిగానీ కోడలు సుభద్ర పడనీయలేదు

"వచ్చి రెండు రోజులవలేదు. మీరెందుకత్తమ్మా. మావయ్యని వెళ్ళనీయండి" అంది సుభద్ర.

కోడలుకు కూడా తనమీద అంత ప్రేమున్నందుకు మురిసిపోయింది అన్నపూర్ణమ్మ. నాలుగు రోజులాగి వెళ్ళొచ్చులే ఎంతదూరం. బస్సెక్కితే అరగంటలో దిగిపోవచ్చుననుకుని సరిపెట్టుకుంది.

రాజేశ్వర్ దగ్గరికి వెళ్ళినప్పట్నించీ విశ్వనాథంకు ఏదో యిబ్బంది గానే వుంది. ఎందుకో పరాయి యింట్లోవున్న భావన. చిన్నప్పుడు తన పక్కన కూచుని గంటలు గంటలు మాట్లాడిన కొడుకు ఐదు నిమిషాలు కూడా మాట్లాడడు. ఏమని పలకరించబోయినా 'అవును, కాదు' అని రెండు ముక్కల్లో తేల్చేస్తాడు. తనతో కలిసి ఒక్కసారి కూడా భోజనం చేయలేదు.

ఇక కోడలు సుందరి సరేసరి. మనవళ్ళతో మాట్లాడనియ్యదు.

"వాళ్ళకు హొంవర్కులున్నాయి చదువుకోనీయండి" అంటుంది.

పిల్లల హొంవర్కుల గురించి తనకా చెప్పేది అనిపించిందాయనకు. బిక్కుబిక్కున కూర్చోవటం తప్ప ఏం చేయాలో తోచటం లేదాయనకు.

మూడో రోజున కోడలు పాలు తీసుకు రమ్మంది. చెంబు తీసుకుని వెళ్లి పాలు పట్టుకొచ్చాడు. ఆ మరునాడు కూరలు తెమ్మంది. ఆ తరవాత సరుకులు. తన యింటి పని తను చేసుకోవటంలో తప్పేముందిగానీ ఎందుకో సుందరి చెప్పేవిధానంలో ఏదో అవసవ్యంగా వుందనిపించిందాయనకు. రాను రానూ ఇంటికి కావలసిన వస్తువులన్నీ బజారునుండి తీసుకురావటం ఆయన డ్యూటీ ఐపోయింది. మూడో వారంలో భార్య దగ్గరికి వెళతానన్నాడు విశ్వనాథం. ఏమీ మాట్లాడకుండా వెళ్లిపోయాడు రాజేశ్వర్. కొడుక్కి తను వెళ్ళటం యిష్టం లేదనిపించింది. ఆ తరవాత ఓసారి కోడలుతో అన్నాడు

"మీ అత్తమ్మను చూడక చాలా రోజులయిందమ్మా. ఇంతవరకూ యిన్ని రోజులు ఎప్పుడూ వుండలేదు. నేనోసారి వెళ్ళొస్తాను"

"తొందరేముంది, ఓవారం రోజులుండండి వెళుదురుగానీ" అంది సుందరి.

సుందరిక్కూడా తను వెళ్ళటం యిష్టంలేదు. అనవసరంగా తనను సరిగా చూడటంలేదని అపార్థం చేసుకున్నాడు తను. పిల్లలు పాపం వాళ్ళకేం తెలుసు. వాళ్ళ పనులతోనే వాళ్ళకు తీరదు. తననేం పట్టించుకుంటారు అనుకున్నాడు.

"నాన్నా నీ పెన్షన్ రాలేదా"

మొదటిసారిగా తనంతతాను పలకరించాడు రాజేశ్వర్, ఆ నెలరోజుల్లో.

"ఏమోరా అబ్బాయ్.. ఏదైనా వుంటే గంగాధర్ గాడింటికి రాయమని హెడ్ మాస్టర్‌గారికి చెప్పొచ్చాను"

"ఇవాళ ఎవరో వస్తుంటే వాడు కబురెట్టాడు, నిన్ను పంపించమని. బహుశా ఏమైనా వుత్తరం వచ్చిందేమో"

"ఐతే నేను వెళతానురా. మీ అమ్మను చూడకుండా యిన్ని రోజులు ఎన్నడూ వుండలేదు. ఎప్పుడెప్పుడు పోదామా అనుంది"

"నువ్వెళ్ళగానే అమ్మను పంపియ్యి. చాలా రోజులయింది నేను కూడా అమ్మను చూడక"

తన దగ్గరున్న కాస్త చిల్లరా మనవలకు అవీయివీ కొనిపెట్టి, యింట్లోకి కూరలూ అవీ తెచ్చి ఖర్చు పెట్టేసాడాయన.





"ఛార్జీలకు డబ్బులిచ్చిపోరా"

విసుగ్గా చూసి, జేబులోంచి ఐదురూపాయలనోటు అందించాడు రాజేశ్వర్

"జీతమంతా వారం రోజులు కూడా రావటం లేదు. సరిపోతుంది కదా"

మారు మాట్లాడకుండా తీసుకున్నాడు విశ్వనాథం. తనకంటూ లేకుండా ఖర్చు పెట్టుకోకూడదని మొట్టమొదటిసారిగా అనిపించిందాయనకు.

ఏడున్నరకల్లా గంగాధర్ యింట్లో వడ్డాడు విశ్వనాథం. ఆఫీసునుండి వచ్చితీరిగ్గా పేపర్ చదువుకుంటున్న గంగాధర్ పేపర్లోంచి తలెత్తి చూసి, మళ్ళీ అందులో మునిగిపోయాడు. కనీసం 'ఎప్పుడొచ్చావ్ నాన్నా' అని కూడా అనలేదు. ఇక తనే పలకరించాడు.

"ఏరా, అంతా బావున్నారా"

"బావుండకేం, అంతా బానే వున్నారు" పేపర్లోంచి తలెత్తకుండానే సమాధానం చెప్పాడు గంగాధర్.

"నా పెన్షన్ విషయం ఏమైనా కబురొచ్చిందా"

"లేదు" పేపర్లోంచి తలెత్తలేదు గంగాధర్.

మనసు చివుక్కుమనిపించింది విశ్వనాథంకు. మౌనంగా లోపలికి నడిచాడు.

"తాతొచ్చాడు, తాతొచ్చాడు" గట్టిగా అరిచింది మనవరాలు. సంతోషంగా ఆ పిల్ల బుగ్గలు నిమిరి, బస్సు ఛార్జీ పోగా మిగిలిన డబ్బులతో తెచ్చిన చాక్లెట్స్ అందించాడు.

"ఒకటి నీకు, ఒకటి అన్నయ్యకు"

సరేనన్నట్టు తలూపి పరిగెత్తుకెళ్ళిపోయిందా పిల్ల.

మరుక్షణంలో వంటింట్లోంచి వచ్చింది అన్నపూర్ణమ్మ. భర్తను చూడగానే ఎన్నో సంవత్సరాల తరువాత చూసినట్టుగా ఆమె కళ్ళల్లో ఆనందబాష్పాలు. చిక్కి నీరసించినట్టున్న అన్నపూర్ణమ్మను చూడగానే ఆయన మనసు విలవిల్లాడింది.

"ఏమిటి అన్నపూర్ణా, ఒంట్లో బావుండటం లేదా"

"అబ్బే, ఏమీ లేదు. బానే వున్నాను" తను చూడగానే కోడలు పనిమనిషిని మానిపించేసి యింటెడు చాకిరీ తనతోనే చేయిస్తున్నదని ఎలా చెప్పగలదు. అందుకే చెప్పలేదు.

"మరేంటి అలా వున్నావ్"

"చాలా రోజులకు చూస్తే అలాగే అనిపిస్తుంది గానీ అబ్బాయి, కోడలు బావున్నారా. పిల్లలు స్కూళ్లకు వెళుతున్నారా?"

"ఆ, అంతా బానేవున్నారు. పెద్దాడు నిన్ను వెంటనే బస్సెక్కించమని మరీ మరీ చెప్పాడు"

"అయ్యో పొయ్యి మీద పాలు పెట్టాను, వుండండి వస్తాను" గబగబా వంట గదిలోకి వెళ్ళింది అన్నపూర్ణమ్మ.

కాళ్ళు కడుక్కుని తనూ వంటగదిలోకి నడిచాడు. ఆయన వెళ్ళేసరికి కాఫీ చేసి అందించింది.

"నా పెన్షన్ విషయం ఏమయిందో తెలియదు. ఓసారి నేను ఊరికెళ్ళి వస్తాను" కాఫీ తాగుతూ అన్నాడాయన "డబ్బుల్లేవు చిన్నాడినడిగితే వున్నాయో, లేవో, ఏమంటాడో"

"అనేదేముంది ఉంటే యిస్తాడు. లేకపోతే ఎవరి దగ్గరైనా అడిగియిస్తాడు"

మామూలు విషయమైనట్టు చెప్పిన భార్యను చూసి నవ్వొచిందాయనకు. నాలుగున్నర బస్సు ఛార్జీ ఐతే సరిగ్గా అర్ధరూపాయి ఎక్కువిచ్చిన పెద్ద కొడుకు గుర్తొచ్చాడు. కానీ తప్పదు కదా.

ఆయననుకున్నట్టు కాకుండా ఆయనడగ్గానే వందరూపాయలు తీసిచ్చి ఆశ్చర్యపరిచాడు గంగాధర్. ఆ ఆశ్చర్యమంతా మరుక్షణంలో మాయమయింది.

"సామానులన్నీ అక్కడే వుంచేసారు కదా. వచ్చేప్పుడు పట్టుకొచ్చెయ్యి"

తనొచ్చేదాకా వుండమని అన్నపూర్ణమ్మకు చెప్పి బయలుదేరివెళ్ళాడు విశ్వనాథం.

విశ్వనాథంను చూడగానే నొచ్చుకున్నాడు హెడ్‌మాస్టర్

"సారీ మాస్టారు. రేపు పూర్తయిపోతుందన్నాడు. చివరకు మిమ్మల్ని రప్పించుకున్నాను"

"ఫరవాలేదండీ. మీరున్నారు గనుక ఆ మాత్రం జరిగింది. ఎటూ సామాన్లు తీసికెళ్ళా



లిగదా, అందుకనొచ్చాను''

ఆరోజు విశ్వనాథంను తనింట్లోనే వుంచుకున్నాడు హెడ్‌మాస్టర్.

మరునాడనుకున్నది ఆ మరునాడు పూర్తయింది. చెక్కులు చేతికొచ్చేసరికి సాయంత్రం నాలుగయింది. పిల్లల చదువులకోసం, ఉద్యోగాల కోసం చేసిన అప్పులన్నీపోను చేతికొచ్చింది చాలా తక్కువ. మొత్తానికి పెన్షన్ కూడా శాంక్షనయిపోయింది. వెళ్ళి డబ్బులు పంపించమని చెప్పాడు హెడ్ మాస్టర్. ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకుని, సామాన్లు తీసుకుని బయలుదేరి గంగాధర్ యింటికి చేరుకునే సరికి రాత్రి తొమ్మిది కావస్తూంది. పెద్దకొడుకు రాజేశ్వర్ కూడా అక్కడే వున్నాడు.

మర్నాడు ఉదయం గంగాధర్, సుభద్ర, రాజేశ్వర్‌లు ముందు గదిలో కూర్చుని విశ్వనాథం తీసుకొచ్చిన వస్తువులు పంచుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

''డబ్బులిచ్చి, పంపించి తెప్పించిన వాణ్ణి నేను. నువ్వు తీసుకుపోతానంటావేం'' అన్నాడు గంగాధర్.

''సరే, నేను యాభై రూపాయలిచ్చేస్తాను సరిపోతుంది'' అన్నాడు రాజేశ్వర్.

''అమ్మో బావగారు చాలా ఘటికులు''

''మీకన్నానా, వాళ్ళతో పాటు తెచ్చిన చిన్న చిన్న వస్తువులన్నీ మీ దగ్గరే వున్నాయి కదా. అవన్నీ వుంచేసుకుని అందులో రేడియో ఒక్కటి మాకియ్యండి''

''ఆ రేడియో తప్ప అందులో పనికొచ్చేవేం వున్నాయనీ''

క్రమంగా వాళ్ళ మాటలు స్థాయి పెరిగి గోలగా వినిపించసాగాయి.

విశ్వనాథంకు భోజనం వడ్డించి పక్కనే కూర్చున్న అన్నపూర్ణమ్మ చెవిన పడసాగాయి వాళ్ళ మాటలు.

''పెన్షన్ సంగతేమయిందట''

''ఏదీ, ఆయన రాగానే సామాన్ల గోలేనాయె. భోంచేసి రాగానే కనుక్కుందాంలే''

''ఒరేయ్ నీ తెలివి తేటలు నా దగ్గర కాదు. నేనున్నప్పుడు అడిగితే నాకు యిప్పుడే సగం యియ్యాల్సొస్తుందని నువ్వే దాటేసావ్'' ఆరోపించాడు రాజేశ్వర్.

''పోనీ అలాగే అనుకో... నిన్ను నమ్మించటానికి నేనేంచేయనూ''

''ఒరేయ్, మన ఒప్పందం ప్రకారం నాన్నను నెలరోజులుంచుకున్నాను. నెలవగానే అమ్మను పంపించావా నువ్వు?''

''అమ్మేగదా, నాలుగు రోజులుంటే ఏం పోయిందని వుంచుకున్నాను''

''నాన్నేగదా, పోనీ నాన్నను నీదగ్గరే వుంచుకోరాదూ. అమ్మ నాదగ్గరుంటుంది''

''అలాగే వుంచుకుంటాను. నాన్న పెన్షన్ విషయం నువ్వడగకు''

''అబ్బ ఎంత ఆశరా. అలాగైతే అమ్మానాన్నలిద్దర్నీ నేనే వుంచుకుంటాను. నాన్న పెన్షన్ కూడా నేనే తీసుకుంటాను''

నిశ్చేష్టులై వినసాగారు విశ్వనాథం, అన్నపూర్ణలు. వాళ్ళ గొంతులు యింకా తీవ్రస్థాయికి పెరిగాయి-

''నన్ను ఆశన్నావు. అటు నాన్న పెన్షనూ దొబ్బొచ్చు. ఇటు యింట్లోపని చేయడానికి ఫ్రీగా అమ్మా వస్తుంది. అలాగైతే యిద్దర్నీ నాదగ్గరే వుండనియ్యి''

''అబ్బబ్బ ఎందుకు యిద్దరూ తగువుపడతారు'' సుభద్ర కల్పించుకుంది- ''బుద్ధితక్కువై నాలుగు రోజులు ఆమెను ఎక్కువుంచుకున్నాం బావగారూ. ఈసారి మీరూ ఓ నాలుగురోజులు ఎక్కువుంచుకోండి ఎపుడన్నా. అనవసరంగా గొడవలెందుకు. ఇద్దర్నీ చెరో నెలా పంచుకుందాం. ఆయన్ని నెలవగానే పంపిస్తాం. వెంటనే మీరు ఆవిణ్ణి పంపెయ్యండి. మళ్ళీ నెలకల్లా ఆయన్ని మీరు పంపండి. తిరుగు బస్సులో ఆవిడ మీ యింటి దగ్గరుంటుంది... చాలా?''

''మరి పెన్షన్ డబ్బులు?''

''అవి కూడా సగం, సగం అనుకున్నాం గదా''

''గ్రాట్యుటీలూ, పీ.ఎఫ్‌లూ ఏమైనా వచ్చుంటాయిగదా''

''అబ్బ, అన్నీ కావాలి నీకు''

''ఒరేయ్, డబ్బులు నీకైనా డబ్బులే,





నాకైనా డబ్బులే''

''ఇంతకీ యిలా పంచుకుంటామంటే వాళ్ళు ఒప్పుకుంటారా?''

''ఒప్పుకోక ఏంచేస్తారు? ఎటూ ఆయనకొచ్చే పెన్షన్ డబ్బులతో యిల్లు తీసుకుని, అద్దె కట్టుకుంటూ వాళ్ళిద్దరూ బతకలేరు. ఒక్క మనిషంటే మనకు యింట్లో ఏమూలో పడుంటారు గనుక యిబ్బందుండదు. సరే, యిబ్బందనుకున్నా నాన్నను పెన్షన్ డబ్బుల కోసం భరించక తప్పదు. అమ్మంటే ఏదో పనిచేస్తుందిగదా. పనిమనిషికిచ్చే జీతం తిండి పెడుతున్నామనుకుంటే సరి''

తింటున్న కంచంలో చేతులు కడుక్కున్నాడు విశ్వనాథం. అన్నపూర్ణమ్మ కంటినుండి జలజలా నీళ్ళు రాలాయి.

''ఏమండీ'' అంతకన్నా మాట్లాడలేకపోయింది. మౌనంగా లేచి చెయ్యి తుడుచుకున్నాడు విశ్వనాథం.

''అన్నపూర్ణా, ఏమీ మాట్లాడకుండా సూట్‌కేస్ పట్రా''

''ఎందుకండీ''

''పద, వాళ్ళకు కనిపించకుండా పోదాం. ఆలస్యమైతే బస్సులు దొరకవు''

ఏదో చెప్పాలనుకున్న అన్నపూర్ణమ్మ ఆయన గంభీరంగా వుండటం చూసి మారు మాట్లాడకుండా రెండు నిమిషాల్లో సూట్‌కేస్ తీసుకుని వచ్చింది.

రాజమార్గంలో దర్జాగా తిరిగిన విశ్వనాథం, కొడుకుల మొహాలు చూడటానికి సిగ్గుపడి, భార్యను వెంటబెట్టుకుని, పెరటిదారిగుండా, బైటికి నడిచాడు.

అమావాస్య చీకట్లు చిక్కగా అలుముకున్నాయి. సూర్యుడు కుంగిపోగానే చంద్రుడు వెన్నెలిచ్చి ఆదుకోకపోతే లోకం చీకటిమయమే అవుతుంది. ప్రతిరోజూ సూర్యుడు ఎండకాస్తాడు కానీ, ఆ ఎండతోనే బతికే చంద్రుడు మాత్రం ఓసారి వెన్నెల చిమ్ముతాడు. ఓసారి చీకటి చిందిస్తాడు. చీకట్లోంచి నెమ్మదిగా, భారంగా నడుస్తూ వెళుతున్నారు ఆ వృద్ధదంపతులిద్దరూ.

''ఏమండీ, వీళ్ళా మన పిల్లలు!'' బాధగా అంది అన్నపూర్ణమ్మ.

''అవును అన్నపూర్ణా... చిన్నతనంలో నేను రావటం ఆలస్యమైతే, 'నాన్నొచ్చేదాకా అన్నం తినమని' మారాంచేసిన కొడుకులు వీళ్ళే... అడ్డాలనాడు ముద్దుగా గుండెలమీద ఆడుకుని గడ్డాలొచ్చాక బండగా తన్నేలా గుండెలు బండరాళ్ళు చేసుకున్నారు...

ఇన్నాళ్ళూ స్కూల్లో పిల్లలకు తల్లిదండ్రులు అంటే, ద్వంద్వసమాసం, కలిసుండే పదాలూ అని తప్పుడు పాఠాలు చెప్పాను అన్నపూర్ణా... తల్లిదండ్రుల్ని విడదీయొచ్చనీ, పంచుకోవచ్చనీ, యిదిగో రిటైరయ్యాక నేర్చుకున్నాను...

మనిద్దరం కూడా యిద్దరు కొడుకులూ రెండు కళ్ళనుకున్నాంకానీ, నీదోకన్ను నాదో కన్ను అనుకోలేదు ఎందుకంటావ్. ఆ రెండో కన్ను స్వార్థం. ఆ దృష్టి మనకు లేదు. వీళ్ళకుంది...

పద అన్నపూర్ణా... జ్ఞానదంతాలొచ్చినప్పుడు జ్ఞానమొస్తుందంటారు. నాకేమో దంతాలు వూడిపోతున్న వయసులో వచ్చింది జ్ఞానం!

రెక్కలొచ్చిన పిల్లపక్షుల్ని పెద్ద పిట్టలు గూట్లోంచి తరిమేస్తాయట. రెక్కలూడిన తల్లిదండ్రుల్ని మనిషి పిల్లలు యింట్లోంచి తరిమేస్తారు... మనిషికీ పశువుకూ తేడా వుండనే వుంది చూశావా... నేనేమో ఆ తేడా 'జ్ఞానం' అనుకుని, విద్యలేనివాడు వింతపశువు అని పాఠాలు చెప్పాను...''

''ఏమండీ...'' ముక్కు ఎగబీల్చింది అన్నపూర్ణ, ఏడుపు దిగమింగుకుంటూ.

''ఏడవకు అన్నపూర్ణా... ఋణానుబంధ రూపేణా పశుపత్ని సుతాలయా అన్నారు. నిజమే అది. మనకూ, మన పిల్లలకూ ఋణం తీరిపోయింది...

అవును అన్నపూర్ణా... మనం వాళ్ళను కన్నాం, పెంచాం. వాళ్ళ భవిష్యత్తుకోసం అహర్నిశలూ కష్టపడ్డాం. వాళ్ళు పుట్టారని పండుగ చేసుకున్నాం. నీకు గుర్తుందా అన్నపూర్ణా... మన యింటిముందర పెద్దాడు పుట్టినప్పుడు ఓ చెట్టూ, చిన్నవాడు పుట్టినప్పుడు ఓ చెట్టూ నాటాం. ఆ చెట్లు పెద్దవై ఎంత విశాలంగా, ఎంత హాయిగా నీడనిస్తున్నాయి. ఎక్కడా నీడ

దొరక్కపోతే ఆ చెట్లకింద వుందాం. వాటికి మన రుణం తీర్చుకోవాలన్న కోరిక లేకపోయినా తీర్చుకునే అవకాశముంది. కానీ మన పిల్లలతో మన రుణం తీరిపోయింది...

హుఁ వాళ్ళు నవ్వితే నవ్వాం, ఏడిస్తే ఏడ్చాం. కన్నక్షణంనుండే వాళ్ళనుండి ఎంతో సంతోషాన్ని ఆనందాన్నీ పొందాం. చిట్టిచేతుల తప్పట్లు, చిట్టికాళ్ళ తప్పటడుగులు, వచ్చీరాని ముద్దుమాటలు, ఇన్నింటితోనూ మనకు సంబరం కలిగించి, గుండెల్ని పొంగించి మన రుణం వాళ్ళు చిన్నప్పుడే తీర్చుకున్నారు... అంతే, యింకా వాళ్ళనుండి మనం పొందాల్సిందేమీ లేదు...

బాధ్యతలేని కొడుకుల దగ్గర్నించి దాన్ని మన హక్కుగా మనం పొందలేం పద... కష్టపడ్డా, కష్టాలు పడ్డా, ఈ వయసులో కలో గంజో తాగుతూకలిసేవుందాం...

అన్నపూర్ణా... మనం ఎన్నో ఏళ్ళు వున్న యిల్లు మనది కాదని ఖాళీచేసి వచ్చేశాం. మన ఆత్మ ఎన్నో సంవత్సరాలుగా నివశిస్తున్న ఈ దేహం మనది కాదు. దీన్ని ఖాళీచేసి వెళ్ళిపోతుంది. అలాంటిది తొమ్మిది నెలలు ఎప్పుడో పుట్టకముందు నీ కడుపులో వున్నంత మాత్రాన ఈ కన్న కడుపు వాళ్ళదనీ, దానికి కడుపుకోత పెట్టొద్దనీ వాళ్ళను అనుకోమనడం న్యాయం కాదు...

ప్రేమించుకున్న పిల్లల్ని కలిసుండనీయకుండా విడగొడుతుంటారు పెద్దవాళ్లు. పెళ్ళి చేసుకుని, కాపురం చేస్తున్న అమ్మా, నాన్నల్ని విడగొడుతున్నారు పిల్లలు. ప్రేమకోసం పెద్దవాళ్ళనెదిరించి, పారిపోయి, పెళ్ళి చేసుకుని, స్వతంత్రంగా బతికే ధైర్యం పిల్లలకే వుండగా లేనిది, పిల్లల అండ లేనంతమాత్రాన స్వతంత్రంగా బతికే ధైర్యం మనకేనా లేదు...

ఇన్నాళ్ళ జీవితమూ మరిచిపో... వృద్ధాప్యం మళ్ళీ వచ్చే బాల్యం అన్నారు. ఈ కొత్త బాల్యంలో, కొత్త జీవితం మొదలెడదాం... మలిసంధ్య మలుపులో కమ్ముకున్న చీకట్లను పారదోలటానికి చంద్రుడికి మనను రాకపోతే మనమే ఓ చిన్న దీపం వెలిగించుకుందాం... పదా...''

ఇద్దరూ ముందుకు అడుగేశారు.

★ ★ ★

''ఇవాళ ముప్పయ్యోరోజు'' అంది రాణీ, ఉద్వేగంగా.

''ఐతే రేపే విడుదలన్నమాట'' తేలిగ్గా అన్నాడు రాజు.

''జెయిలు లెక్కైతే విడుదల, మన లెక్కైతే బందీలమవుతాం''

''అదేంటి, బందీలు, ఖైదీలు''

''అవునుమరి. సంసారం కూడా ఒక జెయిలేకదా. కాకపోతే కోరుకుని బందీలమయ్యే జెయిలు. కోరుకున్నా విడిపోలేని జెయిలు''

''ఇదిగో ఈ జెయిలు, కారాగార వాసమూ కబుర్లు మానెయ్యి''

''ఎలా మానేస్తాను. ప్రేమే నేరమౌనూ - అని అందరూ అంటుంటే''

''రేపు మనిద్దరమూ యిలా యిక్కడ కూర్చుని కబుర్లు చెప్పుకోంకదూ''

''పెళ్ళయ్యేంతవరకూ అలాంటి మాటలు కూడా మాట్లాడొద్దన్నాను కదా'' చిరుకోపంతో మందలించింది రాణీ.

''నేను మామూలుగానే అన్నాను. నువ్వే సెన్సారు బోర్డు మెంబర్‌లాగా లేని అర్థాలు వెతుకుతున్నావ్'' ఆరోపించాడు రాజు.

''మరి నాకూ ఎప్పుడెప్పుడా అనే వుంది''- అనలేదు రాణీ, మనసులోనే అనుకుంది.

ఇద్దరూ నెలరోజులకిందట రిజిస్ట్రార్ ఆఫీసులో అప్లికేషన్ పెట్టారు. ముప్పైరోజుల తరువాత ఎప్పుడైనా పెళ్ళి చేసుకోవచ్చని చెప్పారు. మరునాడే చేసుకోవాలని ఇద్దరూ నెలకిందటే నిర్ణయించుకున్నారు.

ముందుగా మాధవి తన అమ్మా, నాన్నలతో మాట్లాడింది. రాణి తండ్రి విషయంలో తను వీలైనంతగా సహాయం చేస్తానని చెప్పాడాయన. ఆయన కూడా వాళ్ళు అనుకున్నట్టుగానే పెళ్ళయ్యేంతవరకూ తెలియనీయొద్దని చెప్పాడు.

తరువాత విశ్వనాథం, అన్నపూర్ణమ్మలకు చెప్పారు. వాళ్ళకు వీళ్ళిద్దరి విషయమూ అందరికన్నా ముందుగా తెలును. మహాలింగంను రాజు ఎంత బాగా ఆదరించాడో కళ్ళారా చూసిన విశ్వనాథం, తన కొడుకులతో





పోల్చుకున్నప్పుడల్లా రాజును మనసులో మెచ్చుకుంటూ వుంటాడు. తన చేతనైనంత సహాయం చేస్తానని ఆయనా చెప్పాడు. వాళ్ళిద్దరూ వెళ్ళాక ఆయన్ని అన్నపూర్ణమ్మ అడిగింది-

"ఏమండీ, మనకా ఆడపిల్లల్లేరు. అటు ఆ పిల్లలకూ పెద్దదిక్కు లేదు. కన్యాదానం చేస్తే ఎంతో పుణ్యమంటారు. ఈ పెళ్ళి మనం జరిపిద్దామండీ... నాలుగు డబ్బులు ఖర్చయినా మనకుమాత్రం యిక చేసుకోవటానికి శుభకార్యాలేమున్నాయనీ"

"ఖర్చుదేముంది అన్నపూర్ణా... ఇందులో నీ కష్టమే ఎక్కువగా వుంది. నువ్వు అడిగితే కాదంటానా, కానీయ్. నీ యిష్టం. ఐతే ఒక్క షరతు. ఈ మాట వాళ్ళిద్దరికీ ముందుగా చెప్పొద్దు"

ఆ తరువాత హెూం ఫర్ ఏజ్‌డ్‌లో దాదాపు అందరికీ చెప్పారు. శంకర్‌రెడ్డి చాలా పలుకుబడి వున్నవాడు. మంత్రులనుండి అధికారుల దాకా ఎంతోమందితో పరిచయాలున్నవాడు. గాంధీయిస్టు. అందుకే రాజకీయాల్లోకి వెళ్ళకుండా సాంఘికసేవ చేస్తూ వుండిపోయాడు. ఆయన లేకపోతే హెూమ్‌ఫర్ ఏజ్‌డ్ అలా వుండదని చాలామందికి తెలుసు. రమాకాంత్ నుండి ఎలాంటి ఆటంకమూ రాకుండా తను చూసుకుంటానని ఆయనా హామీ యిచ్చాడు.

పెళ్ళి వారంరోజులుందనగా సంసారానికి కావలసిన వస్తువులు కొనటం మొదలెట్టాడు రాజు. దాదాపుగా అన్నీ కొనేశారు. పెళ్ళి జరగటానికి ఎన్ని రోజులుందో ప్రతిరోజూ లెక్కబెట్టుకోసాగారు.

తెల్లవారితే పెళ్ళి. ఇద్దరికీ ఉద్వేగంగా వుంది, ఎలా జరుగుతుందోనని.

"నాకో మూడొందలియ్యవా" హఠాత్తుగా అడిగింది రాణి.

"ఎందుకు?" అప్రయత్నంగా ప్రశ్నించాడు.

"ఎందుకో చెబితేగానీ యియ్యవా" ముద్దుగా అడిగింది.

చిన్నగా నవ్వి పర్సు తీసి అందించాడు రాజు-

"రేపట్నించీ యిది నీదేకదా. ఊరికే అడిగా ..., అంతే"

మూడు వందనోట్లు లెక్కబెట్టి తీసుకుంది-

"అమ్మో, అయ్యగారి దగ్గర డబ్బులు బాగానే వున్నాయే" పర్సు తిరిగి యిచ్చేస్తూ అంది.

బదులుగా నవ్వి వూరుకున్నాడు.

"పద, పోదాం"

"ఎక్కడికి?"

"చెబుతానుకదా"

బట్టలషాపులోకి తీసికెళ్ళింది.

రాజుకు మంచి రెడీమేడ్ జత తీసుకుంది. తొమ్మిది వందలయింది. తీసి డబ్బులిచ్చింది. సీరియస్‌గా వున్న రాజువైపు చూసి, మెల్లిగా చెప్పింది-

"అలా చూడకు... ఇవి మా నాన్న డబ్బులు కావు. నేను సంపాదించుకున్నవి. నేను నిబ్ పెయింటింగ్ చేస్తాను తెలుసుకదా నీకు. అవి అమ్మేశాను"

ఏం మాట్లాడాలో తెలియక ఆర్తిగా రాణివైపు చూస్తూ వుండిపోయాడు.

"రేపు మన పెళ్ళికదా. అందుకన్నమాట"

"మొగుడొక్కడే హనీమూన్‌కెళ్ళినట్టు యిదేంటీ అనకు. నీదగ్గర మూడొందలు తీసుకున్నది అందుకే. పద, చీర కొనిపెడుదువుగానీ"

మరో షాపులోకెళ్ళారు.

"ఆ డబ్బులుండనీ... నేను కొంటానాగు నీకు" అని బలవంతంగా మంచి చీర తీశాడు రాజు- "బావుందా" అడిగాడు.

"నీకిష్టమైతే నాకిష్టమే"

"ఏయ్, చీర కట్టుకునేది నువ్వా, నేనా?"

"నేనే అనుకో... కానీ అది నేను కట్టుకుంటే నీకు చూట్టానికి బావుండాలి కదా"

"యూ ఆర్ కంట్రీఫూలో" ముద్దుగా కోప్పడ్డాడు రాజు.

"ఎస్సార్... ఇండియా ఈస్ మై కంట్రీ, ఐలవ్‌మై కంట్రీ, సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హతపొందుటకై సర్వదా నేను కృషి చేయుదును. అండర్ స్టాండ్?"

వాళ్ళిద్దరూ ఏదో మాట్లాడుకుంటున్నారను కున్న సేల్స్‌మన్, చిన్నప్పుడు స్కూల్లో చెప్పిన ప్లెడ్జ్ వినిపించేసరికి ఆశ్చర్యపోయాడు.

రాజు మారు మాట్లాడకుండా ఆ చీరను ప్యాక్ చేసి, బిల్లిమ్మన్నాడు.

"రాజూ, ఈ డబ్బులతో ఏమైనా కొనుక్కోనా" చిన్న పిల్లలాగా అడిగింది రాణి.

"కనీసం నువ్వడిగిన స్టైల్‌కు వద్దనాలనిపించదు" అన్నాడు రాజు.

"మరి అలా అనిపించేట్టు అడిగితేనే కదా కొనుక్కోవచ్చు"

గాజులు, చెప్పులు, తలపిన్నులు, పెట్టీకోట్, యిలాకొంది రాణి.

"ఇవన్నీ ఎందుకు!" ఆశ్చర్యంగా అడిగాడు రాజు.

"రేపు మా యిల్లు వదిలేసి వస్తున్నానుకదా. వాళ్ళకిష్టం లేనిపెళ్ళి చేసుకుంటూ, యింత చిన్న చిన్న వస్తువులైనా మాత్రం వాళ్ళ డబ్బుతో కొనుక్కున్నవి ఎందుకు తెచ్చుకోవాలి?"

"మరి బ్లౌజు?"

"అది ముందుగానే కుట్టి పెట్టుకున్నాను"

"మరి యిప్పుడు కొన్న చీరకు మ్యాచ్ అవుతుందా?"

"బ్రహ్మాండంగా అవుతుంది"

సుమారు ఎనిమిదయింది. ఇద్దరూ విడిపోలేక విడిపోలేక విడిపోయారు. విరహం అనేది తియ్యగా వుంటుందని రాసిన ప్రతి కవినీ తిట్టుకున్నారు.

★ ★ ★

బోసి నుదురంటి గగనానికి సూరీడు బొట్టు నలది తొలిపొద్దు పొడిచింది. చీకటి మరణించింది. సూర్యుడు అరుణించాడు. విరహాన్ని కొలిచే మనసున్న గడియారంలేని మరమనుమల లోకంలో, తప్పునినరిగా కాలాన్ని కొలిచే మరగడియారం వంక మరోసారి చూసింది రాణి.

క్రితం రోజు కొనుక్కున్న వస్తువులన్నీ తీసింది. ఒక్కొక్కటీ ధరించింది. నిలువుటద్దం ముందు నిలుచుంది. ఒళ్ళు ఝల్లుమంది రాణికి. ఎవరా అడిగింది... ఇంకెవరు, తన మనసులోని... ఐతే తనేం చెప్పాలి...

కళ్ళు తిరుగు సుళ్ళు తిరుగు గోదావరిలా
గోదారి ఒడ్డునున్న బృందావనిలా
ఆకసాన అందరాని యెండిరేకలా
కొండమామ గుండెపైని గోగుపువ్వులా
ఎవ్వరివే అమ్మడూ, ఏదారే అమ్మడూ...

ఓనమాల వంపును, వయ్యారి నడకను
ఒద్దికైన మలుపును, వావి వరస పిలుపును
ఎనక జనమ పూసును, ముందు జనమ బాసను
ఈ జనమ కడదాకా యిడిసిపోని మనసును
ఎందుకురా కృష్ణుడూ, నీదాన్నే ఎప్పుడూ...

మురిపెంగా నవ్వుకుంది, అద్దంముందు నుండి దూరం జరుగుతూ. ఆ నవ్వులో వానాకాలం వెండి మబ్బు వెన్నెల్లు, శీతాకాలం బంతి పూవు చిన్నెల్లు...

తల్లినీ, తండ్రినీ మళ్ళీ చూస్తానో లేదోనని పించింది. తను మాత్రం ఏం చేస్తుంది... చెబితే ఒప్పుకోరు...

అరసేతి నడ్డడితే సూరీడు ఆగడు
అడ్డుకట్ట కేటి వరద పొంగు ఆగదు
కట్టి పెడితె పావురాయి రెక్కలాగవు
కట్టుబాటు తోటి మనిషి మనసు ఆగదు...

ఇద్దరూ అప్పుడే బైటికెళ్ళారు. క్లబ్బు తరపున సామూహిక వివాహాలు జరిపించడానికి తల్లి వెళ్ళింది! కొత్త బిజినెస్ డీల్ డిస్కషన్స్‌కు తండ్రి వెళ్ళాడు!

సందమామనే గెలిసీ మొగ సాలన సీకటి
యెన్నెలంటి మనసునే రగిలించే కుంపటి
మనసేలేని మనిషి తనకు తానె చీడకలుపు
తనకు లేదు మేలుకొలుపు, ప్రేమ కేడదే గెలుపు...

హు వాళ్ళు లేకపోవడమూ మంచిదే అయింది. తన వేషం, అవతారం చూసి అనుమానమొచ్చినా రావచ్చు. అదే జరిగితే యిక తమ పెళ్ళి జరగదు. ప్రిస్టేజ్‌కోసం ఎంతకైనా తెగిస్తారు తన తల్లిదండ్రులు. కూతురు కోసం మాత్రం పదిక్షణాలు కేటాయించరు. ఎంత విచిత్రమైంది ఈ లోకం... ఈ లోకంలో పసివయసుకూ, పచ్చదనానికి




అసలు విలువుందా...

బొంతపురుగూ, కాబోకే సీతాకోకసిలకా
వానమబ్బునుండి నువ్వు రాబోకే సినుకా
పంచరంగులట్టుకోని ఎగిరిపోవె సిలకా
ఇది విచ్చుకునే మొగ్గలను ఉసురెట్టే
నరకం...

గేటు దాటి వడివడిగా బైటికి అడుగులే సింది రాణి. ముందుగా అనుకున్నట్టుగా హోమ్ ఫర్ ఏజ్‌డ్‌కు వెళ్ళటానికి ఆటో తీసుకుంది. ముందుకురికిన ఆటోలో ఆలోచిస్తూ కూర్చున్న రాణి మనసు మరింత వేగంగా వెళుతూంది...

హోమ్‌ఫర్ ఏజ్‌డ్ ముందు ఆటో ఆగింది. తడబడుతున్న గుండెలతో దిగింది రాణి. ఎదురుగా నిలుచుని నవ్వులు చిందిస్తున్నాడు రాజు. అప్రయత్నంగా చూపులు వాల్చుకుని, మళ్ళీ అతని కన్నుల్లోకి చూచింది.

ఆ కళ్ళల్లో ఎన్ని కబుర్లో, ఎన్నికలలో... రాణి దగ్గరికొచ్చాడురాజు...

"ఏమిటలా వున్నావు!"

"అబ్బే" మరింత తడబడి నుదుట పాకిన చెమటల్ని కర్చీఫ్‌కు అద్దుకుంది, అతని వెంట నడుస్తూ.

"అందరూ వచ్చారా" గునగునగా అడిగింది.

"ఊఁ"

"నేను ఆలస్యమయ్యానా?"

"ఊహుఁ"

"ఈ డ్రెస్సులో నువ్వు ఎంత బావున్నావో తెలుసా?"

"నీ అంత కాదు కదా"

ఈ యెడదకు ఆ యెడదే అనువాదం
ఇరు మనసుల శ్రుతిలయలే ప్రియవాదం
పెనుకడలికి తమ వూసుల తరగల మణిహారం
కెరటాలకు చిరునవ్వుల, సిరిమువ్వల ధ్వనిదానం
ఇంకెందుకు తీరం, ఇంకెందుకు లోకం
ఇది లవ్, ఇది ప్రేమ
శతమానం, జతగానం
ఇది లవ్, ఇది ప్రేమ
ఇది సతతం, ఇది హరితం...

రంగు కాగితాల జెండాలు కట్టున్నాయక్కడ. రిజిస్ట్రార్ వచ్చి ఐదు నిమిషాలయింది. అనుకున్నసమయంకన్నా ముందుగానే వచ్చాడాయన. ఆదిదంపతుల్లా ఎదురొచ్చారు విశ్వనాథం, అన్నపూర్ణమ్మ.

అంతవరకూ ఆ ఆశ్రమంలో అలాంటి వేడుక జరగలేదు. అందరూ పెద్దలే, అందరూ అతిథులే... ఇన్‌స్పెక్టర్ నాయుడు కూడా వున్నాడక్కడ... మాధవి, ఆమె కుటుంబం, చివరకు సాధారణంగా ఎక్కడికీ కదలని మాధవి నానమ్మా, తాతయ్యలు.

రాజారాం, థామస్‌లు అక్కడలేని చలవతిని తలుచుకుంటూ, సంబరంగా అటూయిటూ తిరుగుతూ హడావిడి చేస్తున్నారు.

రాజు, రాణిలకోసం ప్రత్యేకంగా వేసిన కుర్చీల్లో యిద్దరినీ కూర్చోబెట్టారు. రిజిస్ట్రార్ పుస్తకం తెరిచాడు, ఆయన వెంటవచ్చిన అసిస్టెంటు.

"బాబూ, నీ పేరు?"

"రాజు"

"పూర్తిపేరు?"

"రాజు మహాలింగం!"

"నీ పేరమ్మా"

"రాణి... ఉషారాణి"

"ఈ పెళ్ళి మీ యిద్దరికీ యిష్టమే కదా?"

"ఇష్టమే"

"ఇష్టమే"

"ఇక్కడ సంతకాలు చెయ్యండి"

ఇద్దరూ సంతకాలు చేశారు. ఫొటోగ్రాఫర్ ఫొటోలు తీశాడు.

"సాక్షులు కూడా సంతకాలు చేయండి"

మొదటి సంతకం శంకర్‌రెడ్డి చేశాడు.

రెండో సంతకం ఇన్‌స్పెక్టర్ నాయుడు.

మూడో సంతకం రాజారాం.

అందరూ మాలలు పట్టుకుని ముందుకొచ్చారు.

తన చేతికిఅందించిన మాల రాజు మెళ్ళో వేసింది రాణి.

రాణి మెళ్ళో తన చేతిలోని మాల వేశాడు.



రెండూ ఫొటో తీశాడు ఫొటోగ్రాఫర్.

తరవాత ఒక్కొక్కరూ తాము తెచ్చిన తయారుచేసిన, రకరకాల మాలలు అందించారు. గులాబీ మాల, మల్లెల మాల, తులసీదళాల మాల, మందారమాల, వడికిన నూలు పోగులమాల... అదంతా పదినిముషాల దాకా సాగింది.

స్వీటు తిని వెళ్ళిపోయాడు రిజిస్ట్రార్.

కాసేపటికి ఆ ఏరియా ఇన్‌స్పెక్టర్ పోలీసులతో వచ్చాడు.

ఓ గంట సేపు అక్కడ సరదాగా గడిచింది.

అప్పుడు వచ్చారు రమాకాంత్, సరళ హడావిడిగా. వాళ్ళకు పరోక్షంగా ఆ కబురు అందించాడు ఇన్‌స్పెక్టర్ నాయుడు, ఇలాంటి వ్యవహారాలు తొందరగా తేలితేనే మంచిది. అందుకే ఆయనా పనిచేశాడు.

"మీ అమ్మాయని నాకు తెలీదు సార్" మర్యాదగా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మీ అమ్మాయని నాకూ తెలీదు. ప్రేమ వివాహం కదాని సరదాగా సాక్షి సంతకం కూడా చేశాను సార్" మర్యాదకోసం చెప్పాడు ఇన్‌స్పెక్టర్ నాయుడు.

"రమాకాంత్‌గారూ, మీ అమ్మాయి నాకు తెలుసు. ఐనా మీకు తెలియచేయకపోవటం పొరపాటే. అమ్మాయి యిష్టపడింది. కష్టమో, నష్టమో ఆమె జీవితం ఆమెది. ఉన్నది ఒక్కగానొక్క కూతురు. మిమ్మల్ని అడక్కుండా పెళ్ళి చేసుకుంది. తప్పే అయినా మీరు దీవిస్తే వాళ్ళకూ హాయి, మీకు హాయి" చెప్పాడు విష్ణువర్ధన్.

"చూడండి రమాకాంత్‌గారూ, మనిద్దరికి ఇంతకుముందు పరిచయం కూడా వుంది. కానీ అమ్మాయి మీ కూతురని తెలియదు. తెలిసినా వాళ్లకు అభ్యంతరం చెప్పేవాణ్ణి కాదనుకోండి. పిల్లాడు బుద్ధిమంతుడు. డబ్బు ఒక్కటే లేదనిగానీ అదున్న చాలామందికి లేని మంచి మనసున్నవాడు. మీ అమ్మాయి అతని దగ్గర సుఖపడుతుంది. అందుకు నా హామీ. మీరు దీవిస్తే మీ పెద్దరికం నిలబడుతుంది. వాళ్ళకు పెద్దల అండ దొరుకుతుంది. లేకపోయినా ఇక్కడున్న ఇంతమంది పెద్దల ఆశీస్సులు మాత్రం ఎప్పుడూ వాళ్లకు శ్రీ రామరక్షలా వుంటాయి" వివరించాడు జనార్ధన్.

"డాడీ, రాజు ఈజ్ జెంటిల్మన్. మీ ఆస్తి కోసం నన్ను పెళ్లి చేసుకోలేదు. నేనే అతని వెంటపడి నన్ను పెళ్లిచేసుకునేట్టు చేసుకున్నాను. రాజు తప్పేమీ లేదు. ఐ లవ్ హిమ్ డాడ్. ప్లీజ్ బ్లెస్సజ్" వేడుకుంది రాణి.

"మిమ్మల్ని 'మావయ్యా' అని పిలిస్తే మీకు కోపం వస్తుందేమో... సార్, మీ ఆస్తిలో చిల్లిగవ్వ కూడా మాకొద్దు. మీ ఒక్కగానొక్క కూతురు, రాణి కోసమైనా మమ్మల్ని దీవించండి" అర్థించాడు రాజు.

ఇద్దరూ కలిసి ముందుకు అడుగేయబోతుండగా కోపంగా ఏదో అనబోయిన సరళను వారించాడు రమాకాంత్, మౌనంగా.

రాజు, రాణి ఇద్దరూ నమస్కరించబోతుండగా గొణుక్కుంటూ వెనక్కి జరిగింది సరళ.

ఇద్దరూ వంగి రమాకాంత్ కాళ్లకు నమస్కరించారు.

ఇద్దరి తలలపైనా చెయ్యుంచి, శూన్యంలోకి చూస్తూ దీవించాడు రమాకాంత్.

"గాడ్ బ్లెస్ యూ"

ఆ మాటనేసి గిరుక్కున వెనుదిరిగి విసవిసా నడిచి వెళ్లిపోయాడు. అతన్ని అనుసరించింది సరళ.

"అమ్మయ్య. కథ సుఖాంతమైంది. నాలుగు రోజులుపోతే వాళ్ళే దిగొస్తారు. ఇక మేం వెళ్ళొస్తాం. గాడ్ బ్లెస్‌యూ. విష్ యూ హ్యాపీ మ్యారీడ్ లైఫ్" చెప్పేసి వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్ నాయుడు.

ఆ ఏరియా ఇన్‌స్పెక్టరూ, పోలీసులూ కూడా వెళ్లిపోయారు.

అందరికీ కృతజ్ఞతలు చెప్పుకుని, అక్కణ్ణించి కదిలారు రాజు, రాణి.

"సాయంత్రం మీరందరూ రావాలి. తప్పకుండా రావాలి" అందరికీ పేరు పేరునా చెప్పసాగారు విశ్వనాథం, అన్నపూర్ణమ్మ.

ఎక్కడికో, ఎందుకో అర్థం కాలేదు రాజు, రాణిలకు. తిరిగి వెళుతూండగా అడిగాడు రాజు.




"మా ఇంట్లో ఫంక్షనుందిలే. మీ ఇద్దరికీ చెప్పలేదుకదూ. పదండి, భోజనంచేసి ఇంటికె ళదాం. అక్కడ చెబుతాను" అన్నాడు విశ్వ నాథం నవ్వుతూ.

హొటల్లో భోజనం చేసిన తరవాత అంద రూ విశ్వనాథం ఇంటికెళ్లారు. అక్కడి ఏర్పాట్లు చూసి ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

పెళ్లిమంటపం, ఇల్లంతా రంగురంగుల లైట్లు, షామియానా, కుర్చీలు, అంతా నంద డిగా వుంది. ఇద్దరికీ అర్థంకాలేదు.

"బాబూ, ఒక తండ్రికాని తండ్రికి కన్నకొ డుకు కంటే ఎక్కువ సేవ చేసిన నువ్వు నీకే కన్నతండ్రి వుంటే ఇంతకన్నా గొప్పగా పెళ్లిచే సుకుని వుండేవాడివి. నా కొడుకుల పెళ్లిళ్లు ఇంతకన్నా ఘనంగా చేశాను. ఏం లాభం. అందుకే మీ ఇద్దరి మంచి మనసుకూ ఇది నా కానుకనుకోండి. పైగా డబ్బు సంపాదనతో పాప భీతి పెరుగుతుండటం అలానే అనుకో, మీ పిన్నికి కన్యాదానఫలం కావాలని కోరికట. కట్టు కున్న భార్య కోరిక తీర్చటం మీ వయసులోక న్నా మా వయసులోనే గొప్ప ఆనందమయ్యా. తను ఎన్నడూ నోరు తెరిచి అడగలేదు. అందు కే అడిగిన వెంటనే తీర్చటానికి ఒప్పుకున్నా ను. దీనికి ఖర్చయిన డబ్బుతో వెలకట్టకండి. మా మనసులతో వెలకట్టండి" చెప్పాడు విశ్వ నాథం ఉద్వేగంగా.

ఇద్దరికీ నోట మాటరాలేదు.

రాణిని లోపలికి తీసుకెళ్ళింది అన్నపూర్ణ మ్మ.

మరో గంటకల్లా మళ్ళీ పెళ్లిసందడి మొద లయింది.

"అమ్మా నువ్వు నా దత్తపుత్రికవు ఇవ్వాళ్టి నుంచీ. నీకు ఎప్పుడు ఏం కావాలన్నా నన్నడు గు. నేను మీ అమ్మనే అనుకో" తను తెచ్చిన పెళ్లిచీర అందిస్తూ చెప్పింది అన్నపూర్ణమ్మ.

క్రితంరోజు రాజు కొన్న చీర మార్చు కుంటుండగా అంది మాధవి-

"ప్చ్... ఈ చీరకూ, ఈ బ్లౌజ్‌కూ మ్యాచింగ్ కుదరలేదే"

"షటప్. ఇది ఆయన కొనిచ్చారు. నేను కొనుక్కున్న బ్లౌజు, ఆయన కొనిచ్చిన చీరా మ్యాచ్ కాకపోయినా నాకు బాగానే వుంటుంది. మేమిద్దరం మేడ్ ఫర్ యీచ్ అదర్‌కదా" చెప్పింది రాణి.

"అమ్మో, అప్పుడే 'ఆయన'? మీరిద్దరూ మేడ్ ఫర్ యీచ్ అదరే తల్లీ"

రాజారాం, థామస్‌లు రాజును ముస్తాబు చేస్తున్నారు.

"ప్యాంటు ఉండగా ధోవతీ కట్టరాదురా బాబూ. లోపల డ్రాయరుందికదా. ప్యాంటు తీసెయ్యి ఫరవాలేదు" అన్నాడు రాజారాం.

ధోవతీ కట్టి, లాల్చీ తొడిగి పెళ్ళికొడుకును సిద్ధం చేశారు.

"నీ పెళ్లి చూసే అదృష్టం వుందో లేదో అంటూండేవాడు డాడీ. ఇప్పుడుంటే ఎంత గోలగా వుండేదో" కంటతడి పెట్టుకున్నాడు రాజు.

"రాజూ తప్పు. శుభమాని పెళ్ళిచేసు కుంటూ ఏడవకూడదు. ఎవరికెంత ప్రాప్తమో అంతే"

"ఏంట్రా ప్రాప్తం అంటున్నావు, ముసలి నాకొడకా. ఇక్కడింత వేడుక జరుగుతుంటే నాకు కబురు చెయ్యొద్దూ"

చలపతి గొంతు వినిపించి ఆశ్చర్యంగా చూశారటువైపు.

"ఒరే, నువ్వేలా వచ్చావురా!"

"విశ్వనాథం నా జీతం పంపిస్తూ, ఇవ్వాళ వీళ్ల పెళ్ళని ఉత్తరం రాశాడు. హోమ్ ఫర్ ఏజ్‌డ్‌లో అంటే అక్కడికెళ్లాను. అయిపో యిందనుకున్నారు. కానీ మళ్ళీ ఇక్కడ జరు గుతున్నదన్నారు. నేనొచ్చేలోగా అయిపోతే మళ్ళీ తాళి కట్టిద్దామనుకుంటూవచ్చాను... వీడికన్నీ వీడి అబ్బ బుద్ధులే. వెధవని చిన్నప్ప ట్నించీ చూస్తున్నాను అంతే. ఏరా, నన్ను పిలవకుండా పెళ్ళి చేసుకుందామనుకున్నావ ట్రా?"

"పొరపాటు బాబాయ్. హడావిడిలో మరిచి పోయాను. క్షమించెయ్యి"

"క్షమించానుఫో గానీ ఈ రెండు పెళ్లిళ్లు ఏమిట్రా"

"ఈ రెండో పెళ్లి, ఐమీన్ రెండోసారి పెళ్లి అన్నపూర్ణమ్మ సరదా. గొడవలేమైనా జరుగుతా యేమోనని ముందుగా రిజిస్టర్ మ్యారేజ్ చే





శాం. తరవాత అసలు పెళ్లి''

''అసలు పెళ్లికి ఇంకా టైముందిగదా, ఆరు కూడా కాలేదు'' చిలిపిగా కన్ను గీటాడు చలపతి.

''ఏరా, నీ కొడుకు ఎలా చూసుకుంటున్నాడు''

''బాగానే చూసుకుంటున్నాడ్రా పిచ్చిన న్యాసి. పెళ్లికి బయలుదేరమని వాడే టికెట్ తీసిచ్చాడు. ఒక్కణ్ణీ వెళ్ళలేకపోతే సెలవు పెట్టి వస్తానన్నాడు. నేనే వద్దని వచ్చాను''

''సంతోషంరా. మాకా యోగంలేదు'' బాధగా అన్నాడు రాజారాం.

''పెళ్లి మొదలయింది. విశ్వనాథం వ్యాపారానికి సంబంధించిన వాళ్ళూ, హోమ్ ఫర్ ఏజ్‌డ్‌నుండి శంకర్‌రెడ్డితోపాటు నలుగురు వృద్ధులూ, కాలనీలోని వాళ్ళూ, అనాథశరణాలయంనుండి సుబ్రహ్మణ్యం తదితరులూ మొత్తమ్మీద సుమారు వందమందిదాకా వచ్చారు. బ్యాండుమేళం బ్రహ్మాండంగా మోగుతోంది. పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు.

విశ్వనాథం దంపతులు రాజు కాళ్లు కడిగి కన్యాదానం చేశారు. విశ్వనాథం తన కాళ్లు ముట్టుకుంటుంటే ఇబ్బందిపడ్డాడు రాజు.

మాంగల్యధారణ పూర్తయింది.

అరుంధతీ నక్షత్రం చూపించి నమస్కరించమన్నాడు పురోహితుడు.

తరువాత వధూవరులిద్దరూ ముందుగా విశ్వనాథం, అన్నపూర్ణమ్మలకు నమస్కరించారు.

''దీర్ఘసుమంగళీభవ. పిల్లాపాపలతో కలకాలం చిలకాగోరింకల్లా జీవించండి'' నిండు మనసుతో దీవించారు.

ముఖ్యమైన పెద్దలందరి దీవెనలూ తీసుకున్నారు.

విందు మొదలయింది. భోజనాలు చేసేవాళ్ళు చేస్తున్నారు. పెళ్ళితంతులో ఇంకా చిన్న చిన్న ముచ్చట్లు జరుగుతున్నాయి.

పూలచెండులు విసురుకోవటం, నీళ్లచెంబులోంచి ఉంగరాలు తీయటంలాంటివన్నీ పూర్తయ్యాయి.

చివరగా ఇద్దరికీ దిష్టితీసింది అన్నపూర్ణమ్మ.

పెళ్లికూతుర్ని పెళ్లికొడుకుతో సాగనంపటానికి ఏర్పాట్లు మొదలయ్యాయి.

రాణి చేతిని రాజు చేతిలోపెట్టి అంపకాలు చేశాడు విశ్వనాథం.

"బాబూ, అమ్మాయిని బాగా చూసుకో"

రాణి చెయ్యిని గట్టిగా పట్టుకున్నాడు రాజు. క్షణంపాటు మృదువుగా విడిపించుకుని, అన్నపూర్ణమ్మను వాటేసుకుని బావురుమంది రాణి.

"పిన్నీ" అంటూ.

మామూలుగా అమ్మా, నాన్నల్ని విడిచిపోతున్న బెంగతో కన్నీళ్ళు పెడుతుంది పెళ్లికూతురు. కానీ తనకు కన్నతల్లిలా అన్ని ముచ్చట్లూ తీర్చినందుకు ఆమెపట్ల కృతజ్ఞతతో కన్నీరు పెట్టింది రాణి.

కుడికాలు ముందుపెట్టి స్వంత ఇంటిలోపల అడుగుపెట్టింది రాణి. ఆమెవెంటే లోపలికి నడిచాడు రాజు.

ఇద్దరూ మహాలింగం ఫొటోకు నమస్కరించారు.

ఆసరికి చాలామంది వెళ్లిపోయారు.

ఇద్దరినీ శోభనం గదిలోకి పంపించి, తలుపులు దగ్గరగా లాగేశారు.

ఇల్లు బైటతాళం వేసి కిటికీలోంచి తాళాలు ఇంట్లోకి విసిరేసి వెళ్లిపోయారందరూ.

కదలకుండా అక్కడే నిలుచుండిపోయిన రాణిని చూస్తూ కూర్చున్నాడు రాజు.

"అందరూ వెళ్లిపోయారు, రా" మృదువుగా పిలిచాడు రాజు.

ఓసారి తలెత్తి రాజువైపు చూసి, మళ్ళీ నేలకు వాల్చింది రాణి.

లేచి నిలబడి తనే రాణి దగ్గరకు నడిచాడు రాజు.

రాణి భుజాల చుట్టూ చెయ్యివేసి పొదివి పట్టుకున్నాడు. జల్లుమంది రాణి ఒళ్లు. నెమ్మదిగా మంచం దగ్గరకు నడిపించాడు. ఆ తొలిసారి స్పర్శ రాజుకు కూడా ఉత్కంఠగా వుంది.

పెళ్లికిముందు ఎన్నిరోజులు కలిసి తిరిగినా రాణి ఎప్పుడూ ఎందుకు ముట్టుకోనీయలేదో, మోటార్‌సైకిల్‌మీద కూచున్నప్పుడు కూడా ఎందుకు ఆనుకుని కూర్చోలేదో అప్పుడు అర్థమయింది రాజుకు. పెళ్లికిముందు విచ్చలవిడిగా తిరిగే జంటలు తొలిరాత్రి పొందాల్సిన ఆ అపురూపమైన ఆనందం, ఆ రోజుకే ప్రత్యేకంగా దాచుకోవటంవలన కలిగే మధురానుభూతీ కోల్పోయి, ప్రేమ పేరుతో మొదటిరాత్రే నిస్సారమైన కాపురం మొదలెట్టడం తల్చుకున్నాక రాణి మరింత ముద్దొపెంగా కనిపించింది రాజుకు.

రాణిని మంచమ్మీద కూర్చోపెట్టి, తనూ పక్కన కూర్చున్నాడు.

"రాణీ"

"ఊ"

"మనకెందరు పిల్లలు కావాలి?"

"ఇద్దరు"

కాసేపు తటాపటాయించాడు రాజు-

"నువ్వేమీ అనుకోనంటే చెబుతాను. నీకిష్టంలేదంటే మానేద్దాం. కానీ మనఃస్ఫూర్తిగా నిజమే చెప్పాలి, ప్రామిస్" అరచెయ్యి చాచాడు.

"అలా ఒట్టు పెట్టుకోకూడదు. నేను మీకు నిజమే చెబుతాను. చెప్పండి"

"ఏంలేదు రాణీ, అనాథాశ్రమంలో ఎందరో పిల్లలున్నారు. అందులో ఒకడిగా పెరిగి, మమ్మల్నెవరూ పెంచుకోరే అని ఎన్నోసార్లు బాధపడ్డాను నేను. కనేబదులు ఇద్దరు పిల్లల్ని తీసుకెళ్ళి పెంచుకుంటే సరిపోతుందిగదా అనిపించేది. ఇవాళ నేనైనా ఆ పనిచేయకపోతే నన్ను నేనే మోసం చేసుకున్నట్టు అనిపిస్తుంది. అలాగని నీకు ఇష్టం లేకుంటే వద్దు"

పదిక్షణాలు మౌనంగా కూర్చుంది రాణి, ఆలోచిస్తూ.

ఆమెనే చూస్తుండిపోయిన రాజు చివరకు అన్నాడు-

"మనస్ఫూర్తిగా నిజం మాత్రమే చెప్పు. నాకోసం అబద్ధం చెప్పొద్దు"

"మీతో అబద్ధాలెందుకు చెబుతానండీ నేను. ఎలా వుంటుందాని ఆలోచిస్తున్నాను...

మన రక్తం పంచుకుని పుట్టిన పిల్లలు లేకుండా వుండటం నావల్ల కాదండీ...''

రాజు మనసు దిగులుతో నిండిపోయింది. అది పైకి కనిపించకుండా రాణీ మాటలు వినసాగాడు.

''కానీ మీరు చెప్పింది కూడా నిజమేనని పిస్తూంది. అందుకని ఒకపని చేద్దాం. మన సొంతబిడ్డ ఒకరు చాలు, అదీ మూడు సంవత్సరాల తరవాత. ఈలోగా మనం నిలదొక్కుకోవాలి. పిల్లల్ని తెచ్చుకోగానే సరిపోదుకదండీ. అన్నం పున్నెం తెలియని పిల్లల్ని తెచ్చుకుని వాళ్లను కష్టాలు పెడితే ఏం బావుంటుంది. అందుకని ఓ అయిదేళ్ళుపోయాక అప్పటి మన ఓపికను బట్టి ఒకరినో ఇద్దరినో ఆశ్రమంనుండి తెచ్చుకుందాం. మనకు కొత్త కాపురం మోజూ, సరదాలూ తీరుతాయి. మన పాపకు అప్పటికి రెండేళ్లు నిండుతాయి. అయిదారేళ్లు నిండిన పిల్లల్ని తెచ్చుకుంటే చిన్నపిల్లల్ని పెంచే అవస్థావుండదు. ఏమంటారు?''

రాజు మనసు సంతోషంతో నిండిపోయింది.

''నువ్వు చాలా మంచిదానివంటాను''

''పెళ్ళాన్ని అలా పొగడకూడదు. ఆయుక్షీణం'' నొచ్చుకుంటూ చెప్పింది.

ఆశ్చర్యంగా చూసి అడిగాడు.

''రాణీ, ఒకటడుగుతాను చెప్పు. ఇలాంటివన్నీ ఎలా అలవాటయ్యాయి నీకు. మీ అమ్మానాన్నల్ని చూస్తే అంత మాడ్రన్‌గా వుంటారు. నిన్ను చూస్తే ఇలా వుంటావు. ఎక్కడ నేర్చుకునావివన్నీ''

''మా ఆయమ్మ దగ్గర. సాంప్రదాయమైన కుటుంబంలోంచి వచ్చిందామె. సూర్యుణ్ణి చూడందే భోజనం చేసేది కాదామె. బతికిచెడి మా ఇంట్లో ఆయాగా చేరింది. నా పదోఏట కాన్సరొచ్చి చచ్చిపోయింది''

కాస్సేపు మౌనంగా వుండిపోయాడు రాజు.

''మొదటి రాత్రి భార్య కోరికకేమిటో తెలుసుకుని తీర్చాలట. నీకేమైనా కోరిక, చాలాకాలంగా మనసులో ఉన్నది చెప్పు. తీర్చటానికి ప్రయత్నిస్తాను''

ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయింది.

''కొత్త కోరిక కాదు. తీరని కోరిక'' మళ్ళీ చెప్పాడు రాజు.

''నాకో తీరని కోరిక వుందిగానీ అది తీరదు. తీరేమార్గం కూడా లేదు''

''ఏంటది?''

''ఎందుకులెండి. చెప్పి మిమ్మల్ని బాధపెట్టడం''

''నేనేం బాధపడను. తీర్చలేనిదైనా ఫర్వాలేదు. అసలంత గొప్ప కోరిక ఏమిటని?''

''భగవంతుడు కూడా తీర్చలేనిదది'' నిట్టూర్చి చెప్పింది రాణీ- ''నాకు అత్తా, మామలు కావాలండీ''

తెల్లబోయాడు రాజు.

''మీరేం చేయగలరు... కనీసం మావయ్యా అయినా ఉన్నాడనుకుంటే నా దురదృష్టం మన పెళ్లికిముందే ఆయన పోయారు. అత్తమ్మా, మావయ్యా, మరుదులూ, మరదళ్ళూ, తోటికోడళ్ళూ, సందడిగా వుండే ఇల్లంటే నాకు చాలా ఇష్టం. కట్టుకున్నవాణ్ణి కమ్మగా చూసుకుంటూ, అత్తామామల్ని ఆదరంగా చూసుకుంటూ, వాళ్లందరి ప్రేమా పొందే అదృష్టం అందరికీ వుంటుందా చెప్పండి. ఇంట్లో ప్రతిపనికీ సలహాలివ్వటానికీ, పెద్దదిక్కుగా ఎవరైనా వుంటే ఎంత బావుంటుంది. చెప్పానుగదా. తీరని కోరికని. మీరేం ఆలోచించకండి. చెప్పమన్నారు గనుక మీ దగ్గర దాచుకునేదేముందని చెప్పాను'' నిట్టూర్చింది రాణీ.

''అందరూ అత్తామామలు లేని సంసారం కోరుకుంటే నువ్విలా కోరుకోవటం ఆశ్చర్యంగా వుంది రాణీ''

''మీరే ఓసారి అన్నారుగదా, నేను పిచ్చిదాన్నని. అందుకేనేమో'' నవ్వింది.

''నువ్వు పిచ్చిదానివి కాదు రాణీ. మీ ఆయమ్మ నీకందించిన సనాతనమైన భారతీయ సంస్కృతి. నిన్ను ఇలా పెంచిన మీ ఆయమ్మలాంటి తల్లులూ, నీలాంటి పిల్లలూ వుంటే, ఈ ప్రపంచంలో కనీసం ప్రేమరాహిత్యం అనే సమస్య వుండేదికాదేమో. చెట్టు ముందా, విత్తు ముందా అన్నట్టు పెద్దవాళ్ళ పెంపకం లోపమో, పిల్లల ఆలోచనల లోపమోగానీ ఈ సమస్య అలా నానుతూనేవుంది. మధ్యలో మన లాంటివాళ్లకేమో అందని చందమామలాగా




వుంటే, వున్నవాళ్ళకేమో పెరటిచెట్టు సామెత లాగా వున్న విలువ తెలియదు. ప్చ్. ఏమిటో' నిరాశగా నిట్టూర్చాడు రాజు.

వస్తున్న ఆవులింతను ఆపుకోవటానికి విఫలప్రయత్నం చేసింది రాణి.

అప్పుడు గుర్తొచ్చింది రాజుకు, తాము శోభనం మంచంమీద కూర్చున్న విషయం. వెంటనే తన ఆలోచనలను దోవ మళ్ళించాడు.

"ఏయ్, అప్పుడే నిద్దరేంటి? ఇన్నాళ్లూ ముట్టుకోవద్దన్నావ్. వేలికొస తగిలితే కస్సుమన్నావ్. కనీసం యిప్పుడు ముట్టుకోవచ్చు కదా ఈ చేతిని..."

"ఊఁ" సిగ్గుగా అంది రాణి.

రాజు వేలి కొసలు రాణి చేతిమీదుగా పాకాయి. పులకరింపుతో జల్లుమంది రాణి ఒళ్లు.

"ఈ నుదుటిమీద ముద్దు పెట్టుకోవచ్చా" గుసగుసలాడాడు.

"ఊఁ..." నుదుటికి రాజు పెదవులు తగలగానే జివ్వుమన్నాయి నరాలు.

"ఈ గుండెల్లో తల దాచుకోవచ్చా"

చటుక్కున అరచేతులతో గుండెల్ని కప్పుకుంది రాణి...

లైటు ఆరిపోయింది. స్విచ్ బోర్డు దగ్గర్నించి వస్తున్నరాజు అడుగుల సవ్వడికి బిడియంతో రాణి తనువంతా కంపించసాగింది...

తడుముకుంటూ మంచంమీద కూర్చున్నాడు రాజు. అతనికి అందకుండా పక్కకు జరగబోయిన రాణి చేతిగాజులు గలగలమన్నాయి. చెరకువింటి విలుకాడు మార్జాలావతారంతో వచ్చి 'మ్యావ్' మనగానే ఉలిక్కిపడిన రాణి రాజును గట్టిగా పెనవేసుకుంది. ఆమెను మరింతగా గుండెల కదుముకున్నాడు రాజు...

ఇరు సంధ్యల సంగమం, ఇంద్రధనుసు సంబరం
మనసైన తొలివలపుకు తెరతీసిందో హృదయం
సొగసైన నరి వయసుల చెరతీసేటీ ప్రణయం
ఆ తపనల పెదవుల బిగి అల్లికలో
నెరి ముద్దుల తమకం సరి ఒద్దికలూ
చెరినగముల జనితం, జగమెరుగని ప్రణయం
ఇది అమృత జననం, మదనునికిది గ్రహణం
ఇది లవ్, ఇది ప్రేమ
శతమానం, జతగానం
ఇది లవ్, ఇది ప్రేమ
ఇది మథనం, నవ కథనం...

★ ★ ★

"ఏంటి బాబూ! నేను విన్నది కరెక్టేనా!" ఆశ్చర్యంగా అడిగాడు శంకర్‌రెడ్డి, తన ఎదురుగా కూర్చున్న రాజునీ, రాణినీ.

"కరెక్టే సార్... నాకు ఓ అమ్మానాన్నల్ని దత్తత తీసుకోవాలనుంది" మళ్ళీ చెప్పాడు రాజు.

"నా యీ యాభయ్యేళ్ల జీవితంలో ఎన్నో విచిత్రాలు విన్నాను కానీ, యిది మాత్రం, వినలేదు బాబూ. అసలు ఎందుకొచ్చింది మీకిలాంటి ఆలోచన?" అబ్బురంగా అడిగాడాయన.

"ఇంట్లో ఓ పెద్ద దిక్కుంటే అన్నిటికీ మంచిదనిపించింది"

"మీ యిద్దరూ కొత్తగా పెళ్ళి చేసుకున్నారు. మీ కాపురంలో సరదాలకు వాళ్లు అడ్డువస్తారు గదా. ఐనా, నీకు అమ్మా, నాన్నలు కావాలని వుండొచ్చు. కానీ అమ్మాయి సంగతేంటి?"

"అసలీ ఆలోచనకు కారణం రాణే. తెలిసీ తెలియని మాలాంటి కొత్తదంపతులకు పెద్దవాళ్ల అనుభవం వుంటే ఎంతో బావుంటుంది. ఇల్లు నిండుగా వుంటుంది. మా పిల్లలకు నానమ్మా, తాతయ్యా వుంటారు. అందుకే తనకు అత్తా, మామలు కావాలని మా పెళ్ళైన రోజు మొదటి కోరిక కోరింది నా భార్య. నాలాంటి దురదృష్టవంతుడికి చిన్ననాడు తీరకపోయినా, ఈ వయసులోనైనా అమ్మా, నాన్నలతో వుండే సంబరం తీరుతుంది గదా"

"బాబూ, నువ్వు కాదయ్యా. నిన్ను కని వదిలేసిన నీ తల్లిదండ్రులు ఎంతో దురదృష్టవంతులు. నీలాంటి కొడుకు ప్రేమ నోచుకోలేక పోయినందుకూ, ఈ అమ్మాయిలాంటి కోడలి సేవలు అందుకోలేనందుకూ వాళ్ళు బాబూ

దౌర్భాగ్యులుయువతరంలో మీలాంటి ఆలోచనలుంటే యిక్కడున్న వాళ్లలో చాలామంది హాయిగా తమ యింటి పట్టునుండే వాళ్ళు. మీకు ఎవరు కావాలో చెప్పండి మాట్లాడుతాను''

ఈ విషయం ఆశ్రమంలోని వృద్ధులందరికీ వివరించాడు శంకర్‌రెడ్డి. చాలామందిలో ఆశ పొడసూపింది. ఐతే వాళ్లందరూ ఒంటరివాళ్ళే, ఒక్క దశరథరామయ్య, జానకమ్మలు తప్ప. తను పెరిగిన అనాథశ్రమంలో ఎవరైనా దత్తత తీసుకోవటానికి వచ్చినప్పుడు ఆశగా ఎదురు చూసే పిల్లలు గుర్తొచ్చారు రాజుకు. ఎవరో ఒకర్ని వాళ్ళు తీసుకుపోగానే తామంతా ఎంత బాధపడే వాళ్లో గుర్తొచ్చింది. ఇంత మందిలో తాను ఆ నిరాశను కూడా మిగులుస్తున్నందుకు హృదయం ద్రవించింది. కానీ తను అందరినీ తీసుకుపోలేడుగదా.

దశరథరామయ్య దంపతులు సంతోషంగా ఒప్పుకున్నారు.

''బాబూ, నువ్వు కోకిలలాగే పరాయిగూట్లో పెరిగావు. రెక్కలొచ్చి ఎగిరే ఎయసు రాగానే కోకిల తన పాటతో పదిమందిని మైమరపించినట్టు, నీ మంచితనంతో పదిమందికి సంతోషాన్ని అందిస్తున్నావు. కోకిల కూసి, మావికి చివురులు తొడిగించినట్టుగానే ఓ నిర్భాగ్య దంపతుల జీవితాలకు వసంతం అందిస్తున్నావు. కాకి గూడులాంటి ఈ లోకంలో నీలాంటి కోకిలలు ఎందరుంటారయ్యా'' ఉద్వేగంతో చెప్పాడు శంకర్‌రెడ్డి రాజునుద్దేశించి.

''మీ యిద్దరినీ దేవుడు చల్లగా చూస్తాడమ్మా'' తమకు కాకపోయినా, తమలాంటి ఎవరో ఒకరిని ఆదుకున్న రాజు, రాణీ దంపతులను దీవించారు అందరూ.

దశరథరామయ్య, జానకమ్మలను వెంటబెట్టుకుని, హోమ్‌ఫర్ ఏజ్‌డ్ నుండి కదిలారు రాజు, రాణి.

వాళ్లకు చేతులూపుతూ వీడ్కోలిచ్చారు, కడలిని చేరని నదులలాగా కంచికి చేరని కథలలాగా అక్కడే ఆగిపోయిన వృద్ధులు...

మాతృదేవోభవ
పితృదేవోభవ



# చతుర ప్రపంచం

## ఆఫీసుల్లో నిద్ర?

'లంచ్' అయ్యాక ఓ గంట కునుకు తీయాలని ఎవరికిమాత్రం అన్పించదు? అపూర్వమైన ఆ అవకాశాన్ని అధికారపూర్వకంగానే కొన్ని పాశ్చాత్యదేశాలు తమ దేశాల్లోని ఉద్యోగులందరికీ కల్పిస్తున్నాయట. అలాంటి సదుపాయమేదో మన దేశంలోనూ ఉంటే బాగుండునే అనుకొంటున్నారుగదూ? అయినా ఇక్కడమాత్రం ఏం తక్కువ? అనధికారికంగానైనా ఆ సౌకర్యాన్ని చాలామంది ఉద్యోగులు ఇక్కడా అనుభవిస్తున్నారుగదండీ? మన ఆఫీసుల్లోని ఫైళ్ళు నత్తనడక నడవడాన్కి ఇదీ ఒక కారణమని మీరు ఒప్పుకుతీరాలి. సరే... ఆ సంగతి అటుంచితే మధ్యాహ్నం నిద్ర మనిషికి చాలా అవసరమనీ తద్వారా చక్కటి ఆరోగ్యాన్నీ దీర్ఘాయుష్షునీ పొందవచ్చుననీ పశ్చిమ జర్మనీలోని ఫ్రీబెర్గ్ యూనివర్శిటీకి చెందిన శాస్త్రవేత్తలు చెబుతున్నారు. సాధారణంగా మధ్యాహ్న భోజనం ముగించాక శరీరమూ, మనస్సూ విశ్రాంతిని కోరుకుంటాయి. రెప్పలు బరువెక్కి మూతలు పడ్తుంటాయి. ఆ దశలో బలవంతంగా నిద్రను ఆపుకోవడంకన్నా నిద్రపోవడమే అన్నివిధాల శ్రేయస్కరం అంటున్నారు ఆ శాస్త్రవేత్తలు. అందువల్ల నిద్రానంతరం అతి చురుకుగా పనుల్ని నిర్వర్తించుకోవచ్చునట. అందుకే ఆఫ్రికాదేశాలు, లాటిన్ అమెరికా దేశాలు, కొన్ని యూరప్ దేశాలు ఈ పద్ధతిని ఖచ్చితంగా అమలుజరుపుతున్నాయి.

స్కాండ్‌నేవియాకు చెందిన లాబ్‌లాండ్ ఆదివాసులలో మధ్యాహ్న భోజనానంతరం నిద్రించనివార్ని తీవ్రంగా శిక్షించే ఆచారం ఉందట. ఉగాండా ఆదివాసులు తెల్లవారుఝామున 3 నుంచి మొదలుకొని మధ్యాహ్నం 12 గంటలవరకూ పనులు చేసుకుంటారు. ఆ తర్వాత సమయమంతా వారికి నిద్రలోనే గడిచిపోతుందట. మలేషియాకు చెందిన డామియర్ జాతి ఆదివాసులు మధ్యాహ్నం ఒంటిగంటనుంచి సాయంత్రం 7 గంటలవరకూ నిద్రిస్తారట. ఆ తర్వాత సమయమంతా పనులు చేసుకుంటారట. గ్రీసు, పశ్చిమ జర్మనీ దేశాలలో కూడా మధ్యాహ్న నిద్ర అమలులో ఉంది.

అదలా ఉంచితే కొన్ని గమ్మత్తయిన నిద్ర ఆచారాలు ప్రపంచంలో ఉన్నాయి. న్యూగినియా దేశానికి చెందిన కొందరు ఆదివాసులు నిద్రించేముందు తమ తలగడలకింద మరణించినవారి కపాలాల్ని పెట్టుకుంటారట.



అందువల్ల కమ్మటి నిద్ర పడుతుందని వారి నమ్మకం. మరికొన్ని జాతులలో నిద్రకి ఫలానా సమయం అనేదే లేదు. రాత్రీ, పగలు అని లేదు. ఎప్పుడు నిద్రవస్తే అప్పుడు నిద్ర. ఎప్పుడు మెలకువ వస్తే అప్పుడు పని. ఇండో నేషియాలో నిద్రాసాధనాలుగా విచిత్రమైన దిళ్ళని ఉపయోగిస్తారు. మూడు అడుగుల పొడవు, ఒక అడుగు వెడల్పుతో మెత్తగా ఆ దిళ్ళుంటాయట. అమ్మాయిలు, అబ్బాయిలు వాటిని తమ తమ బాయ్‌ఫ్రెండ్స్, గాళ్ ఫ్రెండ్స్ అంటూ ఊహించుకొని కరచుకొని ఎంచక్కా నిద్రపోవచ్చుట... ప్చ్...

## ముప్పుతెచ్చిన ముద్దు!

పాతికేళ్ల డిసిల్వా ఇరవై ఏళ్ల నోరానుగాఢంగా ప్రేమించాడు. అయినా ఆమెనుంచి సరైన ప్రతిస్పందన రాలేదు. ఆమె మెప్పుకోసం ఆమె వెంటే తిరుగుతూ ఎన్నో సాహసకృత్యాలు వీరోచిత కార్యాలు చేశాడతను. కానీ లాభం లేకపోయింది. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా తన ప్రయత్నాలు మాత్రం అతను మానలేదు.

ఆరోజు జనవరి 10, 1989, ఎప్పటిలాగే ఆనాడు కూడా ఆమె ప్రేమకోసం పరివరి విధాలుగా ప్రాధేయపడుతూ ఆమె వెంటపడ్డాడతను. కొంచెం దూరం వచ్చాక అక్కడ రోడ్డుమీద ఒక గుంపు నిలబడి ఉండటం చూసి ఆ ఇద్దరూ కుతూహలంగా గుంపులోకి తొంగిచూశారు. లారీ మీదుగా పోవడంవల్ల అక్కడ ఓ పాము చచ్చిపడి ఉంది. గుంపులోని వారంతా రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు.

ఆ పాముని చూడ్డంతోటే నోరా మనసులో ఓ చిలిపి ఊహ మెదిలింది. వెంటనే ఆమె డిసిల్వావైపు తిరిగి - "నువ్వే గనుక నన్ను ప్రేమిస్తున్న మాటనిజమైతే అదుగో చచ్చిన ఆ పాముని తినెయ్యాలి... తినగలవా? నే చెప్పినట్లు చేస్తే నీకో తియ్యని ముద్దు బహుమానం" అంది నవ్వుతూ.

వెంటనే అక్కడివారంతా ఆశ్చర్యంనుంచి తేరుకోకముందే డిసిల్వా ఆ పాముని తోకవైపు నించి మొదలుబెట్టి కరకరా నమిలిపారేశాడు. ముందు బిత్తరపోయినా అతని సాహసానికి సంతసించిన నోరా అన్నట్లుగానే అతనికి ఓ కమ్మటి ముద్దు ప్రసాదించింది. పట్టలేని ఆనందంతో డిసిల్వా కూడా ఆమెను వడిసిపట్టుకొని ఆమె పెదాల్ని గాఢంగా చుంబించేశాడు. ఆ ప్రేమికుల చేష్టల్ని చూసి అక్కడ చేరినవారంతా ముక్కునవేలేసుకున్నారు.



అయితే రెండు నిముషాలు గడవకముందే నోరా కళ్లు తిరిగికిందపడిపోయింది. ఆమె నోటినుంచి నురుగులు వెలువడ్డాయి. శరీరంకూడా నీలివర్ణంలోకి మారిపోయింది. గబగబా ఆమెను ఆసుపత్రికి తీసుకువెళ్లారు. అక్కడ రెండు రోజులపాటు మృత్యువుతో హోరాహోరీ పోరాడి మరీ కన్నుమూసిందామె.

డిసిల్వా ఆమెను ముద్దాడినపుడు ఇంకా అతని గొంతులోనే ఉన్న పాముతల వత్తిడికి లోనవడంవల్ల అందులోని విషం బయటకువచ్చి నోరానోటిలోకి ప్రవేశించి ఆమె మరణానికి కారణభూతమైందని డాక్టర్లు నిర్ధారించారు. విచిత్రమేమంటే పామును భుజించిన డిసిల్వాకు మాత్రం ఏ హానీ జరుగలేదు. కానీ అతను మాత్రం చేజేతులా ప్రియురాల్ని చంపుకున్నానని కుమిలికుమిలి ఏడుస్తున్నాడు. ఈ సంఘటన గోవాలోని పొనాజీలో జరిగింది.

# 'తెరవెనుక' పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర' మీకందించిన వినయ్ రచన 'తెరవెనుక' పై మాకందిన సమీక్షల్లో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ దిగువనిస్తున్నాం.

## నూతన ప్రయోగం

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

**ఒ**క కథని నవలగా పాఠకులచేత చదివిస్తూ ఆ కథనే సినిమాగా తీస్తే జరిగే కష్టనష్టాలని కళ్ళకు కట్టినట్టు వివరించారు రచయిత ఈ ప్రయోగాత్మక నవలలో. తెర వెనుక జరిగే తతంగాన్ని పాఠకులకి చక్కగా అందించారు.

అయితే ఒక చిత్రకారుడు ఒక చిత్రాన్ని గీసి ప్రదర్శనకి పెడితే వచ్చిన సందర్శకులు ఆ చిత్రాన్నికాక దానికి కట్టిన ఫ్రేమ్‌ని, ఫ్రేమ్ అందాన్ని మెచ్చుకుంటే ఆ చిత్రకారుడి కృషి అంతా బూడిదలోపోసిన పన్నీరే అవుతుంది. ఈ నవలలో అసలు కథ వెనకపడి, తెరవెనక జరిగే ప్రక్రియ పాఠకులచేత చదివించేదిగా ఉంది. దానికే అయితే ఎన్నో సినిమా వార పత్రికలు ఉన్నాయి. తెర వెనుక జరిగే ప్రక్రియని వివరించటంలో చూపిన శ్రద్ధ అసలు కథ విషయంలో చూపకపోవటంతో నవల గందరగోళంగా తయారయింది.

'ఉబ్బరుబ్బర్, నగం మీసం హడల్స్' అన్న మాటలు సినిమాలో వాడితే అవి ఆయా నటుల డైలాగ్ డెలివరీనిబట్టి ప్రేక్షకులు మెచ్చుకుని, శభాష్ అనవచ్చు. కానీ నవలలో ఆ మాటలు చాలా పేలవంగా ఉన్నాయి. కొన్ని కొన్ని చోట్ల 'చక్రి' తాను వ్రాసిన కథని విని పిస్తూ మధ్యమధ్య అసలు కథలోకి జారిపోతాడు. సరిగ్గా పాఠకుడు అసలు కథలో లీనం అవుతుంటే 'కట్ చేస్తే' అని చక్రి ఎంటరై పాఠకుడి పఠనాశక్తిని 'కట్' చేస్తాడు. ఇది కేవలం రచయిత చేసిన తప్పే. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ నవలలో సినిమా నిర్మాత రాఘవరావు పాత్ర చెప్పినట్టు ఇది చాలా చెత్త కథ. అయితే నవల పేరు 'తెరవెనుక' కనుక పాఠకులు రాజీపడక తప్పదు. ఈ నవలలో కథాంశం చిన్నది. పాత్రలు ఎక్కువ అయిపోవటంతో రచయిత ఏ ఒక్క పాత్రకీ న్యాయం చేకూర్చలేకపోయారు. పాఠకుడు ఊహించేది కాకుండా మలుపు తిప్పటమే సస్పెన్స్ అని భావించి అన్ని పెద్ద పాత్రలు ఉండగా, ఒక పసికుర్రవాడు జిమ్మీని హంతకుడిగా చేసి రచయిత చేతులు దులుపుకున్నారు. ఈ మలుపుసాధారణ డిటెక్టివ్ కథాస్థాయిలో కూడా లేదు.

మరింత శ్రద్ధ తీసుకుని ఈ నవల వ్రాసి ఉంటే నూతన ప్రయోగంగా మొదలు పెట్టిన ఈ నవల సక్సెస్ అయి పాఠకుల జ్ఞాపకాల పొరల్లో కలకాలం భద్రపరచుకో తగినదిగా ఉండేది.

-కె.వి.ఎస్.భానుమూర్తి
తణుకు- 534 215

## మామూలు కథతో మంచి నవల

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

**వి**నయ్‌గారి 'తెరవెనుక' నవల చిత్రలోకం గురించి పూర్తిగా తెలియజేసిందని చెప్పవచ్చు. కొన్ని రోజుల అవిశ్రాంత సంఘటిత



కార్యరూపాన్ని కొన్ని గంటల్లో తేల్చివేసే ప్రతి ప్రేక్షకుడు చదవాల్సిన నవల ఇది. సినిమా ప్రపంచాన్ని బ్యాక్‌గ్రౌండ్‌గా చేసుకుని చాలా నవలలు ఇదివరకే వచ్చినా వాటికి భిన్నంగా ఉండి తన ప్రత్యేకతను నిలబెట్టుకుంది.

అయితే రచయిత కథ నడిపిన తీరు గురించి కొద్దిగా ఆలోచించాల్సొస్తుంది. చక్రవర్తి, హీరోలకు, ప్రొడ్యూసర్లకు, ఇతర టెక్నీషియన్స్‌కు కథను వినిపిస్తున్నట్టుగా కథనం నడిపించారు రచయిత. ఇలా చేయడంవల్ల కథలోని 'కంటిన్యుటీ' దెబ్బతింది. అలా కాకుండా ముందు సినిమా కథను చెప్పేసి తరువాత సంఘటనలను మిగతా వారికి వివరిస్తున్నట్టు రాస్తే బావుండేది. మరో విషయం 'సినిమా టెక్నాలజీ' గురించి వివరించటం. రచయిత వివరించిన టెక్నాలజీకి సంబంధించిన, ముఖ్యంగా సౌండ్స్ గురించి విషయ వివరణ ఇదివరకే 'సితార'లోను మరికొన్ని సినిమా పత్రికలలోనూ వచ్చినదే. అయితే ఇక్కడ ఒక విషయం గురించి ఆలోచించాలి. ఓ మామూలు పాఠకుడు టెక్నాలజీ గురించి తెలుసుకోవటం ఎంతవరకూ అవసరం?

చక్రి రాసిన సినిమా కథ విషయానికొస్తే ఇలాంటి కథ ఈమధ్య రాలేదు అని పలుసార్లు చెప్పటం జరిగింది. కానీ ఈ కథ ఓ సాదా సీదా క్రైం కథలాగే ఉంది. ఇక నవల క్లయిమాక్సుగా చక్రిని సినిమాలోనుండి తీసెయ్యడం అనేది పాఠకులకు పెద్దగా పాకివ్వదు. సినిమా లోకంలో ఇలాంటివన్నీ మామూలే అనే విషయం అనేక సినిమా పత్రికల ద్వారా పాఠకుడు ఇదివరకే గ్రహించటం ఇందుకు కారణం. రచయిత ఎంతోకొంత సినిమా పరిజ్ఞానం ఉన్న వ్యక్తి అని తన నవల ద్వారా తెలియజేసుకున్నాడు. మొత్తానికి కొంత కన్ఫ్యూజన్ మరికొంత రిపీటెడ్ మాటర్ లేకపోతే 'తెరవెనుక' సినిమా ఇండ్రస్టీ గురించి పాఠకులకు వారి క్యూరియాసిటీని, మనస్తత్వాన్నిబట్టి ఎంతో కొంత తెలియజేసిందనే చెప్పవచ్చు.

-జి.యన్.భూషణ్‌రావు
హుస్నాబాద్, 505 467





## సప్తవర్ణాలు

**(మూడవ బహుమతి రూ.50/-పొందిన సమీక్ష)**

తెల్లటి తెరపై సప్తవర్ణాలను సందర్శించి ఊహాలోక విహారం చేసి, అద్భుతాలను కనులారా కాంచే మేము 'తెరవెనుక' జరిగే సినీ సృష్టిని, 'కురుక్షేత్రాన్ని' ఇన్నాళ్ళకు దర్శించాము. క్షణానికో పోకడతో వుండే సినీ పరిశ్రమను బహుచక్కగా వివరించారు. 'తెరవెనుక' తతంగాన్నంతా అక్షరీకరించటంలో రచయిత కృషి అపూర్వం. ఒకవైపు ఆసక్తికరమైన కథనం, వేరొకవైపు, సినీ సృష్టిలోని చిత్రాలు, విన్యాసాలు వివరించడం నవలకు న్యాయం చేకూర్చినట్లయింది. ఈ మేకప్‌ల ప్రపంచంలో స్వార్థపరుల గురించి, మేక వన్నె పులుల గురించి చెప్పినవి సినీ సత్యాలు. శ్రీరామచంద్రుడిలాంటి వారు నామాలు ఎలా పెడతారో అవసరానికో అవతారంతో ఎలా నటిస్తారో కనులముందు సాక్షాత్కరించినట్లయింది. ఈ పరిశ్రమలో అనుకోనివి జరిగినా కృంగిపోకుండా పటిష్టమైన పునాది వేసినవాడేపైకి ఎగబ్రాకగలడు. ఆశ అనేది నెరవేరితే మనిషిని అందలమెక్కిస్తుంది. తప్పితే అట్టడుగుకు తొక్కేస్తుంది. మేడిపండులాంటి ఈ సినీ పరిశ్రమ గురించి సమూలంగా తెలుసుకొన్నందుకు ఆనందిస్తున్నాం. ఈ నవల మాకు తెలియనివి తెలియజేసింది. అస్తవ్యస్తంగా ఉన్న చిత్రానికి రంగులు దిద్ది రూపాన్ని తెచ్చినట్లు, చిత్ర పరిశ్రమ గురించి తెలిసీ తెలియని అభిప్రాయాలకు ఒక రూపాన్నిచ్చింది ఈ చతురమైన 'చతుర'. సినిమా చూడడం ఎంత సులువో నిర్మించడం అంత కష్టం. ఆ కష్టాలన్నీ కమనీయకథగా కూర్చడం అభినందనీయం. రచయిత సినిమాలో లాజిక్కులు కనుగొని రసవత్తరంగా, ఉదాహరణ పూర్వకంగా వివరిస్తూ మాజిక్కుచేసి చదివించారు. ఉపయోగకరమైన ఉత్తమ నవలను ఊహించని రీతిలో మాకందచేసిన 'చతుర'కు నమస్సులు.

-జి.కుమారస్వామి
విజయనగరం- 531 202

## వైజ్ఞానిక రచన

*(నాలుగవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

నేడు అందరికీ అందుబాటులో ఉన్న వినోద సాధనం 'సినిమా'. కొంచెం డబ్బుతో కావాల్సినంత వినోదాన్ని పొంది. బైటికి రాగానే మర్చిపోతాం. కాని ఆ కాస్సేపూ కాలాన్ని మరిపించగల సినిమా ఒక గొప్ప సాంకేతిక కళాతపస్సనీ, కొన్ని వందలమంది నిపుణుల సమిష్టి కృషితో సాగే భారీ పరిశ్రమ అనీ సాధారణ పాఠకునికి కూడా అర్థమయేలా చెప్పారు వినయ్‌గారు.

తెరమీద చూసే ప్రతి సినిమా వెనుక ఇంతటి ప్రసవవేదన. ఇందరి సహకార సంపత్తి మరెందరిదో సృజనాత్మక ప్రతిభ ఉంటాయని సామాన్య ప్రేక్షకుణ్ని ఎడ్యుకేట్ చేసిన నవల ఇది. ఒక్కమాటలో -సినిమాలపై ఈ నవల చిన్న సర్టిఫికెట్‌కోర్సు. తెలుగులో ఈ వస్తువుతో వచ్చిన రచనలు బహుతక్కువ. పైగా ఇలా నిర్మాణ పద్ధతి, సాంకేతిక పరిజ్ఞానము, పరికరాలు, టెక్నిక్కుల పదజాలంతో సహా విపులీకరించిన రచనలు లేవనే చెప్పాలి.

ఏదైనా స్టూడియోలోగాని. బైటగాని షూటింగు చూసే ప్రతిఒక్కరూ నటీనటులను చూస్తారేగాని లైట్లు. కెమేరా పట్టించుకోరు. కారణం వాటి గురించి ఏమీ తెలీకపోవడమే! ఇలాంటి రచనలు చదివిన జ్ఞానంతో పరిశీలన అలవర్చుకున్న ప్రేక్షకుడు శ్రమనూ గుర్తించి తీరుతాడు. వేలం వెర్రి 'హీరో వర్షిప్' కూడా కొంతవరకు తగ్గుతుంది.

అయితే రచయితే నొక్కివక్కాణించినట్లు రచనైనా, సినిమా అయినా 'కథే' జీవం. కాబట్టే 'సినిమా కథనం' సాకుతో జూలీకథను కూడా జోడించారు. అదేగనుక లేకుంటే వ్యాసమై ఉండేది! అక్కడికీ 'నెరేషన్' పాలు హెచ్చింది. అయినా వస్తువు దృష్ట్యా బాగానే అతికింది. విషయాన్ని వివరించడంలోను, ఒప్పించడంలోను వినయ్‌గారు సఫలీకృతులైనారనే చెప్పాలి. ముఖ్యంగా రెంటినీ జోడించిన విధానం, కథనం చాలా పట్టుగా ఉన్నాయి.

అయితే చక్రిలాగా అవకాశ నిరీక్షణలోనే అలిసిపోతున్న గొప్ప కళాస్రష్టలెందరో కదా! తమ కథల్లోని, సినిమాల్లోని పాత్రలకు తాత్కాలిక ముగింపులు చెప్పగల రచయితలు, డైరెక్టర్లు చక్రి కథకేం ముగింపు చెప్తారోనన్న భావం రచయితతోబాటు మనకూ కల్గుతుంది. ఆశతో వేచి ఉండటంకన్న చక్రి చేయగలిందేముంది.

సృజనాత్మకత ఊపిరిగా ఉండే సినీ రంగంలో అభ్యుదయ అవగాహనున్న ఏ నిర్మాత, దర్శకులైనా ఈ రచన చదివి స్పందిస్తే రచనా ప్రయోజనం నెరవేరినట్లే. సరికొత్త విజ్ఞానాన్ని సరళంగా అందించిన వినయ్‌గారు బహుధా అభినందనీయులు.

-రాయనూతల లక్ష్మి
సి. మల్లవరం- 517 505

## మార్గదర్శిని

*(అయిదవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

సినీరంగానికి వెళ్ళాలనుకొన్నవారూ, ముఖ్యంగా నిర్మాత, దర్శకులు, రచయితలు కావాలనుకోనేవారు తప్పనిసరిగా తలా ఒక కాపీ దగ్గరుంచుకోవాల్సిన ఆణిముత్యంలాంటి నవల 'తెరవెనుక'. ఒక్క మాటలో చెప్పాలంటే సినిమా నిర్మాణానికి మార్గదర్శిని అని చెప్పవచ్చును. మనం సరదాగా రెండున్నర గంటలు చూసి మురిసిపోయే రంగుల ప్రపంచం వెనుక ఎంత వేదన, ఎంత మనోరోదన, ఎంత పరిశ్రమ, ఎన్ని వూసరవెల్లి కుతంత్రాలు దాగివున్నాయో కట్టె- కొట్టె- తెచ్చే- పద్ధతిలో పరిచయం చేస్తుందీ నవల. ఇదొక సినీ నిఘంటువులాంటిది. నిర్మాతకు వుండాల్సిన పరిజ్ఞానం, దర్శకుని లక్షణాలు, లక్ష్యాలు, కథను ఎలా సినిమాకు అనుగుణంగా మలుచుకుంటారు? యిత్యాది విషయాలతోపాటు ఫిల్మ్ టెర్మినాలజీని కూడా పరిచయం చేయడం జరిగింది.

ఒకప్రక్క ఆసక్తికరంగా కథ నడిపిస్తూనే, మరోవంక విభిన్న సినీ హీరోల మనస్తత్వాన్ని ఆవిష్కరించారు రచయిత. ఒక తల్లి పడే ప్రసవవేదనకు ఏమాత్రం తీసిపోని వేదననుభవించి రచయిత కథను తయారుచేస్తే, దాన్ని హీరోలు ఎలా తమ "ఇమేజ్‌కు" అనుగుణంగా అవకతవక మార్పులు సూచిస్తుంటారో తెల్సుకుంటే కథారచయిత 'చక్రి'తో పాటు చదివేవాళ్ళకూ కడుపు మండిపోతుంది. "విద్వజ్జన పరిశ్రమ విద్వజ్జనులకేతెల్సు. పిల్లల్ని కనే తల్లి బాధ గొడ్రాలికేంతెల్సు" అనే సంస్కృతశ్లోకం సినీ రచయితలకు నిత్యం గుర్తుకొస్తుందనుకుంటాను.

విశ్వాసఘాతం అన్ని రంగాల్లో వున్నప్పటికీ బహుశా సినీరంగంలో దాని స్థాయి యింకా తీవ్రంగా వుండివుంటుంది. అందుకే చివరిదశలో నిర్మాత శ్రీరామచంద్రుడు- 'చక్రి'కి చెప్పాపెట్టకుండా చెయ్యిస్తాడు. అంతటి నమ్మకద్రోహానికి చక్రితోపాటు పాఠకుడు కూడా ఖంగుతింటాడు.

"కదిలేదీ, కదిలించేదీ, పెనునిద్దర వదిలించేది" కవిత్వమన్న శ్రీశ్రీ మాట అన్ని కళారూపాలకూ వర్తిస్తుందేమోననిపించింది. "మన చుట్టూ పెత్రరిజం నాట్యం చేస్తున్న రోజుల్లో ఓ చావు ఎవడ్ని ఆకర్షిస్తుంది?" అనే మాట నేటి ప్రపంచంయొక్క నగ్నస్వరూపం! ఈ వాక్యం చదివిన పాఠకుడు ఒక్కక్షణం ఆగి సమకాలీన సమాజపు దారుణ మారణాలవైపు దృష్టి మరల్చకుండా వుండగలడా? విశ్వజనీన సత్యాన్ని ప్రబోధించే ఒక్క వాక్యంకూడా ఒక కావ్యమే అవుతుంది. అందుకే "వాక్యం రసాత్మకం కావ్యం" అన్నది. ఈ నవల సమస్తం ఒక సమగ్రదృశ్య కావ్యం.

ఇంత మంచి నవల వ్రాసిన వినయ్‌గార్కి, ప్రచురించిన ఎడిటర్‌గార్కి కృతజ్ఞతాపూర్వక అభినందనలు.

-మహబూబ్ కమల్
న్యూ పాలవంచ- 501 115




*(ఆరవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

మనం మూడు గంటలసేపు సినిమాచూసి అది బాగుందనో లేక బాగా లేదనో ఈజీగా కొట్టిపారేస్తాం. అలాంటి సినిమావెనుక ఎంత కృషి, ప్రతిభవుందో రచయిత సజీవపాత్రలతో చాలా చక్కగా వివరించారు.

కానీ ఒకవిధంగా చెప్పాలంటే ఈనవల కొంచెం బోర్‌కొట్టేసింది. ఆ రచనాశైలి అలాంటిది. అయినాసరే 'తెరవెనుక' జరిగే కథా కమామీషు, లోటుపాట్లు లావాదేవీలు, ఇవేమీ తెలియని పాఠకుల కళ్ళకు ఆ వాతావరణాన్ని కట్టినట్లుగా చిత్రించటంలో రచయిత తన ప్రతిభ నిరూపించుకొన్నాడు.

ముఖ్యంగా పాఠకులకు తెలియని ఎన్నో సందేహాలను రచయిత చక్రవర్తి పాత్రద్వారా తీర్చారు. తెరవెనుక జరిగే ఇన్ని విషయాలు ఎలా సేకరించారా? అని ఒక్కక్షణం ఆశ్చర్యంవేసింది.

హీరోయిన్ తన లవర్ ఇచ్చిన లవ్‌లెటర్ విప్పేటప్పుడు వచ్చే శబ్దం, బూట్లతో నడిచే శబ్దంలాంటివి చేయడానికి వాళ్ళుపయోగించేపద్ధతులు పాఠకులను ఆశ్చర్యపరచింది. ఎన్నో కొత్తవిషయాలు తెలిపారు ఈ నవలద్వారా.

కొంతమంది సినిమాలను కేవలం వ్యాపార దృష్టితో తీసి యువతరాన్ని పెడత్రోవ పట్టిస్తున్నారు. అలాగని విజ్ఞానం, వివేకం పెంచే సినిమాలు కూడా లేకపోలేదు. వారు 'తెరవెనుక' నవల చదివితే చాలు అంతా అర్థమౌతుంది. ఈ నవల చదువుతున్నంతసేపూ మేమొక డైరక్టర్‌గానో నిర్మాతగానో ఫీలయ్యామంటే నమ్మండి.

-ఎ. నర్సింహాచారి
జాన్‌పహాడ్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.



ఉషాకిరణ్ మూవీస్

# తేజ





రామోజీరావు

ఎన్.హరిబాబు




సత్యానంద్ · కీరవాణి · వేటూరి · కె.యస్.హరి · గౌతంరాజు

భాస్కరరాజు · అట్లూరి రామారావు